


- ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం

# ఆంధ్రమహాభారతం అమృతత్వసాధనం

# ఆంధ్రమహాభారతం

# అమృతత్వసాధనం

**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**

తెలుగుశాఖ పూర్వాధ్యక్షులు

మానవీయ శాఖ పూర్వాధ్యక్షులు

హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం

**ఆచార్య జీవియస్ షష్టిపూర్తి ప్రచురణలు**

హైదరాబాద్ - 500 044

# నామాట

"ఏయది హృద్య? మపూర్వం
బేయది? యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు? నఘనిబర్హణ
యేయది? యక్కథను వినగ నిష్టము మాకున్"

సూతుణ్ణి శౌనకాది మహామును లడిగిన ప్రశ్న యిది. ఎవరైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా మంచి కథ వినదలచుకున్న వారు అడగవలసిన ప్రశ్న యిది.

కథ హృద్యంగా ఉండాలి. అంటే మనసును ఆకట్టుకొనేటట్లు ఉండాలి. అపూర్వంగా ఉండాలి. అంటే అంతకుముందు చెప్పబడనిదై ఉండాలనీ, వింటే 'ఇంత గొప్పకథ ఎప్పుడూ వినలే'దని అనిపిచేటట్లు ఉండాలనీ భావం. కథ వింటే జ్ఞానం సమగ్రంగా కలగాలి. జ్ఞానం అంటే ధర్మ అర్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను సాధించి జీవితంలో అమృతత్వ సాధనం చేయడానికి అనువైన తెలివిని కలిగించటం. జీవిత లక్ష్యాన్ని సాధింపగలిగే సమగ్ర జీవన ధర్మ పరిజ్ఞానమే 'ఎఱుక సమగ్రమై ఉండే' కథా పరిజ్ఞానం. కథ పాపాన్ని తొలగించాలి. అంటే కథ విన్న తరువాత శ్రోత మనసులో ఒక ఉన్నత పరిణామం రావాలి; జీవితంలో అధర్మ ప్రవృత్తిని తొలగించుకొనగలిగే ఒక సంస్కారం ఏర్పడాలి. తనను తాను ఉద్ధరించుకొనే ఆత్మధర్మం పుణ్యం. దానికి విరుద్ధమైనది పాపం. పాపాన్ని ప్రక్షాళనం చేసుకొనే ప్రజ్ఞను కథ మనకు ప్రసాదించాలి. ఇది కథాతత్త్వం.

ఈ లక్షణాలన్నీ ఉన్న కథ మహాభారత మని సూతుడు పేర్కొన్నాడు. కృష్ణద్వైపాయనుడు మూడు సంవత్సరాలు కృషించి విశ్వశ్రేయస్సుకై జయకావ్యాన్ని నిర్మించాడు. దానిని వివిధలోకాల్లో ప్రచారం చేయడానికి విశిష్టమునులను నియోగించాడు. మానవ లోకంలో వైశంపాయనుణ్ణి జనమేజయునికి బోధించటానికి ఆదేశించాడు. జనమేజయు డడిగిన ప్రశ్నలకు వైశంపాయను డిచ్చిన సమాధానాలతో కలసి, జయకావ్యం భారతంగా ప్రసిద్ధి చెందింది. ఆ భారతాన్ని సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు. శౌతకాది మునులు అనేక ప్రశ్నలు వేశారు. వాటికి సూతుడు సోదాహరణంగా, సేతిహాసంగా ఎన్నో విషయాలను వివరించాడు. అవన్నీ కలిసి మహాభారతం రూపొందింది. ఆ మహాభారతాన్ని తెలుగులో కవిత్రయం కావ్యేతిహాసంగా వినిర్మించారు. శాస్త్రేతిహాసాన్ని కావ్యేతిహాసంగా రూపొందిస్తూ కవిత్రయం వారు ఆంధ్ర మహాభారతాన్ని ఒక స్వతంత్ర వ్యక్తిత్వం గలిగిన రచనగా దిద్దితీర్చారు. అది మానవుడు జీవితంలో సాధించే అమృతత్వసిద్ధిని పాండవేతివృత్తం ద్వారా, మిత్రసమ్మితంగా, కాంతాసమ్మితంగా బోధిస్తోంది.

'మృతసంజీవని' సాధించినవారు దానవులు; అమృతాన్ని త్రాగినవారు దేవతలు. మానవుడు ఆ రెండింటి కంటె విలక్షణమైన ధర్మసాధననే అమృతత్వసాధనగా పండించుకొన్న దార్శనికుడు. మానవుని శరీరం నశ్వరమని అతనికి తెలుసు. అయినా, బొందితో స్వర్గాన్ని సాధించిన ఘట్టా లున్నాయి. అలా సాధించిన వారిలో మహాభారత నాయకుడు ధర్మరాజు ప్రసిద్ధుడు. అతడు స్వర్గం కంటె ధర్మసాధనకు అగ్రతాంబూల మిచ్చాడు. ధర్మమే మానవునిలో అమృతత్వం. దాని సాధనమే మానవ జీవిత పరమార్థం.

ధర్మరాజు ధర్మ వీరుడు, కర్మవీరుడు. అతని భక్తిజ్ఞానాలు కర్మకు దోహదాలుగా నిలిచాయి. కర్మమార్గమే మానవుణ్ణి అమృతునిగా చేస్తుందని నిరూపించే ఇతిహాసం మహాభారతం. కర్మభూమిగా ప్రసిద్ధిచెందిన భరతఖండంలో ప్రతి మానవుడూ అనుసరించదగిన ఆదర్శ జీవిత పథాన్ని చూపించే మహేతిహాసం ఆంధ్రమహాభారతం. ఈ అంశాన్ని అయిదు అధ్యాయాలలో చెప్పటానికి చేసిన ఒక చిన్న ప్రయత్న మిది.

నా మిత్రులలో కర్మయోగిలా నా హృదయాన్ని ఆకట్టుకున్న వారు - లామ్‌కోగ్రూప్ అధిపతులు మాన్యశ్రీ సారిపల్లి కొండలరావుగారు. మానవునిలో మౌలికమైన విలువలను గౌరవించి వ్యాటిని ఆదరించి ఆచరించే కార్యవాది శ్రీ కొండలరావుగారు ధర్మ పురుషార్థ సాధకులు. అర్థిక సంపదకు మూలమైన ఉత్పత్తిని పెంపుచేసి దేశాన్ని సుసంపన్నం చేయటమే కాకుండా, ఆ సంపదలో కొంతభాగం ధార్మిక సాంస్కృతిక కార్యక్రమాలకు పారిశ్రామిక వేత్తలు వినియోగించాలని ప్రబోధించే శ్రీ కొండలరావుగారు ఆధునిక అర్థపురుషార్థ సాధకులు. మానవుని కామనలు నియతం కావాలనీ, ఆధ్యాత్మిక చింతతో అవి పునీతం కావాలనీ, పరిపూర్ణం కావాలనీ భావించటమే కాకుండా బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయలయ మానవ మూల్యాలను మనసులో నింపుకున్న ధర్మార్థ కామ పురుషార్థ సాధకులు శ్రీకొండల రావు గారు. ప్రవృత్తిలో ఎంత గాఢంగా నిమగ్నులై ఉన్నా అంతరంగాన్ని నివృత్తిలో నిశ్చలంగా నిలుపుకొని ఆత్మహంస చేసే క్రేంకారంలాగా 'ఓంశాంతి' అని అనుభవ పూర్వకంగా అనగలిగిన మోక్ష పురుషార్థ సాధకులు శ్రీ కొండలరావుగారు. అందువల్లనే ఈ గ్రంథం వారి కంకితం చేశాను. వారు దయతో అంగీకరించినందుకు నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇది నా షష్టిపూర్తి ముద్రణ కావటం నా అదృష్టం. ముఖచిత్రం అందించిన సాహితీ శిల్పి శ్రీశీలా వీర్రాజు గారికి, గ్రంథ శుద్ధ ప్రతిని తయారు చేయటంలో సహాయపడిన చిరంజీవులు ఎన్. మృదులకు, జె. భారతికి ఆశీస్సులు. అక్షర శిల్పులు శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ వారికి, ముద్రణ శిల్పులు విప్లా ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

హైదరాబాదు,

24-9-1996

- జి.వి. సుబ్రహ్మణ్యం

# అమృత బిందువులు

# ఆంధ్ర మహాభారత కథామృతం

## భారత ప్రశస్తి

మహాభారతం పంచమవేదం. అంటే - నాలుగు వేదాల సారం.

మహాభారతం కార్ష్ణ వేదం. అంటే వాసుదేవ తత్త్వం చెప్పే వేదం.

నాలుగు వేదాలను విభజించిన వ్యాసమహర్షి భారతాన్ని జయకావ్యంగా రాశాడు. దాన్ని జనమేజయ మహారాజుకు వైశంపాయనుణ్ణి వినిపించుమని పంపాడు. వైశంపాయనుడు చెప్పిన కథకు 'భారతం' అనేపేరు వచ్చింది. ఆ తరువాత నైమిశారణ్యంలో శౌనకుడు చేసిన సత్రయాగంలో రోమహర్షణుని కుమారుడూ, ఉత్తమ పౌరాణికుడూ అయిన సూతమహర్షి శౌనకాది మునుల కందరికీ చెప్పాడు. అలా సూతుడు చెప్పిన 'భారతం' మరికొన్ని ఉపాఖ్యానాలతో పెరిగి ' మహాభారతం' గా లోకంలో ప్రసిద్ధి చెందింది. అలా తరువాత ఎంతమంది ప్రచారం చేసినా మెదట చెప్పిన గౌరవం వేదవ్యాసులదే.

వేదవ్యాసుడే భారత కావ్య విధాత. ఆయన చెపుతూఉంటే గణపతి గంటం ఆపకుండా రాశాడని ప్రసిద్ధి. భారతీయ భాషల్లో భారతం వివిధ రూపాల్లో అవతరించింది. ప్రజలు పాటలుగా పాడుకుంటారు. పాండవులకు గుళ్లుకట్టి పూజిస్తారు. ఇక శ్రీకృష్ణుణ్ణైతే పరిపూర్ణ అవతారమూర్తిగా భావించి, జగద్గురువుగా, గీతాచార్యునిగా, రసరాట్టుగా ఆరాధిస్తారు. కవిత్రయం మహాభారతాన్ని తెలుగులో నిర్మించింది. కవిత్రయం అంటే ముగ్గురు కవులు. వారే - పదకొండో శతాబ్దంలో ఉన్న 'ఆదికవి'' నన్నయభట్టు; పదమూడో శతాబ్దంలో ఉన్న 'కవిబ్రహ్మ' తిక్కన సోమయాజి; పధ్నాలుగో శతాబ్ది పూర్వార్ధంలో ఉన్న ''ప్రబంధ పరమేశ్వరుడు' ఎఱ్ఱాప్రెగ్గడ.

సంస్కృత మహాభారతం నూరుపర్వాల శాస్త్రేతిహాసం. ఆంధ్ర మహాభారతం పద్ధెనిమిది పర్వాల కావ్యేతిహాసం. నన్నయ ఆది, సభా పర్వాలు పూర్తిచేసి అరణ్యపర్వంలో

నాల్గో ఆశ్వాసంలోని 142వ పద్యం వరకూ రచించి దివంగతుడయ్యాడు తిక్కన విరాట పర్వం నుంచి స్వర్గారోహణపర్వం దాకా పదిహేను పర్వాలు రచించాడు. ఎఱ్ఱన అరణ్యపర్వశేషాన్ని పూరించాడు. తెలుగు సాహిత్యంలో కవిత్రయంవారి ఆంధ్ర మహాభారతం వంటి భారత కావ్యం మరొకటి లేదు. 'తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి' అని తెలుగువారు మోజుపడి చెప్పుకుంటారు.

భారత కథ మనోహరం, అపూర్వం. దానిని వింటే జీవితానికి సంబంధించిన పరిపూర్ణ జ్ఞానం లభిస్తుంది. పాపం తొలగుతుంది; పుణ్యం కలుగుతుంది!

మహాభారతం అందరికీ నచ్చే కావ్యం; అనంత విజ్ఞాన సర్వస్వం.

సీ. "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు."

ధర్మతత్త్వం తెలిసిన వారికి మహాభారతం ధర్మశాస్త్రంలాగానే కనపడుతుంది. ఆధ్యాత్మిక విషయాలు తెలిసినవారికి వేదాంతంలా గోచరిస్తుంది. నీతిని వివేచించే వారికి మహాభారతం నీతిశాస్త్రంలా స్ఫురిస్తుంది. మహాకవులకు మహాకావ్యంలాగా ప్రత్యక్షమౌతుంది. లక్షణాలు చెప్పే శాస్త్రజ్ఞులకు అన్ని లక్షణాలకూ ఉదాహరణలు దొరికే సంపుటిలాగా స్పష్టమౌతుంది. ఐతిహాసికులకు మహాభారతం ఒక గొప్ప ఇతిహాసంగా తోస్తుంది. పౌరాణికులకు పురాణ సంపుటిలాగా ముచ్చట గొలుపుతుంది. ఇటువంటి అపూర్వ గ్రంథాన్ని రాసినందుకే వేదవ్యాసుణ్ణి విష్ణువువంటి వాడని భారతీయులు భావిస్తారు. భారతాన్ని విశ్వజనీనమైన సంహితగా ఆరాధిస్తారు.

మహాభారతాన్ని విన్నవారికి కూడా ఎన్నో శుభాలు కలుగుతాయి. ఆయువును కోరేవారు చిరకాలం జీవిస్తారు. సంపదలు కోరితే సమృద్ధిగా లభిస్తాయి. ధర్మాన్ని కోరేవారికి సదా ధర్మప్రీతి కలుగుతుంది. సంతానం కోరేవారికి ఉత్తమ సంతానం కలుగుతుంది. భక్తితో భారతాన్ని వింటే భగవంతుడైన శ్రీకృష్ణుడు భవభయాన్ని మాన్పి, కోరిన కోర్కెలన్నీ తీరుస్తాడు.

అందువల్లనే మహాభారతం పారిజాత వృక్షంలాంటి దని భారతీయులు భావిస్తారు. పారిజాత వృక్షం కల్పవృక్షంలాగా కోర్కెలు తీర్చే దేవతరువు. అది వ్యాసుడనే ఉద్యానవనంలో పుట్టింది. ఉపాఖ్యానాలనే కొమ్మలతో విస్తరిల్లింది. వేదార్థాలనే చల్లని నీడలను ప్రసరించింది. ధర్మార్థ కామమోక్షాలనే పూలగుత్తులతో సువాసనలు వెదజల్లింది. నరనారాయణుల గుణకీర్తనమనే ఫలాలతో విరాజిల్లింది. భారత పారిజాతం కోర్కెల వర్షపాతం.

మహాభారతం భారతీయ భారతిగా ప్రవహించే గంగా ప్రవాహం. దీనిని వింటె అందులో స్నానం చేసినట్లే. పాపాలను ప్రక్షాళితం చేసుకొన్నట్లే. సర్వపాపనివారిణి, సకల పుణ్య సంపాదిని శ్రీ మహాభారత శ్రవణం, శ్రీమహాభారత కీర్తనం.

# ఆదిపర్వం

మహాభారత యుద్ధానంతరం కౌరవ వంశానికి అంకురంగా నిలిచినవాడు ఉత్తరాభిమన్యుల పుత్రుడు పరీక్షితుడు. పాండవుల తరువాత హస్తినాపుర సింహాసనమెక్కి అరవైయేడేళ్ళు నిరాఘాటంగా పరిపాలించాడు. ఒకనాడు పరీక్షిన్మహారాజు వేటకు వెళ్లాడు. ఒక మృగం మీద బాణం వేశాడు. అది ఆ గుచ్చుకున్న బాణంతోనే పరుగెత్తటం మొదలు పెట్టింది. రాజు దాని వెంటపడ్డాడు. అది కనుమరుగైపోయింది. ఆ అరణ్యంలో శమీకుడనే ముని కనపడ్డాడు. అతన్ని మృగాన్ని గురించి అడిగాడు. ఆ ముని ధ్యానంలో మౌనవ్రతంలో ఉండటం చేత మాట్లాడలేదు. పరీక్షిత్తుకు కోపం వచ్చింది. పక్కన చచ్చిపడి ఉన్న ఒక పామును వింటి కొప్పుతో ఎత్తి ఆ ముని మెడలో వేసి హస్తినాపురికి తిరిగి వెళ్లాడు.

శమీకుడు సమాధిలో ఉండటంచేత పాము మెళ్లో పడ్డా ఒళ్లు తెలియలేదు. అతనికి శృంగి అనే కుమారు డున్నాడు. అతడు తపస్వి అయినా మహాకోపి. తండ్రికి జరిగిన అవమానాన్ని ఒక ముని వలన విని, ఆగ్రహోదగ్రుడై, ఏడురోజుల్లో తక్షక విషాగ్ని దగ్ధుడై పరీక్షిత్తు ప్రాణాలు కోల్పోవుగాక! అని శపించాడు.

శృంగి తండ్రి దగ్గరకు వచ్చాడు. పామును తండ్రి మెడనుండి తొలగించాడు. శాపాన్ని తండ్రికి తెలియజెప్పాడు. శమీకుడు కోపం వలన ఎన్నో అనర్థాలు కలుగుతాయనీ,

క్షమాగుణం తపస్వికి అలంకారమనీ కొడుకుకు బోధించి శాపాన్ని క్రమ్మరించుమని కోరతాడు. శృంగి దానికి అంగీకరించడు. శమీకుడు విచారపడతాడు. ఒక శిష్యునితో శాపవృత్తాంతాన్ని రాజుకు తెలియపరిచాడు.

శాపవృత్తాంతం విని పరీక్షిత్తు భయపడ్డాడు. మంత్రులతో మంతనాలు సలిపి ఒంటికంబపు మేడ కట్టించుకొని అందులో విషాన్ని విరిచే మహామంత్రాలు జపిస్తూ రాత్రింబవళ్ళు వైద్యులు, భటులు కాపలా కాస్తూ ఉంటే, వారంరోజుల గడువును కంటికి కూరుకు లేకుండా సాగిస్తున్నాడు.

పూర్వం బ్రహ్మదేవుడు కాశ్యపుడనే బ్రహ్మర్షికి సంజీవనిని ఉపదేశించాడు. పరీక్షిత్తును తక్షకుడు కాటేసి చంపితే అతనిని తిరిగి బ్రతికించి తన విద్యా బలాన్ని ప్రభువుముందు వెల్లడించాలని కాశ్యపుడు బయలుదేరాడు. అతన్ని త్రోవలో తక్షకుడు కలుసుకున్నాడు. కాశ్యపుని శక్తిని పరీక్షించటానికి తక్షకుడు ఒక మర్రిచెట్టును కాటేసి దగ్ధం చేశాడు; వెంటనే కాశ్యపుడు ఆ చెట్టును బ్రతికించాడు. అతని విద్యాబలం తెలుసుకొని ఎంతో ధనాన్ని అతనికి పారితోషికంగా ఇచ్చి హస్తినాపురం చేరకుండా అతన్ని తిరిగి పంపించి వేశాడు. పరీక్షిత్తుకు మృత్యువు తథ్యమని తేలింది.

తక్షకుడు నాగకుమారులతో కలిసి బ్రాహ్మణవేషాలతో వెడలి ఏకస్తంభ హర్మ్యానికి చేరుకున్నాడు. వేదఘోషతో వచ్చిన ఆ విప్రులను రాజు పూజించాడు. ఏడవరోజు సూర్యాస్తమయం అవుతున్నది కదా అని ఆ విప్రులు తెచ్చిన పండ్లలో ఒకదానిని పరీక్షిత్తు తినటానికి ఉద్యుక్తుడైనాడు. ఆ పండులో క్రిమిగా తక్షకుడు తలయెత్తి విషాగ్నిని గుప్పించాడు. మేడతో సహా పరీక్షిత్తు దగ్ధుడైపోయాడు.

పరీక్షిత్తు చనిపోయేనాటికి అతని కుమారుడు జనమేజయుడు బాలుడు. పిన్ననాటనే ాజ్యభారాన్ని స్వీకరించవలసి వచ్చింది. తండ్రికి తక్షకునివలన కలిగిన అపకారాన్ని తెలుసుకొని ాముల జాతిమీద మండిపడ్డాడు. సర్పయాగం చేసి తక్షకాదుల నందరినీ అగ్నిలో ఆహుతి ేయాలను కొన్నాడు. యాగం ఆరంభమయింది. అగ్నికుండంలో పాములు వరుసగా వచ్చి డుతున్నాయి. అప్పుడు ఆస్తీకుడనే విప్రుణ్ణి వాసుకి మొదలైన నాగముఖ్యులు సర్పయాగాన్ని ప్పించుమని ప్రార్థించారు. ఆస్తీకుడు సముచితమైన స్తుతులనుచేసి జనమేజయుణ్ణి ్పించి సర్పయాగం మాన్పించాడు.

ఆ తరువాత ఒకనాడు జనమేజయుడు విద్వద్గోష్ఠిలో ఉండగా వైశంపాయనాది ష్యులతో వ్యాసమహర్షి అక్కడకు వచ్చాడు. జనమేజయ మహారాజు వ్యాసమహర్షిని అర్ఘ్య

పాద్యాది విధులతో పూజించి వినయంతో నమస్కరించి ఇలా అడిగాడు -

"ఓ మహర్షీ! మీరూ, భీష్మాది కురువృద్ధులూ కలిసి రాజ్య సంపదను విభాగం చేసి ఇచ్చినప్పటికీ కూడా, సుఖశాంతులతో వాటిని అనుభవించకుండా అటు పాండవులూ, ఇటు కౌరవులూ ఏకారణంవలన ఇంత ప్రజాక్షయమైన భారతయుద్ధం చేశారు? ఈ వంశ కలహం అసలు ఎందుకు కలిగింది? మీ ఆజ్ఞలను వారెందుకు పాటించలేదు? లేదా మీరు తెలిసి తెలిసి వారిని ఎందుకు వారించలేదు? పాండవధార్తరాష్ట్రుల విభేదన కథ వినాలని ఉంది. వినిపించండి" - అని జనమేజయుడు వేడుకొన్నాడు. వ్యాసమహర్షి శ్రీ మహాభారత కథాఖ్యానం చెప్పటానికి తన శిష్యుడైన వైశంపాయనుణ్ణి నియోగించాడు. అందువలన కథకుడు - వైశంపాయనుడు. శ్రోత - జనమేజయుడు.

మహాభారత కథ చెప్పటానికీ, వినటానికీ ఒక ప్రణాళిక కావాలి. దాన్ని తెలుగులో నన్నయ సూచించాడు. ఆంధ్ర మహాభారతం వినాలనే కోర్కె రాజరాజనరేంద్రుని కుండేది. దాన్ని ఎలా వినాలో కూడా ఒక పద్ధతి ఆయన మనసులో ఉండేది. దాన్ని నన్నయతో చెప్పుకొని మహాభారతాన్ని వినిపించుమన్నాడు.

"'హిమకరుఁదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁ గా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెమ్మెయిన్"

జనమేజయుడిలాగానే రాజరాజనరేంద్రుడు కూడా చంద్రవంశజుడు. వేదధర్మాన్ని ఆచరించిన ఆదర్శ ప్రభువుల వంశ చరిత్రలను ప్రధానంగా సూర్యచంద్రవంశగాథలుగా పురాణాలు వర్ణిస్తాయి. పాండవులు చంద్ర వంశజులు. అంటే వారి వంశానికి మూలపురుషుడు చంద్రుడన్నమాట. ఒక్కొక్క వంశంలో వంశకర్తలని కొందరు ప్రసిద్ధి పొందుతారు. వారి పేర్లమీద ఆ వంశజులు పిలువబడుతూ ఉంటారు. చంద్రవంశంలో ఒక్కొక్కరు ఒక్కొక్క విశిష్ట ధర్మాన్ని పాటించిన వారని పేరుపొందినవారు - వరుసగా పూరుమహారాజు, భరత మహారాజు, కురుమహారాజు, పాండు మహారాజు. వారు ఆ వంశకర్తలు. తండ్రికోసం నిండు యౌవనాన్ని త్యాగం చేసిన ధీరుడు పూరుడు; అఖండ రాజ్యాన్ని ఆదర్శవంతంగా పరిపాలించిన ధర్మమూర్తి భరతుడు; యజ్ఞయాగాదుల నాచరించి ధర్మకర్మ పరిరక్షణం చేసిన కర్మవీరుడు కురుమహారాజు; దిగ్విజయయాత్రలు చేసి రణపాండిత్యాన్ని ప్రకటించిన యుద్ధవీరుడు పాండురాజు. వీరి నలుగురి పేర్లమీదా ఆ వంశజులు ప్రసిద్ధి కెక్కారు. పాండవులను-

పౌరవులనీ, భారతులనీ, కౌరవులనీ అందువల్లనే పిలుస్తూ ఉంటారు. మహాభారతంలో విశేషమేమంటే - చంద్రవంశంలో పుట్టిన పాండవులు తమకు పూర్వం తమ వంశంలో పుట్టిన వంశకర్తల ఉత్తమ గుణాలనన్నింటినీ తమలో పండించుకొన్నారు. అందువలన చంద్రవంశం పాండవ చరిత్రలో పరిపూర్ణతను సాధించింది. కాబట్టి, పాండవుల చరిత్రను సవిస్తరంగా వింటే మహాభారతాన్ని అంతా విన్నట్టే.

## వ్యాసుని జననం

మహాభారతాన్ని రచించిన వేదవ్యాసులవారే పాండవుల చరిత్రలో ఒక ప్రధాన పాత్ర నిర్వహించారు. అందువలన ఆయనను గురించి ముందు తెలుసుకొందాం.

దాశరాజుకు మత్స్యగంధి అనే కూతురు ఉంది. అద్రిక అనే అప్సరస బ్రహ్మశాపం వల్ల యమునలో చేపగా తిరుగుతున్నప్పుడు ఆమె ఉపరిచర వసువు వీర్యం వలన పుట్టింది. ఆమెను దాశరాజు పెంచుకుంటున్నాడు కన్న బిడ్డలా. చేపకడుపున పుట్టటం వలన ఒళ్లల్లా చేపవాసన కొడుతుండేది ఆమెకు. అందువల్ల మత్స్యగంధి అని పిలిచేవా రామెను. ఆమెకు యౌవనం వచ్చింది. యమునానదిమీద పడవ నడిపిస్తూ యాత్రికుల సేవ చేసుకోమని తండ్రి మత్స్యగంధిని నియోగించాడు. ఆమె శ్రద్ధా భక్తులతో ఆపని చేస్తోంది.

వసిష్ఠ మహర్షి మనుమడు, శక్తిపుత్రుడు, మహాతపస్వి అయిన పరాశరముని యమునానది దాటటానికి పడవరేవుకు వచ్చి మత్స్యగంధిని చూచాడు. ఆమె శరీర సౌందర్యం ఆమహర్షి మనస్సును దోచుకొన్నది. ఆతడు తన కోర్కెను ఏకాంతంగా ఆమెకు తెలియజెప్పాడు. మునిమాట కాదంటే శాపమిస్తాడనే భయంతో పరాశరునితో మెల్లగా ఇలా అన్నది:

"మహర్షీ! నేనా కన్యకను, పైపెచ్చు నా మేనెల్లా చేపలకంపు; మీ మాట నే నంగీకరిస్తే నాకన్యకావ్రతం ముగిసిపోతుంది. అప్పుడు మాతండ్రిగారింటికి నే నెలా వెళ్లగలుగుతాను? కాబట్టి, నా కెటువంటిదోషం రాకుండా నీవు అనుగ్రహిస్తే నాకేమీ అభ్యంతరం లేదు" అని అన్నది మత్స్యగంధి.

పరాశరుడు ఆ మాటలు విని, సంతోషంతో ఆమె కన్యాత్వానికి లోపం లేకుండా వరమిచ్చాడు. ఆమె శరీరంలోని చేపలకంపు పోయి ఒక యోజనదూరం వరకూ పరిమళించే సుగంధాన్ని సహజశరీర వాసనగా ప్రసాదించాడు. దానితో ఆమె 'గంధవతి'గా 'యోజనగంధి'గా పేరుపొందింది. ఆమెకు దివ్యాంబర భూషణాలు అందించాడు మహర్షి. పడవ నది నడుమనున్న దీవికి చేరింది. పట్టపగలు - బట్టబయలు ఎలా సంగమం సాధ్యం అని

అనుమానించింది యోజనగంధి. పరాశరుడు పట్టపగలును చిమ్మచీకటిగా మార్చాడు. ఆ ముద్దరాలి అనురాగాన్ని అనుభవించాడు. ఆమెకు సద్యోగర్భంలో సూర్యతేజుడైన వ్యాసుడు ఉదయించాడు. పుట్టగానే సద్యోయౌవనుడైనాడు. సమస్తజ్ఞానం ఆయనకు స్వాధీనమైంది. పరాశరుడు మత్స్యగంధికి మరికొన్ని వరాలిచ్చి వెళ్ళిపోయాడు. యమునా ద్వీపంలో పుట్టటం వలనా, కృష్ణుడు - అంటే - నల్లనివాడు కావటంచేత వ్యాసుడు కృష్ణద్వైపాయనుడు అయినాడు. కృష్ణాజినం, కాషాయాలు, కపిలజడలు, దండకమండలాలూ సహజంగానే ధరించి వ్యాసుడు తల్లికి నమస్కరించాడు. "మీకు నా అవసరం ఎప్పుడు ఉంటే అప్పుడు నన్ను తలుచుకోండి అక్షణమే మీ యెదుట ఉంటాను" అని చెప్పి తపోవనానికి వెళ్లాడు. ఘోరతపస్సు చేసి, ఆత్మ సాక్షాత్కారాన్ని పొంది, చిక్కుపడిఉన్న వేదాలను విడదీసి లోకంలో వెలయించాడు; వేదవ్యాసుడైనాడు. మహాభారతంలో తానూ ఒక పాత్రగా జీవించి చివరకు ఆ కావ్యాన్ని తానే రచించాడు. యోజనగంధి అసలు పేరు సత్యవతి. కౌరవ వంశ చరిత్రలో తరువాత కీలక పాత్ర నిర్వహించింది.

## భీష్మప్రతిజ్ఞ

వ్యాసుని తరువాత పాండవ కథలో మరో ప్రధానవ్యక్తి భీష్ముడు. శంతన మహారాజుకూ గంగా దేవికీ పుట్టిన మహాబలుడు. వసిష్ఠుని శాపం వలన భూతలం మీద పుట్టి బ్రహ్మచారిగా దీర్ఘాయువుగా, మహావీరుడుగా జీవించిన సత్యవ్రతుడు. యౌవరాజ్య పట్టాభిషేక యోగ్యుడై తండ్రియైన శంతన మహారాజుగారి వాత్సల్యాన్ని చూరగొంటూన్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు శంతనుడు గంగానదీ తీరంలో యోజనగంధిని చూచాడు. ఆమెపై మరులు కొన్నాడు. ఆమె తండ్రి అయిన దాశరాజుకు తనకోరిక తెలిపాడు. దాశరాజు అందుకు అంగీకరించాడు కాని, ఒక నియమం పెట్టాడు. శంతనునికీ సత్యవతికీ కలిగిన పుత్రునికే పట్టాభిషేకం చేయాలి అప్పుడే సత్యవతితో వివాహానికి అంగీకరిస్తా నన్నాడు. శంతనుడు భీష్ముని మీది అభిమానంతో సత్యవతి సంబంధాన్ని అంగీకరించలేక హస్తినాపురానికి తిరిగి వెళ్లాడు. కాని, సత్యవతీ విరహంతో కుమిలిపోతుంటాడు. భీష్ముడు తండ్రి మనస్సును తెలుసుకొంటాడు. దాశరాజు దగ్గరికి వెళతాడు. అతని నియమాన్ని అంగీకరిస్తాడు. దానికోసం రెండు భీషణ ప్రతిజ్ఞలు చేస్తాడు : ఒకటి - తాను రాజ్యం స్వీకరించకుండా శంతనునికీ సత్యవతికీ కలిగిన సంతానానికే రాజ్యం లభించేటట్లు చేస్తానని. రెండు : భవిష్యత్తులో తనకు పుట్టే బిడ్డలు సింహాసనానికి పోటీ పడకుండా ఉండటానికి వీలుగా ఆమరణ బ్రహ్మచర్యవ్రతాన్ని స్వీకరిస్తానని. ఈ ప్రతిజ్ఞలు విని దేవతలు పూలవాన కురిపించారు. 'భీష్ముడు' అని ప్రశంసించారు. తండ్రి అతనికి 'స్వచ్ఛందమరణాన్ని' వరంగా ఇచ్చాడు.

భీష్ముని వలననే సత్యవతికీ శంతనునికీ వివాహమౌతుంది. వారిద్దరికీ చిత్రాంగద, విచిత్రవీర్యులనే పుత్రులు పుట్టారు. వారి చిన్నప్పుడే శంతనుడు కన్నుమూశాడు. వారిద్దరి రక్షణభారంతోపాటు రాజ్యరక్షణభారాన్ని కూడా భీష్ముడు స్వీరించాడు. చిత్రాంగదుడికి పట్టాభిషేకం చేశాడు. అతడు గర్వాంధుడై విహరించాడు. మనుజ గంధర్వాదులను ఆక్షేపించాడు. చిత్రాంగదుడనే ఒక గంధర్వపతికి కోపం వచ్చి అతన్ని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. చిత్రంగదులిద్దరూ ఘోరంగా యుద్ధం చేశారు. శంతనుని పుత్రుడు చిత్రాంగదుడు యుద్ధంలో చనిపోయాడు. ఆ తరువాత భీష్ముడు విచిత్రవీర్యునికి హస్తినాపురి పట్టాభిషేకం చేశాడు. అతనికి కాశీరాజు కూతుళ్లను ముగ్గురిని స్వయంవరంలో బలవిజితలుగా తెచ్చి వివాహం చేయబోయాడు. వారిలో పెద్దది అంబ సాల్వుణ్ణి వరించింది కావున భీష్ముడామెను సాళ్వదేశానికి పంపాడు. మిగిలిన ఇద్దరూ అంబిక, అంబాలికలను విచిత్రవీర్యునికి కట్టబెట్టాడు. అతడు ఆ భార్యలతో అహోరాత్రాలు భోగించి నిర్వీర్యుడై అసువులను కోల్పోయాడు. దానితో హస్తినాపురికి నాథుడు లేకుండా పోయాడు.

అదొక విచిత్రమైన పరిస్థితి. కురువంశపుత్రులలో మిగిలింది భీష్ముడొక్కడే. సత్యవతి అతణ్ణి రాజ్యానికి పట్టాభిషిక్తుడవు కమ్మనీ, వివాహమాడి సంతానవంతుడవై వంశాన్ని నిలుపుమనీ వేడుకొన్నది. భీష్ముడు తన భీష్మప్రతిజ్ఞను జ్ఞాపకం చేసి, పంచభూతాలు వాటి ధర్మాలు తప్పినా నేను నా మాటను మాననని స్పష్టం చేశాడు. అప్పుడు భీష్ముడు నిండు సభలో ఒక ఆపద్ధర్మాని ప్రతిపాదించాడు. రాజవంశాలలో సంతానం లేకుండా రాజులు మృతులైనప్పుడు దేవరన్యాయంతో రాజులు సంతానాన్ని పొందే ఆచారాన్నీ, అది అప్పటి సమాజంలో పొందిన ప్రామాణికత్వాన్నీ వివరించి చెప్పాడు. అది అందరికీ అంగీకారమైంది. సత్యవతి వేదవ్యాసుని తలచి, అతడు తన కోడండ్రైన అంబిక, అంబాలికల యందు పురుష సంతానాన్ని కలిగించేటట్లు భావిస్తుంది.

ఆ దేవర న్యాయం వలన అంబికయందు వేయి యేనుగులబలం గల ధృతరాష్ట్రుడు పుట్టాడు. కాని, అతడు పుట్టుగ్రుడ్డి. అందువలన వ్యాసుడు అంబాలిక యందు మరొక పుత్రుణ్ణి అనుగ్రహించాడు. అతడు మహాపరాక్రమశాలి కాని, పాండు శరీరం కలవాడు కాబట్టి పాండురాజయ్యాడు. సలక్షణ సంతానం కలుగలేదన్న అసంతృప్తితో అంబికను మరొక పుత్రుణ్ణి కనమని కోరుతుంది సత్యవతి. కాని వ్యాసుని కపిలగడ్డము, కవిల జడలు, నల్లని పొడుగైన రూపము చూచి రెండవసారి పొందలేక అంబిక ఒకదాసిని తనస్థానంలో ఉంచుతుంది. ఆమె వ్యాసుని హృదయాన్ని మెప్పించి ఒక సుతుణ్ణి పొందుతుంది. అతడే ధర్మవిదుడైన విదురుడు. వారిని పెంచి, పెద్దవారిని విద్యావంతులను చేసి,

వివాహితులను చేసే బాధ్యత కూడా భీష్ముడే స్వీకరించాడు.

ధృతరాష్ట్రునికి పెళ్లియీడు వచ్చింది. గాంధార దేశాన్ని పరిపాలించే సుబలుడనే రాజుకు గాంధారి అనే కూతురు ఉన్నదనీ , ఆమె రూపలావణ్యశీలాలలో ఉత్తమురాలనీ, నూరుగురు బిడ్డల తల్లి కాగలదనీ జ్యోతిష్కుల వలన విని భీష్ముడు స్వయంగా ఆసంబంధాన్ని కుదిర్చాడు. అంతేకాదు గాంధారికి పదిమంది తోబుట్టువు లున్నారు. వారందరినీ ధృతరాష్ట్రుని కిచ్చి పెళ్ళిచేయించాడు. అంతేకాక, కులశీలవతులైన నూరుగురు కన్యలనిచ్చి ఆపై వివాహాలు జరిపించాడు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడయినా అతనికి ఎటువంటి లోపం రాకుండా చూచాడు. అతనికి పట్టాభిషేకం చేశాడు.

పాండురాజు అఖిలాస్త్ర శస్త్ర విద్యలను గడించి విస్తృత దేశ దండయాత్రలు చేసి అపార ధనరాసులు తెచ్చి ధృతరాష్ట్రుని వశం చేసేవాడు. బంధువులకు పంచేవాడు. అతడు స్వయంవరంలో పొందిన కన్య కుంతి; భీష్మానుమతితో పెండ్లాడిన కన్య మాద్రి. పాండురాజు కుంతీ మాద్రులను అమితానురాగంతో చూచుకొంటూ ఉండేవాడు.

## కర్ణుని జన్మరహస్యం

ఇక్కడ కుంతి జీవితంలో జరిగిన ఒక రహస్య వృత్తాంతం చెప్పాలి. కుంతి బోజుని యింట కుంతి కన్యగా పెరుగుతున్నప్పుడు అతిథులకు సత్కారాలను స్వయంగా నిర్వహిస్తూ వారి ఆశీస్సులను, ప్రశంసలను పొందుతూ ఉండేది. ఒకసారి దుర్వాసుడు వారింటికి అతిథిగా వచ్చాడు. అతనికి ఇష్టమైన పదార్థాలను వండి వడ్డించి భక్తితో సేవించింది కుంతి. ఆముని సంతసించి ఒక దివ్యమంత్రాన్ని ప్రసాదించా డామెకు. ఆమంత్రంతో ఏ వేల్పునైనా ఆరాధిస్తే అతడు, కోరిన పుత్రుణ్ణి ఇచ్చి సంతోషపెడతాడు. అది ఆపద్ధర్మంగా వాడుకోతగింది మాత్రమే.

ఆ ముని వెళ్లిపోగానే ఆ మంత్రశక్తిని పరీక్షించాలని ఆసక్తి కలిగి గంగదరికేగి కుంతి సూర్యుణ్ణి స్మరించి అతని వంటి కొడుకును కోరి మంత్రాన్ని జపించింది. సూర్యుడు తరుణద్యుతితో ఆ తరుణి దగ్గరకు దిగి వచ్చాడు. సహజ కవచకుండల శోభితుడైన బిడ్డ నిచ్చాడు. అతడే కర్ణుడు. అయితే కుంతి కోరికపై ఆమె కన్యాత్వం యథాతథంగా ఉండేటట్లు వరమిచ్చాడు. కుంతి సూర్య ప్రేరితమై వచ్చిన ఒక మందసంలో కర్ణుణ్ణి ఉంచి నదిలో వదిలింది. సూతు డొకడు ఆ పెట్టెను పట్టి కర్ణుని తన పట్టిగా పెంచుకొన్నాడు.

కుంతి కర్ణుని జన్మరహస్యాన్ని బైట పెట్టలేదు. అది దేవరహస్యంగా ఉండిపోయింది.

# పాండవ, కౌరవ జననం

ఒకసారి పాండురాజు వేటకు వెళ్లాడు. ఆరోజు వనంలో ఎక్కడా వేటకు మృగాలు దొరకలేదు. విసిగివేసారి పోయాడు. చివరకు ఒకచోట, రెండు మృగాలు క్రీడిస్తుంటే చూచి వాటిని బాణాలతో కొట్టి చంపాడు. కిందముడనే ముని తన భార్యతో కలసి మృగరూపంలో క్రీడిస్తున్నాడు. అతడు పాండురాజు బాణాలకు చనిపోతూ శాపం పెట్టాడు - 'నేను నా భార్యతో కూడినప్పుడు ఎలా చనిపోతున్నానో అలాగే నీవు నీ భార్యతో కూడినప్పుడు చనిపోతావు. నీ భార్యకూడా చనిపోతుంది' - అని శపించి ఆ ఋషి దంపతులు కన్నుమూశారు. పాండురాజు విషణ్ణుడయ్యాడు; విరక్తుడు కూడా అయ్యాడు. భార్యా సమేతుడై శత శృంగపర్వతం చేరి ఘోరతపస్సు చేయనారంభించాడు. అది బ్రహ్మ లోకానికి వెళ్లేదారి. కొందరు మునులు బ్రహ్మలోకానికి పోతూ ఉంటే పాండురాజు వారితో తానూ వస్తానన్నాడు. కాని, వారు 'అపుత్రస్యగతిర్నాస్తి అని వినలేదా! నీకు సంతానం లేదు కాబట్టి మోక్షానికి అర్హతలే' దని చెప్పారు. వారి మాటలు పాండురాజును మరీ క్రుంగదీశాయి.

సంతానాన్ని గురించి కుంతీమాద్రులతో కలిసి ఆలోచించాడు. దుర్వాస మహర్షి తన కిచ్చిన మహామంత్ర మొకటి ఉన్నదని ఆపద్ధర్మంగా దానిని పుత్రలబ్ధికి వాడుకోవచ్చునని కుంతి చెపుతుంది. పాండురాజు అంగీకరిస్తాడు. కుంతిని పుత్ర సంతానం కోసం మంత్రమహిమ నాశ్రయించుమని నియోగిస్తాడు. ఆమె భర్తకు ప్రదక్షిణం చేసి సమాహిత చిత్తంతో మంత్రాన్ని జపిస్తుంది. మొదటగా - సర్వలోకాలకు ఆశ్రయమైన ధర్మానికి మూలమైనవాడు ధర్ముడు; అతనిని స్మరించి ఉత్తమ ధర్మవర్తనుడైన పుత్రుణ్ణి కోరుకుంది. దిక్కులు కాంతులతో పిక్కటిల్లేటట్లు వెలుగొందే బాలుడు ధర్ముని అంశాన జన్మించాడు. అతడు పుట్టినప్పుడు సర్వభూతములు సంతోషించాయి. ఆకాశవాణి ఇలా పలికింది: "ఇతడు కురుకుల దీపకుడౌతాడు; ధర్మస్థిరమతి కావటంచేత యుధిష్ఠిరుడు" అని పిలువబడతాడు.

యుధిష్ఠిరుడు పుట్టిన సంగతి హస్తినాపురానికి వార్త అందింది. అందరూ సంతోషించారు. కాని, గాంధారి అప్పటికే గర్భవతి. సంవత్సరం నిండుతున్నా ముందుగా సంతానాన్ని కనలేకపోయింది. ఆ అసూయతో కడుపుపై బాదుకొన్నది. గర్భపాతమైపోయింది. వేదవ్యాసుడు వచ్చి ఆ పిండ ఖండాలను నూటొక్కటిని లెక్కించి వేరువేరు తైలభాండాలలో భద్రపరిచాడు. నూర్వురు కొడుకులు, ఒక్క కూతురు పుడతారని చెప్పి వెళ్లాడు.

అక్కడ - శత శృంగపర్వతం మీద పాండురాజు మరొక పుత్రుని పొందాలనే కోరికతో కుంతిని - వాయుదేవుని ఆరాధించి ఉత్తమజవసత్త్వుడైన కుమారుణ్ణి పొందుమని - అడుగుతాడు. ఆమె అలాగే చేస్తుంది. వజ్రదేహుడైన విక్రమోన్నతుడైన బాలుడు పుట్టాడు.

దివ్యవాణి అతనికి 'భీమసేనుడు" అని పేరుపెట్టింది.

అదేరోజున హస్తినాపురంలో దుర్యోధనుడు పుట్టాడు. కులాన్నీ, లోకాన్నీ నాశనం చేయగల దుశ్శకునాలు ఎన్నో పొడసూపాయి. అందరూ భయవిహ్వాలులైనారు. అలాగే క్రమంగా దుశ్శాసనుడు మొదలైన తొంభై తొమ్మిదిమంది తమ్ములు, దుశ్శల అనే చెల్లెలు దుర్యోధనునికి పుట్టారు. కులనాశకుడైన దుర్యోధనుని ఒక్కణ్ణి దూషించటం మంచిదని పెద్దలు ధృతరాష్ట్రునికి సూచించారు. అతడు పుత్రవ్యామోహంతో దాన్ని అంగీకరించలేదు.

ఈ సంగతి విని - పాండురాజు త్రిలోక విజయుడైన పుత్రుని కొరకు ఏకపాదం మీద నిలువబడి ఒక సంవత్సరం కాలం ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేశాడు. దేవేంద్రుడు ప్రసన్నుడై శత్రుక్షయాన్ని చేయగల మహావీరుడు నీకు కొడుకుగా పుడతాడని వరమిచ్చాడు. పాండురాజు, కుంతీదేవిని దేవేంద్రుని ఉపాసించుమని కోరతాడు. ఆమె అలాగే ఆరాధిస్తుంది. స్థిరపౌరుషుడు, లోకోత్తరుడు, వంశకరుడు అయిన పుత్రుడు ఇంద్రాంశతో పుట్టాడు. ఆ సమయంలో దేవతలు ఆ బాలుని భావి బలవీర్యాలను కీర్తిస్తూ.పూలవానలు కురిపించారు. ఉత్తరఫల్గుణిలో పుట్టాడు కాబట్టి ఆ బాలుణ్ణి ఫల్గుణుడని పిలిచారు.

ముగ్గురు కొడుకులను చూచి పాండురాజు మూడులోకాలు జయించినట్లు పొంగిపోతుండేవాడు. కాని, మాద్రి తనయందు పుత్ర సంతానం పొందే ఉపాయం లేకపోవటంవల్ల విచారిస్తూ ఉండేది. దీన్ని గమనించి, కుంతితో ఒప్పించి, దూర్వాసుని మంత్ర ప్రభావంతో మాద్రిచేత అశ్వినీ దేవతలను ఆరాధింపజేసి కవలపిల్లలను పొంద గలిగాడు. వారే నకుల సహదేవులు. సౌందర్య పరాక్రమాలలో సాటిలేనివారు. ఇలా పంచ పాండవులు పుట్టి శుక్ల పక్ష చంద్రబింబాల్లాగా పెంపొందుతూ ఉన్నారు.

అంతలో ఒక విపత్తు. వసంత ఋతువు వచ్చింది. ప్రకృతిశోభ మానవుల హృదయాల నుప్పొంగ జేస్తోంది. ఒకనాడు కుంతి అన్నదానవ్రతంలో నిమగ్నురాలై ఉంది. మాద్రి ఒక్కతే పాండురాజు ప్రక్కన ఉంది. ఆమె మనోహరరరూపం వసంత ప్రభావంతో అతని మనస్సు నాకర్షించింది. పాండురాజు మాద్రిని సమీపించాడు. మునిశాపం చేత మరణించాడు. శతశృంగీయులందరూ గుమికూడారు. హృదయ విదారకంగా విచారించారు. మాద్రి తాను పాండురాజుతో సహగమనం చేసింది. కుమార రక్షణకు కుంతి దృఢచిత్తంతో జీవించ సంకల్పించింది. మాద్రీ పాండురాజుల అంత్యక్రియుల తర్వాత వారి అవశేషాలతో అందరూ హస్తినాపురం చేరారు.

## రగిలిన పగలు

హస్తినాపుర రాజమందిరంలో అటు కౌరవులు, ఇటు పాండవులు అందరూ కలి బాలక్రీడ లాడుతుండేవారు. అందరిలో బలాఢ్యుడు భీమసేనుడు. జలక్రీడ లాడేటప్పు భీముడు కౌరవులను బుజాలపై కెక్కించుకొని నీటిలో ముంచి తేల్చి ఉక్కిరి బిక్కి చేసేవాడు. పండ్లకోసం కౌరవులు చెట్లెక్కితే భీముడు చెట్ల మొదళ్లు బట్టి ఊపి పండ్లతో బా వారిని కూడా క్రింద పడేసేవాడు. ఇలా భీముని చేతిలో బాధపడలేక దుర్యోధనుడు- శకు దుశ్శాసనాదులతో మంతనాలు సలివి, భీముణ్ణి ఒంటరిగా ఉన్నప్పుడు చంపటా పన్నాగాలు పన్నాడు.

ఒకనాడు భీముడు జలక్రీడలలో వేయిమంది వీరకుమారులతో పోటీపడి గెలి బాగా అలసిపోయి, చల్లగాలి వీస్తుంటే నీటి ఒడ్డునే పడుకొని గాఢనిద్రపోయాడు. దా గమనించిన దుర్యోధనుడు భీముణ్ణి లతాపాశాలతో గట్టిగా కట్టించి నీటిలో త్రోయించా కాని, భీముడు ఒళ్ళు విరుచుకుండే సరికి ఆ లతలన్నీ పెటపెటా తెగి పోయాయి. భ బంధవిముక్తుడు లాగా నీటినుండి బయటికి వచ్చాడు.

ఒకనాడు బాగా శ్రమించి భీముడు నిద్రిస్తున్నాడు. ఆ అదను కనిపెట్టి దుర్యోధను ఒక సారథి చేత పాములను తెప్పించి అతన్ని కరిపించాడు. భీముని శరీరం వజ్రతుల్య కావటం చేత పాముల కోరలు అతని చర్మంలో దిగబడలేదు. కాని, నిద్ర మెలకువ వచ్చిం సారథి నొక్క చరుపుతో చంపివేశాడు, పాములను కాళ్ళతో నలిపివేశాడు. ఒకసారి అన్నం విషం కలిపి పెట్టించాడు దుర్యోధనుడు. యయుత్సుడు వద్దంటున్నా ఆకలిగొన్న భీము ఆ విషాన్నం తిన్నాడు. విషంకూడా ఆకలి వలన అతనికి అమృతంగా మారింది. ఇలా ఎన్ ఉపాయాలతో భీముణ్ణి వధించి ధర్మరాజును ఒంటరివాణ్ణి చేసి చంపాలని దుర్యోధను ప్రయత్నించి విఫలుడయ్యాడు. చివరకు - పాండవులకందరికీ అపాయం కలిగిం ఉపాయమే ఉపాదేయమనుకున్నాడు.

భీష్ముడు బాలురకందరికీ మొదట కృపాచార్యునిచేత విలువిద్య నేర్పించాడు. ఆపై ద్రోణుని కూడా నియోగించాడు. ద్రోణుణ్ణి ద్రుపదుడు అవమానించాడు. అందువల అతనిపై ప్రతీకారం తీర్చుకోవాలని ఆతడు లోలోన మండిపోతున్నాడు. శిష్యులందరి తనకోర్కె తీర్చగలరా అని అడిగాడు. అర్జునుడు ఒక్కడే మాట ఇచ్చాడు. అందువలన అత జగదేకవీరునిగా తీర్చిదిద్దుతానని ద్రోణుడు వరమిచ్చాడు. ఏకలవ్యుని వంటి వారి అ ఉపాయంతో తొలగించాడు. రాత్రియుద్ధం, శబ్దభేది, అస్త్రశస్త్రాలు, విలువిద్యా రహస్యాల ఎన్నెన్నో అర్జునునికి బోధించాడు. విలువిద్యలో పార్థుడే ప్రథమగణ్యుడు.

రాజకుమారుల అస్త్రశస్త్రపాండిత్యాన్ని పెద్దల ముందు ప్రదర్శింప చేయటానికి ద్రోణుడు ఒకవిశాలసమతల ప్రదేశంలో రంగం ఏర్పాటు చేయించాడు. తెల్లని వస్త్రాలతో ద్రోణుడు అశ్వత్థామ వెంటరాగా క్రీడారంగం మధ్యకు వచ్చి నిలువబడ్డాడు. కురు కుమారులందరూ జ్యేష్ఠానుపూర్వంగా మహాధనువులతో తనుత్రాణాలతో గురువుగారి వెనుక వరసగా నిలిచారు. చూడముచ్చటగా ఉంది దృశ్యం.

మొట్టమొదట భీమ దుర్యోధనుల గదా ద్వంద్వ యుద్ధం ప్రవర్తిల్లింది. భూమి దద్దరిల్లేలా పాద ఘట్టనం చేస్తూ మదపుటేనుగుల్లాగా భయంకరంగా పోరాడ సాగారు భీమ దుర్యోధనులు. ప్రజలలో వారిరువురి పట్ల అభిమానం గల వారు పెద్ద అరుపులతో పాటు పరస్పర వివాదాలు గూడా చేయటం మొదలు పెట్టారు. దానితో వారిద్దరి పోరును ద్రోణుడు అశ్వత్థామను పంపి ఆపించాడు.

ఆ తరువాత హేమ కవచావృతుడు, ఉన్నత చాపధరుడు, అసితోత్పల వర్ణుడు, బద్ధతూణీరుడు అయిన అర్జునుడు రంగమధ్యంలో నిలిచి జన హృదయాలను ఆకట్టుకొన్నాడు. ప్రజలు చేసే ప్రస్తుతి మిన్నంటింది. అర్జునుడు ఆచార్యుని అనుమతితో ఆగ్నేయ, వారుణాది మహాస్త్రాలను ప్రయోగించి, పరుగెత్తుతున్న మృగాలపై బాణాలు నాటే పలునేర్పులను ప్రకటించి విలువిద్యలో మేటివీరుడని జయజయధ్వానాలు పొందాడు.

అంతలో సహజకవచకుండలధారియైన కర్ణుడు రంగద్వారం వద్ద నిలిచి భుజాస్ఫాలనం చేసి అర్జునుణ్ణి ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. ద్రోణుని అనుమతితో ముందుగా అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ ప్రదర్శించి చూపించాడు. అతని పరాక్రమం చూచి దుర్యోధను డతనిని కౌగిలించుకొని "నాతో స్నేహం చేసి నాకూ నా బంధువులకు హితం చేసి నన్ను కురురాజ్యం ఏలించి, నా ఐశ్వర్యం ఉపయోగించుకో" అని కోరాడు. కర్ణుడు దానికి అంగీకరించాడు.

ఆ తరువాత కర్ణార్జునుల ద్వంద్వ యుద్ధం మొదలైంది. కర్ణుడు పర్జన్యాస్త్రం వేశాడు. అర్జునునిపై మేఘాలు దట్టంగా కమ్మాయి. కుంతి భయపడింది. అంతలో అర్జునుడు వాయుబాణం వేసి మేఘాలను చిమ్మివేశాడు. కుంతి శాంతపడింది. వారిద్దరి నడుమ పంతాలు పెరుగుతున్నందువల్ల కృపాచార్యుడడ్డుపచ్చి, అర్జునుని తల్లిదండ్రుల పేర్లు కులం అందరికీ తెలుసు, అలాగే నీ వివరాలూ తెలియజెప్పమని కర్ణుణ్ణి అడిగాడు. కర్ణుడు చెప్పడానికి సిగ్గుపడి తలవంచుకొన్నాడు.

దుర్యోధనుడు రంగప్రవేశం చేసి, రాజైతేనే గాని పార్థునితో యుద్ధం చేయడానికి

వీల్లేదంటే ఇదుగో అంగరాజ్యాన్నిస్తున్నానని, రంగమధ్యంలో సింహాసనం వేసి అంగరా పట్టాభిషేకం చేసి కర్ణుణ్ణి అంగరాజుగా పిలిచాడు. సూతుడు కొడుకుని చూచి ఉప్పొంగిపో కౌగలించుకొన్నాడు. కర్ణుడు అతనికి అభివాదనం చేశాడు. దానితో అతడు సూతపుత్రు అందరికీ తెలిసి పోయింది. భీముడు సూతపుత్రుడు క్షత్రియునితో యుద్ధం చేయ తగదన్నాడు. దుర్యోధనుడు అతని మాటలకు అడ్డువచ్చాడు. "లేడి కడుపున ప పుడుతుందా? ఇంతటి దివ్యతేజస్సు కలవాడు సామాన్యుడై ఉంటాడా? సూరుల జన్మ సురల జన్మము, ఏరుల జన్మము ఎవరు చెప్పగలరు? సహజ కవచ కుండలధారియై ఇతడు అంగరాజ్యానికే కాదు అఖిల మహీమండలానికే అధిపతి కాగలిగినవాడు" ప్రశంసిస్తూ ఉండగా ప్రొద్దుక్రుంకింది. అందరూ వారి వారి మందిరాలకు వెళ్లారు.

## గురుదక్షిణ

మరునాడు ద్రోణాచార్యులు శిష్యులనందరినీ పిలిచి గురుదక్షిణ ఇవ్వమన్నా అందరూ గురువుగారిని ఆదేశించుమన్నారు. 'ఐశ్వర్యమదగర్వితుడైన ద్రుపదుణ్ణి ఓడి పట్టి నాముందు పెట్టండి. అదే నేను కోరే గురుదక్షిణ' అని ప్రకటించాడు ద్రోణాచార్యు

ఆమాట వినగానే కౌరవులందరూ సైన్యాలను వెంటబెట్టుకొని రథాలె పాంచాలపురం వైపు పయనం సాగించారు. పాండవులు గురుప్రదక్షిణం చేసి ఆయన వెంట తీసికొని ఆతరువాత బయలుదేరారు. కౌరవుల సేనను ద్రుపదుడు చతురంగ సే ఎదుర్కొన్నాడు. పోరు ఘోరంగా సాగింది. ద్రుపదుని పరాక్రమానికి కౌరవు నిలవలేకపోయారు. వెనుదిరిగి పోసాగారు. పాండవు లెదురుపడ్డారు. వారి అం నిలిచారు. అర్జునుడు భీముని సాయంతో ముందు నడిచాడు. ద్రోణుణ్ణి, ధర్మజుణ్ణి ఒక నిలిపారు. సైన్యంతో భీముడు ద్రుపదుని గజబలాన్ని మట్టుపెట్టాడు. అర్జునుడు అశ్వబల మట్టుబెట్టి ద్రుపదునిపై బాణాలు గుప్పించాడు. అంతలో ద్రుపదుడు అర్జునుని విల్ల విరుగకొట్టాడు. అర్జునుడు సింహంలా లంఘించి కత్తితో ద్రుపదుని రథంపైకి దూకా మెరపుదాడి చేసి అతన్ని రథాక్షంతో కట్టి ద్రోణుని యెదుటకు తెచ్చి ఉంచాడు. అప్ప అవహేళనగా నవ్వుతూ ద్రోణుడు ద్రుపదునితో ఇలా అన్నాడు -

క. "వీ రెవ్వరయ్య ద్రుపద మ

ఇప్పటికైనా నేను జ్ఞాపకానికి వచ్చానా? అని అధిక్షేపించి ద్రుపదుణ్ణి వదలివేశాడు. ఇలా గురుదక్షిణను పాండవులే ఇచ్చారు.

## లాక్షాగృహ దహనం

రాజ్యభారాన్ని వహించగలవానిగా భావించి భీష్మ విదురాదులతో విచారించి ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు యువరాజుగా పట్టంగట్టాడు. ధర్మజుడు నలుగురు తమ్ముల సాయంతో నాలుగుదిక్కులా విజయ యాత్రలు సాగించి అపార ధనరాసులను తెచ్చి హస్తినాపుర వైభవాన్ని పెంచాడు. ధర్మరాజు పేరుకు యువరాజుగాని తీరుకు సార్వభౌముడు.

పాండవుల మీద పెరుగుతున్న ప్రజానురాగం దుర్యోధనుని గుండెలో అసూయాగ్నిని రగిల్చింది. అతడు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్లి తన దుఃఖాన్ని వెళ్లగక్కాడు. " పైతృకమైన ఈ రాజ్యలక్ష్మిని పూర్వం పాండురాజు భరించాడు కాబట్టి ఇప్పుడు ధర్మరాజును యువరాజును చేశారు. ఆ తరువాత అతని కొడుకులు, మనుమలే రాజ్యాధిపతులౌతారు. మేము వారిని సేవించి బ్రతికే దుర్గతి ఏర్పడుతుంది. రాజ్యం మీ అధీనంలో ఉంది కాబట్టి మీరే మాకు రాజ్యానికి మార్గం వేసి చూపించాలి. పాండవుల కీర్తి ప్రజలలో పెరిగిపోతున్నది. ముందు వారిని దూరం చేయండి. వారణావతానికి పంపండి. ఆరు నెలల్లో నేనూ హస్తినాపురి ప్రజలలో నామీద అభిమానం కలిగేటట్లు చూచుకుంటాను"' - అని వాదించి తండ్రిని ఒప్పించాడు.

ధృతరాష్ట్రుడు నయంతో ప్రేమతో పాండవులను కుంతితో సహా వారణావతానికి పంపాడు. అక్కడ దుర్యోధనుడు పురోచనునితో లక్కయింటిని కట్టించి సమయం కనిపెట్టి అందులో పాండవులు తగులపడేటట్లు చూడాలని పన్నాగం పన్నాడు. విదురుడీ రహస్యాన్ని గోప్యంగా ధర్మరాజుకు సూచించాడు. ధర్మజుడు గ్రహించి, భీమునితో చెప్పి, లాక్షా గృహంలో నిపుణంగా జాగరూకతతో ఉంటుంటారు. విదురుడు ఒక గూఢచారిని పాండవుల చెంతకు పంపించి లక్కయింటినుండి వారు తప్పించుకొని పోవటానికి బిలమార్గాన్ని ఏర్పరచి, కృష్ణ చతుర్దశినాటి రాత్రి లాక్షాగృహదహన మవుతుందని సూచించాడు. భీముడు ఈ రహస్యాన్ని గమనించి పురోచనుని, ఒకదాసిని, దాని అయిదుగురు కొడుకులను ఆ లక్కయింటిలో ఉంచి, అన్నదమ్ములను తల్లిని బిలం ద్వారా పంపించి నియమించిన ముహూర్తం కంటే ముందే లక్కయిల్లు మొత్తం దహనమయ్యేటట్లు చూచి తాను బిలం ద్వారా వెడలిపోయాడు. ఒక్క విదురుడు తప్ప అందరూ పాండవులు లక్క యింటిలో పడి కాలి పోయారని దు:ఖించారు. ధృతరాష్ట్ర దుర్యోధనుల పాప సంకల్పాలను ప్రజలు గర్హించారు.

బిల ద్వారం కుండా పాండవులు బయటపడి పాదచారులై నడిచి ఒక వనం చేరారు. భీముడు నీరు తెచ్చే లోపలే ఒక చెట్టుకింద ధర్మజాదులు, కుంతి గాఢనిద్రపోయారు. వారి దీనావస్థకు విచారపడుతూ ఆ రాత్రి భీముడు వారికి కాపలా కాస్తూ ఉంటాడు.

అది హిడింబాసురుడు నివసించే వనం. నరవాసన కొట్టింది అతనికి. పాండవులను చంపి వండి వడ్డించుమని చెల్లెలైన హిడింబను అజ్ఞాపించాడు. ఆమె ఆ చెట్టు దగ్గరకు వచ్చింది. భీముని సుందర వీరాకారం చూచింది. మనసారా ప్రేమించింది. అతని తోడిదే తన జీవితమని మొదటిచూపులోనే నిర్ణయించుకొన్నది. అన్నను పోగొట్టుకొన్నా భీముని మాత్రం పొందాలని అనుకొన్నది. అన్ని విషయాలు భీమునికి చెప్పింది. ఆలస్యమైందని హిడింబుడు వచ్చాడు. భీము డాతనితో యుద్ధానికి తలపడ్డాడు. రాక్షసుని అరుపులకు కుంతి నిద్ర లేచింది; ధర్మజాదులు లేచారు. హిడింబ మానవాకారంలో ఎదుట కనపడింది. కుంతి ఆమెను గురించి అడిగింది. హిడింబ ఏసంగతీ దాచుకోకుండా మనసు విప్పి కుంతితో చెప్పుకొన్నది. ఆమెకు ఎన్నో మహిమ లున్నాయి. వాటిని ప్రదర్శించి చూపింది. భీముడు హిడింబాసురుణ్ణి చంపాడు. పాండవులను హిడింబ అనుసరించింది. భీముడు వారించాడు. ధర్మజుడు, కుంతి భీమునికి నచ్చచెప్పారు. శాలిహోత్రుని ఆశ్రమం గురించి హిడింబ చెప్పిన మాటలు నిజమని తెలిశాయి. భీమునితో హిడింబకు వివాహమౌతుంది. పగలల్లా ఆ దంపతులు అడవుల్లో విహరించేవారు; రాత్రిళ్ళు ధర్మరాజాదుల వద్ద ఉండేవాళ్లు. కొన్నాళ్లకు ఘటోత్కచుడనే పుత్రుడు పుట్టాడు హిడింబకు. భయంకరాకారుడు. సద్యోయౌవనుడు; అస్త్రశస్త్రకుశలుడు, రాక్షస పిశాచబలపరివృతుడు. పాండవులను కొంతకాలం సేవించి రాక్షస రాజ్యానికి వెళ్లిపోయాడు తల్లిని తీసికొని. స్మరిస్తే చాలు ప్రత్యక్షమౌతానని తండ్రితో చెప్పాడు.

శాలిహోత్రుని ఆశ్రమమంలో వ్యాసుడు పాండవులకు దర్శనమిచ్చాడు. జరిగిన దానికి విచారించవద్దని ధైర్యం చెప్పి, భావికార్యక్రమాన్ని సూచించి వెళ్లాడు. పాండవులు బ్రాహ్మణవేషాలతో ఏకచక్రపురం చేరారు. అక్కడ భిక్షాటనం చేసుకుంటూ బ్రతుకు సాగించారు. అయినా, అక్కడ ప్రజలను పట్టి పీడించే బకాసురుణ్ణి భీముడు వధించి వారికి శాంతి సౌఖ్యాలను అందించాడు.

## పాండవ వివాహం

ఆనాడు అర్జునుని చేతిలో ఓడిననాటినుండి ద్రుపదుడు - ద్రోణుణ్ణి చంపే కొడుకును, అర్జునుని వివాహమాడే కూతురును పొందాలని అనేక ఘోరవ్రతాలు చేశాడు. చివరకు ఒక క్రతువు నిర్వహించాడు. యజ్ఞాగ్నిలో నుండి ఉజ్జ్వల కరవాలంతో రథారూఢుడైన

ధృష్టద్యుమ్నుడు పుట్టాడు, దివ్య తేజస్విని ద్రౌపది పుట్టింది. ఆ ద్రౌపదిని అర్జునున కివ్వాలని లోన సంకల్పం. పైకి, చలత్ మత్స్య యంత్రభేదనాన్ని వరపరీక్షగా పెట్టాడు ద్రుపదమహారాజు. ఈ సంగతి పాండవులు ఏకచక్రపురంలో విన్నారు. పాంచాలపురికి హుటాహుటి పయనమైనారు.

ద్రుపద నగరం స్వయంవరోత్సవంతో కోలాహలంగా ఉంది. ఎత్తుగా కట్టబడిన మత్స్య యంత్రాన్ని అయిదు బాణాలతో ఎవడు కొట్టగలగో, ఆవిలుకాడే ద్రౌపదికి భర్త కాగలడని పాంచాలపతి ప్రకటించాడు. రాజులు నగరం చుట్టూ డేరాలు తీర్చి స్వయంవరానికి దిగి ఉన్నారు. పాండవు లాపురిలో బ్రాహ్మణ వేషాలతో ప్రవేశించి ఒక కుంభకారుని యింట్లో వసించి మత్స్యయంత్రసభకు వెళ్లారు.

ధృష్టద్యుమ్నుడు స్వయంవర నియమాన్ని ప్రకటించాడు. స్వయంవర సభలో విచ్చేసియున్న రాజుల నందరినీ ద్రౌపదికి చూపించాడు. అందులో నూరుగురు కౌరవులున్నారు; కర్ణాశ్వత్థామాదులు కూడా ఉన్నారు. వారిలో ఎవరు లక్ష్యాన్ని భేదిస్తే అతడు కల్యాణమాలకు అర్హుడని సూచించాడు. ఆ సభలోని అతిథులలో వాసుదేవు డున్నాడు. అతడు బ్రాహ్మణవర్గంలో పంచాగ్నుల వలె వెలుగొందుతున్న పాండవులను గ్రహించి పార్థుడు పాంచాలిని గ్రహిస్తాడని సంతోషించాడు.

కొందరు రాజులు విల్లును ఎక్కుబెట్టలేక వెనుతిరిగి పోయారు; కొందరు ప్రయత్నమే చేయలేకపోయారు; కొందరు చేసి విఫలురయ్యారు. బ్రాహ్మణులలోనుండి అర్జునుడు లేచి యంత్రాన్ని సమీపించి, గురువులకు నమస్కరించి, ధనుస్సునకు ప్రదక్షిణం చేసి మ్రొక్కి, దానిని అవలీలగా ఎక్కుబెట్టి, అలవోకగా మత్స్య యంత్రాన్ని భేదించాడు. సభికులందరూ ఆశ్చర్యపోయారు. బ్రాహ్మణు లుప్పొంగిపోయారు. ధృష్టద్యుమ్నుడు సైన్యంతో అర్జునుని వెంట నిలువబడ్డాడు. ధర్మజుడు నకుల సహదేవులతో కలిసి వసతి గృహానికి వెళ్లాడు. ద్రౌపది కల్యాణ మాలను అర్జునుని మెడలో ఉంచటానికి బయలుదేరింది. దుర్యోధనాదు లది సహించలేకపోయారు. రాచకన్నెను విప్రుని కివ్వటం అవమానమని ఆగ్రహించారు. విప్రాకారంలోనున్న అర్జునుణ్ణి అపహసించారు. బ్రాహ్మణులు భయపడి అర్జునుని వెనకాల నిలువపడ్డారు. వారందరికి అభయమిచ్చి అర్జునుడు భీమసహాయంతో తిరగబడ్డాడు.

అర్జునునికి ఎదురుగా కర్ణుడు నిలిచి బాణయుద్ధం చేశాడు. తన ఎదుట నిలువగలిగిన వా డెవడా అని కర్ణు డాశ్చర్యపోయాడు. ఎవడో విప్రశ్రేష్ఠుని వలె నున్నాడని రణరంగం నుండి తొలగిపోయాడు. భీముడు శల్యుణ్ణి నేలపై పడవేసి కొట్టాడు. అతడు లేచి దుమ్ము దులుపుకొని వెళ్లిపోయాడు. ఆ బ్రాహ్మణు లెవరో తేల్చుకోవాలని పట్టుబట్టిన దుర్యోధనాదులకు మొగం వాచేటట్లు సమాధానం చెప్పి వాసుదేవుడు పంపివేశాడు.

రాజులు మరలి పోయారు. భీమార్జునులు ద్రౌపదిని తీసికొని యింటికి వచ్చారు. ధర్మజాదులతో కలిసి తల్లితో "అమ్మా! మేమొక భిక్ష తెచ్చాం" అని అన్నారు. కుంతి అసలు విషయాన్ని గమనింపక "మీరయిదుగురూ ఉపయోగించుకొనండి" అని కొడుకులను నియోగించింది. ఆ తరువాత ద్రౌపదిని చూచి అధర్మాన్ని ప్రబోధించానని విస్మబోయింది. ఆమె అన్నమాట అయితీరుతుంది. పాండవులు అమ్మమాట జవదాటరు. కుంతి కలత చెందింది. ధర్మజుడు తల్లి నోదార్చి ద్రౌపదిని అర్జునుణ్ణే వివాహమాడుమన్నాడు. అర్జునుడు పెద్దవాడైన ధర్మరాజును పెండ్లాడమన్నాడు. వీరిద్దరూ ఇలా అంటూనే ఉన్నారు. పాండవు లైదుగురూ పాంచాలిని చూచి మన్మథభావాన్ని ఒకేసారి పొందారు. పాంచాలి కూడా వారి అయిదుగురియందు బద్ధానురాగయై నిలిచింది. ధర్మజుడు వేదవ్యాసుని మాటలు స్మరించి ద్రౌపదిని పాండవు లైదుగురు పాణిగ్రహణం చేయటమే ఉత్తమ మని నిర్ణయించాడు.

మత్స్యయంత్రం భేదించింది అర్జునుడనీ, ద్రౌపదిని వివాహమాడేది పాండవులనీ తెలుసుకొని ద్రుపదుడు సంతోషించాడు. ద్రౌపదికి భర్తృ పంచకం ఏర్పడటానికి గల పూర్వ జన్మ వృత్తాంతాన్ని వ్యాసుడు వినిపించాడు. ఆమె అయిదుగురు భర్తల భార్య అయినా ఎవరి దగ్గరి కన్యాత్వం సతీత్వం వారివద్ద మొక్కవోకుండా ఉండే వరం ఉండటం వలన వివాహంలో కూడా వరుసగా ధర్మజాదులు తాళిగట్టేటప్పు డామె కన్యాత్వం చెక్కు చెదరకుండా నిలిచింది. ఆమహిమను చూచి అగ్నిజాతయైన ద్రౌపది విశిష్ట లక్షణంగా అందరూ భావించారు. వాసుదేవుడు సంతోషించాడు. పాండవుల వివాహం వైభవంగా జరిగింది; వారు పాంచాలీ నగరంలో ఒక యేడాదిపాటు ఉన్నారు.

## ఇంద్రప్రస్థపురం

ధృతరాష్ట్రుడు భీష్మాదుల నీతివచనాలు విని పాండవులను హస్తినాపురానికి విదురుని పంపి పిలిపించాడు. లాక్షాగృహదహనం నుండి పాండవులు బైటపడ్డందుకు దుర్యోధనుడు లోలోన మండిపోతుండేవాడు. పాండవులు ఎక్కువ కాలం హస్తినాపురంలో ఉండకుండా చూడుమని తండ్రిని బలవంత పెట్టేవాడు. కొడుకు పోరు పడలేక ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్యమిచ్చి ఇంద్రప్రస్థపురం రాజధానిగా ఏలుకోండని పంపాడు. ధర్మరాజును పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. శ్రీకృష్ణాదులు వెంటరాగా పాండవులు ఇంద్రప్రస్థపురాన్ని చేరుకొన్నారు.

శ్రీకృష్ణుడు ఇంద్రుణ్ణి, ఇంద్రుడు విశ్వకర్మను స్మరించగా విశ్వకర్మ సాయంతో ఇంద్రప్రస్థపురం దిక్పాలకుల పురాలతో దీటైనదిగా రూపొందింది. వాసుదేవుని అనుమతితో ఆశీస్సులతో ధర్మజు డానగరంలో ప్రవేశించి అపర దేవేంద్రుడు లాగా వెలుగొందుతూ ఉన్నాడు.

ఒకనాడు నారదుడు వచ్చి పాండవులలో ఒక్కొక్కరు ద్రౌపదిని ఒక్కొక్క యేడు తన తన భవనంలో ఉంచుకోవాలనీ, ఆ కట్టడిని తెలిసిగాని, తెలియకగాని ఎవరైనా మీరితే ఒకయేడాది పాటు అతడు తీర్థయాత్రలు చేసిరావాలనీ నియమం చేశాడు. పాండవులు దానికి కట్టుబడి ఉన్నారు.

ఒక యేడు ధర్మరాజు అంతఃపురంలో ద్రౌపది ఉంటున్నది. అర్జునుడు బ్రాహ్మణ ధేనువును రక్షించడానికై ఆయుధాలు తెచ్చుకొందామని ధర్మజుని భవనానికి వెళ్ళివచ్చాడు. దొంగలను చంపి ధేనువును బ్రాహ్మణున కిచ్చి ఆయుధాలు ఉన్నచోట పెట్టాడు. కాని, ఆ సమయంలో అర్జునాదులు ధర్మజునింటికి పోగూడదు. నియమం తప్పినట్లైంది. ధర్మజుడు వలదన్నా అర్జునుడు తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆ యాత్ర అతనికి పుణ్యం పురుషార్థం కలిసి వచ్చేటట్లు చేసింది. ఉలూచి, చిత్రాంగద, సుభద్రలు అర్జునుని వివాహమాడారు. సుభద్ర - బలరామశ్రీకృష్ణుల ముద్దుల చెల్లెలు. అర్జునుడు యతివేషంలో సుభద్రకు సన్నిహితుడు కావటానికి, ఆమెను వివాహమాడి ఇంద్రప్రస్థపురానికి చేరటానికీ శ్రీకృష్ణుడు సూత్రధారుడుగా నిలిచాడు. సుభద్రార్జునుల వివాహం ఇంద్రోపేంద్రులే స్వయంగా చేయించారు. ఆమీద బలరాము డంగీకరించాడు. సుభద్రను ద్రౌపది దీవించింది. పాండవవంశాన్ని నిలిపే కౌరవ వధువుగా సుభద్ర మహాభారతంలో చిరస్మరణీయురాలుగా నిలిచింది

# సభాపర్వం

శ్రీకృష్ణుని కోరికపై మయుడు ఒక అపూర్వమైన సభను నిర్మించి పాండవులకు సమర్పించాడు. ఒక శుభముహూర్తాన పాండవు లందులో ప్రవేశించారు. దిక్పాలకుల సభలకంటె, బ్రహ్మసభకంటె, మయనిర్మితమైన సభ మహిమాన్వితమైనదని నారద మహర్షి ప్రశంసించాడు. అంతటితో ఆగక ఆ మహర్షి ధర్మజుని రాజసూయ యాగం చేయుమని ప్రోత్సహించాడు. ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి ఇంద్రప్రస్థానికి పిలిపించుకొని, రాజసూయం చేయటానికి ఆశీస్సుల నర్థించాడు. శ్రీకృష్ణుడు రాజసూయం నిర్వహించే యోగ్యత ధర్మరాజుకు అన్ని విధాలా ఉన్నదని నిర్దేశించి, జరాసంధుణ్ణీ, అతనికి ఆసట బాసటగా నిలచి ఉన్న శిశుపాలుణ్ణీ, హంసడిభకులనూ సంహరించందే రాజసూయ యాగం నిరాటంకంగా సాగదని సూచించాడు.

## ధర్మజ రాజసూయం

గిరివ్రజపురాన్ని రాజధానిగా చేసికొని, చండశాసనుడుగా పాలిస్తూ, భరతవర్షంలో

మూర్ధాభిషిక్తులైన రాజులనందరినీ బంధించి, రోజుకొక్కణ్ణి చండికకు బలియిస్తూ సమకాలీన రాజలోకంలో సింహస్వప్నంగా దాపురించాడు జరాసంధుడు. అతనికి ఆయుధాల వలన చావులేదు. అలాగే హంసడిభకులకు కూడా. శిశుపాలుడు నూరు తప్పులు చేసేంతవరకు ఎవరూ ఏమీ చేయలేరు. అపార సేనతో జరాసంధుడు శ్రీకృష్ణుని కూడా బాధించాడు. అతడు మధురను వీడి మరోచోటికి ఎన్నోసార్లు పోవలసి వచ్చింది. అటువంటి జరాసంధుణ్ణి భీముడొక్కడే చంపగలడు. అందువలన శ్రీకృష్ణుడు భీమార్జునులతో కలిసి బ్రాహ్మణవేషాలతో గిరివ్రజానికి వెళ్లి ద్వంద్వయుద్ధంలో జరాసంధుని శరీరాన్ని రెండుగా చీల్పించి చంపించే పథకాన్ని వేశాడు. శ్రీకృష్ణుని మాట పాండవులకు శిరోధార్యం. శ్రీకృష్ణ దర్శకత్వంలో భీముడు జరాసంధుణ్ణి చీల్చి చంపాడు. బందీలుగా ఉన్న వేలాది భూపతులను విడుదల చేయించాడు. శ్రీకృష్ణుడు గిరివ్రజానికి జరాసంధుని కుమారుడైన సహదేవుణ్ణి రాజును చేశాడు. విముక్తులైన రాజులనందరినీ వెంటపెట్టుకొని భీమార్జున శ్రీకృష్ణులు ఇంద్రప్రస్థపురం చేరారు. ధర్మరాజు ఆ రాజులకు వారి వారి రాజ్యాలిచ్చి సగౌరవంగా పంపాడు. శ్రీకృష్ణునకు కృతజ్ఞతాంజలి సమర్పించాడు.

రాజసూయానికి ముందు జరాసంధ సంహారం ఒక విజయారంభం అయింది. ధర్మరాజు నలుగురు తమ్ములనూ నాలుగు దిక్కులూ జయించటానికి పంపాడు. భీమసేనుడు తూర్పు దిక్కున నున్న రాజులను నిరాఘాటంగా సాధించాడు. అర్జునుడు ఉత్తరదిశపై విజయాన్ని కరతలామలకం చేసుకొన్నాడు. నకులుడు పశ్చిమ దేశ ప్రభువులను పాదాక్రాంతులను చేసుకొన్నాడు. సహదేవుడు దక్షిణ దిగ్విజయాన్ని దక్షతతో నిర్వహించాడు. నాలుగు దిక్కులనుండీ అపార ధనరాసులు తెచ్చి ధర్మరాజుకు సమర్పించారు భీమాదులు. రాజసూయానికి కావలసిన సంపద చేకూరింది. శ్రీకృష్ణుని అనుమతి తీసికొని ధర్మరాజు యాగానికి సన్నాహాలు ప్రారంభించాడు. సహదేవుణ్ణి సకల సన్నాహాలకూ సారధిగా నియమించాడు. నకులుణ్ణి హస్తినాపురానికి స్వయంగా పంపి భీష్మాదులనందరినీ సగౌరవంగా ఇంద్రప్రస్థానికి రప్పించాడు. ధృతరాష్ట్ర దుర్యోధనాదులను కలిపికోలుతనంతో గౌరవించాడు. దక్షిణలిచ్చే నిర్ణయం కృపాచార్యునికిచ్చాడు; కృతాకృత నిర్ణయాధికారాన్ని భీష్మ ద్రోణులకు ఒప్పచెప్పాడు. వస్తు వ్యయభారాన్ని విదురుని చేతులో ఉంచాడు. నానా దేశాల నుండీ వచ్చే రాజులు తెచ్చే విలువైన కానుకలను గ్రహించే పరువైన బాధ్యతను దుర్యోధనుని కిచ్చాడు. భక్ష్యభోజ్యాది వినియోగ పర్యాలోకనాన్ని దుశ్శాసనుని కందించాడు. ఇలా అందరికీ అన్ని బాధ్యతలు ఇచ్చి ధర్మరాజు తాను యజ్ఞదీక్షితుడై యజమాని చేయవలసిన కార్యక్రమాలను ఆరంభించాడు. యజ్ఞం మహేంద్ర వైభవంగా సాగింది. అఖిల జనాలకు ఆనందాన్ని కలిగించింది.

# శిశుపాలవధ

రాజసూయయాగం జరిగిన విధానాన్ని చూచి కురువృద్ధుడు భీష్ముడు ఉప్పొంగిపోయాడు. ధర్మరాజును ఆప్యాయంగా దగ్గరికి పిలిచి ఇలా బోధించాడు: 'మహాయజ్ఞం మహాత్ముని పూజతోకాని పరిపూర్ణం కాదు. స్నాతకుడైనా, ఋత్విజుడైనా, సద్గురుడైనా, సన్మిత్రుడైనా, భూతలేశుడైనా, సంయమీంద్రుడైనా - వీరిలో ఎవరినైనా ఒక్కరిని ఉత్తముని ఎన్నికచేసి పూజించు; యజ్ఞఫలాన్ని పొందు' - అని నిర్దేశించాడు. 'తాతా' అట్టివా డెవ్వడో నీవే నిర్ణయించి చెప్పాలి' అని ధర్మరాజు అర్థించాడు. పితామహుడు చిరునవ్వు నవ్వి, ఒకతన్మయభావంతో ఇలా అన్నాడు - "యుధిష్ఠిరా ! సూర్యచంద్రులు ఎలా తమ కాంతి కిరణాలతో లోకాలను వెలిగిస్తూ ఉన్నారో, అలాగే తన దివ్య తేజంతో మనలనందరినీ ఆనంద పరవశుల్ని చేస్తున్న ఆ పుండరీకాక్షుడు, ఆ అనాది నిధనుడు, ఆ అబ్జనాభుడు ఈ కృష్ణుడు మన మధ్య ఉన్నాడు. ఆ అచ్యుతుణ్ణి పూజించి, యజ్ఞపురుషుణ్ణి పూజించిన అమృతఫలాన్ని పొందు".

భీష్ముని మాటలు ధర్మరాజు శిరసావహించాడు. సహదేవుడు పూజాపాత్రలను తేగా ధర్మతనయుడు విధివిధానంగా వాసుదేవుని అగ్రాసనంమీద కూర్చుండపెట్టి అర్ఘ్యాన్ని ఇచ్చాడు. దానికి శిశుపాలుడు ఆగ్రహించాడు. నిండుసభలో పెద్దగా అధిక్షేపించటం ఆరంభించాడు -

"ధర్మరాజా! పూజింపదగిన రాజులు, ద్విజులు, పూజ్యులు ఇంతమంది ఈ సభలో కొలువుదీరి ఉంటే ఈ గాంగేయుడు ఏదో నెపంతో ఈ కృష్ణుణ్ణి పూజించమంటే, వెంటనే పూజించి నీ అవివేకాన్ని ప్రకటించుకొన్నావు. నిజంగా దాశార్హుడు పూజార్హుడా? సభలలో ధర్మతత్త్వాన్ని నిరూపించి చెప్పటం సాధ్యంకాని పని. భీష్ముడు వెర్రితనంతో ధర్మబాహ్యుడైన కృష్ణుణ్ణి పూజించుమని చెప్పాడు. వృద్ధుల బుద్ధులు సంచలించటంలో ఆశ్చర్యం లేదు. ఇష్టముంటే కానుక లిచ్చుకోవచ్చు కాని, పలువురు పెద్దలున్న సభలో అయోగ్యుణ్ణి యోగ్యునిగా ప్రకటించి పూజించటం న్యాయం కాదు. కృష్ణుడు ఏ విధంగా అర్హుడైనాడు? వృద్ధు డందామా సభలో అతని తండ్రి వసుదేవు డున్నాడే? ఋత్విజు డని గౌరవిద్దామా ఎదురుగా వేదవ్యాసుడున్నాడే? ఆచార్యుడందామా అరుగో గృపాచార్యులూ, ద్రోణాచార్యులూ. భూనాథు డందామా ఈసభలో ఎందరో ప్రభువు లున్నారు. యుధిషిరా! నీవు యోగ్యుడవని భావించి మేమందరమూ ఈ యజ్ఞానికి వచ్చాం. ఇలా భీష్ముడు చెప్పిన మాటలు విని మమ్మల్ని అవమానిస్తావని ఊహించలేకపోయాం. ఒకవేళ నీవు తెలియక అర్ఘ్యమిచ్చినా, తగుదునమ్మా అని ఈ గోవిందు డెలా గ్రహించాడు?" - అంటూ ధర్మజ భీష్మ శ్రీకృష్ణులను

నిందిస్తూ పుత్రమిత్రులతో కలిసి సభను వీడి బయటకు నడిచాడు శిశుపాలుడు.

యజమానియైన ధర్మజుడు నయవినయవాక్యాలతో శిశుపాలుణ్ణి సమాధాన పెట్టటానికి ప్రయత్నం చేశాడు. 'ఉత్తములకు వాక్పారుష్యం చెల్లుతుందా? విషం కంటె, దహనం కంటె అది ఎంతో దారుణం. పితామహుడు దామోదరుడు పూజ్యుడని చెప్పాడు. బ్రహ్మోత్పత్తికి మూలమైనవాడు, వేదాది సమస్త వాఙ్మయాలలో ప్రశంసితుడైనవాడూ, లోకాలకు ఆదియైనవాడూ త్రిలోక పూజ్యుడు అయిన అచ్యుతుడే ఈ కృష్ణుడని తాతగారు ఆత్మలో దర్శించి చెప్పారు. ఇది ఒప్పుగాక తప్పెలా అవుతుంది? అదీకాక మహాత్ముల చరిత్రలు అల్పులకు అర్థం కావటం కష్టం కూడా. నీకంటె పెద్దలందరు తమందరి కంటె పెద్దగా శ్రీకృష్ణుని గౌరవిస్తుంటే, నీ వభ్యంతరం చెప్పటం ఉచితమా?' అని శిశుపాలుణ్ణి ధర్మజుడు మందలించాడు.

శిశుపాలుని మాటలకు భీష్ముడు మండిపడ్డాడు -

ఉ॥ "పాలిత దుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ
పాలక నీకుఁ బట్టుపరుపన్, మఱి ధర్మువెఱుంగ వీనికిం
బోలునె రాగకోప పరిభూత మనస్కున కల్పరాజ్య ల
క్ష్మీ లలనాంధబుద్ధి కనిమిత్త మహత్పరివాద శీలికిన్"

- అని ధర్మరాజును వారించి శిశుపాలునితో ఇలా నిష్ఠురంగా పలికాడు. 'శిశుపాలా! నీవు మూర్ఖుడవురా. అవినయబుద్ధితో హరికి అర్పిస్తున్న అర్ఘ్యాన్ని అయోగ్యమని నిందించావు. నేను వేరే చెప్పవలెనా? ఈ సభలో నున్నవారందరూ ఆతని దయచేత పరిముక్తులైనవారే. అతని శరణార్థులే. బాలుడైనా, జ్ఞాని అయితే బ్రాహ్మణులలో పూజ్యుడు; విక్రమంలో అధికుడైతే క్షత్రియుల్లో పూజ్యుడు. గోవిందుని యందు ఈ రెండు గుణాలూ ఉన్నాయి. అతడు వయోవృద్ధు డని కాదు గుణవృద్ధు డని పూజించాలి' అని మందలించాడు.

సహదేవుడు శిశుపాలుని అవినయవర్తనానికి ఆగ్రహించాడు. 'మేము అచ్యుతునికి అర్ఘ్యమిచ్చాం. దీనికి అంగీకరింపని దుర్మార్గుల శిరస్సులమీద ఇదుగో నా పాదాన్ని ఉంచి తగినశాస్తి చేస్తాను' అని సహదేవుడు పాదాన్ని ఎత్తి ఝళిపించాడు. సభాసదులు కిమ్మనకుండా సద్దుమణిగి కూర్చున్నారు. దేవతలు పూలవాన కురిపించారు.

ఆ తరువాత శిశుపాలుడు కొందరు రాజులను కూడగట్టుకొని ససైన్యంగా ధర్మరాజు యజ్ఞంపై దాడిచేశాడు. యజ్ఞదీక్షితుడైన ధర్మజుడు భయసంభ్రమాలతో భీష్ముని చూశాడు. శ్రీకృష్ణు డున్నంతవరకు భయమేమీ లేదని పితామహుడు ధైర్యం చెప్పాడు. ఆ

మాటలు విని శిశుపాలుడు భీష్మణ్ణి పరుషవచనాలతో నిందించాడు; 'శ్రీకృష్ణుడు పరమేశ్వరుడా' అని అవహేళనం చేశాడు. అతని వీరగాథలను పేర్కొని అధిక్షేపం చేశాడు. ఆ విధంగా ఇచ్చవచ్చినట్లు ప్రేలుతున్న శిశుపాలుని చూచి భీముడు రౌద్రోద్రేకుడైనాడు. పండ్లు పటపటా కొరుకుతూ అతణ్ణి చంపటానికి ఉద్యుక్తుడైనాడు. అప్పుడు భీష్ముడు భీముణ్ణి వారించి శిశుపాలుణ్ణి చంపవలసిన వాడు శ్రీకృష్ణుడే నని వాని జన్మగాథ చెప్పి నూరు నేరాలవరకు హరి అతణ్ణి సహించి ఊరుకుంటాడనీ ఆ తరువాత అతని చావు ఆయన చేతుల్లో తప్పదనీ వివరించాడు. ఆ మాటలు విని శిశుపాలుడు శ్రీకృష్ణునితో ముఖాముఖిగా నిలిచి ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. శ్రీకృష్ణుడు - శిశుపాలుడు చేసిన నూరు తప్పులను ఏకరువు పెట్టి అందరికీ తెలియచెప్పి, ఇక శిశుపాలుడు క్షమార్హుడు కాడని నిరూపించి సుదర్శన చక్రంతో అతని శిరస్సును ఖండించాడు. శిశుపాలుని శరీరంలో నుండి ఒక వెలుగు లేచి వెలుగుల కన్నింటికి వెలుగైన శ్రీకృష్ణునిలో లీనమయింది. సభాసదులందరు ఆశ్చర్యమగ్నులయ్యారు. జయజయనినాదాలు చేశారు.

## మయసభ : సుయోధనుని అసూయ

రాజసూయ యాగం నిర్విఘ్నంగా నారాయణుని దయవలన పరిసమాప్తమయింది. బంధుమిత్రులు ఒక్కరొక్కరే తరలి వెళ్లటం మొదలయింది. శ్రీకృష్ణుడు ద్వారకకు పయనమైపోయాడు. ధృతరాష్ట్రాదులు హస్తినకు తిరిగి వెళ్లారు. దుర్యోధనుడు, శకుని మాత్రం మయసభా వైభవాన్ని చూడటానికై కొన్నాళ్ళు ఇంద్రప్రస్థంలో ఆగారు. సుయోధనుడు మయసభా శిల్ప రమణీయ కల్పనలన్నింటిని చూస్తూ విహరిస్తున్న తరుణంలో మిట్టలు జలాశయాలుగా, జలాశయాలు మిట్టలుగా, ద్వారాలు కుడ్యాలుగా, కుడ్యాలు ద్వారాలుగా గోచరించే విచిత్రశాలలో తిరుగుతూ మిట్టలని భావించి నీటిలో పడడం, ద్వారమని భావించి కుడ్యాన్ని ఢీకొనడం జరిగింది. అప్పుడు పాంచాలి, పాండుకుమారులు నవ్వారు. ధర్మరాజు దివ్యాంబరాలను, భూషణాలను దుర్యోధనుడు ధరించటానికి భీముని ద్వారా పంపాడు. ఆ విధంగా జరిగిన సభాప్రలంభనం దుర్యోధనునికి సహించరాని అవమానంగా హృదయాన్ని బాధించింది. లజ్జతో పాండవులను వీడ్కొని హస్తినాపురం చేరాడు.

ధర్మరాజు చేసిన రాజసూయం అందరికీ సంతోషాన్ని కలిగించింది. కాని, దుర్యోధనునికి అసూయ రగిలించింది. సకలజన నయనానందాన్ని కలిగించిన పాండవ సభాలక్ష్మి ఆ సుయోధునికి మాత్రం గుండెల్లో మంటలు పెట్టినట్లు బాధించింది. రాజధానికి తిరిగి వచ్చాడే కాని రారాజు కంటినిండా నిద్రపోలేదు. పాండవులపై పాపచింతతో అన్ని భోగాలూ వదలి దిగులుతో రోజులు గడుపసాగాడు. శకుని దానిని గమనించి దుర్యోధనుణ్ణి

ఏకాంతంగా ఊరడించటానికి వచ్చాడు. దుర్యోధనుడు తనబాధ బయటపెట్టుకొన్నాడు.

"మామా! మయుడు నిర్మించి పాండవుల కిచ్చిన సభను నీవుకూడా చూచావు కదా! ఏ యుగంలోనూ, ఏ లోకంలోనూ దానివంటి వైభవం వినపడదు. కనపడదు. దానిలో ధర్మరాజు సూర్యతేజంతో వెలిగిపోతున్నాడు. అదేమి ఆశ్చర్యమో భూతలంమీద ప్రభువులందరూ ధనరాసులను కానుకలుగా తెచ్చి ధర్మరాజుకు భృత్యుల్లా చెల్లించారు. పాండవుల పరాక్రమం ధర్మరాజు ప్రభుత్వం భూమిమీద స్థిరపడ్డాయి. అపార పరాక్రమార్జితమైన పాండవమహాలక్ష్మిని చూచి నేను సహించలేకపోతున్నాను. అభిమానధనులైనవారు జ్ఞాతుల అభివృద్ధిని చూచి సహించగలరా! కాబట్టి ఏ విధంగా ఆ పాండవ లక్ష్మిని అపహరించటానికి వీలౌతుందో యోచించాలి'. - అని ఆవేదన వ్యక్తంచేశాడు.

దుర్యోధనుని దురాలోచనకు ధృతరాష్ట్రుని అనుమతి సాధించాలని శకుని అతణ్ణి ధృతరాష్ట్రుని వద్దకు తీసుకొని పోయాడు. దుర్యోధనుడు తన మనోవేదనను తండ్రిముందు చెప్పుకొన్నాడు. రాజులిచ్చిన కానుకల నన్నిటినీ తానే స్వయంగా లెక్కించాడు. కాబట్టి వాటి నన్నింటి విలువనూ చెప్పి వాపోయాడు. గతంలోనూ భవిష్యత్తులోనూ, వర్తమానంలోను పాండవలక్ష్మి వైభవంతో సరితూగే సంపదను ఎన్నడూ చూడలేదనీ, దాని నిప్పుడు చూస్తు తాను సహించి ఉండటం కూడా కష్టమనీ, అందువల్లనే క్రుంగి కృశించిపోయినాననీ తండ్రి ముందు చెప్పుకొన్నాడు.

అవభృథస్నానానంతరం ధర్మరాజు ఉన్నత సింహాసనం మీద కూర్చున్నాడు. సాత్యకి ముత్యాల గొడుగు పట్టాడు. భీమార్జునులు మణిహేమదండాలు పట్టారు. నకుల సహదేవులు చామరాలు వీవసాగారు. ధృష్టద్యుమ్నుడు మూర్ధాభిషిక్తులైన రాజులందరి చేత అతని పాదాలకు మ్రొక్కించాడు. ఆ మహారాజు వైభవం చూచి మేమందరం చిన్నబోయాం. మమ్మల్ని చూచి శ్రీకృష్ణ పాండునందన ద్రౌపదీ సాత్యకులు నవ్వారు. ధర్మజు డారాజ్య వైభవాన్ని అనుభవించడం నేను సహించలేను. - అని దుర్యోధనుడు పలికాడు. 'అనుమతిస్తే ఆ సంపదనంతా మాయాద్యూత నెపంతో అపహరించి దుర్యోధనునికి ఇస్తా'నని శకుని సూచించాడు. శకుని ఉపాయానికి అంగీకరింపుమని తండ్రిని బలవంతపెట్టాడు దుర్యోధనుడు. అంగీకరించకపోతే అగ్నిలో పడి ఆత్మాహుతి చేసుకొంటానని బెదిరించాడు. పుత్రవ్యామోహంతో ధృతరాష్ట్రుడు శకుని వ్యూహానికి తలఊపాడు.

మహాసభను నిర్మించాడు. దానిలో మాయాద్యూతం జరిపించాలని నిర్ణయించి విదురునికి చెప్పాడు. విదురుడు జూదం వల్ల కలిగే ఆపదలను పేర్కొని దుర్యోధనాదులను ఆప్రయత్నం నుండి విముఖులయ్యేటట్లు ప్రయత్నించుమని ధృతరాష్ట్రుణ్ణి హెచ్చరించాడు. గ్రుడ్డిరాజు ఏవిధంగానైనా జూదం జరగాలనీ, ఎటువంటి కీడులూ జరగకుండా పెద్దలు చూడాలనీ చెప్పి పాండవులను తీసికొని రావటానికి విదురుణ్ణి ఇంద్రప్రస్థ పురానికి రథాలతో పంపాడు. విదురు డీసంగతి భీష్మునికి నివేదించి బయలుదేరాడు.

మహేంద్ర వైభవంతో ఉన్న ధర్మరాజును విదురుడు దర్శించాడు. ధృతరాష్ట్ర సందేశాన్ని వినిపించాడు. నూత్న సభాసందర్శన సందర్భంలో సుహృద్ద్యూతం సమంజసం కాదనీ, అది కలతలకు దారి తీస్తుందనీ ధర్మజుడు భావించాడు. కాని, పెదతండ్రి ఆజ్ఞను శిరసావహించి భీమాదులను ద్రౌపదిని, ధౌమ్యాదులను వెంటబెట్టుకొని బయలుదేరి హస్తినాపురికి చేరాడు.

మణిమయ మహాసభను దుర్యోధనుడు చూపగా ధర్మజుడు దర్శించి హర్షించాడు. ఆ తరువాత రారాజు ద్యూతానికి ఆహ్వానించాడు ధర్మరాజును. ద్యూతం వలన కలిగే కీడును పేర్కొని ధర్మరాజు ఆ ఆహ్వానాన్ని వారించాడు. శకుని కల్పించుకొని ఆటనేర్చినవారే దానిని నిందిస్తే ఆకళ ఏమైపోతుందని చమత్కరించి, ధర్మజుడు ఓడినట్లు అంగీకరిస్తే ఆడవలసిన అవసరం లేదని అధిక్షేపించాడు. ధర్మజుడు ఆ మాటకు నొచ్చుకొన్నాడు. బలవంతంగా జూద మాడించటానికి పిలిచిన తరువాత వెనుకాడటానికి వీలౌతుందా? అని అంటూ విధి ప్రేరితుడై మాయాద్యూతానికి ఉన్ముఖుడైనాడు.

జూదంలో తన పక్షాన శకుని ఆడతాడనీ, అతడొడ్డిన ధనరాసులు తాను చెల్లిస్తాననీ రత్నరాసులు కుప్పలు పోసి దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. ఇతరుల కోసం జూదం ఆడటం అసమంజసం - అని అంటూనే ధర్మరాజు సాగరావర్త సంభవాలైన మణిరాసులను ఒడ్డాడు. సుహృద్ద్యూతం ఆరంభమయింది. భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాశ్వత్థామాదులు సముచితాసనాలలో కూర్చొని జూదాన్ని పరికిస్తున్నారు.

శకుని మాయావిదుడు. అందువలన పాచికలతో కావలసిన పందాన్ని జయప్రదంగా వేయగలడు. దానితో వరుసగా పందాలు శకుని గెలుచుకొంటున్నాడు. ధర్మరాజు ఓడిపోతున్నాడు. ఆట సాగే కొద్దీ ధర్మరాజుకు పంతంకూడా పెరిగింది. ఒక ఒడ్డుకు సువర్ణ భాండాగారాలు పెట్టి ఓడిపోయాడు. మరొక పందానికి రత్న భాండాగారాలను కోల్పోయాడు. ఇంకొకసారి చతుశ్శత నిధులను, మరొకసారి గుఱ్ఱాలను, ఏనుగులను, పరిచారికలను, పరిచారకులను ఇలా క్రమంగా ఉన్న సంపదనంతా మాయాద్యూతంలో చేజార్చుకొన్నాడు.

ఏకాంతంగా ఊరడించటానికి వచ్చాడు. దుర్యోధనుడు తనబాధ బయటపెట్టుకొన్నాడు.

"మామా! మయుడు నిర్మించి పాండవుల కిచ్చిన సభను నీవుకూడా చూచావు కదా! ఏ యుగంలోనూ, ఏ లోకంలోనూ దానివంటి వైభవం వినపడదు. కనపడదు. దానితో ధర్మరాజు సూర్యతేజంతో వెలిగిపోతున్నాడు. అదేమి ఆశ్చర్యమో భూతలంమీది ప్రభువులందరూ ధనరాసులను కానుకలుగా తెచ్చి ధర్మరాజుకు భృత్యుల్లా చెల్లించారు. పాండవుల పరాక్రమం ధర్మరాజు ప్రభుత్వం భూమిమీద స్థిరపడ్డాయి. అపార పరాక్రమార్జితమైన పాండవమహాలక్ష్మిని చూచి నేను సహించలేకపోతున్నాను. అభిమానధనులైనవారు జ్ఞాతుల అభివృద్ధిని చూచి సహించగలరా! కాబట్టి ఏ విధంగా ఆ పాండవ లక్ష్మిని అపహరించటానికి వీలౌతుందో యోచించాలి'. - అని ఆవేదన వ్యక్తంచేశాడు.

దుర్యోధనుని దురాలోచనకు ధృతరాష్ట్రుని అనుమతి సాధించాలని శకుని అతణ్ణి ధృతరాష్ట్రుని వద్దకు తీసుకొని పోయాడు. దుర్యోధనుడు తన మనోవేదనను తండ్రిముందు చెప్పుకొన్నాడు. రాజులిచ్చిన కానుకల నన్నిటినీ తానే స్వయంగా లెక్కించాడు. కాబట్టి వాటి అన్నింటి విలువనూ చెప్పి వాపోయాడు. గతంలోనూ భవిష్యత్తులోనూ, వర్తమానంలోనూ పాండవలక్ష్మి వైభవంతో సరితూగే సంపదను ఎన్నడూ చూడలేదనీ, దాని నిప్పుడు చూస్తూ తాను సహించి ఉండటం కూడా కష్టమనీ, అందువల్లనే క్రుంగి కృశించిపోయినాననీ తండ్రి ముందు చెప్పుకొన్నాడు.

అవభృథస్నానానంతరం ధర్మరాజు ఉన్నత సింహాసనం మీద కూర్చున్నాడు. సాత్యకి ముత్యాల గొడుగు పట్టాడు. భీమార్జునులు మణిహేమదండాలు పట్టారు. నకుల సహదేవులు చామరాలు వీవసాగారు. ధృష్టద్యుమ్నుడు మూర్ధాభిషిక్తులైన రాజులందరి చేత అతని పాదాలకు మ్రొక్కించాడు. ఆ మహారాజు వైభవం చూచి మేమందరం చిన్నబోయాం. మమ్మల్ని చూచి శ్రీకృష్ణ పాండునందన ద్రౌపదీ సాత్యకులు నవ్వారు. ధర్మజు డారాజ్య వైభవాన్ని అనుభవించడం నేను సహించలేను. - అని దుర్యోధనుడు పలికాడు. 'అనుమతిస్తే ఆ సంపదనంతా మాయాద్యూత నెపంతో అపహరించి దుర్యోధనునికి ఇస్తా'నని శకుని సూచించాడు. శకుని ఉపాయానికి అంగీకరింపుమని తండ్రిని బలవంతపెట్టాడు దుర్యోధనుడు. అంగీకరించకపోతే అగ్నిలో పడి ఆత్మాహుతి చేసుకొంటానని బెదిరించాడు. పుత్రవ్యామోహంతో ధృతరాష్ట్రుడు శకుని వ్యూహానికి తలఊపాడు.

## మాయాద్యూతం

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు వేయిమంది శిల్పులను పిలిపించి ఒక విచిత్ర

మహాసభను నిర్మించాడు. దానిలో మాయాద్యూతం జరిపించాలని నిర్ణయించి విదురునికి చెప్పాడు. విదురుడు జూదం వల్ల కలిగే ఆపదలను పేర్కొని దుర్యోధనాదులను ఆప్రయత్నం నుండి విముఖులయ్యేటట్లు ప్రయత్నించుమని ధృతరాష్ట్రుణ్ణి హెచ్చరించాడు. గ్రుడ్డిరాజు ఏవిధంగానైనా జూదం జరగాలనీ, ఎటువంటి కీడులూ జరగకుండా పెద్దలు చూడాలనీ చెప్పి పాండవులను తీసికొని రావటానికి విదురుణ్ణి ఇంద్రప్రస్థ పురానికి రథాలతో పంపాడు. విదురు డీసంగతి భీష్మునికి నివేదించి బయలుదేరాడు.

మహేంద్ర వైభవంతో ఉన్న ధర్మరాజును విదురుడు దర్శించాడు. ధృతరాష్ట్ర సందేశాన్ని వినిపించాడు. నూత్న సభాసందర్శన సందర్భంలో సుహృద్ద్యూతం సమంజసం కాదనీ, అది కలతలకు దారి తీస్తుందనీ ధర్మజుడు భావించాడు. కాని, పెదతండ్రి ఆజ్ఞను శిరసావహించి భీమాదులను ద్రౌపదిని, ధౌమ్యాదులను వెంటబెట్టుకొని బయలుదేరి హస్తినాపురికి చేరాడు.

మణిమయ మహాసభను దుర్యోధనుడు చూపగా ధర్మజుడు దర్శించి హర్షించాడు. ఆ తరువాత రారాజు ద్యూతానికి ఆహ్వానించాడు ధర్మరాజును. ద్యూతం వలన కలిగే కీడును పేర్కొని ధర్మరాజు ఆ ఆహ్వానాన్ని వారించాడు. శకుని కల్పించుకొని ఆటనేర్చినవారే దానిని నిందిస్తే ఆకళ ఏమైపోతుందని చమత్కరించి, ధర్మజుడు ఓడినట్లు అంగీకరిస్తే ఆడవలసిన అవసరం లేదని అధిక్షేపించాడు. ధర్మజుడు ఆ మాటకు నొచ్చుకొన్నాడు. బలవంతంగా జూద మాడించటానికి పిలిచిన తరువాత వెనుకాడటానికి వీలౌతుందా? అని అంటూ విధి ప్రేరితుడై మాయాద్యూతానికి ఉన్ముఖుడైనాడు.

జూదంలో తన పక్షాన శకుని ఆడతాడనీ, అతడొడ్డిన ధనరాసులు తాను చెల్లిస్తాననీ రత్నరాసులు కుప్పలు పోసి దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. ఇతరుల కోసం జూదం ఆడటం అసమంజసం - అని అంటూనే ధర్మరాజు సాగరావర్త సంభవాలైన మణిరాసులను ఒడ్డాడు. సుహృద్ద్యూతం ఆరంభమయింది. భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాశ్వత్థామాదులు సముచితాసనాలలో కూర్చొని జూదాన్ని పరికిస్తున్నారు.

శకుని మాయావిదుడు. అందువలన పాచికలతో కావలసిన పందాన్ని జయప్రదంగా వేయగలడు. దానితో వరుసగా పందాలు శకుని గెలుచుకొంటున్నాడు. ధర్మరాజు ఓడిపోతున్నాడు. ఆట సాగే కొద్దీ ధర్మరాజుకు పంతంకూడా పెరిగింది. ఒక ఒడ్డుకు సువర్ణ భాండాగారాలు పెట్టి ఓడిపోయాడు. మరొక పందానికి రత్న భాండాగారాలను కోల్పోయాడు. ఇంకొకసారి చతుశ్శత నిధులను, మరొకసారి గుఱ్ఱాలను, ఏనుగులను, పరిచారికలను, పరిచారకులను ఇలా క్రమంగా ఉన్న సంపదనంతా మాయాద్యూతంలో చేజార్చుకొన్నాడు.

విదురు డాకపటద్యూతాన్ని అంతటితో ఆపించు మని ధృతరాష్ట్రుణ్ణి కోరుకొన్నాడు. కాని, అతడు పుత్రవ్యామోహంతో ఏమీ నకుండా మిన్నకున్నాడు.

అప్పుడు విదురుడు దుర్యోధనుని ఇలా మందలించాడు: - 'అన్యాయంగా, శకుని మాయతో, పాపమతివై జూదంతో పాండవుల సంపదలను ఇలా మోసంతో సంగ్రహించటం న్యాయమా. పాండవులు పరాక్రమాన్ని ప్రకటించి సంపాదించుకొన్నారు సంపదను; మీరు మోసంచేసి దొచుకుంటున్నారు'"అన్నాడు.' విదురుని మాటలు దుర్యోధనునికి కోపం తెప్పించాయి. 'మావద్ద తిని పరాయి వాళ్లను పొగడే కుత్సితబుద్ధి నీది! ఓ విదురా! నీవు మాయింట్లో విషసర్పము న్నట్లున్నావు. ఇతరుల సంపద కులభోపాయంతో గ్రహించటం రాజనీతికాదా! అడగకుండానే నీవు మాకు నీతులు చెప్పవచ్చావు. ఇక చాలు. మాటలు కట్టి పెట్టటం మంచిది' - అని దుర్యోధనుడు విదురుణ్ణి గద్దించాడు.

'దుర్యోధనా! నిన్ను పాడుచేసే వారి మాటలు విని సంబర పడుతున్నావు. నీకు తుడైనవాడు - ముందుగా కొంత అప్రియంగా ఉన్నా తరువాత హితం చేకూర్చే మాటలు పుతాడు. హితులు మొగమోటం లేకుండా, బలవంతంగానైనా హితవును బోధిస్తారు. నీ ప్పుడు హితు లెవ్వరో, అహితు లెవ్వరో తెలిసికోలేని స్థితిలో ఉన్నావు' - అని చెప్పి మాటలాడక మిన్నకున్నాడు విదురుడు.

ధనాలనన్నింటినీ ఓటువోయిన ధర్మరాజును మరొక పందెం కాయు మని శకుని బలవంతం పెట్టాడు. ఆ తరువాత కూడా శకుని అవహేళన చేస్తూ పందాలు కాయుమనేవాడు. ఉరుషానికి ధర్మరాజు కాస్తుండేవాడు. వరుసగా సహదేవ నకుల పార్థ భీములనూ, చివరకు తనను కూడా పణంగా పెట్టి జూదంలో ఓడిపోయాడు. ఆపైన శకుని 'ద్రౌపది కూడా నీ ధనమే కదా' అని ధర్మరాజుకు జ్ఞాపకం చేశాడు. గతిలేక కులభామను కూడా జూదంలో ఒడ్డి చివరకు మెను కూడా ఓడిపోయాడు. ధర్మజుడు దీనవక్త్రుడై దిగాలుబడి కూర్చున్నాడు. భీష్మ ణులకు చెమటలు కమ్మాయి. విదురుడు మొగం ప్రక్కకు పెట్టి కంటతడి పెట్టుకొన్నాడు. గిలిన సదస్యులందరూ ఏకధారగా దు:ఖించారు. దుర్యోధన దుశ్శాసన కర్ణ సైంధవులు స్ఫురిన మొగాలతో ఒకరినొకరు చూచుకొంటూ నవ్వుకొన్నారు. సభలో కలకలం బయలు దేరింది. దుర్యోధనునికి పట్టపగ్గాలు లేవు. పాండవులు తనకు దాసులైనా రని పొంగిపోతున్నాడు. ఆ గర్వాతిశయంతో పాంచాలిని దాసీలతో కలిసి తమ యిళ్లు తుడవటానికి ఆజ్ఞాపించాడు. సభలో సంక్షోభం కలిగింది. గ్రుడ్డిరాజు ఆ గోల విని విషయ మేమిటని విదురుణ్ణి అడిగి తెలుసుకొన్నాడు.

# ద్రౌపదీవస్త్రాపహరణం

దుర్యోధనుడు తన ఆజ్ఞను నెరవేర్పజేయటానికి విదురునిబోయి ద్రౌపదిని సభకు తీసుకొని రమ్మని కోరాడు. విదురు డందుకు అతణ్ణి మందలించాడు. దుర్యోధనుడు విదురుణ్ణి తూలనాడి ద్రౌపదిని తోడ్కొని రావటానికి ప్రాతికామిని పంపాడు. అతడు ద్రౌపది దగ్గరకు పోయి జరిగిందంతా చెప్పాడు. ఎన్నడైనా ఇలా తననూ తన భార్యనూ జూదంలో ఓడిపోయిన జూదరి ఉంటాడా అని విచారిస్తూ ప్రాతికామిని ఒక ప్రశ్నవేసింది.

"మున్న దన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో, నన్ను మున్నోటువడి విభుండు
గ్రన్నఁ దన్నోటు వడియెనో యన్న! నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని"

'నీకు తెలియకపోతే ఆ ధర్మరాజునే అడిగి తెలుసుకొని వచ్చి నన్ను తీసికొని పో' అని నిర్దేశించింది.

ప్రాతికామి సభకు వచ్చి ధర్మరాజును ఈ ప్రశ్న అడిగాడు. అతడేమీ సమాధానం ఇవ్వలేక మిన్నకున్నాడు. దుర్యోధనుడు నిండు సభలోనే ఆ సందిగ్ధమైన అర్థాన్ని నిర్ణయించు కొనవచ్చును పాంచాలిని వేగంగా తీసికొని రమ్మని ప్రాతికామిని మరలా పంపాడు. ద్రౌపది పరిస్థితుల ప్రాబల్యాన్ని గమనించింది. ఏకవస్త్రగా, అధోనీవిగా, అవిరళాశ్రుధారాపాతగా సభకు వచ్చి కురువృద్ధుల సమీపంలో నించున్నది. ద్రౌపదిమోము చూడలేక లజ్జితులై, దుఃఖాయమాన మానసులై, తలలు వంచియున్న పాండవులను చూచి దుర్యోధనుడు సంతోషించాడు. దుశ్శాసనుని బిల్చి నీవు పోయి పెద్దల వద్ద నున్న ద్రౌపదిని ఈవలకు లాక్కొని రమ్మని నియోగించాడు. అతడు ఆమెను సమీపించాడు. భయంతో ద్రౌపది గాంధారి దగ్గరకు పోయింది. దుశ్శాసనుడు ఆమెను వెన్నంటి వెళ్ళాడు. 'ఇంకెక్కడికి పోతావు? నీ మగళ్ళు నిన్నోడారు. రారాజు నిన్ను గెలుచుకొన్నాడు. వెంటనే రా!' అని గద్దించాడు. 'నేను రజస్వలను. ఏకవస్త్రను. నన్ను ముట్టకు; పెద్దలున్న సభకు నేనీ స్థితిలో రాలేను' అని దీనంగా పలికింది పాంచాలి. 'నీవు ఏకవస్త్రవైతేనేమి? వివస్త్రవైతేనేమి? నిన్ను ఎలాగైనా తీసుకొని పోతాను' - అని ఆ దుశ్శాసనుడు బలవంతంగా రాజసూయావభృథ స్నానంతో పవిత్రమైన ఆమె శిరోజాలను ఒడిసిపట్టి సభకు ఈడ్చితెచ్చాడు. కర్ణ దుర్యోధన శకుని సైంధవాది దుష్టభూయిష్టమైన ఆ సభలో నిలువబడి ద్రౌపది వివర్ణ వదనంతో ఇలా సభికులను ఉద్దేశించి పలికింది -

'ఓ కురు వృద్ధులారా! ధర్మరాజు ఎంత దురదృష్టకరమైన పరిస్థితులలో చిక్కుకొన్నా ధర్మమార్గాన్ని మాత్రం వీడని ధన్యుడు. దుర్జనుడైన ఈ దుశ్శాసనుడు నన్నీ సభ కెందుకు ఈడ్చుకొని తెచ్చాడు? సర్వ ధర్మ సంవిదు లని పేరుగాంచిన కురుముఖ్యులు చూస్తు ఉండగానే ఈ దుర్మదాంధుడు నన్ను అవమానం చేయవచ్చు. భరతవంశం నేడు అధర్మంతో అతినింద్యమై పోయింది' అని ఆక్రోశిస్తూ, 'అన్యధా శరణం నాస్తి' అనే భక్తి భావంతో ద్రౌపది శ్రీకృష్ణుణ్ణి ఆర్తితో పిలిచింది.

ద్రౌపది దీనస్థితి చూచి భీముడు ధర్మరాజుపై మండిపట్టాడు. జూదానికి కారణమైన అతని చేతుల్ని కాలుస్తానన్నాడు. అర్జునుడు అడ్డం వచ్చి దర్మరాజు వర్తనంలోని ధర్మనీతిని తెలియపరిచాడు. సభలో వికర్ణుడు లేచి ద్రౌపది అన్యాయవిజిత అని వాదించాడు. ఆమె అడిగిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వటం సభాధర్మమని మనవి చేశాడు. కర్ణుడు అతణ్ణి అధిక్షేపించాడు. అడగకుండానే నీతులు చెప్పే అధిక ప్రసంగానికి పోవద్దని మందలించాడు. ద్రౌపది 'ధర్మవిజితయే' అని సమర్థించాడు. ఒక పతిని దైవంగా భావించి కాపురం చేసే వనితను ఏకవస్త్రయని గౌరవించాలిగాని, అనేక భర్తృక అయిన బంధకిని వివస్త్రను చేసినా దోషం లేదని కర్ణుడు వాదించాడు. ఆమాటలు విని రెచ్చిపోయి దుర్యోధనుడు పాంచాలిని వివస్త్రను చేయుమని దుశ్శాసనుణ్ణి ఆజ్ఞాపించాడు. అతడు అన్నమాటను అక్షరాలా పాటించాడు.

అయినా, అఖిల జగద్రక్షాదక్షుడైన నారాయణుని మహిమవలన ద్రౌపది శరీరం మీద చీర తొలగకుండా నిలిచి ఉండింది. దుశ్శాసనుడు లాగిన చీరలు కుప్పలు కుప్పలుగా పర్వతాకారంగా పడ్డాయి. అత డా మహిమకు సిగ్గుపడతాడు. అలసిపోయి ఊరుకొంటాడు. దుశ్శాసనుడు ద్రౌపదికి చేసిన అవమానాన్ని భీమసేనుడు చూచి, ప్రతిక్రియ ఏమీ చేయలేని దయనీయ స్థితిలో ఉండికూడా రౌద్రాకరుడై ఇలా భయంకర శపథం చేశాడు.

మ. కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుఁ డై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘము ని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"

"అలా చేయకపోతే పితృపితామహుల గతికి తప్పినవాణ్ణవుతాను''' భీమశపథం విన్న సభాసదులందరూ సపుత్రకుడైన ధృతరాష్ట్రుణ్ణి నిందించారు. పాంచాలి ప్రశ్నలను పట్టించుకొనని సభను విమర్శించారు. విదురుడు పాంచాలి ప్రశ్నలకు సమాధానం చెప్పకపోతే ధర్మవిదులకు పుట్టగతులుండ వని హెచ్చరించాడు. ఆమె ప్రశ్నకు ధర్మరాజు మాత్రమే తగిన జవాబివ్వగల

డని భీష్ముడు మారు పల్కాడు.

ఇంతలో కర్ణుడు పెచ్చుపెరిగి ద్రౌపదిని చూచి నవ్వుతూ 'తరుణీ! నీకు అరవ భర్త ఉండటం ఉచితం. జూదంలో ఓడనివానిగా అతణ్ణి ఎన్నుకో'' అని ఎగతాళి చేశాడు. ఆ మాటలను ఆసరాగా తీసికొని దుర్యోధనుడు ఆ యిల్లాలిని తన యెడమ తొడమీద కూర్చో మని సైగచేశాడు. ఆ దారుణమైన దృశ్యం చూచి వాయునందనుడు అగ్రహోదగ్రుడై లయకాల రుద్రుడు లాగా విజృంభించి భయంకర శపథం చేశాడు.

ఉ॥ "ధారుణి రాజ్య సంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరునిజోరుదేశమున నుండగ బిల్చిన యిద్ధురాత్ముదు
ర్వార మదీయ బాహు పరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"

అని అరుణ లోచనాలతో ఆయుధాలున్నవైపు చూపులు సారిస్తూ అన్నగారి అనుమతి కోసం ఎదురు చూస్తున్న భీముణ్ణి భీష్మ విదుర ద్రోణాదులు ఇది కోపానికి సమయం కాదని వారించారు. ఆ సమయంలో ధృతరాష్ట్రుని అంతఃపురంలో ఎన్నో అపశకునాలు గోచరించాయి. గాంధారి విదురుని తోడ్కొని ధృతరాష్ట్రుని దగ్గరకు పోయి, జరిగినదంతా చెప్పి, దుర్యోధనుని పిలిచి కోపించి, సకల బాంధవ హితం చేయసమకట్టి ద్రౌపదిని దగ్గరికి పిలిచి శాంతవచనాలు పలికింది. ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాన్ని కోరుకొమ్మని అడిగాడు. ఆమె ధర్మరాజు దాస్య విముక్తిని వరంగా కోరుకొన్నది. దానిని గ్రుడ్డిరాజు ప్రసాదించి రెండో వరాన్ని కోరుకోమన్నాడు. భీమాదులు నలుగురును వారి ఆయుధాదులతో సహా దాస్యవిముక్తులు కావాలని అడిగింది. దానినీ ఇచ్చాడు. మూడో వరం వేడుకోమన్నాడు. క్షత్రియ వనితకు రెండు వరాలు కోరుకోవటం న్యాయం కాబట్టి మూడోవరం కోరుకొనననది. కోడలి ధర్మనిష్ఠకు మెచ్చుకొని ధర్మరాజుకు అతని రాజ్యాన్ని యిచ్చి యేలుకొమ్మని ఇంద్రప్రస్థపురానికి పంపాడు. పాండవులు బంగారు రథాలెక్కి తమ రాజధానికి చేరి సుఖంగా ఉన్నారు.

## అనుద్యూతం

ఈ విషయం తెలుసుకొన్న దుర్యోధనుడు ఖిన్నుడై తండ్రి వద్దకు పోయి ఇలా అన్నాడు: ఇకపై ఎంతమేలుచేసినా పాండవులకు మనం హితులం కాగలమా? పాములకు తోకలు తొక్కి వదిలిపెట్టాం. అవి పగపట్టి కాటేయక మానవు. గాండీవంతో ఉన్న సవ్యసాచిని, గదగొన్న భీముని ఎదుర్కొనటం సాధ్యమా? కాబట్టి వారలను మరల పిలిపించి అనుద్యూతంలో

ఓడించి, అడవులకు పంపుదాం' అని ధృతరాష్ట్రుని ఒప్పించి, ప్రాతికామిని పాండవుల తెచ్చుటకు పంపాడు.

ధర్మరాజాదులు మరల హస్తినాపురికి వచ్చారు. అనుద్యూతానికి పూనుకొన్నా అందులో ఓడినవారు వల్కలాలు కట్టి, కందమూలాలు తింటూ బ్రహ్మచర్యాన్ని పాటిస్త పన్నెండేళ్లు వనవాసం చేసి, పదమూడవ యేడు జనపదంలో అజ్ఞాతవాసం చేయా అజ్ఞాతవాసంలో ఎవరైనా గుర్తిస్తే మరల పన్నెండేళ్ల అరణ్యవాసం, ఒకయేడు అజ్ఞాతవా చేయాలని కట్టడి చేసుకున్నారు. ధర్మరాజు అనుద్యూతంలో శకుని మాయవలన ఓడిపోయా పాండవులు వనవాసాజ్ఞాతవాసాల దీక్షను గ్రహించారు. కుంతిని విదురునియింట ఉంచా సతీసమేతులై పాండవులు అడవులకు బయలుదేరారు.

తలవిరబోసుకొని పతుల వెంట నడచిపోయే ద్రౌపదిని చూచి కౌరవేంద్రు అంతఃపుర వనితలందరూ ఏదో చెప్పలేని భయంతో తలలు వంచారు. నా భయంక గదాదండంతో ఆ దుర్యోధనుని తొడలను ఉగ్రరణంలో విరగకొడతాను, శిరస్సు కాలుత తన్ని అవమానిస్తాను, దుశ్శాసనుని వధించి వేడిరక్తం త్రాగుతా నంటూ బుసలు కొడుతు సాగాడు వాయుపుత్రుడు భీమసేనుడు. రాబోయే పదునాల్గవయేట జరగబోయే మహాయుద్ధంలో నా గాండీవంతో ఈ కర్ణుడు మొదలుగాగల దుర్జన సంఘాన్ని హతమార్చు నని హుంకరిస్తూ అర్జునుడు వెడలాడు. మాయాద్యూతంలో మోసం చేసి యింత విపత్తుక మూలమైన శకునిని చంపుతామని భీమార్జున నకుల సహదేవులు శపథం చేశారు.

ధృతరాష్ట్రుని మందిరంలో పట్టపగలే నక్కలు కూశాయి. గ్రహణకాలం కాకుండా సూర్యుణ్ణి రాహువు పట్టాడు. భూమి కంపించింది. నారదుడు మింట నాట్యం చేస్త పదునాల్గవ యేట భారతయుద్ధం జరుగుతుంది. భీమార్జున పరాక్రమాల వలన పాండవుల జయిస్తారు అని ప్రకటించాడు.

## అరణ్యపర్వం

ద్రౌపదీసహితులై పాండవులు ఉత్తరదిశగా పయనించారు. కొంతదూరం పోయిన తరువాత ఇంద్రసేనాదులైన మూల భృత్యులు, పద్నాలుగు వేల రథాలతో సుభద్రాభిమన్యులు ప్రతివింధ్యాదులు వారిని కలుసుకొన్నారు. ప్రజలు ధృతరాష్ట్రుని నిందించి పాండవుల వెంట వనవాసానికి బయలుదేరారు. ధర్మజుడు వారికి నచ్చచెప్పి నిజవాసాలకు పంపాడు. కాని కొందరు వేదవిహితపండితులూ ధౌమ్యుడూ వారి వెంట సాగి వచ్చారు. తమతో వస్తున్నవార వనవాసంలో ఏమాత్రం ఆకలిబాధకు శ్రమపడినా ధర్మజుడు ఎంతో బాధపడుతుండేవాడు.

ధౌమ్యుడు ధర్మజునికి అతని ఆశ్రితులకు అన్నలోపం లేకుండా ఆదిత్య మంత్రాన్ని జపించుమని ఉపదేశించాడు. నిష్ఠతో జపించిన ధర్మరాజుకు సూర్యుడు ప్రత్యక్షమై ఒక రాగిపాత్ర నిచ్చి ఆ పన్నెండేళ్ల వనవాసకాలంలో వన్యఫలమూల శాకాలకు ఎటువంటి లోపం లేకుండా ద్రుపదరాజపుత్రిచేత సాధింపబడతాయని వరమిచ్చాడు. ఆవిధంగా అరణ్యవాసంలో ధర్మరాజాదులకు ఆకలిబాధ లేకుండా ఆదిత్యుడు రక్షించాడు.

పాండవులు కామ్యకవనం చేరారు. యాదవ పాంచాల వీరులు శ్రీకృష్ణ ధృష్టద్యుమ్నాదులు పాండవులను దర్శించటానికి వచ్చారు. ద్రౌపది తనకు కలిగిన అవమానాన్ని అన్నలిద్దరి యెదుట చెప్పుకొని కంటతడిపెట్టింది. శ్రీకృష్ణుడు ఆమె నోదార్చి కౌరవుల సంహారం తప్పకుండా జరుగుతుందని ఊరడించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుణ్ణి చంపుతా నని ప్రతిజ్ఞ చేశాడు. కొంతకాలమున్న తరువాత శ్రీకృష్ణుడు తనతో సుభద్రాభిమన్యు లను ద్వారవతికి తీసుకొని వెళ్ళాడు. ఉపపాండవులైన ప్రతివింధ్యాదులను ధృష్టద్యుమ్నుడు ద్రుపదపురానికి కొనిపోయాడు. పాండవులు మూలభృత్యులతో సహస్ర బ్రాహ్మణవరులతో ద్వైతవనంలో ప్రవేశించారు.

# పాశుపతాస్త్ర సంపాదనం

యుద్ధం సంభవిస్తే భీష్మద్రోణ కృ పాదులను నిగ్రహించగలిగిన శక్తి తమ కెక్కడ ఉన్నదని ధర్మరాజు గాఢంగా విచారించాడు. అతని మనస్సు తెలిసి వేదవ్యాసుడు ప్రసన్నుడైనాడు. ప్రతిస్మృతి విద్యను బోధించి దానిని అర్జునున కిస్తే తపోవీర్య విభవంతో దేవతలనుండి మహాస్త్రాలను సంపాదింపగల డని సూచించాడు. పాండవులు అక్కడినుండి కామ్యకవనం చేరి సరస్వతీ నదీతీరంలో ఉన్నారు.

ధర్మజుడు అర్జునునికి ప్రతిస్మృతివిద్యను బోధించాడు. దానితో అతడు తేజోవంతుడైనాడు. దివ్యాస్త్ర సంపాదనం కోసం పార్థుడు తపస్సుకు పూనుకున్నాడు. ఇంద్రకీల పర్వతం మీదకు చేరి ఇంద్రుని అనతితో పాశుపతాస్త్రాన్ని పొందటానికి పరమేశ్వరుణ్ణి గూర్చి తపస్సు చేశాడు. పార్థుని ఘోరతపస్సుకు పరమేశ్వరుడు మెచ్చి పరీక్షించి వరమిద్దామని కిరాత వేషంతో దిగివచ్చాడు. మూకుడనే రాక్షసుడు అర్జునుని చంపాలని అడవిపంది ఆకారంలో పరుగెత్తుతూ వచ్చాడు. ఒకవైపు నుండి పార్థుడు, మరొకవైపునుండి పరమేశ్వరుడు బాణాలు వేశారు. పంది పడిపోయింది. మూకుడు నిజాకారాన్ని పొంది అంతర్ధానం చెందాడు. కిరీటి ఎదుట కిరాత వేషధారియైన పరమేశ్వరుడు. ఇరువురూ వీరాలాపాలాడు కొన్నారు. అడవి పందిని చంపటంపై వివాదం పెంచుకొన్నారు. బాణాలు గుప్పుకున్నారు.

ఎఱుకువాని బాణాల ధాటికి అర్జునుడు ఆశ్చర్యపోయి మారురూపంలో వచ్చిన యే దేవుడో అని భావించాడు. అస్త్రశస్త్రాలన్నీ ప్రయోగించాడు. అగ్నిదేవు డిచ్చిన అక్షయతూణీరద్వయం ఓటువోయింది. అర్జునునికి ఆశ్చర్యం వేసింది. గత్యంతరం లేక గాండీవంతో కిరాతుని మీదకు లంఘించాడు. అన్ని ప్రయత్నాలూ వృథా అయ్యాయి. ముష్టియుద్ధానికి తలపడ్డాడు పార్థుడు. పరమేశ్వరుడు గట్టిగా చరిచాడు. నరుడు మూర్ఛపోయాడు. శివుడు ప్రత్యక్షమై కరుణతో పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు. దానికి అసాధ్యమనేది లేదనీ, అల్పుల మీద ప్రయోగిస్తే జగత్ప్రళయం చేస్తుందనీ హెచ్చరిక చేశాడు. ఆ దివ్యబాణంతో అఖిల లోకాలను జయించగలవని చెప్పి పరమేశ్వరుడు అంతర్థానమైనాడు.

పాశుపతాస్త్రం పొందిన అర్జునునికి ఇంద్రుడు దేవగణంతో ప్రసన్నుడైనాడు. వారందరూ పార్థుని నభినందించి వివిధ దివ్యాస్త్రాలను ప్రసాదించారు. దేవేంద్రుడు అర్జునుణ్ణి తన రథంమీద అమరావతికి తీసికొని పోయాడు. అక్కడి భోగభాగ్యాలను చూపించాడు. సగం గద్దెమీద కూర్చుండబెట్టుకున్నాడు. రాత్రి వెన్నెల వేళ ఊర్వశి అర్జునునిపై మరులు గొని సమీపించి మనసుబైటపెట్టింది. కాని, అర్జునుడు ఆమెయందు మాతృభావాన్ని ప్రకటించి నమస్కరించాడు. దేవవనితలకు వావి వరుస లుండవని ఆమె ఎన్నో విధాల మదనోద్దీపకంగా మాట్లాడుతుంది. అతడు చలించడు. ఆమె విసిగి అతణ్ణి నపుంసకునిగా శపించింది. మరునా డా సంగతి తెలుసుకొనిన దేవేంద్రుడు అర్జునుని అభినందించి ఆషండరూపం అజ్ఞాతవాస వత్సర కాలం మాత్రమే ఉంటుందని వరమిచ్చి వివిధ దివ్యాస్త్రాలను ప్రసాదించాడు. ధృతరాష్ట్రుడు అర్జునుని పాశుపతాస్త్ర లాభవృత్తాంతం పారాశర్యుని వలన విని పరమ వ్యాకుల చిత్తుడై తపించాడు. భీముడు కిమ్మీరుని చంపిన వార్తవిని మనసులో కటకటలాడాడు.

పాండవులు గంధమాదన పర్వతం మీద ఉన్నప్పుడు భీముడు ద్రౌపదికి సౌగంధిక పుష్పాలు తెచ్చియిచ్చాడు. ఆ సందర్భంలో హనుమంతుని దయ కాతడు పాత్రుడైనాడు. అర్జున రథధ్వజం మీద నిలిచి రక్షించటానికి వరమిచ్చాడు వీరాంజనేయుడు.

పాండవులు హిమవన్నగ ప్రాంతంలో నివసిస్తున్నప్పుడు భీమసేను డొక్కడే వేటకోసం వెళ్ళాడు. అతడు అలసిపోయి ఉన్నప్పుడు ఒక గొప్ప కొండచిలువ భీముణ్ణి బిగపట్టింది. ఆ పాము పట్టుతో భీముడు బలహీనుడైనాడు. తనను గురించి ఆపాముకు నివేదించుకొన్నాడు. కాని, పాము భీముణ్ణి వదలలేదు. ధర్మరాజు భీముడు తిరిగి రావటం ఆలస్యమైందని తమ్ములతో కలిసి వెదుక్కుంటూ వచ్చాడు. సర్పాధీనంలో భీముణ్ణి చూచాడు. ఆ సర్పం సామాన్యమైనది కాదని తెలిసి వివరాలు అడిగాడు. ఆపామురూపంలో

ఉన్నది భరతవంశీయుడైన నహుష చక్రవర్తి. అన్ని వేదాలు చదివినా, నూరు యజ్ఞాలు చేసినా, దేవేంద్ర పదవి పొందినా మదంతో ముని పుంగవులను అవమానిస్తే ఇలాగే ఫలం అనుభవించవలసివస్తుందని పశ్చాత్తాపంతో స్వవిషయం చెప్పుకొన్నాడు నహుషుడు. తనువేసే ప్రశ్నలకు సమాధానాలు చెపితే భీముణ్ణి వదులుతానన్నాడు. నహుష ప్రశ్నలు తాత్త్విక గుళికలు. వాటిని వినయంతో సరైన సమాధానాలు చెప్పాడు ధర్మరాజు. నహుషునకు శాపవిమోచనమైంది. భీముడు బంధవిముక్తు డైనాడు. నహుషునికి నమస్కరించి తమ్మునితో తిరిగి ఆశ్రమానికి చేరుకొన్నాడు ధర్మరాజు.

## ఘోషయాత్ర

పాండవులు ద్వైతవన సరోవర తీరంలో ఉన్నారు. వారు వనవాస క్లేశాలను అనుభవిస్తున్నారని, వారి ముందు కౌరవ సంపదను ప్రదర్శించి వారికి మరింత దుఃఖాన్ని కలిగించాలనీ దుష్టచతుష్టయం పన్నాగం పన్నింది. ద్వైతవనంలో ఉన్న పశువులు క్రూరమృగబాధకు గురి అవుతున్నాయనీ, తక్షణమే ప్రభువులు వాటికి రక్షణ కల్పించాలనీ సమంగుడనే గోపాలునిద్వారా వినతిని సృష్టిస్తారు. దానిని నమ్మి ధృతరాష్ట్రుడు ఘోషయాత్ర చేయటానికి దుర్యోధనాదులకు అనుమతినిచ్చాడు. అయితే, ఆ వనంలోనే నివసిస్తున పాండవుల కెటువంటి కీడును తలపెట్టవద్దని హెచ్చరించాడు. సరేనని దుష్టచతుష్టయం మహావిభవంగా అట్టహాసంగా సకుటుంబ పరివారంగా ద్వైతవనం చేరి డేరాలు వేయించి వినోదంగా జీవిస్తుంటారు. దుర్యోధనాదుల సంపదలను చూచి పాండవులు, ధార్తరాష్ట్రుల వైభవం చూచి పాంచాలి మనసులో బాధపడా లని వారి పన్నాగం.

ద్వైతవనంలో దుర్యోధనాదులు మృగయా వినోదం సాగిస్తూ ద్వైత సరోవర ప్రాంతంలో ధర్మరాజు యజ్ఞదీక్షితుడై ఉన్నాడని తెలిసి, సరోవరానికి ఆవలి ఒడ్డున క్రీడాగృహాలను నిర్మించటానికి ఆజ్ఞాపించారు. ఆ ప్రయత్నాన్ని కొందరు గంధర్వులు అడ్డుకొన్నారు. చిత్రసేనుడనే గంధర్వరాజు క్రీడార్థం కల్పించుకొన్న కొలను కాబట్టి అన్యు లది ఉపయోగించరాదని హెచ్చరించారు. దుర్యోధనాదులు వారిమాటలకు లెక్కసేయక చిత్రసేనుని గంధర్వసేనతో యుద్ధానికి సిద్ధమయ్యారు. పోరు ఘోరంగా జరిగింది. కర్ణుని రథం కూలింది. దుర్యోధనుని రథాన్ని భగ్నం చేసి, విరుగగొట్టి, జుట్టుపట్టి అతణ్ణి నేలపై పడవేసి, పెడకేల కట్టి సింహనాదం చేశాడు చిత్రసేనుడు. దుశ్శాసనాదులనందరినీ బంధించాడు. ఆ భంగపాటుకు బెదరి కౌరవ సైనికులు ధర్మరాజు దగ్గరికి పోయి జరిగిన సంగతి చెప్పి శరణువేడారు.

'మనం చేయవలసిన పని గంధర్వులే చేశా'రని భీముడు నవ్వాడు. పుట్టినప్పటినుండి

మన కపకారం చేస్తున్నది చాలక అరణ్యవాసం చేస్తు్న పసలను అపహాస్యం చేయటాని వచ్చిన అహంకారులకు తగిన శాస్తి అయిందనీ, అతనిమీద ఎటువంటి దయచూపవద్ద భీముడు పలుకుతాడు. ధర్మజుడు అనునయిస్తూ ఇలా అంటాడు-

" కావరయ్య! అనిన, కరము దుర్బలుడైన
చెనసి యోపినంత సేయు ననిన
ఊరకుండునయ్య! ఉత్తమ శూరుండు
దీనజనులయున్న తెరగు సూచి"
"శరణంబని వచ్చిన భీకర శత్రువునయిన బ్రీతి కావగవలయున్
కరుణాపరుల తెరంగిది. యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్".

అని నచ్చచెప్పి భీమార్జునులను గంధర్వరాజుపై పంపి దుర్యోధనుణ్ణి విడిపించే ప్రయత్నం చేశాడు. భీమార్జునులు చిత్రసేనునిపై దండెత్తారు. గంధర్వపతి వారితో అస్త్రశస్త్రాలతో యుద్ధం చేశాడు. పాండవులను పరిహసించటానికి వచ్చిన కౌరవులపట్ల ఎందు కింత కనికర అని ప్రశ్నించాడు. 'సుయోధనుడెంత చెడ్డవాడైనా మాకు సోదరుడు అతణ్ణి వదలిపెడితే మా అన్న ధర్మరాజు సంతోషిస్తాడు' అని అర్జునుడు ప్రకటించాడు. అందుకు గంధర్వరాజంగీ కరించి పెడరెక్కలు కట్టిన దుర్యోధనుణ్ణి స్వయంగా ధర్మరాజు ఎదుట నిలిపి అతని దుష్ట స్వభావాన్ని బయటపెట్టాడు. చిత్రసేనుని ఔదార్యాన్ని కొనియాడి ధర్మజుడు సగౌరవంగా అతన్ని గంధర్వ లోకానికి సాగనంపాడు. ఆపైన దుర్యోధనాదుల బంధాలను ఊడదీయించాడు. "ఎప్పుడూ ఇటువంటి సాహసాలు చేయకుము సోదరా! దుర్జనుడు సాహసిస్తే నశిస్తాడు. కాబట్టి వెంటనే నీతమ్ములను తీసికొని నగరానికి వెళ్ళిపో. దీన్ని మనసులో పెట్టుకొని బాధపడకు" అని మెత్తగా మందలించి దుర్యోధనుణ్ణి వీడ్కొలిపి పంపించాడు. ధర్మజుని ధర్మప్రవృత్తికి ధౌమ్యాదులందరు ప్రశంసించారు.

దుర్యోధనుడు పాండవులచేత విడిపింపబడ్డాడన్న అపకీర్తిని సహించలేక నగరికి తిరిగిపోతూ మార్గ మధ్యంలోనే ప్రాయోపవేశం మొదలుపెట్టాడు. దుశ్శాసన, కర్ణ, శకునులు ఎంతో చెప్పి చూచారు. ఫలం లేకపోయింది. పాతాళవాసులైన రాక్షసులు కృత్యను సృష్టించి అర్ధరాత్రి దుర్యోధనుణ్ణి అక్కడికి తెప్పించుకొన్నారు. దుర్యోధనుడు వారి తపస్సుకు ఫలంగా పుట్టాడని చెప్పి అసురాంశలతో పుట్టినవారినందరినీ పేర్కొని, వారి కందరికీ ఉత్తేజం కలిగించటానికి బ్రతికి ఉండు మని హితవు చెప్పారు. మరునాడు ఉదయమే దుర్యోధనుడు ప్రాయోపవేశం మాని సైన్యసమేతుడై హస్తినాపురం చేరాడు.

# సైంధవ పరాభవం

ఒకసారి పాండవులు తృణబిందునాశ్రమంలో ధౌమ్యుణ్ణి, ద్రౌపదిని ఉంచి తాము వేటకు వెళ్లారు. ఆ సమయంలో సైంధవుడు సాల్వకన్యను వివాహమాడే నిమిత్తమై ఆవైపు ససైన్యుడై తరలిపోతున్నాడు. ఆశ్రమద్వారంలో ద్రౌపదిని చూచాడు. ఆమె అపూర్వ లావణ్యాన్ని చూచి మోహించి ఆమెకు తన కోర్కెను దూతద్వారా తెలియపరిచాడు. దూతకు ద్రౌపది తనవివరాలు తెలిపి పాండవపత్నిననీ, సంతానవతి ననీ పేర్కొని, పాండవులు వచ్చేంతవరకు ఉండి వారి ఆతిథ్యాన్ని స్వీకరించి వెళ్లమంటుంది. ఆ సంగతి దూత సైంధవునికి నివేదించాడు. అతడు మదనాతురుడై రథం దిగి ద్రౌపదిగల ఆశ్రమం లోనికి ప్రవేశించి ఆమెను పలుకరించాడు. ఆమె అతిథి మర్యాదలు చేసింది. ఆమెపై సైంధవుడు మరులుగొన్న మాటలు మాట్లాడసాగాడు. ఆమె తనకు చెల్లెలివరస అనికూడా భావించకుండా కామాంధకారంతో మాట్లాడిన అతని వైఖరికి నిష్ఠురంగా సమాధానం చెప్పింది. పాండవాగ్రహం వలన కలిగే విపత్తును హెచ్చరించి చెప్పింది. అయినా, అతడు లెక్కసేయకుండా ఆమెను బలాత్కారంగా ఎత్తుకొని రథంమీద ఉంచుకొని బయలుదేరాడు. ద్రౌపది ధౌమ్యుణ్ణి పిలుస్తూ ఆక్రందిస్తుంది. ఆరథం వెంట ధౌమ్యుడు పరుగిడసాగాడు.

పాండవులు ఆశ్రమానికి తిరిగి వచ్చారు. ద్రౌపది చెలికత్తెవలన అంతా తెలుసుకున్నారు. అయిదుగురూ సైంధవుని మీదకు లంఘించారు. వారి రథాలను చూచి సైంధవుడు వారిని పరిచయం చేయుమని ద్రౌపదిని కోరాడు. ఆమె పాండవ పరాక్రమ మూర్తులను వర్ణించి వారి బారిన పడిన వారికి మృత్యువు ఖాయమని వెల్లడించింది. పాండవులు దిక్కులు చీకట్లు కమ్మేటట్లు బాణాలు గుప్పించారు. త్రిగర్త శిబి సింధు సౌవీర సైన్యాలు పాండవుల నెదుర్కొన్నాయి. భీముడు సైంధవుణ్ణి, యుధిష్ఠిరార్జునులు సౌవీరులనూ, నకుల సహదేవులు మిగిలిన వారినీ ఢీకొన్నారు. సంకుల సమరం సాగింది. రణభూమి శవమయం అయిపోయింది. సైంధవుడు ద్రౌపదిని నేలపై దిగవిడిచి రథం తోలుకొని పలాయనం చిత్తగించాడు. కాని, భీమార్జునులు ఆ దుర్మార్గుణ్ణి విడిచి పెట్టదలచలేదు. పాంచాలి క్రుద్ధురాలై సైంధవుని చంపటానికి వారిద్దరినీ పురికొల్పింది. ధౌమ్య ధర్మజ ద్రౌపదులను, నకుల సహదేవులను ఆశ్రమానికి తిరిగి పంపి భీమార్జునులు అతని వెన్నంటారు. భీముడు సైంధవుణ్ణి చితకపొడిచాడు. మొగం నుండి నెత్తురు కారుతూ అతడు మూర్ఛపోయాడు. అర్జునుని సలహాపై అతణ్ణి ధర్మజుని వద్దకు తీసుకొని పోయారు. ధర్మజుడు సైంధవుని తల గొరిగించి నాటినుండి 'పాండవదాసుడ'నని చెప్పుకొనేటట్టు ఒప్పించి విడిపించి పంపాడు. ధర్మరాజు కరుణకు జనులందరు జయజయధ్వానాలు

# కర్ణుని దానవీరం

పాండవ వనవాసంలో పన్నెండో యేడు గడుస్తోంది. కర్ణుని సహజ కవచకుండలాలను బ్రాహ్మణ రూపంలో దానంగా గ్రహించి అర్జునునికి రాబోయే యుద్ధంలో మేలు చేయాలని ఇంద్రుడు సంకల్పించాడు. ఆ తలపు తెలుసుకొని సూర్యుడు ముందుగానే బ్రాహ్మణ వేషంలో వచ్చి కర్ణునికి ఇంద్రుని వ్యూహాన్ని వివరించి చెప్పాడు. అప్పుడు కర్ణుడు తన జన్మ వ్రతమైన దానవ్రతాన్ని ప్రాణంపోయినా విడనాడనని చెప్పి ఇలా అంటాడు-

"మతి కుంతీసుత పక్షపాతి యగుచున్ మాయా స్వరూపంబుతో
జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచున
ట్టి తెఱంగైనఁ దదీయ కీర్తియ చుమీ డిందుం; ద్రిలోకీసము
న్నతమై యొప్పు మదీయ కీర్తి; యిది సూ నా పుణ్య మెబ్బంగులన్"

అని కీర్తి కాముడై ప్రాణాలను లక్ష్యం చేయని కర్ణుని పట్ల వాత్సల్యాన్ని ప్రకటించటానికి దేవనిర్మితమైన రహస్యం ఒకటి ఉందని కర్ణ జన్మవృత్తాంతాన్ని సూచించి రహస్యంగా ఉంచాడు. కాలాంతరాన వెలువడుతుందని పలికాడు. కర్ణార్జునులకు పగలు పెరిగియుద్ధం వస్తే కవచ కుండలధారియైన కర్ణుడు అర్జునుని కంటె అధికుడౌతాడు. అందువలన ఇంద్రుడు మోసంతో తన కొడుకుకు మేలు చేసుకోతలచాడు. కాబట్టి కవచ కుండల దానాన్ని మానుమని హితవు చెప్పాడు. కర్ణుడు దాని కంగీకరించలేదు. అయితే కవచకుండలాలకు ప్రతిఫలంగా శక్తిని వరంగా గైకొనుమని చెప్పి కర్ణునికి సూర్యు డంతర్థాన మయ్యాడు. సూర్యు డన్నంత పని అయింది. కర్ణుడు కవచ కుండలాలను ఇంద్రుని కిచ్చాడు. దానిని అర్జునునిపై ప్రయోగించి దివిజనాథునికి తగిన బుద్ధి చెప్పాలని కర్ణుడు లోలోన భావిస్తూ ఉన్నాడు.

మార్కండేయ మహర్షి వలన అనేక కథలు విని ధర్మరాజు ద్వైత వనానికి చేరాడు. ఒక బ్రాహ్మణుడు అరణి కోసం ధర్మజుని శరణువేడాడు. మృగమొకటి ఆ అరణిని కొమ్ముకు తగిలించుకొని పారిపోయింది. దానిని తేవటానికి తమ్ములతో కలిసి ధర్మజుడు బయలుదేరాడు. మధ్యలో దాహం వేసింది. దూరంగా ఉన్న కొలని నుండి నీటికోసం వరుసగా తమ్ములనందరినీ

పంపుతారు. యక్షు డొకడు ఎంతవారించినా వినక నీరు త్రాగి భీమాదులు మృతి చెందారు. ధర్మజుడు చివరకు తానే ఆకొలను చేరి యక్షరూపంలో ఉన్న యమధర్మరా జడిగిన ప్రశ్నలకు వివేకంతో సమాధానం చెప్పి, తన తమ్ములను తిరిగి సజీవులుగా పొందగలుగుతాడు. బ్రాహ్మణుని అరణిని సాధించగలుగుతాడు.

యక్ష ప్రశ్నలు : ధర్మజుని సమాధానాలు :

1. సూర్యుణ్ణి నడిపే శక్తియేది? - బ్రహ్మము
2. సూర్యుణ్ణి సేవిస్తూ తిరగే దెవ్వరు? - సురకోటి.
3. సూర్యుడు దేనివలన అస్తమిస్తాడు? - ధర్ముని చేత
4. సూర్యునికి ఆధారమేది ? - సత్యము
5. శోత్రియుడు దేనివలన అవుతాడు? - శ్రుతము వలన
6. పురుషుడు దేనివలన మహత్యాన్ని పొందగలడు? - తపస్సు చేత
7. పురుషుడు దేనిచేత సహాయముతు డౌతాడు? - ధృతిచేత
8. పురుషుడు దేనిచేత బుద్ధిమంతుడౌతాడు? - బుధ సేవచేత
9. బ్రాహ్మణుడు దేనివలన దేవభావాన్ని పొందుతాడు? - అధ్యయనం వలన
10. అతనికి సాధుభావం ఏ విధంగా కలుగుతుంది? - అధిక వ్రతశీలం వలన
11. అతనికి అసాధుత్వం దేనివలన కలుగుతుంది? - శిష్టవృత్తిని వదలటం వలన
12. అతడు దేనివలన మానుషుడౌతాడు? - మృత్యుభయం వలన
13. జీవన్మృతుడౌటువంటి వాడు? - దేవాతిధిపతితృభృత్య జనాలకు అన్నంపెట్టకుండా తానే తినేవాడు.
14. భూమి కంటె గొప్పదైనదెవరు? - తల్లి
15. ఆకాశం కంటె పొడవైనదెవరు? - తండ్రి.
16. గాలి కంటె వేగం కలిగిన దేది? - మనస్సు
17. గడ్డి పోచకంటె హీనమైన దేది? - చింత.
18. నిద్రిస్తూ కూడా కన్ను మూయనిదేమిటి? - చేప
19. పుట్టి కూడా చేతనత్వం పొందని దేది? - గ్రుడ్డు
20. రూపముండి హృదయం లేనిదేది? - రాయి
21. వేగం వలన ప్రకాశించేదేది? - ఏరు
22. బాటసారికి, రోగార్తునకు, గృహస్థునకు, మృతునకు మిత్రులెవ్వరు? - సార్థము, వైద్యుడు, సద్భార్య, చేసిన ధర్మం.

23. ధర్మువునకు గురువేది? - దాక్షిణ్యము
24. కీర్తికి ఆశ్రయమేది? - మహిమ
25. స్వర్గానికి ఇమ్మైన మార్గమేది? - దానము, సత్యము
26. సుఖాలకన్నింటికి ఆశ్రయమేది? - శీలము
27. నరునకు ఆత్మ ఎవ్వరు? - పుత్రుడు
28. మానువునకు దైవికమైన చుట్టమెవ్వరు? - భార్య
29. మానవుని జీవిక దేనివలన కలుగుతుంది? - పర్జన్యుని వలన.
30. మానవుడు దేనిని కొనియాడి అతిశయిల్లును? - దానము
31. ఉత్తమ ధర్మమేది? - అహింస
32. ఎప్పుడును పండియుండునది ఏది? - యాగకర్మ.
33. దేనిని నిగ్రహిస్తే ప్రయోజనసిద్ధి కలుగుతుంది? - మనోహంకారం
34. ఎవరితో చెలిమి ఎప్పుడూ చెడిపోకుండా ఉంటుంది? - సజ్జన స్నేహం
35. లోకమున కేది దిక్కు? - సజ్జనులు
36. దేనివలన జలము, అన్నము సంభవిస్తాయి? - ఆకాశము, భూమి, జలము
37. విషమువంటి దేది? - విప్రధనము
38. శ్రాద్ధ విధికి సమయమేది? - బ్రాహ్మణాగమము
39. మానవుడు ఏవి వదలి పెట్టి సర్వజన సమ్మతుడు, నిశ్శోకుడు, అర్థవంతుడు, సుఖి కాగలడు? - గర్వము, క్రోధము, లోభము, తృష్ణ
40. పురుషుడెవ్వడు? - యశస్వి
41. సర్వధని యైనవాడెవ్వడు? - సమచిత్తుడు.

ధర్మరాజిచ్చిన సముచిత సమాధానాలకు యక్షుడు సంతోషించి ఒక తమ్ముని బ్రతికిస్తాను అతని నెన్నుకోమని అడిగాడు. ధర్మరాజు నకులుణ్ణి బ్రతికించుమని యక్షుణ్ణి కోరతాడు. భీమార్జునులలో ఎవరైన నీ కండదండలుగా నిలువగలరుగాని నకులు డెందులకు పనికి వచ్చునని యక్షుడు ప్రశ్నించాడు. కుంతీ పుత్రులలో మొదటి వాణ్ణి నేనున్నాను. అలాగే మాద్రీ పుత్రులలో నకులుడుండటం ధర్మమని ధర్మరాజన్నాడు. యక్షుడు ధర్మజ ధర్మబుద్ధికి సంతోషించాడు. చనిపోయిన భీమాదుల కందరికీ ప్రాణదానం చేశాడు.

ధర్మజుని ధర్మవర్తనానికి సంతుష్టుడైన యమధర్మరాజు పాండవులు అజ్ఞాతవాసం కోసం వారు కోరుకున్న రూపాలు వెంటనే రాగలవనీ, వారి నెవరూ గుర్తింపజాలరనీ వరమిచ్చి అంతర్థానమయ్యాడు. పన్నెండేళ్ల అరణ్యవాసం పాండవులు నియతితో పూర్తిచేశారు.

# విరాటపర్వం

"మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గా౦గ నేమిగతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నా పదుమూ౦డగు నే౦డు మత్స్యతా
మహులు చరించి రంతయు౦ గ్రమంబున నాకెఱు౦గంగ౦ జెప్పుమా!"

అని జనమేజయుడు ఆసక్తిగా అడిగాడు. ఊర్జిత కథోపేతం, నానారసాభ్యుదయోల్లాసం అయిన విరాటపర్వకథ వైశంపాయనుడు వినిపించ నారంభించాడు. పాండవులు తమ వెంట అగ్నిహోత్రాదులతో వస్తున్న వేలాది బ్రాహ్మణోత్తములను ఆగండని అభ్యర్థించారు. బాహ్య పరివారానికి సముచిత విధంగా వీడ్కోలు పలికారు. వా రొక యేకాంత ప్రదేశంలో నిలిచారు. ధౌమ్యుడు వారివెంట ఉన్నాడు. కురుజనపదానికి చుట్టుపట్లనున్న పాంచాల చేది మత్స్య, సాళ్వ, విదేహ, బాహ్లిక దశార్ణ, శూరసేన, కళింగ, మగధ దేశాలలో నివాస యోగ్యమైనదానిగా మత్స్య దేశాన్ని ఎన్నికచేశారు. మత్స్యనరపతి సుజనహితుడు. ధర్మవర్తి కావటంచేత అతని కొలువులో మారువేషాలలో చేరి అజ్ఞాతవాస వ్రతాన్ని నిర్వహించాలని నిశ్చయించారు.

## పాండవుల అజ్ఞాత వాస జీవితం

ధర్మజుడు సన్యాసి వేషంలో కంకుడనే పేరుతో రాజునకు చెలికాడై విద్యాగోష్ఠులతో, పుణ్యకథా సల్లాపాలతో, అనువైనప్పుడు అక్షక్రీడతో గౌరవప్రదంగా గడపాలని నిర్ణయించుకొన్నాడు.

భీమసేనుడు వంటలవాడై, వలలుడనే పేరుతో రుచికరాలైన వివిధ వంటకాలను ప్రభువుకు వండి వడ్డించటానికీ, రాజుకోరితే మల్లురతో కాని కరిసింహవ్యాఘ్రాదులతో గాని పోరి వినోదాన్ని కలిగించటానికీ పూనుకొన్నాడు.

అర్జునుడు బృహన్నలాఖ్యుడైన పేడియై అంతః పురకన్యలకు వివిధ నాట్యవిశేషాలను నేర్పటానికి చేరదలుచుకొన్నాడు. ఊర్వశి యిచ్చిన శాపం, ఇంద్రుని వరం పార్థునికి అజ్ఞాతవాసంలో అనువైన సాధనాలుగా పనికి వచ్చాయి.

నకులుడు దామగ్రంథిగా అశ్వశాలలో ప్రవేశించి అశ్వశిక్షణ చాతుర్యాన్ని ప్రదర్శించటానికీ, సహదేవుడు తంత్రీపాలుడుగా గోరక్షణ నైపుణ్యాన్ని వెలార్చటానికీ నిశ్చయించుకొన్నారు. ద్రౌపది సైరంధ్రిగా సుదేష్ణారాణి కొలువులో చేరి మాలిని అనే పేరుతో మలినమైన పనుల జోలికిపోక గౌరవప్రదంగా అంతఃపురంలో అజ్ఞాతవాసం గడపటానికి నిర్ణయించుకొన్నది. ధౌమ్యుడు శాంతి రక్షామంత్రాలు చదివి వారిని సాగనంపి తానొక ఆశ్రమంలో ఆగిపోయాడు.

పాండవులు భార్యా సమేతులై అడవి దారులలో నడిచి మత్స్యనగరాన్ని సమీపించారు. ఊరి వెలుపల నున్న శ్మశానంలో భయంకరంగా పెరిగి ఉన్న శమీవృక్షానికి తమ ఆయుధాలను శవాకారంలో మూటగట్టి వేలగట్టారు. తాము నదిలో స్నానం చేశారు. అజ్ఞాత వాసంలో ఎవరూ వారిని కనుగొనకుండా వరమిచ్చిన ధర్మదేవతను ప్రార్థించారు. వారు సంకల్పించిన రూపాలు, వేషాలు అత్యంత సహజంగా అమరాయి. అదృష్ట వశాత్తు విరాటరాజు ఆనాడు నగరం వెడలివచ్చి బయలికొలువు ఇస్తూ ఉండటం చేత అవలీలగా అతని కొలువులో చేరిపోయారు. ద్రౌపది సైరంధ్రిగా కుదిరిపోయింది. తమ తమ కొలువులలో నైపుణ్యాన్ని ప్రకటించి అందరి మన్ననలనూ పొందగలిగారు. వారిలో వారు రహస్య నామాలతో పిలుచుకొంటూ వీలైనప్పుడెల్లా కళ్లారా చూచుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు.

ఒకసారి విరటుని కొలువులో మల్లుర సమావేశమయింది. ఆ సమయంలో ఎక్కడినుంచో ఒక భయంకరకాయుడైన మల్లుడు వచ్చి తనను గెలిచే వారెవరైనా మత్స్యనాధుని సభలో ఉన్నారా అని గద్దించాడు. అక్కడ గుమికూడిన మల్ల యుద్ధ నిపుణులందరూ అతని భీకరాకారం చూచి నీరుగారిపోయారు. దేశం పరువు గంగపాలై పోయేటట్లుంది. విరాటుడు విచార పడ్డాడు. అప్పుడు కంకుభట్టు వలలుణ్ణి గురించి చెప్పి అతణ్ణి పిలిపించుమన్నాడు. విరటుడు వలలుణ్ణి పిలిచి ఆ మల్లుణ్ణి ఎదుర్కొనుమని ఆజ్ఞాపించాడు.

భీముని కానాడు పండుగగా తోచింది. వివిధ మల్లయుద్ధక్రీడా నైపుణ్యాలతో ఆ మల్లుణ్ణి చాలాసేపు మూడు చెరువుల నీళ్ళు త్రాగించాడు. చివరకు కాళ్ళుచేతులు పట్టి గిరగిర తిప్పి నేలపై కొట్టి నెత్తురు కక్కేటట్లు చరచాడు. ఆ మల్లుడు భయంకరంగా అరుస్తూ ప్రాణాలు వదిలాడు. విరటుడు మెచ్చి వలులునికి కానుకలిచ్చాడు. వాటిని బీదప్రజలకు పంచుకుంటూ వలలుడు మత్తగజంలా వంటశాలవైపు నడిచిపోయాడు.

వలలుని మల్లయుద్ధమంటే విరటుని కొక వినోదమయింది. అతని చేత పోరించుకొని చూడటం మత్స్యరాజు కొక ప్రీతి అయింది. అలా కొన్ని రోజులు తక్కువగా సంవత్సరం

పూర్తికావస్తున్నది. ఒకనాడు -

## కీచకోదంతం

మత్స్యరాజు బావమరది, ఆదేశానికి దండనాధుడు, నూరుగురు కీచకులకు పెద్దన్న, రూపాభిమాని, నానాభరణశీలుడు, దుర్విదగ్ధుడు, బలగర్వితుడు అయిన సింహబలుడు - అక్కగారైన సుధేష్ణకు మ్రొక్కటానికి వచ్చి ప్రక్కనే ఉన్న అపూర్వ లావణ్యమూర్తిని సైరంధ్రిని చూచాడు. మొదటి చూపులోనే మదనాస్త్రానికి దాసుడైనాడు. ఆమెపై నుండి చూపును ప్రక్కకు త్రిప్పుకోలేక పోయాడు. అంతవర కాతడు అంతటి అందగత్తెను చూడలేదు. అందుకు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. త్రిమూర్తులకు కూడా పొందజాలనంత అందాన్ని సహజంగా పొందగల ఆ సుందరాంగి ఎవరో తెలుసుకోవాలని అతని మనసు ఉరకలు వేసింది. తమకంతో తలపులు తల్లడిల్లి పోసాగాయి; అతనికి తెలియకుండానే అతడు మన్మథ వికార చేష్టలు పలురకాలుగా ప్రకటించడం ప్రారంభించాడు.

సైరంధ్రి వైపు సూటిగా చూపులో చూపుపెట్టి చూచాడు; ఆమెకు కోపం వచ్చి మొగమంతా చెమట పోసింది. అనుచితమైన పనులు ఆచరించటానికి ఆరంభించాడు. ఆమె నివ్వెరపోయింది. ఆమెను కళ్లతో మ్రింగేటట్లు చూశాడు. ఆమె గజగజ వణికిపోయింది. ఆమెను సమీపింపబోయాడు. ఆమె తెల్లబోయింది. ఆమె భయపడిన సాత్త్విక భావాలు ప్రకటించినా ఆ దుర్విదగ్ధుడు అవన్నీ మారవికారాలుగా భావించి రాగసాగర నిర్మగ్నుడైనాడు. ఆమెను గురించిన వివరాలను అక్కగారి నడిగాడు.

కీచకుని చిత్తవృత్తి సుదేష్ణకు చికాకు కలిగించింది. మాటమార్చి చూచింది. అతని మనసు మారేటట్లు లేదు. అక్కగారితో మాట్లాడటం మాని సైరంధ్రితోనే సంభాషణ మొదలుపెట్టాడు. 'ఓ చంద్రవదనా! నీవంటి అందచందాలు ఈ లోకంలో మరెవ్వరికైనా ఉన్నాయా? నీవెవరి కూతురువు? నీ భర్త ఎవరు? నీ పేరేంటి?'' అని గ్రుచ్చిగ్రుచ్చి అడిగాడు. ఆమె మొగం తప్పించింది. ఆతడు విరహతప్తుడై ఆమె సౌందర్యాన్ని సంకీర్తనం చేయనారంభించాడు. ఆమెను పొందలేకపోతే తనకు ప్రాణాలు పోతాయనీ, ప్రాణం పోయిన తరువాత తనను మరలా పొందవచ్చునా?' అనీ ఆమెను అనునయించాడు. ఆతని స్థితని చూచి సైరంధ్రి తొందరపాటు లేకుండా నేర్పుతో వ్యవహరించడం మేలనుకొన్నది.

"అన్నా! నేనున్న స్థితిని, నా శరీరాన్నీ, నామాసిన చీరల్నీ చూస్తే ఏవగింపు కలగటంలేదూ? ఉత్తములు ఇటువంటి మదన వికారపు మాటలు మాట్లాడతారా? నీకూ అప్పచెల్లెళ్లున్నారుగదా! ఇలా వ్యవహరించటం ఉచితమా? పైపెచ్చు నేను పతివ్రతను. నన్ను

ఇలా అడుగవచ్చునా?" అని అతణ్ణి నిలవదీసి అడుగింది సైరంధ్రి.

అతడు వినిపించుకొనే స్థితిలో లేడు. ఆమె శరీరాంగాలను వర్ణిస్తూ 'పరసతీసంగమం వల్ల వచ్చే పాపానికైనా సిద్ధపడతాను గానీ నీతనూ సంగమాన్ని మాత్రం వదులుకోని, బ్రతుక లేను' - అని వెంటపడ్డాడు. ద్రౌపది అతణ్ణి నీచునిగా నిశ్చయించి బెదిరించి అదలించాలని యత్నించింది -

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథనవిద్యా పారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులు లేవు రిప్తు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముంగొనుట తథ్యం బెమ్మెయిన్ గీచకా"!

అని గద్దించింది సైరంధ్రి. కీచకుడు గంధర్వుల బలాన్ని లెక్కసేయకుండా మాట్లాడాడు. అందని మ్రాని పండ్లకోసం అర్రులు సాచి రావణాదులవలె చెడిపోవద్దని సైరంధ్రి హెందలించింది. అతడు మొగం చిన్నబుచ్చుకొని సుదేష్ణను సమీపించాడు. సైరంధ్రి వివరాలను చెప్పమని బలవంతపెట్టాడు.

సుధేష్ణ కీచకునికి నీతులు బోదించింది. అతణ్ణి వలచి వలపించే వనిత లెందరో ఉండగా, పరవనితను కోరటం ధర్మం కాదన్నది. 'లోకంలోని వనితలందరూ ఆమె కాలిగోటికి సరిరారనీ, ఆమెను ఏదోఒక ఉపాయంతో తనవద్దకు పంపకపోతే మన్మథతాపంతో మరణించటం తథ్య'మనీ కీచకుడన్నాడు. ఆమె మరలా నీతులు చెప్పబోయింది. అతడు వారించి ఆమెకు నమస్కరించి - 'ఇక ఈ వెడ మాటలు చాలు. ఆమెను నాతో కలిపే మాట లేవైనా ఉంటే చెప్పు. లేదా నాచావు నిజం. ఆ మీద నీతమ్ముణ్ణి స్మరించుకుంటూ ఉందువుకాని" - అని లేచి వెళ్లబోయాడు. సుదేష్ణ మనసులో భయపడింది. చివరకు తమ్మునికి మాట ఇచ్చింది. ఒకరోజులో సైరంధ్రిని ఆసవంకోసం అతని నివాసానికి పంపుతాననీ, అప్పుడు అభిమతాన్ని తీర్చుకోమనీ సూచించింది. ఆ మాట విని కీచకుడు ఉప్పొంగిపోయి నిజ మందిరానికి పోయి వివిధ మధురసాలను సిద్ధం చేసుకొని విరహవేదన పడుతూ సైరంధ్రిరాకకోసం ఎదురు చూస్తూ ఉన్నాడు.

సుదేష్ణ ఆసవపిపాస అభినయించింది. సైరంధ్రిని పిలిచి రుచిగల ఆసవాన్ని కీచకుని యింటినుంచి తెచ్చిపెట్టుమన్నది. తన నా అనుచిత కార్యానికి నియోగించవద్దని సైరంధ్రి బ్రతిమిలాడుకున్నది. అందుకు సుదేష్ణ నిష్ఠురాలాడింది. సుదేష్ణ తమ్మునికి మేలు చేయాలని పన్నుగడ పన్నిందని స్పష్టమైంది. ఆసవ పాత్రను తీసికొని సైరంధ్రి కీచకునింటికి ఒంటిగా బయలుదేరింది. తనకు కలుగనున్న అపదను స్మరించుకొని మహాపదలకు

పరిహారమైన హరిస్మరణను మనసులో నిలుపుకొని, పుండరీకాక్షుని అంతః ప్రసన్నుని చేసుకొని ముందుకు సాగింది. ఆకసంలో ప్రకాశిస్తున్న సూర్యనారాయణున్ని చూచింది. 'తండ్రీ! నేను నిజంగా పాండవులను ఏకచిత్తంతో భావించేదానినైతే నాకెటువంటి కీడూ కలగకుండా రక్షించే భారం నీదే!' అని నమస్కరించింది. సూర్యనారాయణుడు వెంటనే ఆమెను రక్షించే నిమిత్తం ఒక రక్కసుని కల్పించి కనపడకుండా ఆమె వెంట రక్షకుడుగా ఉండేటట్లు కరుణించాడు. ఎట్టకేలకు మెల్లగా సైరంధ్రి పులిపొదలో లేడి ప్రవేశించినట్లు కీచకమందిరంలో అడుగుపెట్టింది.

కీచకు డామెను చూచి సంతోషంతో సంభ్రమంతో ఉక్కిరిబిక్కి రయిపోయాడు. ఆమె కెదురుపోతూ వింత విలాసాలు వెలార్చడం ఆరంభించాడు. ఆమె అతని వైఖరి గమనించి గంభీరంగా నించున్నది. "దేవి ఆసవపిపాసతో మదిర తెమ్మన్నది, ఇప్పించండి' ' అని ముక్తసరిగా పలికింది. కీచకుడు చనువుతో సమీపించి మొగంలో మొగంపెట్టి తమకంతో ఇలా అన్నాడు. "లీలావతీ! నీవు దేవి దప్పిక తీర్చాలని చూస్తున్నావే కాని, నా దప్పికను నీరసవత్తర సంభావనతో తీర్చాలని అనుకోవేంటి? ఇదేం న్యాయం చెప్పు? నీ పొందు నాకిచ్చి ఈ జన్మ సఫలం చెయ్. మన్మథుని బంటుగా న న్నేలుకో. ఈ సిగ్గుతెరలు మాని చెలిమికలిమిని పంచు" అని తొందరపెట్టాడు. "ఆలస్యమౌతున్నది. దేవి ఎదురుచూస్తూ ఉంటుంది. తడవైతే ఆమె కోపగిస్తుంది. తిరిగి వెళ్లాలి, త్వరగా మదిర నిప్పించండి"- అని నిబ్బరంగా పలుకింది సైరంధ్రి. దానికి కీచకుడు బాధపడుతూ "మదిర తీసికొని పోవటానికి మదవతు లెందరో ఉన్నారు. కాని, మదన సుధారసాన్ని అందించగలిగిన నీ అధరాన్ని నేను కోరుతున్నాను. నా సైన్య సంపదను, పరిచారికా సహస్రాన్ని, నీకర్పిస్తాను. నాకులకాంతలచేత నీకు సేవలు చేయిస్తాను. నేను నీ కనుసన్నలలో మెసలుతాను. అని తమకంతో తనను తాను నిగ్రహించుకోలేక ఆమెపైబడి పట్టుకున్నాడు కీచకుడు.

సూర్యవరం చేత ఆమెను రక్షిస్తున్న అసురశక్తి ఆమెశరీరంలో చేరి కీచకుణ్ణి ఆవలకు తోసింది. వడిగా మందిరాన్ని వీడి సైరంధ్రి పరుగు వెట్టింది. కీచకుడు ఆమె వెంటపడ్డాడు. భయంతో ఎక్కడికి పోవాలనో తోచక ద్రౌపది విలవిలలాడింది. విరాటరాజు కొలువు తీర్చి ఉండటం తెలియ వచ్చింది. ఆ సభవైపు ఆమె పరుగులు తీసింది. జనులు చూస్తున్నారన్న లజ్జకూడా లేకుండా కీచకుడు ఆమెను తరుముకుంటూ వెళ్ళాడు. మదపుటేనుగు జంగమలతను పట్టుకున్నట్టు, పెద్ద గద్ద ఆడుపామును ఒడిసి పట్టినట్లు, రాక్షసుడు దేవకాంతను బలవంతాన పొదివినట్లు సింహబలుడు ఆమె తలపట్టి తిగిచి కూలపడద్రోశాడు. అప్పుడు పాంచాలీ రక్షకుడైన రాక్షసుడు కీచకుణ్ని నేలపై పొరలిపడేటట్లు గట్టిగా కొట్టాడు.

తనపాటు ఇతరులు చూడకుండా గబగబా లేచి కీచకుడు ఒడుపు తప్పిన మహాసర్పంలాగా నిట్టూర్పులు నిగుడిస్తూ నిజమందిరానికి తిరిగి వెళ్లిపోయాడు.

ఆ సమయంలో రాజుకొలువులో భీమసేనుడుండటంచేత ఈ దృశ్యాన్ని చూచాడు. సతికి జరిగిన ఆ అవమానాన్ని సహించలేక అగ్నిహోత్రుడుగా మండాడు. ప్రళయకాల రుద్రాకారంతో మేనుపెంచి కీచకుణ్ణి మట్టుపెట్టాలని తలపెట్టి, అతని ఆనతిమీరలేని మత్స్యపతిని కూడ మడయింపచేయాలని ప్రక్కనున్న మహావృక్షాన్ని పెకిలించటానికి చూపులు సారించాడు. భీముని అసమయ సాహసంవలన అజ్ఞాతవాసం భంగమౌతుందని కంకుభట్టుగా సభలో ఉన్న ధర్మరాజు నిపుణంగా, ఎవరూ బయటివారు తెలిసికోని విధంగా భీమయత్నాన్ని ఇలా వారించాడు.

"వలలుం డెక్కడఁజూచె నొండెడ నసేవ్యక్ష్మాజమ్ముల్ పుట్టవే
ఫలితం బై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్?"

ర్మరాజు మాటల్లోని నిగూఢార్థాన్ని తెలుసుకొని భీముడు శాంతించాడు.

సైరంధ్రిగా నున్న ద్రౌపది కీచకుడు లాగగా నేలపైబడి వేడి నిట్టూర్పులు నిగుడిస్తూ, కన్నులవెంట నీరు కారగా, దీనవదనంతో లేచి విరటుని కొల్వులోకి వచ్చింది. కోపాతిశయంతో సమయభంగం మాట మరిచి సాగ్రహంగా తనభర్తలకు తగిలి వచ్చేటట్లు మాట్లాడసాగింది. "మహావీరులు గంధర్వులైదుగురు నాకు భర్తలై ఉన్నా ఈవిధంగా ఒకడు నన్ను అవమానం చేస్తుంటే చూస్తూ మిన్నకుండటం ఆశ్చర్యం కాదా! ఇక ఎవరిభార్యలు ఈ రాజ్యంలో మర్యాదతో బ్రతుకగలుగుతారు? ఈ సభలో ధర్మభీతితో ఎవరైనా ఒక మాటైనా మాట్లాడారా? ఈ విధంగా కీచకుడు పతివ్రతనైన నన్ను యే ఆడవారినీ అవమానించని విధంగా అవమానిస్తూంటే చూచి కూర్చున్న మీలో కొందరికైనా దయ రాలేదా? ఇందుకు ఈ మత్స్య దేశానికి ప్రభువుగా నున్న ఈ రాజు ననాలి. కీచకుడు చేసిన అధర్మాన్ని చూచి దండించకుండా వదలిపెడతారా?" అని రోషంగా పలికింది. ఆ మాటలకు మారు పల్కలేక విరాటుడు సభనువీడి వెడలిపోయాడు. ప్రజ లామె దైన్యానికి సానుభూతి ప్రకటించారు.

ధర్మరాజుకు రోషం వచ్చింది. కాని నిగ్రహించుకొన్నాడు. నిర్వికారంగా సహజ స్వరంతో ద్రౌపదితో ఇలా అన్నాడు. "ఓ వనితా! నీ మాటలన్నీ రాజూ, సభవారూ విన్నారు. ఇంక పలుమాటలు పలుకకుండా సుదేష్ణ సదనానికి వెళ్లు. నీ పరాభవాన్ని చూచి నీ పతులైన

గంధర్వులు కోపింపకుంటారా? ఇది సమయంకాదు. నీకైనా, వారికైనా ఇప్పుడేమైనా వారు కోపాన్ని ప్రకటించరు. కాబట్టి నీ పతులను నిందింపబోకు. సభలలో ఇంతసేపు శంకలేకుండ అప్రకటంగా నిలిచి ధిక్కరించటం సమంజసం కాదు."- అని ధర్మరాజు హెచ్చరించినా సైరంధ్రి అక్కడి నుండి కదల లేదు. అప్పుడు ధర్మరాజు మరలా ఇలా మందలించాడు: "నీవు కులసతి గౌరవం కించపడేటట్లు ఇలా సభలో పలుపోకలతో విచ్చలవిడిగా నాట్యం చేస్తున్న విధంగా మెలగటం తగునా"? అన్నాడు. ఆ మాటకు పాంచాలి సాభిప్రాయంగా సమాధానం చెప్పింది. - "కంకభట్టు! నాభర్త నటుడు. ఆమాట నిజం. పెద్దవారిలాగానే చిన్నవారుకూడా! కాబట్టి నాపతిలాగానే నేనూ నటిని - కాబట్టి నాకు నాట్యం పరిచయమే. నాభర్త నటుడే కాదు జూదరి కూడా. ఇక జూదరి యాలికి మర్యాద ఎక్కడుంటుంది?" అని ఆర్తితో అక్కడినుండి వెళ్లిపోయింది సైరంధ్రి.

అంతఃపురానికి వెళ్లి జరిగిందంతా ఆ రాణికి చెప్పింది సైరంధ్రి. "దు:ఖించకు నేను కీచకుణ్ణి దండిస్తా"నని సుదేష్ణ ఓదార్చింది. ఆమె మాటలు లెక్కసేయకుండా సైరంధ్రి "నీకెందుకమ్మ అంతకష్టం. కాలాంతకులు నాపతు లున్నారు. వారే పగతీర్చు కుంటారులే" అని చెప్పింది. ఆ మాటలకు అంతఃపుర స్త్రీలందరు భయపడ్డారు. ఆ రాత్రి అందరు శయనించారు.

# కీచకవధ

ద్రౌపది తాను రహస్యంగా వంటశాలలో నిద్రిస్తున్న భీమునివద్దకు పోయింది. కరస్పర్శ చేస్తూ మెల్లగా పిలిచి లేపింది. భీమసేనుడు మేల్కొన్నాడు. ఇంత అర్ధరాత్రివేళ ఇక్కడికి ఎందుకొచ్చావని అడిగాడు. తెలిసికూడా నన్నడుగుతావేమిటని తన అవమానగాథ నంతా వివరించి చెప్పింది ద్రౌపది. "మీరందరూ మహాబలులు భర్తలుగా ఉన్నా ఆనాడు దుశ్శాసనుడు ఆ సభలో ఆవిధంగా అవమానం చేశాడు; ఆపైన సైంధవు డావిధంగా అనుచితంగా వ్యవహరించాడు. ఇప్పుడు ఈ విధంగా కీచకుడు నన్ను పరాభవించాడు." ఆ మాటలకు వాయుసుతుడు ఉద్రిక్తుడై "నన్ను ధర్మజుడు వారించకుండా ఉన్నట్లయితే కీచకుణ్ణీ మత్స్యపతినీ అక్కడే మట్టుపెట్టి ఉండేవాణ్ణి" అన్నాడు. "అయితే దానివలన అజ్ఞాతవాస సమయ భంగ మయ్యేది. మరలా అరణ్య అజ్ఞాతవాసాలు చేయవలసి వచ్చేది. ఆ విపత్తుకు మనమిద్దరమూ కారకులమయ్యేవారం. అందువలన ధర్మజుడు మనలను వారించాడు. ఆయన సత్యవ్రతనిష్ఠు"డని ద్రౌపది వివరించింది. భీముని మనసులో ధర్మజుని పై భక్తి కుదిరేటట్లు ధర్మరాజును కీర్తించింది.

"ఎవ్వనివాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడఁగు
ఎవ్వని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపుఁ గఱపు
నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద లీనుచుండు
నెవ్వని గుణలత లేడు వారాసుల
కడపటి కొండపైఁ గలయఁ బ్రాకు

నతడు భూరి ప్రతాప మహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధకారవైరి
వీరకోటీర మణిఘృణి వేష్టితాంఘ్రి
తలుఁడు గేవల మర్త్యుఁడె ధర్మసుతుడు."

ధర్మజుని నాయకత్వంలో ధైర్యాని వీడకుండా ధర్మాన్ని సాధించుమని భీముని ప్రోత్సహిస్తుంది. భీమ పరాక్రమాన్ని పలువిధాల ప్రశంసిస్తుంది. సమయ భంగం కాకుండా కీచకుణ్ణి చంపకపోతే తాను ఉరి వేసుకొని గాని, నీటమునిగికాని, విషంతినిగాని చనిపోతానని చెప్పింది.

భీముడు చిరునవ్వు నవ్వి ఇలా అంటాడు - "కమలాక్షీ! కీచకుణ్ని చంపటానికి నీవింతగా చెప్పాలా? నిన్ను పరాభవించినవాడు ఇప్పటికీ బ్రతికి ఉండటమే తప్పు. అయినా ఉపాయంతో చంపాలి. వాడు రేపుకూడ నిన్ను సమీపించవచ్చు. నీవు క్రమంగా ఒడబడినట్లు నటించి వానికి నర్తనశాలను సంకేతస్థలంగా పేర్కొని, ఒంటరిగా రమ్మని నిర్దేశించమంటాడు. సంకేత స్థలంలో ఆమెకు బదులు భీముడే చిమ్మచీకట్లో పరుండి ఉండాలనీ కీచకుడు సమీపించగానే భీముడు విజృంభించి చంపి ద్రౌపదికి చూపాలనీ నిశ్చయించుకుంటారు. ఆవిధంగా జరిగేటట్లు యత్నించుమని చెప్పి ద్రౌపదిని ఆమె వయనమందిరానికి పంపుతాడు.

తెల్లవారింది. సింహబలుడు ద్రౌపదిపైని మమకారంతో మరొకటి చూడలేక వినలేక సింగారం చేసికొని సుదేష్ణ మందిరానికి బయలుదేరి వెళ్లాడు. ఆ మందిరంలో ఆమెను దర్శించి, ఏకాంతంలో మనసు విప్పి మాట్లాడి, ఏవిధంగానైనా అంగీకరించేటట్లు చేసి, దగ్గరికకి తీసికొని, ఆ పైని వయ్యకు చేర్చి మన్మథ రాజ్య సాఫల్యాన్ని పొందాలని ఉవ్విళ్లూరుతూ ఉన్నాడు. దానికి అనుకూలంగా ద్రౌపదికూడా ఒంటరి పాటున కనపడింది. ఆమె యెదుట తన పరాక్రమాన్ని చెప్పుకొని విరాట నగరంలో తాను కోరిన వనిత వశముకా

తప్పదని ప్రగల్భాలాడాడు. ద్రౌపది కూడా భీముడు చెప్పిన పన్నాగాన్ని మనసులో ఉంచుకొని అతనివైపు మెత్తబడినట్లుచూచింది. మగువలు తమ భంగులు రహస్యంగా ఉండాలని కోరుకుంటారనీ, విచ్చలవిడిగా బాహాటంగా వలపులు వారికి నచ్చవనీ అంటుంది. ఆమె హృదయం కనిపెట్టి కీచకుడు ఆమె చెప్పినట్లే నడుచుకుంటానంటాడు. రాత్రివేళ నర్తనశాల రహస్య వర్తనానికి అనుకూలంగా ఉంటుందని సూచిస్తుంది సైరంధ్రి. కీచకుడు ఉబ్బితబ్బిబ్బై ఆరాత్రికే ఒటిగా నర్తనశాలకు వస్తానని చెప్పి వెళతాడు. ద్రౌపది భీముని కీ సంగతిని నిపుణంగా తెలియపరుస్తుంది. అతడారాత్రికి కీచకుని సంహరిస్తానని పరమోత్సాహంగా ప్రతిజ్ఞ చేశాడామెముందు.

చీకటి పడింది. నర్తనశాలలో గాడాంధకారం అలముకొని ఉన్నచోట ఉత్తర విశ్రాంతి తీసుకొనే లీలాపర్యంకం మీద భీముడు గుడ్డకప్పుకొని పండుకొని ఉన్నాడు. దానికి దగ్గరలోనే ద్రౌపది చాటుగా నిలువబడి ఉంది. కీచకుడు మన్మథోన్మాదంతో సింహముండే గుహాంతర్భాగానికి మాతంగం వచ్చినట్లుగా భీముని చేరవచ్చాడు. శయనం మీద సైరంధ్రి ఉన్నట్లు తోచింది. కీచకుడు గగుర్పాటుతో సరసభాషణం మొదలు పెట్టాడు. "వనితా! నీకిష్టమైన వస్తువులు కానుకలు తెచ్చాను. సంతోషంతో తీసికో! విచిత్రమేమిటంటే ఎప్పుడూ స్త్రీలే నాకు కానుకలు లంచంగా పెట్టి నన్ను పొదుతూ ఉంటారు. నా రూపాన్ని చూచినా, నా లావణ్యాన్ని గమనించినా, నా విలాసాన్ని భావించినా, నా వివేకాన్ని గుర్తించినా ఏవనిత కూడా నా పొందు విడువలేదు. ఇంతవరకు నేనే వనితల నేలుకునేవాణ్ణి; ఇప్పుడు నీవే నన్నేలుకోవాలి! ఆగౌరవం నీకొక్కతెకే దక్కుతున్నది."అని అన్నాడు కీచకుడు.

ద్రౌపదికి గూడా వినపడేటట్లు కీచకునితో పరిహాసాలు పలికాడు పవన పుత్రుడు. "నిన్ను నీవు పొగడుకోటానికి నీవంటివాడికే చెల్లింది. ఇకనాసంగతి నీకు తెలియదు. నావంటా ఆడుది ఎంత వెదకినా నీకెక్కడా కనపడదు. పొందటం మరీకష్టం. నా ఒడలికి నీ ఒడలు తాకితే చాలు అది ఎలా ఉంటుందో నీకే తెలిసి వస్తుంది. నన్ను ఏ అబలతో నైనా పోల్చదలుచుకుంటే నీవు తప్పుచేసినట్లే! నను మట్టి నీవు మరలా వనితల సంగతికి పోగలవా? నేనీ తనువును పొందిన ఫలాన్నీ, చిత్తభవ వికారాలన్నీ ఒక్కసారి చవిచూస్తావు - రా" అని వెంటనే లేచి రోషకఠినమైన హాసంతో విజృంభించి కీచకుని శిరస్సు వంచి బలంగా కొట్టబోయాడు భీముడు. కీచకుడు వెంటనే విదుల్చుకొని గంధర్వుడని భావించి భీముణ్ణి కాళ్లు చేతులు పట్టి నేలపై నెట్టాడు. ఇద్దరూ మదేభాలు లాగా పవనకుమారుడు విజృంభించి కీకుని పట్టాడు. ఇద్దరూ మదేభాలులాగా ద్వంద్వయుద్ధంగా సాగించారు. భీముడు గూఢమర్దన క్రియలతో కీచకుని చంపి, కాళ్లు చేతులు కడుపులోకి చొప్పించి ముద్ద చేసి భయంకరంగా

పడవేశాడు. ఆవికృతాకారాన్ని దౌపదికి చూపి - ఇదిగో నా మాట నిలుపుకొన్నాను! ఆ వికృతాకారాన్ని ద్రౌపదికి చూపి - ఇదిగో నా మాట నిలుపుకొన్నాను! నా భార్య పొందిన అవమానభారాన్ని మాన్పాను! నిజమా! ద్రౌపదీ! నీ చింత తొలగిందా! నా భుజబలం నీకు నచ్చిందా! నీకు శాంతి చిక్కిందా! ఈ దుర్మార్గుని గతి చూచావా! నిన్ను అవమానింపదలచుకొన్న ఎంతటివీరుని గతి అయినా ఇంతే! ఇది తెలిసి ఆనందించు" అని పలికాడు భీముడు భీముణ్ణి ఉత్తమ నాయకునిగా కీర్తించింది ద్రౌపది.

తెల్లవారుజామున ఉపకీచకులు కీచక శవాన్ని గమనించారు. ద్రౌపదియేదీని కారణమని భావించి ఆమెను తెచ్చి అతని శవానికి కట్టి శ్మశానానికి తీసికొని వెళ్లారు ఆసంగతి గమనించిన భీముడు ఉపకీచకులను సంహరించి, ద్రౌపదిని విడిపించి రహస్యంగా తన వంటశాలకు చేరాడు. ద్రౌపది సుధేష్ణ మందిరానికి చేరింది.

పాండవుల అజ్ఞాతవాసాన్ని భగ్నం చేయాలని దుర్యోదనుని దుర్మంత్రం. నలుదిక్కుల చారులను పంపాడు. వారు పాండవుల తెరగును గుర్తించలేక నిరాశతో తిరిగి వచ్చారు అయితే మత్స్య దేశంలో కీచకులనూ ఉపకీచకులను ఒక స్త్రీ కారణంగా నడురేయి గంధర్వులు అతి విచిత్రంగా, భయంకరంగా చంపారు. విరాటుడెంత యత్నించినా ఆ గంధర్వులు కనపడలేదట ! అని విన్నవించుకొన్నారు. దుర్యోదనుడు కర్ణ దుశ్శాసన శకునులతోనూ భీష్మాదులతోనూ చర్చలు జరిపాడు. దర్మరాజెక్కడ ఉంటే అక్కడ దేశ సుభిక్షంగా ఉంటుందనీ, గోదనం అధికంగా పెంపొందుతుందనీ, పాడి సమృద్ధిగా ఉంటుంద భీష్ముడు తెలియజెపుతాడు. అప్పటి దేశాలన్నింటిలో మత్స్యదేశం సుభిక్షంగానూ సమృద్ధంగానూ ఉన్నట్లు చారుల వలన గ్రహించారు. మరొక నిదర్శనం. గదాయుద్ధం సింహబలుడు భీమసేనుడు, శల్యుడు, బలరాముడు సమాన బలురు. గెలుపు నలుగురిలో ఏ ఒకరికి మాత్రమే కలుగుతుంది. ఊహించగా కీచక మర్దనుడు భీము కావచ్చునని నిశ్చయించారు. మత్స్య దేశంలో పాండవుల ఉనికిని దుర్యోధనాదు శంకించారు.

దుష్టచతుష్టయం ఒక పన్నాగం సిద్ధంచేసింది. మొదట విరటుని గోధనాన్ని అపహరించాలి. దానిని రక్షించటానికి మారువేషాల్లో ఉన్న పాండవులు బయటపడతారు పోరు చేస్తారు. వారిని గుర్తించి మరలా అరణ్య అజ్ఞాతవాసాలకు పంపాలి - అని వ్యూహా పన్నారు. మొదట సుశర్మ దక్షిణదిశగా విరాట నగరాన్ని ముట్టడించి గోవులను హరించాలి దానితో విరటుడు ససైన్యుడై ఆవైపు నడిచి యుద్ధాన్ని సాగిస్తాడు. వెనువెంటనే ఉత్తరదిశ కౌరవులు దాడిచేసి గోవులను హరించాలి. ఆ సమయంలో గోధనాన్ని, రాజును తమన

రక్షించుకొనటానికి పాండవులు బయటపడి యుద్ధానికి రాకమానరు. వ్రతభంగానికి పాల్పడకమానరని చిక్కని చక్కని రచన చేసికొని దుర్యోధనుడు గోగ్రహణ ద్వయ యాత్రలకు రణభేరి మ్రోగించాడు.

బహుళాష్టమినాడు సుశర్మ దక్షిణ గోగ్రహణం చేశాడు. సువర్మ సైనికులచే దెబ్బలుతిన్న గోపాలురు విరాటునికి గోగ్రహణ వృత్తాంతాన్ని విన్నవించుకొన్నారు. విరాటుడు సుశర్మ సాహసానికి కోపించి రాజధానిలో రణబేరి మ్రోగించి సైన్యాన్ని క్షణాలలో సమీకరించాడు. స్వయంగా తాను రథమెక్కి ఊరి వెలుపల సిద్ధమైనాడు. అతని వెంట అతని తమ్ముడు శతానీకుడు, అతని తమ్ముడు మదిరాశ్వుడు, అతని అనుజుడు సూర్యదత్తుడు రథాలతో సిద్ధమైనారు. మత్స్య భూపాలుని పెద్దకొడుకు శంఖుడు సైన్యాలనన్నింటినీ మోహరించి విభీష శంఖాన్ని పూరించాడు. అందరూ యుద్ధ యాత్రకు సిద్ధమయ్యారు.

అంతలో కంకుభట్టు విరాటునికొక మనవి చేసుకొన్నాడు. తాను, వలలుడు, దామగ్రంథి, తంత్రీపాలుడు కూడ అస్త్రాస్త్రప్రయోగాలు తెలిసినవారు కాబట్టి యుద్ధానికి రథాలపై తీసికొని పోవడముచితమని పేర్కొన్నాడు. ఆరాజు సంతోషించి వారందరికీ రథాలనిచ్చి తమతో కలుపుకొని యుద్ధ యాత్ర సాగించాడు.

విరాట సుశర్మల సైన్యాలు సంకులంగా సమరం చేశాయి. విరాట విజృంభణం సుశర్మకు భారమైంది. సుశర్మ విరాటుని మీద రథాలతో దొమ్మి యుద్ధంచేసి అతని తేరు విరుగగొట్టి బందీగా పట్టి తనరథంమీద పెట్టి సమరాన్ని సాగించాడు. దర్మరాజు దానిని గమనించి భీముని హెచ్చరించి తమకాశ్రయ మిచ్చిన విరాటుని విజయుని చేయమని ఆదేశించాడు. అయితే, భీముడు వృక్షాలను పెకలించి భీకర యుద్ధం చేసి తన ఉనికిని బయటపెట్టుకోకుండా నకుల సహదేవులు చక్రరక్షకులుగా గదాసి చక్ర కోదండాలతోనే పోరి విజయం సాధించాలని నిర్దేశించాడు. భీముడు ధర్మజాదులు చూస్తుండగానే సుశర్మ సైన్యాన్ని కార్చిచ్చులాగా చుట్టుముట్టి ఊచకోత కోశాడు. వేల రథాలను నేలమట్టం చేశాడు. ధర్మజుడు కూడా బాణాలతో సుశర్మ సైన్యాలను ధ్వంసం చేశాడు. విరటుడు తప్పించుకొని భూమిమీదకు దూకి గదతో యుద్ధాన్ని ఆరంభించాడు. సువర్మ రథాన్ని విరగగొట్టాడు. భీముడు సువర్మ రథం మీదకు దూకి అతనిని పెడరెక్కలు విరిచి కట్టి బంధించాడు. అతని సేనానులు భయంతో పారిపోయారు. లొంగిపోయారు. పాండవులు కారణంగా విరటునికి విజయం వరించింది.

విరటుడు ధర్మజునికి కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. "నీవు నా మానాన్ని

ప్రాణాన్ని కాపాడావు. దీనికి తగిన బహుమానాన్ని నేనేమివ్వగలను? నా సింహాసనాన్నే నీవు స్వీకరించు. ఈ శరీరము ఈ సంపద ఈ రెండూ నీ విచ్చినవే యిప్పుడు. కాబట్టి ఆరెంటినీ నీకే సమర్పిస్తాను. స్వీకరించి మత్స్యదేశాన్ని రక్షించు. నాచే సేవలు కొని నన్ను మన్నించు.' ' అని వేడుకొన్నాడు. దర్మజుడు వినయంగా - నేను మీ దేశంలో ఉన్నాను. మీ ప్రాపున ఉన్నాను. మిమ్మల్నీ, మీ దేశాన్నీ రక్షించటం నా ధర్మం. ఇందులో నన్ను ప్రత్యేకంగా పొగడవలసింది లేదని పేర్కొంటాడు. కంక. వలల. దామగ్రంధి. తంత్రీపాలుల యుద్ధనైపుణ్యాన్ని విరటుడు మెచ్చుకొంటాడు. ధర్మజుడు చేసిన సహాయానికి కోరిన కోర్కె తీర్చి ఋణ విముక్తుడనౌతానని విరటుడంటాడు. దానికి ధర్మరాజు సుశర్మను సపరివారంగా క్షమించి విడిచి పెట్టుమని కోరతాడు. విరటుడు సంతోషంగా అంగీకరించి దానిని అమలు చేస్తాడు.

గోధనం తిరిగి చేతికి లభించింది. విరటుడు విజయోగ్సవాన్ని నగరంలో రుపుకొనటానికి చారులచేత కబురు పంపాడు. విరాటనగరం విజయోత్సవ శృంగారాలతో కకళలాడుతోంది.

నవమినాడు ఉదయమే దుర్యోధనుడు భీష్మద్రోణకృపాదులైన వీరులందరు కలసిరాగా అపార సైన్యంతో ఉత్తరదిక్కున విరాటుని గోవులను ముట్టడించి మరలించి హస్తినవైపు తోలుకొని పోతున్నాడు. అవిపత్తును గవాధ్యక్షుడు రాజధానిలో అంత:పురంలో ఉన్న భూమింజయుని దర్శించి విన్నవించుకొన్నాడు. అపార కురు సైన్యాన్ని ఎదుర్కొని గోధనాన్ని రక్షించుకొని అభిమానాన్ని కాపాడు కొమ్మని కోరుతాడు. ఉత్తరుడు కౌరవులపై దాడి వెడలటానికి సిద్ధమౌతాడు. కాని. తగిన సారధి నగరంలో లేడని తెలుసుకొంటాడు. సారధి సమకూర్చుండని ఆజ్ఞాపిస్తాడు. తగిన సారధియే కనుక దొరికితే దుర్యోదన భీష్మకర్ణ కృప ద్రోణాశ్వత్థామాది వీరులనందరితో రణరంగంలో పార్థునిలాగా పోరి గోవులను అవలీలగా తిరిగి తెస్తానని ప్రకటించాడు.

ఆ మాటలు ద్రౌపది వింటుంది. అప్పుడేర్పడిన క్లిష్ట పరిస్థితిని పేడి రూపంలో ఉన్న అర్జునునికి చెపుతుంది. అజ్ఞాతవాసకాలం ఆరోజుతో ముగుస్తున్నదని గమనించిన పార్థుడు తన సారథ్యానికి ఉత్తరుడు ఒప్పుకొనేటట్లు చేయుమని ద్రౌపదిని కోరతాడు. ఆమె బృహన్నల రథచోదన శక్తిని గురించి ఉత్తరకు చెప్పి, ఆమె అన్న అయిన ఉత్తర కుమారునికి నివేదించుమంటుంది. పూర్వం ఖాండవ దహన సమయంలో బృహన్నల అర్జునుని రథసారధిగా ఉండి విజయాన్ని సాధించటానికి తోడ్పడ్డాడని ఉత్తర ఉత్తర కుమారునికి చెపుతుంది.

భీష్మాదులతో యుద్ధం చేయబోతూ పేడివాణ్ణి సారధిగా పెట్టుకంటే అపహాస్యాల పాలౌతానని ఉత్తరుడు మొదట ఒప్పుకోడు. కాని, ద్రౌపది కూడా బృహన్నల నేర్పును చెప్పి ఒప్పించటంతో అంగీకరిస్తాడు. ఉత్తర బృహన్నలను రథసారధిగా ఉండటానికి కోరుతుంది. ఉత్తరుడు కూడా అతనిని ఆహ్వానిస్తాడు. అర్జునునికి లాగా తనకూ విజయాన్ని కలిగించుమని కోరతాడు. బృహన్నల రథాన్ని ఆయత్తం చేస్తాడు. ఉత్తర తనకు కురువీరుల తలపాగాలను బొమ్మ పొత్తిళ్ళుగా తెచ్చి పెట్టుమని బృహన్నలను కోరుకుంటుంది. అందుకు బృహన్నల అంగీకరిస్తాడు. ఉత్తరుడు రథమెక్కుతాడు ఉత్తర దిశగా రథాన్ని పోనిస్తాడు.

నగరం వెలువడుతుంది రథం. గోవులను తరలించుకొని వెళుతున్న కౌరవ సైన్యం వలన రేగిన ధూళి ఆకాశాన్నంతా జేవురురంగుతో ఆవరించుకొని ఉంది. ఎట్టఎదుట కౌరవసేన భీషణంగా నిలువబడి ఉంది. ఉత్తరుడాసేనను చూచి నిలువెల్లా కంపించి పోయాడు. తడబడుతూ ఇలా అన్నాడు -

"భీష్మద్రోణ కృపాది ధన్వి నికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిది యేఁ జేరంగశక్తుండనే"

ఆ మహావీరుల ముందు నేనెంత. నా బలమెంత. కౌరవ బలమింతుంటుందని తెలియ యుద్ధానికి వచ్చాను. ఎదుర్కొనే ధైర్యం నాకు లేదు" అని గడగడ వణుకుతూ రథాన్ని వెనక్కు తిప్పుమన్నాడు ఉత్తరకుమారుడు.

బృహన్నల అతనికి నగరంలో చేసిన ప్రతిజ్ఞలను జ్ఞాపకం చేశాడు. విజయం దేవుడెరుగు; పనులమాట దయ్యే మెరుగు; పడుతుల సంతోషం ముఖ్యం కాదు. వీరితో నేను యుద్ధంచేయలేనని నీరుకారిపోయి మాట్లాడాడు. బృహన్నల ఉత్తరకుమారునికి ఉత్తమ వీరుని విజృంభించి కురు వీరుల మీద విజయాన్ని సాధించటం కార్యం కాని, వెనుదిరిగి పోవటం కాదని నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తాడు. ఒంటిరిగా యుద్ధం చేయలేనని ఉత్తరుడు వెనకాడతాడు. ధైర్యం తెచ్చుకొని కౌరవసైన్యాన్ని ముట్టడించి గోవర్గాన్ని కొని పోవాలికాని ఈ భయమెందుకు. సైరంధ్రి నన్ను గురించి చెప్పిన తరువాత సారధిగా ఎన్నుకొన్నావు. నేను నొగలెక్కిన తరువాత మడమ తిప్పటమనే మాట ఉండకూడదని రథాన్ని విప్పచ్చుడు ముందుకు పోనిచ్చాడు.

ఉత్తరుడు భయకంపితుడౌతాడు. పారిపోతే పౌరులు నవ్వుతారని ప్రాణాలు

'మృతసంజీవని' సాధించినవారు దానవులు; అమృతాన్ని త్రాగినవారు దేవతలు మానవుడు ఆ రెండింటి కంటె విలక్షణమైన ధర్మసాధననే అమృతత్వసాధనగా పండించుకొన్న దార్శనికుడు. మానవుని శరీరం నశ్వరమని అతనికి తెలుసు. అయినా, బొందితో స్వర్గాన్ని సాధించిన ఘట్టా లున్నాయి. అలా సాధించిన వారిలో మహాభారత నాయకుడు ధర్మరాజు ప్రసిద్ధుడు. అతడు స్వర్గం కంటె ధర్మసాధనకు అగ్రతాంబూల మిచ్చాడు. ధర్మమే మానవునిలో అమృతత్వం. దాని సాధనమే మానవ జీవిత పరమార్థం.

ధర్మరాజు ధర్మ వీరుడు, కర్మవీరుడు. అతని భక్తిజ్ఞానాలు కర్మకు దోహదాలుగా నిలిచాయి. కర్మమార్గమే మానవుణ్ణి అమృతునిగా చేస్తుందని నిరూపించే ఇతిహాసం మహాభారతం. కర్మభూమిగా ప్రసిద్ధిచెందిన భరతఖండంలో ప్రతి మానవుడూ అనుసరించదగిన ఆదర్శ జీవిత పథాన్ని చూపించే మహేతిహాసం ఆంధ్రమహాభారతం. ఈ అంశాన్ని అయిదు అధ్యాయాలలో చెప్పటానికి చేసిన ఒక చిన్న ప్రయత్న మిది.

నా మిత్రులలో కర్మయోగిలా నా హృదయాన్ని ఆకట్టుకున్న వారు - లామ్‌కో గ్రూప్ పతులు మాన్యశ్రీ సారిపల్లి కొండలరావుగారు. మానవునిలో మౌలికమైన విలువలను వించి వాటిని ఆదరించి ఆచరించే కార్యవాది శ్రీ కొండలరావుగారు ధర్మ పురుషార్థ ధకులు. ఆర్థిక సంపదకు మూలమైన ఉత్పత్తిని పెంపుచేసి దేశాన్ని సుసంపన్నం చేయటమే కుండా, ఆ సంపదలో కొంతభాగం ధార్మిక సాంస్కృతిక కార్యక్రమాలకు పారిశ్రామిక వేత్తలు నియోగించాలని ప్రబోధించే శ్రీ కొండలరావుగారు ఆధునిక అర్థపురుషార్థ సాధకులు. మానవుని కామనలు నియతం కావాలనీ, ఆధ్యాత్మిక చింతతో అవి పునీతం కావాలనీ, పరిపూర్ణం కావాలనీ భావించటమే కాకుండా బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయలయ మానవ మూల్యాలను మనసులో నింపుకున్న ధర్మార్థ కామ పురుషార్థ సాధకులు శ్రీకొండల రావు గారు. ప్రవృత్తిలో ఎంత గాఢంగా నిమగ్నులై ఉన్నా అంతరంగాన్ని నివృత్తిలో నిశ్చలంగా నిలుపుకొని ఆత్మహంస చేసే క్రేంకారంలాగా 'ఓంశాంతి' అని అనుభవ పూర్వకంగా అనగలిగిన మోక్ష పురుషార్థ సాధకులు శ్రీ కొండలరావుగారు. అందువల్లనే ఈ గ్రంథం వారి కంకితం చేశాను. వారు దయతో అంగీకరించినందుకు నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇది నా షష్టిపూర్తి ముద్రణ కావటం నా అదృష్టం. ముఖచిత్రం అందించిన సాహితీ శిల్పి శ్రీశీలా వీర్రాజు గారికి, గ్రంథ శుద్ధ ప్రతిని తయారు చేయటంలో సహాయపడిన చిరంజీవులు ఎన్. మృదులకు, జె. భారతికి ఆశీస్సులు. అక్షర శిల్పులు శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ వారికి, ముద్రణ శిల్పులు విప్లా ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

హైదరాబాదు,

24-9-1996

- జి.వి. సుబ్రహ్మణ్యం

పోగొట్టుకొంటావా? నన్నుఆపబోకు; నీ కంతక్రొవ్వు అరగకపోతే యుద్ధంచేయి అని బాణాల విల్లంబులూ రథమీద పడవేసి నేలమీదకు దూకి సిగ్గువదలి పురంవైపు పరుగు తీయుట ప్రారంభించాడు. బృహన్నల గుర్రాలను ఆపి, నొగలు దూకి ఉత్తరుని పట్టి తీసుకొ రావటానికి అతని వెంట పరుగెత్తసాగాడు.

బృహన్నల ఆకారాన్ని గమనాన్ని గమనించి కౌరవులు అనుమానంలో పడ్డార రూపం పౌరుషం : తీరుస్త్రైణం. బాహువుల వైనం నడిచే వైఖరి అర్జునునిది. బహుశ: పార్థు అజ్ఞాతవాసంలో ఈ వేషంలో ఇక్కడ ఉన్నాడేమో! దక్షిణ గోగ్రహణానికి సారథులందరు పోగ మిగిలిన ఇతణ్ణి పట్టుకొని ఉత్తరుడు తెచ్చాడేమో. కౌరవ సైన్య బలాబలాలు తెలియ ఐదట రథమెక్కి వచ్చినా రాజకుమారుడు భయపడి తిరిగిపోతున్నాడేమోనని పరి పరివిధా 'వించటం మొదలు పెట్టారు కౌరవ వీరులు.

మదకరి గమనంతో అర్జునుడు సాగి ఉత్తరుణ్ణి నిలువరిస్తాడు. ఉత్తరుడు వెలవల బోయాడు. నోట తడియారి తల్లడిల్లాడు; శరీరమంతా చెమటలు కారిపోయాయి; కాళ్ళూ చేతులూ గజగజవణికిపోతాయి. గుండె దడదడ కొట్టుకొంది. దీనదృష్టులతో కంపించే గొంతుతో తనను వదలి పెట్టుమని బృహన్నలతో వేడుకొన్నాడు. వదలితే విలువైన కానుకలిస్తానన్నాడు. తనకోసం ఆతురతతో ఎదురు చూచే అమ్మ దగ్గరకు తొందరగా వెళ్లాలన్నాడు. ఇలా ఎన్నో రకాలుగా దీనాలాపాలను చేస్తున్న ఉత్తరునికి అర్జునుడు ధైర్యం చెప్పి, కురువీరులతో యుద్ధం తానే చేస్తాననీ ఉత్తరుణ్ణి రథసారథ్యం చెయ్యమనీ కోరతాడు. అతడంగీకరించకపోయినా బలవంతాన నొగలు మీద కూర్చుండబెట్టి శమీవృక్షం వైపు రథాన్ని పోనిచ్చాడు.

పేడి రూపంలో ఉన్నాప్రతాప తేజునిగా నివురు గప్పిన నిప్పులా ఉన్న బృహన్నలను అర్జునునిగా అనుమానించారు భీష్మద్రోణులు. అజ్ఞాతవాసం గడువు పూర్తికాకుండా బయలు పడుతున్నాడేమిటని ద్రోణుడు భీష్ముణ్ణి అడుగుతాడు. భీష్ముడు కాలాన్ని లెక్కగట్టి గడువు ముగింసిందని ప్రతాప ప్రకటనకు సమయం ఆసన్నమైందనీ గూఢంగా హెచ్చరిస్తాడు. ఆచార్యుడు అర్జునునికి సమయ భంగం లేదని గ్రహించాడు -

"సింగం బొకటితో గుహాంతరమునం జేట్పాటు మై నుండి మా
తంగ స్ఫూర్జిత యూధ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీడె వ
చ్చెంగుంతీసుతమధ్యముండు సమర స్థేమాభిరామాకృతిన్"

అర్జునునితో సమానంగా పోరగలిగిన వీరులు మనలో ఉన్నారా అనేది అనుమానం. పరమేశ్వరుణ్ణి ప్రీతుణ్ణి చేసి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడని విన్నాం. అతనికి ఆవులను మరలించటం అవలీల!

ఆ మాటలు వని కర్ణుడు కటకట పడ్డాడు. పాండవ పక్షపాతంతో ఆచార్యుడు పార్థుని పొగడాడని ఈసడించుకొన్నాడు. అర్జునుడే కనుక వస్తే యుద్ధంలో బాణాలతో సమాధానం చెపుతానని బీరాలు పలికాడు. దుర్యోదనుడు అర్జునుణ్ణి గుర్తించి మరల పాండవులను అరణ్య అజ్ఞాతవాసాలకు పంపుదామని హెచ్చరించాడు. భీష్మద్రోణాశ్వత్థామలు వారి మాటలకు తమలో తాము నవ్వు కొని ఊరకున్నారు.

అర్జునుడు శమీవృక్షం దగ్గర రథం ఆపాడు. ఉత్తరుని ఆవృక్షం ఎక్కించి ఆయుధాల మూటలో నుండి గాండీవాన్నీ అక్షయతూణీరాలనూ తీయించాడు. తాను అర్జునుణ్ణని ఉత్తరునికి తెలియబలికాడు. అజ్ఞాతవ్రతకాలం పూర్తికావటంతో నిజ తేజోరూపాన్ని మరల పొందాడు. గాండీవధారియై రథమెక్కాడు.

ఉత్తరుడు బృహన్నలను అర్జునునిగా తెలుసుకొని పరమానందభరితుడయ్యాడు. తెలియక పలికిన పలుకులకు క్షమింపుమని వేడుకున్నాడు. అర్జునుడు ఉత్తరుణ్ణి వాత్సల్యంతో కౌగిలించుకొంటాడు. పార్థుని రథానికి సారథిగా ఉండాలని ఉత్తరుని మనసులో ఎప్పటినుంచో కోరికగా ఉండేది. అది ఆనాటికి తీరిందని సంతోషపడతాడు. అర్జునుడు రథారూఢుడై గాండీవాన్ని చేపట్టి గుణధ్వని చేశాడు. దేవదత్తాన్ని పూరించాడు. కపిధ్వజం రెపరెపలాడింది. కిరీటం సూర్యకాంతులను ప్రసరించింది. కౌరవవీరులు అర్జునుణ్ణి గుర్తించారు. ఇక యుద్ధం తప్పదనుకున్నారు.

అప్పుడు ద్రోణాచార్యుడు దుర్యోధనుణ్ణి పిలిచి 'ఇక పార్థుడు పరాక్రమాన్ని ప్రదర్శించబోతున్నాడు అందరూ ఇక యుద్ధానికే సిద్ధంకం'డని హెచ్చరించాడు. అజ్ఞాత వాసకాలం పూర్తికాకుండా పాండవులను గుర్తించి మరల అరణ్యాజ్ఞాతవాస కాలం పూర్తికాకుండా పాండవులను గుర్తించి మరల అరణ్యాజ్ఞాతవాసాలకు పంపాలనే గదా ఇంతయత్నం చేసింది. దీనికి విచారపడవలసిన పనిలేదు అని అన్నాడు. సుయోధనుడు. ద్రోణాచార్యులను అధిక్షేపించాడు. అర్జునుని పరాక్రమాన్ని ప్రశంసించిన కృపాచార్యుణ్ణి కర్ణుడు తూలనాడాడు. అశ్వత్థామ ఆగ్రహించాడు. దుర్యోధనుడు వారందరినీ సమాధానపరిచి భీష్మునివద్దకు వెళ్లి 'పాండవులకు అరణ్య అజ్ఞాతవాస కాలం పూర్తి అయిందా' అని తెలియచెప్పమన్నాడు. భీష్ముడు పూర్తి అయిందని నిష్కర్ష చేశాడు. గడువు పూర్తి అయిన తరువాత అడుగు

ముందుకు వేస్తున్న అర్జునుణ్ణి తక్కువ అంచనా వేయవద్దని హెచ్చరించాడు. ఇలా హితవు కూడా చెప్పాడు.

"వచ్చినవాడు ఫల్గునుఁడవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నై పెనంగిన బలంబులు రెండును గెల్వవచ్చునే
హెచ్చుగుఁ గుందగుందొడరు టెల్ల విధంబుల కోర్చుటట్లుగా
కిచ్చఁదలంచి యొక్క మెయి నిత్తఱిఁ బొందగు చేతయుందగున్"

ఈ మాటలకు సుయోధనుడు చిరునవ్వి నవ్వి "మనకూ పాండవులకూ పొత్తుకుదరదు. నేరు రాజ్యభాగమీయను. యుద్ధం చేసి పరాక్రమాన్ని ప్రదర్శించటమే నాయిష్టం" అని స్పష్టం చేశాడు.

భీష్మాదులు చిన్నబుచ్చుకున్నారు. కవ్వడి గాండీవ గుణధ్వని కౌరవవీరులను చ్చరిక చేసింది. అందరూ వ్యూహం పన్ని సమరానికి సన్నద్ధమయ్యారు.

అర్జునుడు ముందుగా గోవులను మళ్లించి, ఆ తరువాత వ్యూహంలో ఉన్న ౹రువీరులపై దాడి చేయాలని నిశ్చయించాడు. భీష్మద్రోణులకు నమస్కార బాణాలు, యోగక్షేమ బాణాలు పాదాల వద్ద చెవుల వద్ద పడేటట్లు వేసి వారి వాత్సల్యాన్నీ ప్రశంసలనూ పొరగొన్నాడు. ఆ తరువాత అర్జునుడు కౌరవ సైన్యం మీద విరుచుక పడ్డాడు. అందర్నీ క్తసిక్తం చేశాడు శరపరంపరలతో.

"శక్తి స్ఫార దనంజయాయత భుజాసంరంభ గాండీవని
ర్ముక్త క్రూర శరావళీ ద దళిత శత్రువ్రాతముల్ శోణి తా
సిక్తిఁ కొరతఁ బొంది సాంద్ర కుసుమశ్రేణీ విలాసోల్లస
ద్రక్తాశోక తరు వ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెం గడున్."

కౌరవ సైన్య వ్యూహంలో అర్జునుడు సూటిగా ప్రవేశించి సేనను రెండు పాయలుగా న్నాడు. ఆ మీద అడ్డంగా దాడి చేశాడు. నాలుగు మూలలా కలయతిరిగాడు. వివిద రకాల థచంక్రమణ విధానాలను ప్రదర్శించి పార్థుడు సైన్యాన్ని కలత పెట్టాడ. ఒక సముద్రంలో మహామత్స్యం విచ్చలవిడిగా విహరిస్తూ సంక్షోభాన్ని కలిగించినట్లయింది. అర్జునుని యుద్ధ రథయాత్ర.

అర్జునుడు మహావీరులపై సంధించాడు. ద్రోణాచార్యుణ్ణి 70 బాణాలతో కట్టాడు. అశ్వత్థామను 7 బానాలతో చరిచాడు; కృపాచార్యుని పదిబానాలతో బాదాడు; దుశ్శాసనుణ్ణి 15 బాణాలతో కొట్టాడు; వకునికి ఎనిమిది బానాలను రుచి చూపించాడు. భీష్ముని మీద 60

బాణాలను అనుసంధించాడు. కర్ణుని సారథిని గుఱ్ఱాలను చంపి, మర్మాంగాలు ఛేదించేటట్లు అతణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక కౌరవ వీరులు తల్లడిల్లారు. భీష్ముని అండన చేరి తలదాచుకొన్నారు. భీష్ముడు వారినందరిని పురికొలిపి యుద్ధాన్ని ముమ్మరం చేశాడు.

అర్జునుడు కర్ణుని ఢీకొనాలని యత్నించాడు. నడుమ చిత్రాంగదాది కురుకుమారులు చాలామంది కలిసి అడ్డుపడ్డారు. వారిలో కొందరిని పార్థుడు ఓడించాడు; కొదరిని చంపాడు. కర్ణుని తమ్ముడు సంగ్రామజిత్తు విన్వచ్చుని మీదకు వచ్చాడు. కాని అతని చేతిలో చచ్చాడు. తమ్ముని చావు చూచి కోపించి కర్ణుడు అర్జునునిపై విజృంభించాడు. పోరు ఘోరంగా సాగింది. నరుని రథ తురగాలను నాలుగు బాణాలతో కొట్టాడు కర్ణుడు. ఉత్తరుని ఆరు బాణాలతో, రథాన్ని ఎనిమిది బాణాలతో, టెక్కాన్ని పదిబానాలతో, అర్జునుని శరీరాన్ని అరవై బాణాలతో కొట్టాడు. అర్జునునికి రోషం పొంగింది. కర్ణుని శిరాన్ని లలాటాన్ని, కంఠాన్ని బాహువులను, వక్షస్థలాన్ని, బాణాలతో గుప్పించాడు. ఆధాటికి ఓర్వలేక కర్ణుడు రణరంగాన్ని వీడి వెళ్లిపోయాడు. అతన్ని చూచి నవ్వుతూ అర్జునుడిలా అన్నాడు - "వీడొకడు - కురుబలంలో నేనే మహావీరుణ్ణి అంటాడు. - వీడి పరాక్రమం ఇలా నీరుగారింది."

అర్జునుడు రథాన్ని ద్రోనాచార్యునివైపు మళ్లించమన్నాడు ఉత్తరుణ్ణి. ఎఱ్ఱని గుఱ్ఱాలు కట్టి రథంమీద వీరమూర్తిలా నిలుచున్న ద్రోణునికి సూటిగా రథం సాగింది. పార్థుడు గురువుకు నమస్కరించాడు. "చాలాకాలం అడవులలో ఉండి అగచాట్లు పడ్డాం. ఇప్పుడు యుద్ధం చేసే అవకాశం దొరికింది. మాయందు దయచూపండి అని ప్రార్థించాడు. ముందుమీరు బాణం వేస్తే కాని నేను వేయను' అని అర్జునుడనగానే ద్రోణుడు ఇరవై వాడి బాణాలు కిరీటిపై సంధించాడు. వాటి నతడు మధ్యలోనే విరుగకొట్టాడు. ఇరువురూ మత్తేభాలులాగా ఢీకొన్నారు. ఇంద్రాగ్ని వాయు వరుణాది దేవతాకాలైన బాణాలొకరిపై మరొకరు వేసుకొన్నారు. విరుగుడు అస్త్రాలను ప్రయోగించుకొన్నారు. యుద్ధభూమంతా చీకట్లు కమ్మినట్లయింది. భయంకర యుద్ధం ఇరువురి మధ్యసాగింది. 'అర్జునుని యుద్ధం ముందు గురుడు గాని, హరుడుగాని నిలువగలరు గాని మరొకరికి సాధ్యమౌతుందా?' అని దేవతలు మెచ్చుకొన్నారు. ద్రోణుని బాణాలవెల్లువలో పార్థుడు మునిచాడు. సైనికులు హాహాకారాలు చేశారు. అంతలో అశ్వత్థామ తన తండ్రికి తోడువచ్చి అర్జునునిపై బాణాలు గుప్పించాడు. అతడు కూడా రెట్టించి గుప్పించాడు. ఇరువురి నడుమా మహేంద్ర వృత్రాసురుల యుద్ధంలాగా పోరు సాగింది. అశ్వత్థామ తూణీరాలు ఓటువోయాయి. అర్జునుని అక్షయ తూణీరాలు పెంపుగాంచాయి.

అవ్వత్థామను వదలి అర్జునుడు కృపాచార్యుని ఢీకొన్నాడు. ఇరువురికీ సంకులంగా

సమరం జరిగింది. పార్థుడు పంతంతో కృపాచార్యుని రథం విరుగగొట్టాడు. అతడు అశ్వత్థామ రథమెక్కిపోయాడు. అడ్డంవచ్చిన సైన్యాన్ని నురుమాడుతూ విజయుడు భీష్ముని వైపు రథం పోనిచ్చాడు. మదించిన ఆబోతుల్లాగా అంకెలు వేసుకుంటూ తాతా మనవళ్ళు శరయుద్ధంలో కలియబడ్డారు. పితామహుడు వివిధాస్త్ర ప్రయోగాలు చేస్తే వానిని విచ్చుడు విఫలం చేశాడు. పైపెచ్చు భీష్ముని విల్లును రెండుసార్లు విరుగగొట్టాడు. రెండవసారి మరో విల్లందుకొనేలోగా అతని వక్షంలో బాణాలు నాటాడు. వాటికి భీష్ముడు ఒరిగి పడబోయి రథకంబాన్ని ఆలంబనంగా చేసుకొని నిలబడ్డాడు. ఆస్థితిలో సారథి భీష్ముని రథాన్ని ప్రక్కకు తీసుకొని పోయాడు. అర్జునుడు గాండీవ గుణాన్ని మ్రోగించుకొంటూ భుజబలంమీద రథంమీద నిరాఘాలంగా పోతుంటా ఆచార్య కర్ణ కృపాచార్యాది ప్రభృతులందరూ కళ్లప్పగించి చూస్తూ నించుండిపోయారు.

విజయుడు క్రమంగా తమ్ములు ఆప్త భృత్యులు పరివేష్టించి ఉండగా మధ్యలో నిలిచి ఉన్న చోటుకు రథాన్ని పోనిచ్చాడు. ముందుగా రెండు బాణాలు వక్షస్థలంమీద కొట్టాడు. దుర్యోధనుడు బొమలు ముడిచి వాడి బానాన్ని పార్థుని నొసలిపై నాటాడు. ఇంతలో వికర్ణుడు ఒక భద్రగజంమీద ఎక్కి అర్జునునికి అడ్డం వచ్చాడు. క్రుద్ధుడై అర్జునుడు ఒక్కబాణంతో ఏనుగును కూలగొట్టాడు. వికర్ణుడు వెల్లకిలబడి లేచి పరుగెత్తాడు. దుర్యోధనుని శరపరంపరతో ముంచెత్తుతున్నాడు. విచ్చుడు. రారాజు వెనుకంజ వేస్తున్నాడు. రాజును రక్షించుకొనటం వీరుల బాధ్యతగా గుర్తించండని ఎలుగెత్తి చాటుతున్నాడు కర్ణుడు. ద్రోణాదులతని మాటలు పట్టించుకొనే స్థితిలో లేరు. అర్జునుడు దుర్యోదనుని సంబోధించి ఇలా ఎకసెక్కాలు ఆడటం మొదలు పెట్టాడు. "ఓ కౌరవరాజా! వీరక్షత్రియుడు యుద్ధంలో ఓడి ఇలా పారిపోతాడా! నేనా చిన్నవాణ్ణి! అభిమానివిగా, బలదర్ప సమగ్రుడివిగా పేరొందిన నీవు మిత్రులతో సమా ఇలా పలాయనం చిత్తగిస్తే బలవంతులు మెచ్చుతారా? ఇరుగడలా పెక్కేనుగులు కదలి వస్తూంటే రేపు పురవీథులలో నీవు భద్రగజం మీద ఊరేగవద్దా? భూషణాలంకారాలతో, కస్తూరి చందనాదులతో రేపు నిండు సభలో గండుమీరవద్దా? మనోహర చతురాంగనలతో నీవు ముదన లీలలలో తేలియాడవద్దా? ఇలా యుద్ధంలో ఓడి తిరిగిపోయిన దానికన్నా తనువు చాలించటం మంచిది. ఇది రణరంగం. జూదమాడే నేర్పు ఇక్కడ సాగదు సుమా! నీవంటివాడు వెనుదిరిగి పరుగెత్తటమా! నిలు నిలు'మని విజయుడు రారాజును ములుకుల వంటి మాటలతో ఎత్తిపొడిచాడు.

ఆ మాటలకు అభిమానపడి సుయోధనుడు వెనుదిరిగి యుద్ధం చేయ నారంభించాడు. భీష్మాదులు కూడా ఆయనకు సాయంగా నిలిచారు. పోరు సంకులంగా

సాగింది. పార్థుడు ఉత్తర మాటలు తలచి సమ్మోహనాస్త్రాన్ని సంధించాడు. వీరులందరు మూర్ఛలో మునిగిపోయారు. అప్పుడు ఉత్తరుణ్ణి దుర్యోధనాదుల తలపాగాలను తెచ్చి భద్రపరుచుమని, ఉత్తరకుమారి బొమ్మపొత్తికలుగా బహుకరించవచ్చునని నిర్దేశించాడు. భీష్మునిజోలికి వెళ్లవద్దన్నాడు. ఉత్తరుడు తలపాగలు తెచ్చి రథంమీద పెట్టాడు. భీష్ముడంతలో ఒడలు తెలిసి అర్జునునిపై బానాలు గుప్పాడు. పార్థుడు గూడ తాతను నొప్పించి దూరంగా రథాన్ని నడిపించి విరామ ప్రాంతంలో నిలిపాడు.

దుర్యోధనాదులు సమ్మోహనాస్త్ర భ్రాంతినుండి మేల్కొని యుద్ధానికి సిద్ధమౌతుండగా భీష్ముడు వారి తలపాగలు లేని విషయం తెలియజెప్పి ఒడలు తెలియనప్పుడు అర్జునుడు ప్రాణాలు తీయనందుకు అభినందించాలని నచ్చచెప్పాడు. కౌరవుల ప్రాణాలు అర్జునుని దయాభిక్షగా అభివర్ణించాడు. దుఃర్యోధనుడు చేసేది లేక సైన్యాన్ని హస్తినాపురం వైపు నడిపించమన్నాడు. విరటుని గోవులను వివచ్చునకు వదలిపెట్టి వెళ్లిపోయాడు. కిరీటి కొంతదూరం కౌరవసైన్నాన్ని తరిమి గాంగేయాదులకు నమస్కరించి మధ్యందిన మార్తాండబింబం లాగా దుర్నిరీక్ష్య తేజంతో వెలుగుతూ విజయశంఖాన్ని పూరించాడు.

కురుబలాలాను గెలిచింది ఉత్తరుడే అని నగరంలో చెప్పమన్నాడు అర్జునుడు. దానికి ఉత్తరుడు వినయంతో 'నేను విజయాన్ని సాధించి గోవులను మరలించానని చెప్పినా జనులు నమ్మవద్దా? అయినా అర్జునా నీవు చెప్పమన్నప్పుడే చెప్పమన్న విధంగానే రాజుకు నిజం చెప్పి ఒప్పిదాన్ని పాటిస్తా'నని మాటయిచ్చాడు. రథాన్ని శమీవృక్షం ధ్గరకు తీసికొని వెళ్లారు. గాండీవ తూణీరాలను యథాస్థలంలో ఉంచారు. విజయుడు బృహన్నల వేషాన్ని ధరించాడు. దివ్యాభరణాలను ప్రార్థించి అంతర్హితం చేయించాడు. తాను సారధిగా నొగలెక్కుతాడు, ఉత్తరుడు రధికుడుగా రథమెక్కుతాడు. గోపాలుర చేత విజయవార్త ముందుగా మత్స్యమహీపతికి తెలియ పంపుతాడు.

విరాటుడు విజయోత్సాహంతో దక్షిణ దిక్కునుండి నగరానికి చేరుకొని వేడుకలు చేసుకొంటాడు. ఉత్తరుడు నగరంలో కనపడకపోవటంతో అతని గురించి అడుగుతాడు. ఉత్తరగోగ్రహణ వృత్తాంతం, భీష్మాది మహావీరులతో యుద్ధంచేసి ఒంటిగా విజయాన్ని సాధించటానికి బృహన్నలను సారథిగా చేసికొని ఉత్తరుడు వెడలిన సంగతి తెలుసుకొంటాడు. కురు సైన్యాన్ని ఎదిరించే శక్తి ఉత్తరకుమారునికి లేదని అతడు రణరంగంలో ఏమయిపోతాడోనని భయవిహ్వాలుడైపోతాడు. బృహన్నల బాహుపరాక్రమంతో రాకుమారుడు విజయం సాధించగలడని కంకుభట్టు ధైర్యం చెపుతాడు. అంతలో ఉత్తరుని విజయవార్తలు గోపాలురు వచ్చి నివేదిస్తారు. విరటుని ఆనందోత్సాహాలకు అవధులు లేకుండాపోయాయి.

సాగింది. పార్థుడు ఉత్తర మాటలు తలచి సమ్మోహనాస్త్రాన్ని సంధించాడు. వీరులందరు మూర్ఛలో మునిగిపోయారు. అప్పుడు ఉత్తరుణ్ణి దుర్యోధనాదుల తలపాగాలను తెచ్చి భద్రపరుచుమని, ఉత్తరకుమారి బొమ్మపొత్తికలుగా బహుకరించవచ్చునని నిర్దేశించాడు. భీష్మునిజోలికి వెళ్లవద్దన్నాడు. ఉత్తరుడు తలపాగలు తెచ్చి రథంమీద పెట్టాడు. భీష్ముడంతలో ఒడలు తెలిసి అర్జునునిపై బానాలు గుప్పాడు. పార్థుడు గూడ తాతను నొప్పించి దూరంగా రథాన్ని నడిపించి విరామ ప్రాంతంలో నిలిపాడు.

దుర్యోధనాదులు సమ్మోహనాస్త్ర భ్రాంతినుండి మేల్కొని యుద్ధానికి స్థిమౌతుండగా భీష్ముడు వారి తలపాగలు లేని విషయం తెలియజెప్పి ఒడలు తెలియనప్పుడు అర్జునుడు ప్రాణాలు తీయనందుకు అభినందించాలని నచ్చచెప్పాడు. కౌరవుల ప్రాణాలు అర్జునుని దయాభిక్షగా అభివర్ణించాడు. దుర్యోధనుడు చేసేది లేక సైన్యాన్ని హస్తినాపురం వైపు నడిపించమన్నాడు. విరటుని గోవులను విడచ్చునకు వదలిపెట్టి వెళ్లిపోయాడు. కిరీటి కొంతదూరం కౌరవసైన్యాన్ని తరిమి గాంగేయాదులకు నమస్కరించి మధ్యందిన మార్తాండబింబం లాగా దుర్నిరీక్ష్య తేజంతో వెలుగుతూ విజయశంఖాన్ని పూరించాడు.

కురుబలాలాను గెలిచింది ఉత్తరుడే అని నగరంలో చెప్పుమన్నాడు అర్జునుడు. దానికి ఉత్తరుడు వినయంతో 'నేను విజయాన్ని సాధించి గోవులను మరలించానని చెప్పినా జనులు నమ్మవద్దా? అయినా అర్జునా నీవు చెప్పమన్నప్పుడే చెప్పమన్న విధంగానే రాజుకు నిజం చెప్పి ఒప్పిదాన్ని పాటిస్తా'నని మాటయిచ్చాడు. రథాన్ని శమీవృక్షం ధ్గరకు తీసికొని వెళ్లారు. గాండీవ తూణీరాలను యథాస్థలంలో ఉంచారు. విజయుడు బృహన్నల వేషాన్ని ధరించాడు. దివ్యాభరణాలను ప్రార్థించి అంతర్హితం చేయించాడు. తాను సారథిగా నొగలెక్కుతాడు, ఉత్తరుడు రథికుడుగా రథమెక్కుతాడు. గోపాలుర చేత విజయవార్త ముందుగా మత్స్యమహీపతికి తెలియ పంపుతాడు.

విరాటుడు విజయోత్సాహంతో దక్షిణ దిక్కునుండి నగరానికి చేరుకొని వేడుకలు చేసుకొంటాడు. ఉత్తరుడు నగరంలో కనపడకపోవటంతో అతని గురించి అడుగుతాడు. ఉత్తరగోగ్రహణ వృత్తాంతం, భీష్మాది మహావీరులతో యుద్ధంచేసి ఒంటిగా విజయాన్ని సాధించటానికి బృహన్నలను సారథిగా చేసికొని ఉత్తరుడు వెడలిన సంగతి తెలుసుకొంటాడు. కురు సైన్యాన్ని ఎదిరించే శక్తి ఉత్తరకుమారునికి లేదని అతడు రణరంగంలో ఏమయిపోతాడోనని భయవిహ్వలుడైపోతాడు. బృహన్నల బాహుపరాక్రమంతో రాకుమారుడు విజయం సాధించగలడని కంకుభట్టు ధైర్యం చెపుతాడు. అంతలో ఉత్తరుని విజయవార్తలు గోపాలురు వచ్చి నివేదిస్తారు. విరటుని ఆనందోత్సాహాలకు అవధులు లేకుండాపోయాయి.

ఆ రాత్రి ద్రౌపదీ పండవులు రహస్యంగా సమావేశమై మరునాడు రాజసభలో బయలు మెరయటానికి నిర్ణయించుకొన్నారు. మరునాడు సూర్యోదయ కాలానికి పాండవులు సముజ్జ్వల వేషాలతో రాజసభకు వెళ్లి సింహాసనం మీద ధర్మరాజు, అతని ప్రక్కన సముచితాసనాలపై భీమాదులు కూర్చుండి పంచాగ్నులవలె వెలగొందుతూ ఉంటారు. విరటుడు సభకు వచ్చి కంకుభట్టు గద్దెపై కూర్చుండి లేవనందుకు ఆగ్రహించాడు. అప్పుడు అర్జునుడు ధర్మరాజును విరటునికి పరిచయం చేస్తాడు.

"నడదివియలు సేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన మనుజపతులఁ
దగునాజ్ఞ సూచాణముగ నొసరించె మం
చిగ నేల నాలుగు సెఱఁగులకును
బ్రీతార్థి జనుల సచేతన త్యాగధ్వ
జములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కులన్నింటిను దెలుపారుపూత గా
వించె నుజ్జ్వల యశోవిభ్రమంబు

రాజసూయాధ్వర ప్రవర్తకుఁడు నిత్య
సత్యభాషా మహావ్రత శాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు దర్మ
రాజు సుమ్ముమత్స్యావనీరమణ! యితడు".

" ఈతఁడజాతశత్రుడు మహిందగ దిగ్విజయంబు సేసె వి
ద్యాతిశయార్థి వాసవుసుహాసన మైనను నెక్క నర్హుఁడు
ద్ద్యోతిత మూర్తి గౌరవకులోద్వహుఁ డార్యనికాయ సంతత
ఖ్యాత చరిత్రఁడీ చిఱుత గద్దియకుం దగుడే నరేశ్వరా!"

ఆ మాటలు విని విరటుడు ఇస్మయానంద మగ్నుడై, ఇతడు ధర్మరాజైతే భీమార్జున నకుల సహదేవులు, ద్రౌపది ఏరి అని ఆసక్తిగా అడిగాడు. కవ్వడి ఇలా అన్నాడు "వలలుడనే వంటవాడుగా మీవద్ద ఉంటూ, మల్లయుద్ధప్రతాపాలను ప్రదర్శిస్తూ మీ ప్రశంసలందుకొనిన బకాసుర సంహారకుడు అవక్ర పరాక్రముడు భీడు. ఉత్తమ హయశిక్షకుడుగా నీ మెచ్చులనందుకొన్ని దామగ్రంథి నకులుడు, సమస్త గోపాలక ముఖ్యవృత్తిలో నుండి తంత్రీపాలునిగా మెలగిన వీరుడు సహదేవుడు. ఇక - మాలిన పేర సైరంధ్రిగా సుదేష్ణాంత:పురంలో వర్తించిన యిల్లాలు ద్రౌపది. ఆమెకొరకై కీచకోపకీచకులు

గందర్వకార్యమనే పేర భీమసేనునిచే రాత్రికి రాత్రే చంపబడ్డారు.

భీముడు అర్జునుణ్ణి - బృహన్నల వేషంలో ప్రచ్ఛన్న రూపుడుగా ఉన్న బీభత్సుని పరిచయం చేశాడు. విరటునితోపాటు అందరూ అద్భుతరసాక్రాంతులయ్యారు. తానిదివర చెప్పినట్లు కౌరవసేనతో యుద్ధంచేసి గోవులను మరలించిన దేవ సంభూతుడే అర్జును ఉత్తరుడు తెలియపరిచాడు. ద్రౌపదీ పాండవులను వినయ భక్తి ప్రపత్తుల్లో విరటాదులంద సేవిస్తారు. పాండవులిచ్చిన తనువులే. సంపదలే తమవని మత్స్య భూపతి ఉత్తరు కృతజ్ఞతలు ప్రకటిస్తారు. పాండవులకు ప్రత్యుపకారం బంధుత్వం కలుపుకోవటంతో సార్థకమౌతుందని ఉతప్రఉడు సూచిస్తాడు. విరటుడుప్పొంగి అర్జునునికి ఉత్తరనిచ్చి వివాహ చేయాలని భావిస్తాడు. కాని, నాట్యగురువైన అర్జునుడు తాను తండ్రివంటివాడినని అభిమన్యునికిచ్చి వివాహం చేయటం తన అభీష్టమనీ స్పష్టం చేస్తాడు.

"హరి మేనల్లుఁడు బాహు వీర్య పటు శౌర్య స్ఫూర్తి త్రైలోక్య సుం
దరుఁడాచార పవిత్రుఁడంచిత కళా దక్షుండు దారుండు గా
తర సంరక్షకుఁడార్య సమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
తురు తేజుండు వరించుఁగాక యభిమన్యుండీ సరోజాననున్".

ఆ ప్రతిపాదనను యుధిష్ఠిరుడు ఆమోదించాడు; అందరూ అంగీకరించారు. అర్జునుని వియ్యమందే అదృష్టం కలిగినందుకు విరటుడు ఉప్పొంగి పోయాడు. ఉత్త ర అపూర్వాలంకారాలతో ప్రకాశిస్తున్న పాండవులకు, ద్రౌపదికి ఆమెచేత మ్రొక్కించా మాత్స్యకౌరవ వంశాలు ఉత్తరాభిమన్యుల వివాహాలతో అన్యోన్యబాంధవ్యాల పెంచుకొన్నాయి; అగణితపుణ్యాలను గడించుకొన్నాయి.

హస్తినాపురానికి తిరిగిపోతున్న దుర్యోధనుని మనస్సులో ఒక అనుమానం పీడిస్తు ఉంది. అజ్ఞాతవాసకాలం ముగియకుండానే అర్జునుడు బయటపడ్డాడా? అలా జరిగి పాండవులు మరలా అరణ్యాజ్ఞాతవాసాలు చేయాలి కదా! అనిఅతని శంక, భీష్ముడు గడు ముగిసిందని చెప్పాడు. అయినా దుర్యోధనునికి నమ్మకం కుదరలేదు. ధర్మరా అబద్ధమాడడని అతని వద్దకు ఒక దూతను పంపాడు. అతడు గడువు ముమ్మాటి ముగిసిందని నొక్కిచెప్పి పంపాడు. ఆ దూతమాట బయట పెట్టకుండా - నిండుసభలో మరలా అందరిముందు అదే ప్రశ్న అడిగాడు. భీష్ముడు లేచి "నేనప్పుడే చెప్పా ముగిసిందని. ముగియలేదని ఎవరన్ని అంటే నవ్విపోతారు. ఇటువంటి మాటలు తెలి లేని మాటలు" అని అన్నాడు. అందరూ దానికి అంగీకరించారు. చేసేది మరేమీ లే మాయదారులు సాగక, దుర్యోధనుడు ఇంటిత్రోవ పట్టాడు.

విరాట నగరంలో వివాహ ముహూర్తాలు పెట్టించారు. బంధుజనుల కందరికీ పిలుపు లందాయి. అటు యాదవులు, ఇటుద్రుపద వంశం వారు కదలి వచ్చారు. వాసుదేవుని వెంట సుభద్రాభిమన్యులు వచ్చారు. పాండవులు సర్వ వైభవాలతో ఉపప్లావ్య నగరంలో విడిది చేశారు.

వివాహ సంభారాలన్నీ వడివడిగా సాగిపోసాగాయి. లగ్న మాసన్న మైందని ఆడపెళ్లివారు మగపెళ్లివారికి తెలియపరిచారు. యుధిష్ఠిరుడు వసుదేవాదులతో కలిసి అభిమన్యుని అలంకరించుకొని బంధుమిత్ర సమేతంగా వివాహవేదిక వద్దకు చేరారు. విరటుడు మంగళ తూర్యలు మ్రెగుతూ ఉండగా వరపూజ చేశాడు. వివాహ మంటపంతో తెరవద్ద వధువరులనుంచారు. పుత్రవధూవరులు ఇకరినొకరు చూచుకోవాలన్న ఆసక్తితో ఆలస్యాన్ని ఓర్చుకోలేకపోతున్నారు. తొలి చూపుల జల్లులు కురిసినప్పుడు చిరుచెమలు పొటమరించాయి. పాణిగ్రహణానంతరం పెనుపాదులో కలపిమెలసిన చూతవృక్షం నవమల్లికలా అన్యోన్య అనురాగంతో వెలుగొందారు. ఉత్తరాభిమన్యుల వివాహం పరమానంద సంసద్భరితం.

# ఉద్యోగ పర్వం

ఉత్తరాభిమన్యుల వివాహానికి వచ్చిన రాజబంధువులందరూ ఉపప్లావ్యంలో సమావేశమైనారు. శ్రీకృష్ణుడు పాండవ కార్యార్థియై వారందరినీ ఇలా ప్రబోధించాడు.

'పాండవులు కపటద్యూతంలో రాజ్యసంపదపంతా కోల్పోయారు. పరాక్రమ వంతులై ఉండి కూడా సత్యనిరతితో అరణ్యాజ్ఞాతవాసాలు పూర్తిచేశారు. పన్నెండేళ్ల అరణ్యవాసంలో రాక్షసుల వలనా క్రూరమృగాలవలనా ఎన్నో ఇబ్బందులకు గురి అయ్యారు. కష్టతరమైన పదమూడో యేడు ఎన్నిఆపద లెదుర్కొని ఎలా గట్టెక్కగలిగారో మీకందనికీ లిసిందే. ధర్మరాజు ధర్మమార్గం తప్పి ఇంద్రపదవిని కూడా ఆశించడు. పాండవులు కృధనంగానే కాక, దిగ్విజయం చేసి సంపాదించుకొన్నారు వారి సామ్రాజ్యాన్ని. దాన్ని పటద్యూతంతో ధార్తరాష్ట్రులు అపహరించారు. అయినా, ధర్మరాజు వారికి కీడు చేయ తలపెట్టడు. ఈ రెండు విధాలను మనం పరిశీలిస్తే ఈ రెండు తెగలవారూ రాజ్యాన్ని పంచుకొని అనుభవించటం తగిన కార్యమని అనిపిస్తున్నది. దీనిపై మీ అభిప్రాయాలు ప్రకటించండి. ముందుగా నా మాట చెపుతున్నాను - పాండవు లింతవరకూ శాంతులై సమయాన్ని పాటించారు. ఇకపై తమ పరాక్రమున్ని ప్రదర్శించుకోవాలని భావిస్తున్నారు. వీరి తలపు తెలిస్తే దుర్యోధనుడు తన మిత్రులతో కలిసియుద్ధానికి సిద్ధమౌతాడు. యుద్ధమన్న తరువాత తక్కువబలం ఉన్నవారిమీద ఎక్కువబలం ఉన్నవారి ప్రభావం కనపడుతుంది. పాండవు లెంత బలవంతులైనా సైన్యబలాన్ని, మిత్రబలాన్ని సమీకరించుకోక తప్పదు. అప్పుడు ఈ వైపునా, ఆ వైపునా రాజులకూటమి ఏర్పడక మానదు. దేవాసురుల యుద్ధంలోలాగా కొందరు చనిపోవ తీరదు. కాబట్టి ఇక్కడి వారి తలపులు, అక్కడివారి తలపులు ఎలా ఉన్నాయో తెలియవు. కార్యనిశ్చయం చేయటం ఇప్పుడు కష్టం. అందువలన తగిన రాయబారిని పంపటం అవసరం. దుర్యోధనుడు రాజ్యభాగం ఇచ్చాడాసరి, లేదా అప్పటికి తగిన విధంగా నడచుకోవటం న్యాయం'.

శ్రీకృష్ణుని మాటలను బలరాముడు సమర్థించాడు. కాని, సాత్యకి రాయబారపు యత్నాన్ని వ్యతిరేకించాడు. 'సంగ్రామమే అవశ్య కర్తవ్య' మన్నాడు. అయితే, ధర్మరాజు అంగీకరించి రాయబారం నడపదలచుకొంటే - దయనీయంగా రాజ్యాన్ని అడగకుండా గౌరవపురస్సరంగా వా రిస్తే పుచ్చుకొనే పద్ధతిలోనే మాటలు సాగాలి' అని ప్రతిపాదించాడు. సాత్యకి అభిప్రాయాన్ని ద్రుపదుడు బలపరిచాడు. దుష్టాత్ముడైన దుర్యోధనుడు

మంచిమాటలతో రాజ్యభాగాన్నివ్వటానికి అంగీకరించడు. దుర్జనుల హృదయాలు మెత్తని మాటలతో ప్రసన్నమౌతాయా? భీష్మద్రోణులు పెద్దవారే కాని, కూటికోసం వారి ననుసరిస్తారు. ధృతరాష్ట్రుడికి కొడుకుమీద వ్యామోహం పెద్దది. కర్ణుడా వట్టి తులువ. మిగిలిన వారందరూ దుర్యోధనుడే సద్బుద్ధి గలవా డని కీర్తిస్తారు. కాబట్టి అతడు దుర్వినీతుడై ఎప్పుడూ యుద్ధానికే కాలుదువ్వుతుంటాడు. ఈ సమయంలో మనం బలాలను సేకరించుకోవాలి. పిలువదగిన రాజులకు పిలుపులు పంపించాలి. దుర్యోధనుడు కూడా తనవారిని తాను పిలుచుకుంటాడు. ముందు పిలిచిన వారికి సహాయం అందజేసే మర్యాద రాజలోకంలో ఉంది. మనం త్వరపడి శల్య కేకయ జరాసంధ తనయాదులను వారిబంధు మిత్రులను మన వైపు చేర్చుకోవటం అవసరం' - అని చెప్పి ద్రుపదుడు తన పురోహితుని దూతగా ధృతరాష్ట్రుని పాలికి పంపాలనీ, ఎవ రెవరితో ఏయే మాటలు ఎలా మాట్లాడాలనో అతనికి వివరంగా చెప్పితే వాటి నాతడు నిర్వహిస్తాడనీ సూచించాడు.

వాసుదేవుడు ద్రుపదుని మాటలు కూడ ఉచితంగా ఉన్నాయి. అలాగే చేయాలి అని అంటూ - 'నాకు కౌరవులు పాండవులు సమానమే. వారిరువురు రాజ్యాన్ని పంచుకొని అనుభవిస్తే చూచి సంతోషిస్తాను. పెళ్లికి వచ్చి చాలరోజులయింది. మా యిళ్లకు మేము పోవాలి. ద్రుపదుడందరికీ కావలసినవాడు, అన్నీ తెలిసినవాడు; ఆతడు ఎలా చేస్తే అలా కానివ్వండి. ఇరువురికీ స్నేహం కుదిరితే సంతోహం. లేదా, మమ్మల్నీ పిలవ బంపండి వచ్చి సాయం చేస్తాం' - ఆపైన అర్జునుని కోపాగ్ని వారిని చుట్టుముట్టక మానదు' - అని నిష్కర్షచేసి నిజనగరానికి బయలుదేరాడు.

విరటుని ప్రేరణతో యుద్ధోద్యోగం పాండవపక్షంలో ప్రారంభమయింది. పాండవులు, విరాటరాజు, ద్రుపదుడు సైన్యాలతో ఊరివెలువల గుడారా లెత్తించి తమ కనురక్తులైన రాజులవద్దకు తగిన దూతలను పంపారు. ఈ సంగతిని తెలుసుకొన్న దుర్యోధనుడు కూడా తన బంధుమిత్ర గణాలను సమీకరించటం మొదలు పెట్టాడు. ఇలా రెండువైపులా స్కంధావారాలు సైన్యాలతో సమృద్ధమౌతూ ఉన్నాయి.

ద్రుపదుడు ధర్మజుని అనుమతితో వయోజ్ఞాన వృద్ధుడైన పురోహితుణ్ణి పిలిపించి ధృతరాష్ట్రుని పాలికి దూతగా పంపనియోగించి ఇలా ప్రబోధించాడు - 'నీవు మతిమంతుడవు, చతురవచన కోవిదుడవు, సమయజ్ఞుడవు, హితుడవు కాబట్టి పాండవార్థమై నిన్ను ధృతరాష్ట్రుని పాలికి దూతగా పంపుతున్నాను. అతడు పుత్రమమకారం కలవాడు; కుటిలుడు. అతని వర్తనం, ధర్మజుని శీలం రెండూ నీకు తెలుసు. పాండవులకు రాజ్యభాగం అడుగుతూ ధర్మనిష్ఠతో మాట్లాడితే అతని అనుచరులందరూ ఆగ్రహిస్తారు. గురుభీష్మాదుల హృదయాలు

యుద్ధంమీదకు పోకుండా, దుర్యోధనుడు సంధికంగీకరించేటట్లు నిపుణంగా మాట్లాడాలి. బంధువుల కందరికీ పాండవులు పడిన పాట్లను వివరిస్తూ, ఎవరికి నచ్చేవిధం వారిపట్ల అనుసరిస్తూ, నీవు చెప్పేదే మంచిమార్గమని వారందరూ భావించేటట్లు పలకాలి. అంతేకాదు, అక్కడి అందరి మనస్సులూ ఇక్కడ వ్రాలేటట్లు ఎన్నిఉపాయాలు దొరికితే అన్నీ ప్రయోగించాలి. కృష్ణాదుల వాదాలు నీవు విన్నావు కదా వాటికి అనుకూలంగా పాండవులకు తేజోలాభం కలిగేటట్లు కార్యం నిర్వహించాలి. కురువృద్ధుల హృదయాలు గమనిస్తూ గడుసరిగా మసలుకోవాలి. నీ వాక్యసూత్రానికి సుమోధను డంగీకరించాడా అదే అందరికీ సంతోషం కలిగిస్తుంది; ధర్మరాజుకు ప్రీతిని కలిగిస్తుంది. ఇక పోయిరా అని హస్తినాపురికి పంపాడు. అతడు హస్తినాపురం వెళ్లి కొన్నాళ్లుండి ధృతరాష్ట్ర దుర్యోధన భీష్మాదులతో తగిన మాటలాడుతూ తగిన సమయంకోసం ఎదురు చూచాడు.

ఆ సమయంలోనే ఇరుపక్షాలవారు వారివారి మిత్రులను సాయమడిగే యత్నాలు ాగిస్తున్నారు. దుర్యోధనుడు అన్యరాజన్యులను అడిగినట్లు గానే శ్రీకృష్ణుని సహాయం అడగడానికి దూతను పంపటం ఉచితం కాదని తానే స్వయంగా వెళ్లాడు. శ్రీకృష్ణుడు తన మందిరంలో శయనించి ఉన్నాడు. దుర్యోధనుడు వెళ్లి తలవైపున ఉన్నపెద్దగద్దెమీద కూర్చున్నాడు. అదే సమయంలో అర్జునుడు కూడా వచ్చాడు. అతడు శ్రీహరిపాదాలచెంత వినమ్రుడై నిలువబడ్డాడు. కృష్ణుడు నిద్ర లేచి ముందుగా అర్జునుని చూచి పలుకరించాడు; ఆ తరువాత దుర్యోధనుని చూచి సంభావించాడు. ఇద్దరినీ వచ్చిన పనిని గూర్చి అడిగాడు. రాబోవు యుద్ధంలో తనకు సహాయం చేయు మని అడగటానికి వచ్చానని దుర్యోధనుడు పలికి, వచ్చిన వారిలో తానే మొదటివాడు కాబట్టి అడిగే అవకాశం మొదట కల్పించుమని కోరాడు.

శ్రీకృష్ణుడు అది కాదని మొదట చూచినవాడు, చిన్నవాడు, అన్నచాటు వాడు అయిన అర్జునునికి మొదట కోరుకొనే అవకాశం ఇచ్చాడు. తన బలాన్ని రెండు భాగాలు చేశాడు. నారాయణాఖ్యులైన పదివేలమంది గోపాలురు యుద్ధ నిపుణులు ఒకవైపు, ఆయుధం పట్టక యుద్ధం చేయక, సాయం చేసే తా నొక్కడూ ఒక్కవైపు ఏర్పరచాడు. ముందుగా అర్జునుడు శ్రీకృష్ణుని కోరుకొన్నాడు. దుర్యోధను డందుకు ఉప్పొంగి పోయి గోపాలురను తీసికొని వెడలి పోయాడు.

పదివేల మంది నారాయణవీరులను కోరకుండా తన నొక్కని నెందుకు కోరుకొన్నావని శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నించాడు. అందుకు అతడిచ్చిన సమాధానం ఇది-

'శ్రీకృష్ణా! నేను రణంలో ఎవరి సహాయాన్నీ తీసుకోను. నీవా ప్రసిద్ధుడవు. నీవు యుద్ధం చేస్తే నాకు పేరు రాదు. అంతేకాక నీ కెదురై విజయాన్ని సాధించటం దుర్లభం. విజయమూలమైన నీతోడు నాకుంటే చాలు. నీవుయుద్ధం చేయకపోయినా సంతోషమే. అందువల్లనే నిన్ను కోరుకొన్నాను. ఓ మహాత్మా! నారథానికి నీవు సారథివై నన్ను ముందుకు నడిపించు. అపారకృపారరసం నీమీద చిలికి నాకీ వరం ప్రసాదించు. ఇది నా చిరకాలవాంఛితం. మన్నించు ' అని పార్థుడు ప్రార్థించాడు.

'అర్జునా! నీ అభిమతం తీర్చటం నాకు ఆనందం. తప్పక నీ రథసారథ్యం నిర్వహిస్తాను. పార్థసారథి అనే పేరుతో ప్రసిద్ధిపొందుతాను' అని అనునయిండి కిరీటిని తీసికొని ధర్మరాజు వద్దకు వెళ్లి పాండవులకు కార్యాలోచనంలో మార్గదర్శిగా వ్యవహరించాడు మాధవుడు.

పాండవ దూతలు శల్య సహాయాన్ని కోరారు. అత డంగీకరించి పుత్రమిత్ర సేనాసమేతంగా బయలుదేరి ఉపప్లావ్యానికి అంచెలంచెలుగా యాత్ర సాగిస్తున్నాడు. దుర్యోధనుడు ప్రచ్ఛన్నంగా తనవారిచేత శల్యసైన్యానికి కావలసిన సౌకర్యాలన్నీచేయించాడు. దాని కతడు మెచ్చి పాండవదూతలే సహాయం చేస్తున్నారని భావించి వరమిస్తానని ప్రకటించాడు. సమయ మదేనని తెలుసుకొని దుర్యోధనుడు శల్యుని ముందుకు వచ్చి తన పక్షం వచ్చి యుద్ధంలో చేయుమని కోర్ాడు. దానికి కారణం - శల్యునికి కౌరవపాండవు లిరువురూ సమానులేననీ, దుర్యోధనుణ్ణి శల్యుడు ముందుచూచాడనీ పేర్కొన్నాడు. శల్యుడు దాని కంగీకరించాడు. కాని, ధర్మరాజుకు ఆ సంగతి చెప్పి వస్తానని ఉపప్లావ్యానికి వెళ్లాడు. అతనికి జరిగిందంతా తెలిపాడు. ధర్మరాజు కూడా ఒక కోరిక కోరాడు. మాపక్షంలో అర్జునునికి శ్రీకృష్ణుడు సారథి. వారిపక్షంలో కర్ణుని రథసారథిగా అశ్వహృదయం తెలిసిన నిన్నే చేయాలని భావించి ఉంటారు. కర్ణసారథ్యం వహించేటప్పుడు అర్జునునికి విజయం కలిగేటట్లు సహాయం చేయాలని ప్రార్థించాడు ధర్మజుడు. శల్యుడు దానికి అంగీవరించాడు. కర్ణరథసారథ్యం చేసేటప్పుడు అతని హృదయం వికలమయ్యేటట్లు మాట్లాడి పరోక్షంగా పార్థవిజయానికి దోహదం చేస్తానని వాగ్దానం చేశాడు.

ఈ విధంగా కౌరవ పాండవులు బంధుమిత్రుల సహాయంతో సైన్యసమీకరణం చేసుకొన్నారు. పాండవులకు ఏడక్షౌహిణులు, కౌరవులకు పదకొండు అక్షౌహిణులు

పదివేల మంది నారాయణవీరులను కోరకుండా తన నొక్కని నెందుకు కోరుకొన్నావని శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నించాడు. అందుకు అతడిచ్చిన సమాధానం ఇది-

'శ్రీకృష్ణా! నేను రణంలో ఎవరి సహాయాన్నీ తీసుకోను. నీవా ప్రసిద్ధుడవు. నీవు యుద్ధం చేస్తే నాకు పేరు రాదు. అంతేకాక నీ కెదురై విజయాన్ని సాధించటం దుర్లభం. విజయమూలమైన నీతోడు నాకుంటే చాలు. నీవుయుద్ధం చేయకపోయినా సంతోషమే. అందువల్లనే నిన్ను కోరుకొన్నాను. ఓ మహాత్మా! నారథానికి నీవు సారథివై నన్ను ముందుకు నడిపించు. అపారకృపారరసం నీమీద చిలికి నాకీ వరం ప్రసాదించు. ఇది నా చిరకాలవాంఛితం. మన్నించు ' అని పార్థుడు ప్రార్థించాడు.

'అర్జునా! నీ అభిమతం తీర్చటం నాకు ఆనందం. తప్పక నీ రథసారథ్యం నిర్వహిస్తాను. పార్థసారథి అనే పేరుతో ప్రసిద్ధిపొందుతాను' అని అనునయిండి కిరీటిని తీసికొని ధర్మరాజు వద్దకు వెళ్లి పాండవులకు కార్యాలోచనంలో మార్గదర్శిగా వ్యవహరించాడు మాధవుడు.

పాండవ దూతలు శల్య సహాయాన్ని కోరారు. అత డంగీకరించి పుత్రమిత్ర సేనాసమేతంగా బయలుదేరి ఉపప్లావ్యానికి అంచెలంచెలుగా యాత్ర సాగిస్తున్నాడు. దుర్యోధనుడు ప్రచ్ఛన్నంగా తనవారిచేత శల్యసైన్యానికి కావలసిన సౌకర్యాలన్నీచేయించాడు. దాని కతడు మెచ్చి పాండవదూతలే సహాయం చేస్తున్నారని భావించి వరమిస్తానని ప్రకటించాడు. సమయ మదేనని తెలుసుకొని దుర్యోధనుడు శల్యుని ముందుకు వచ్చి తన పక్షం వచ్చి యుద్ధంలో చేయుమని కోర్హాడు. దానికి కారణం - శల్యునికి కౌరవపాండవు లిరువురూ సమానులేననీ, దుర్యోధనుణ్ణి శల్యుడు ముందుచూచాడనీ పేర్కొన్నాడు. శల్యుడు దాని కంగీకరించాడు. కాని, ధర్మరాజుకు ఆ సంగతి చెప్పి వస్తానని ఉపప్లావ్యానికి వెళ్లాడు. అతనికి జరిగిందంతా తెలిపాడు. ధర్మరాజు కూడా ఒక కోరిక కోరాడు. మాపక్షంలో అర్జునునికి శ్రీకృష్ణుడు సారథి. వారిపక్షంలో కర్ణుని రథసారథిగా అశ్వహృదయం తెలిసిన నిన్నే చేయాలని భావించి ఉంటారు. కర్ణసారథ్యం వహించేటప్పుడు అర్జునునికి విజయం కలిగేటట్లు సహాయం చేయాలని ప్రార్థించాడు ధర్మజుడు. శల్యుడు దానికి అంగీవరించాడు. కర్ణరథసారథ్యం చేసేటప్పుడు అతని హృదయం వికలమయ్యేటట్లు మాట్లాడి పరోక్షంగా పార్థవిజయానికి దోహదం చేస్తానని వాగ్దానం చేశాడు.

ఈ విధంగా కౌరవ పాండవులు బంధుమిత్రుల సహాయంతో సైన్యసమీకరణం చేసుకొన్నారు. పాండవులకు ఏడక్షౌహిణులు, కౌరవులకు పదకొండు అక్షౌహిణులు

ఈ విధంగా పలికిన పురోహితుని సందేశం విని భీష్ముడు లేచి ఇలా అన్నాడు: "పాండవులు ఎటువంటి ఆపదలు పొందకుండా ఉండటం అయ్యో! నిజంగా ఎంత అదృష్టం! శ్రీకృష్ణునితో కలిసి, ధర్మమార్గాన్ని అనుసరించి, ప్రశాంతచిత్తాలతో ఇటువంటి సాధుమార్గాన్ని అనుసరించటం కూడా చాలమేలే! అయితే! ఓ రాయబారీ! నీ ఉపన్యాసం విప్రస్వభావంతో వినేవారికి పదుషంగా ఉండటం చేత నీ మాటలు కార్యరూపంలో పెట్టటానికి ఇష్టపడతారా? నియమానుసారులై పాండవులు పడిన పాట్లన్నీ లోకానికి తెలుసు. పుణ్యాత్ములను వేధించటం తగదు. వారికి కూడా రాజ్యంలో పాలిచ్చి ధ్రుతరాష్ట్రుడు వారిని కూడా తన సుతుల్లాగా చూచుకొనటం న్యాయం. అలాకాకపోతే ధర్మరాజు శాంతమూర్తిగా ఉంటాడేమో కాని అర్జునుడు ఊడుకోడు. అతడు మోహరిస్తే ఎదురునిలిచే మగవాడున్నాడా ఈలోకంలో.

భీష్ముని మాటలు కర్ణునికి కోపం తెప్పించాయి. ఆవేశంతో అతడు ఇలా అన్నాడు.: 'అందరికీ తెలిసిన ఈ విషయాలను పదేపదే చెప్పటం దేనికి? జూదంలో దుర్యోధనుని పక్షాన శకుని ఆడాడు ధర్మరాజు ఓడిపోయాడు. ఇందులో తన్నేమి ఉంది? అరణ్యానికి వెళ్లి ధర్మజుడు సమయం ముగియకుండానే బయటపడి తండ్రిపాలు మాకు రావడం న్యాయమ గడుసరితనంతో అడగటం తప్పు. అంతేకాక విరటుడు, ద్రుపదుడు తమతమ సైన్యాలను తనకు సాయంగా చేర్చి యుద్ధానికి స్కంధావారాలను నిలిపి, ఇప్పుడు బలవంతంగా సగంభాగం కావాలని అడిగితే కురుపతి భయపడి ఇస్తాడా? అసలు ఇలా అడగటం న్యాయమేనా?' - అని గద్దించాడు. భీష్ముడామాటలకు కటకట పడ్డాడు.

'కర్ణా! నీవు బలేమనగాడివయ్యా! ఎందుకు? వినేవాళ్లు నవ్వేటట్లు పెద్దపెద్దమాటలు మాట్లుడతావు? అవక్రపరాక్రమశాలి యైన అర్జునుడు నిన్న ఉత్తరగోగ్రహణయుద్ధంలో ఒక్కడే మనల్నందర్నీ ఓడించి గెల్చాడు. నీవు రణరంగంలో అతన్ని గెలవలేవు కాని మనరాజు కొలువులో మాటల్లో మాత్రం గెలుస్తావు. అర్జునుడు ఆవులవెంట తరుముతూ వస్తుంటే దుర్యోధనుడు పాండవుల అజ్ఞాతవాసకాలం ముగిసిందా లేదా అని నన్ను అడిగినప్పుడు నీవు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ వింటూ ఉండగా సమయం ముగిసిందని నేను చెప్పలేదా?' - అని కోపగించాడు.

మాటలు ముదురుతున్న ఆ తరుణంలో ధృతరాష్ట్రుడు కల్పించుకొని భీష్మణ్ణి భక్తితో బ్రతిమిలాడి, కర్ణుణ్ణి కసిరి, ద్రుపద పురోహితునితో ప్రియ ముట్టిపడేటట్లు ఇలా అన్నాడు: 'నేనూ బంధువులు, మంత్రులు, పెద్దలు బాగా ఆలోచించి సమస్తప్రజలకు

ప్రీతికలిగేటట్టు బిడ్డలపాలికి ఒక సౌమ్యుణ్ణి పంపుతాను. అతడు నా అభిప్రాయం ప్రకారం వారితో కలిసి చర్చించి ఇకముందు నడువవలసిన తీరును నిర్ణయించుకోవడం కౌరవజాతి కంతా స్పష్టమైన మార్గం. కాబట్టి ముందుగా నీవు వెళ్లు' మని సగౌరవంగా సాగనంపాడు. పురోహితుడు ధర్మరాజుకు జరిగినదంతా నివేదించాడు.

ధృతరాష్ట్రుడు పుత్ర వృద్ధామాత్యసహితంగా కొలువుతీర్చి సంజయుని పిల్చి యిలా చెప్పాడు: -

'సంజయా! నీవు ఉపప్లావ్యంలో ఉన్న పాండవుల వద్దకు వెళ్లి వాసుదేవ సహితంగా వారున్నప్పుడు కలిసి, వారి దుఃఖం ఏవిధంగా ఉపశమిస్తుందీ ఆవిధంగా సముచితంగా మాట్లాడాలి. మీ తండ్రి మీరు వనవాసక్లేశాన్ని తరించి అభ్యుదయం పొందటం విని చాల సంతోషించి నన్నిక్కడకు పంపాడని ముందుగా చెప్పు. ధర్మరాజు నిండుకొలువున్నప్పుడు `తనిని దర్శించి అతని తమ్ములకు, బంధువులకు సంతోషం కలిగించేటట్లు మాట్లాడు; హాన్ని పాటించి తియ్యని మాటలతో కోపం తేరేటట్టు చేసి, ధర్మజుడు యుద్ధమని నస్సులో తలచకుండా ఉండేటట్లు శాంతవచనాలు పలుకు; కలిసిఉండేటట్లు యత్నించు, అని చెప్పి రథ మెక్కించి పంపాడు. సంజయుడు ఉపప్లావ్యం చేరి ముందుగా నరనారాయణులను దర్శించి తగురీతిగా మాట్లాడి మరునాడు ధర్మరాజును నిండుకొలువులో కలుసుకొన్నాడు. ధర్మజునితో సంజయు డిలా మాట్లుడటం మొదలుపెట్టాడు:

"ధర్మజా! పుణ్యాత్ముడవైన నిన్ను చూచి నేను ధన్యుడనైనాను. మీతండ్రి ధృతరాష్ట్రుడు మీ రిక్కడున్నా రని విని అత్యంతస్నేహపూర్ణమైన హృదయంతో మీ అందరి యోగక్షేమాలు తెలుసుకొనటానికి నన్ను పంపాడు". ఆ మాటలకు ధర్మరాజిలా అన్నాడు:

'ఆ రాజుకు మాపట్ల ఉన్న దయ కారణంగా ఇలా సుఖంగా ఉన్నాం. నిన్ను పంపించిన మర్యాదకు నా మనస్సెంతో వికసించింది. ఆ మహారాజు పుత్రపౌత్రాదులతో క్షేమమే కదా! దేశంలో అరిష్టాలు లేకుండా శుభపరంపర కలుగుతున్నదా? ద్రోణకృపాశ్వత్థామలు కుశలమేనా? భీష్ముడు క్షేమమా? కౌరవు లాయనకు పెద్దతన మిచ్చి గౌరవిస్తారా? బ్రాహ్మణులకు నేను దానం చేసిన వృత్తులు నేటికీ చెల్లుతున్నయా? ఎవరైనా దండెత్తి వచ్చినప్పుడు మాగాండీవిని, భీమసేనుణ్ణి స్మరిస్తున్నారా? మొన్న ఘోషయాత్రలో గంధర్వుల ఉదంతాన్ని అప్పుడప్పుడు మనసుల్లో నెమరువేసుకుంటున్నారా? పక్షపాతం లేకుండా ఆలోచిస్తే అక్కడి వీరుల్లో అర్జునుని చేత మానాన్ని, ప్రాణాన్ని దక్కించుకొనని వారెవరున్నారు? సంజయా! ఆ దుర్యోధనుని మందిరంలో కార్యానికీ, ఖడ్గానికీ నేనే తగుదునంటూ చాతుర్యాన్ని ప్రదర్శించె కర్ణుని ఆర్యత్వం ఇంకా చెల్లుతూనే ఉందా? ధర్మజుని మాటల్లో అధిక్షేపం తొంగి చూచింది. సంజయుడు సవినయంగా ఇలా అన్నాడు:

"కురురాజు కొలువులో అవినీతులు ఉన్నారు. నీతిమంతులూ ఉన్నారు. దురహంకారులూ ఉన్నారు. సత్త్వ సంపన్నులూ ఉన్నారు. వారిలో ఒకరు చెప్పిన మాట మరొకరు వినరు. వారి మాటకేం కాని, నా విన్నపాన్ని ముందు మన్నించు ధర్మజా! వెన్నెల వంటి తెల్లని చల్లని మనస్సుతో స్నేహం చేయాలని భావిస్తున్నావు నీవు. అదే అదే అందరికీ క్షేమం. ఇంతవరకూ అది లేకపోయినా ఇకముందు తప్పకుండా ఉంటుందని మా ఆశ! ధృతరాష్ట్ర మహారాజుకు వార్ధక్యంచేత మనస్సు ఒక విధంగా ఉండదు. అందువలన కొడుకు గర్వాన్ని నాడు మాన్పలేక మనస్తాపం పొంది ఇప్పుడు శాంతుడైనాడు. వారి చేష్టలకన్నింటిని నీ వంటి పుణ్యాత్ముడు సహించి అజాత శత్రువనే కీర్తిని పొందగలిగాడు. పాప నాశకమైన సత్పురుష జీవన పద్ధతి గైకొన్నవారు హింసాపరులౌతారా? పాండుకుమారులు దుర్వారబలాఢ్యులైనప్పటికీ శాంతస్వభావులు కావటంచేత ఆగ్రహాన్ని ప్రకటించి అధర్మాన్ని ఆచరించరని లోకులందరూ మిమ్మల్ని గురించి భావిస్తున్నారు. నరవరా! మీ తమ్ములూ, వాసుదేవుడూ, ఆప్తులూ, బంధువులూ కూడి ఉన్నప్పుడు మీతో మీ తండ్రి చెప్పుమన్న మాటలు నీకు వినిపిస్తాను" - అన్నాడు సంజయుడు. ధర్మజుడు సంజయుని మాటలలోని నాన్పుడు స్వభావానికి విసిగి అధిక్షేపాత్మకంగా అతనికి తమ్ములను, గోవిందుణ్ణి చూపించి రాజేమనా చెప్పుమన్నాడో త్వరగా నివేదించుమన్నాడు.

సంజయుడు కృష్ణునుకీ, భీమాదులకు, పాంచాల మత్స్య భూపాలురకూ పేరుపేరున నమస్కరించి, ధర్మజుని ముందు చేతులు ముడుచుకొని వినయంగా ఇలా మాట్లాడనారంభించాడు -

"ధృతరాష్ట్ర భూపాలుడు ప్రశాంత చిత్తంతో నన్నిక్కడకు పంపేటప్పుడు నారథం దగ్గరికి తానే స్వయంగా వచ్చి ఎంతో ఆప్యాయంగా ఈ మాటలు చెప్పాడు మీరు సావధానంగా వినండి. మీ వంటి ధర్మజ్ఞులు, శాంతులు, అయిన ప్రసిద్ధులు చులకనైన పనులు చేయటం ఏ విధంగానూ న్యాయమౌతుందా? ధర్మరాజా! మడుగు చీరలో మసి చేరినట్లు దుర్యోధనుని వలన కురుకులం కల్మషమైపోయింది. అయితే, ఆ కల్మషాన్ని బాపగల సమర్థుడవు నీవే! ఓ దయామయా! యుద్ధం జరిగితే జయాపజయాలు ఏ వైపు కలిగినా అవి సుఖాన్ని కలిగించవు. రణరంగంలో బాలురను, వృద్ధులను, బంధువులను, గురులను చంపిన తరువాత ఆ సుఖాలు మాత్రం దేనికి? నీకు హరి పెట్టని కోట భీమర్జున సాత్యకి విరాటాదులు మహావీరులు. వీరందరూ యుద్ధ భూమిలో నిలిస్తే దేవతలే ఎదుర్కొనటానికి భయపడతారు. అయితే, ఆ వైపూ తక్కువవారు లేరు. ద్రోణ భీష్మ కృపాశ్వత్థామ కర్ణశల్యాదులు ఒక్కొక్కరు అజేయులు. వారందరు కలిసి వస్తే పరమేశ్వరుడైనా

జయించటం కష్టం. ఇటువంటి మీ ఇరు పక్షాలకు అన్యోన్య కలహం మేలుకాదు. ఈ సభలో నున్న వాసుదేవాదుల కందరికీ చేతులెత్తి మ్రొక్కుతున్నాను. మీరందరూ అసూయమాని, కరునాకరుడైన ధర్మరాజును క్రోధశాంతి పొందమని కోరండి. యుద్ధాన్నుండి ఉపశమిస్తే భీష్మాదులు కూడా సంతోషిస్తారు. సర్వలోకం సమ్మతిస్తుంది."అని ధర్మజుని ఎదుట వినమ్రుడై నిలువబడ్డాడు. అతడిలా అన్నాడు -

"సంజయా! నా మాటలలో స్నేహమనేది ఒక్కటే నీ చెవులకు వినిపించింది. కయ్యము లేకుండా ఉండండని మమ్మల్ని నీవు కోరుతున్నావు. బాగానే ఉంది. కయ్యం లేకుండానే దానివలన కలిగే అర్థసిద్ధి చేకూరితే ఇక వేరే కయ్యం చేయవలసిన పనేముంటుంది? ధృతరాష్ట్ర మహారాజు ద్యూత సభలో తాను నీతి మార్గానికి నీళ్లువదిలివక్రంగా వ్యవహరించాడు. ఇప్పుడు మాకు మాత్రం ఋజుమార్గంలో నడవండని నీతులు చెపుతున్నాడు తమలాగానే ఎదుటివారిని గూడా భావించాలి. అలాకాక - 'మాకు కుడుమిచ్చి మీరు వ్రక్క తీసుకోండి' అన్న సామెతగా వ్యవహరిస్తే పొందు కుదురుతుందా?

మేము సంపద లేనివారమై ఉంటే అశక్తులమని లెక్కకట్టి మమ్మల్ని పిలిచి, గౌరవించి, రాజ్య మిచ్చేంత వెర్రివాడా మహారాజు? అతని సలహాదారుల బుద్ధిని, కొడుకు కోరికను మన్నిస్తాడు గాని ధర్మాన్ని పరిగణిస్తాడా? ఎందుకు మీకీ వృథా ప్రయాసలు? మానండి. ఆయన చరిత్రం నీకూ మాకూ ఈనాటి వింతయా? ఎన్నడైనా కొడుకును తగిన మాటలు చెప్పి మాన్పగలిగాడా? పై పెచ్చు విషం త్రాగినా అతడే వీరుడని నమ్ముతాడు. ఆనాడు జూదపు సిరి వద్దని పెద్లనలేదా? దానికి ఆయన పెడచెవి పెట్టలేదా? ఇక ముందు కూడా ధృతరాష్ట్రుడు దుర్యోధన శకుని కర్ణాదులు తన నే వైపు నడిపిస్తారో ఆ మార్గాన్నే అనుసరిస్తాడు. ఆయన పద్ధతి మార్చుకుంటాడా?

నీవు ఉత్తముల పద్ధతిని గురించి ఉపన్యసించావు. నీకు ఆదుర్యోధనుని అవినయం అనివార్యమని తెలియదా? లేక తెలిసిన అజ్ఞానమా? అతడికి శ్రీకృష్ణుడంటే లెక్కలేదు. అర్జునునికి ఎదురుగా కర్ణుడున్నాడని నమ్మి అహంకరిస్తాడు. ద్రోణ భీష్మ కృపాశ్వత్థామ కర్ణ దుర్యోధనాదులు యుద్ధాలెలా ఆశాపాశాలో పూర్వం గ్రహించలేదా? బంధువుల పరాక్రమాలు తెలిసి కూడా చావును వరించి యుద్ధాన్ని కోరుతూన్నారు. ఇక కపిధ్వజ కాంతులు వారిని అంధీభూతులను చేయక తప్పదు.

నీవు ముందుగా మమ్మల్ని పొగిడావు? ఆ తరువాత కౌరవులను గెలవటం అసాధ్యమన్నావు. నేనీ మాటకు అంగీకరించను. నీవు పక్షపాతం లేకుండా మాట్లాడి

ఉండవలసింది. అది అలా ఉండనీ. అవమానములు పొంది కూడా మేము ఓర్పును ప్రదర్శించాం. నీకూ ఈ వివరాలన్నీ తెలుసు. వాటి నన్నింటినీ మా తండ్రి తలంచి మాకెటువంటి కీడు రాకుండా, మేము మరొకవైపు పోకుండా, లోకం మెచ్చేలా మమ్మల్ని తనవద్దకు పిలిపించుకొని, రాజ్యాంలో భాగం మాకిమ్మని కొడుకుల కాజ్ఞాపించి, ఇంద్రప్రస్థాన్నో మరొక నగరాన్నో మాకు రాజధానిగా చేసి ఏలుకొమ్మనటం సముచితం కాదా!" అని కొంత రోషాతివయంతో అన్నాడు ధర్మరాజు. సంజయుడు మరలా ఇలా సంభాషణ సాగించాడు.

"ధర్మజా! ఎదుటివారు ఎన్ని తప్పులు చేసినా వాటిని ప్రక్కకు త్రోచి ఓర్పును ప్రదర్శిస్తావు కాబట్టి, నీవిన్ని మాటలు అన్నా తనివి తీరక నీకు నేను ఇంకా మనవి చేస్తాను. నిజంగా నీ గొప్పతనమంతా నీ అమింసా ప్రవృత్తిలో, నీ మచ్చ లేని చరిత్రంలో ఉంది. ఒకవేళ కౌరవులు దుర్మార్గులై రాజ్య భాగం ఇవ్వకుండా మీకు అన్యాయం చేశారే అనుకుందాం. మీ నడవడికి రక్తపు కూడు కంటే భిక్షాన్నమే సముచితం. అది ఎలాగంటావా? రాజసూయాధ్వరం చేసి దేవతలను మెప్పించి శాంతి దాంతులతో సకల లోకాలు కీర్తింపగా బ్రతికిన పుణ్యమూర్తివి నీవు. అట్టి నీ పవిత్ర చరిత్రం హింసా కళంకితం కావటం ఉచితం కాదు. అంతేకాదు. అలనాడు అవినయంతో మాయాద్యూతం కల్పించి అంతటి అవమానం చేసిన వారిని వారి గర్వం చెల్లేటట్లు చేసి లోకుల చేత వారు తిట్లు పడేటట్లు ఎందుకు చేశావు? ఓర్పే సంపదగా ఇంతవరకు అడవులలో ఇడుముల నెందుకు అనుభవించావు? ఇంత ఉత్తమ పథంలో సాగి, ఇప్పుడు క్రూర పద్ధతిలో ప్రవేశించి బంధువులను, గురువులను వెదకి వెదకి వధించటం సౌఖ్యమా? అది ఆర్యనింద్యం; అస్థిరం.

హాలాహలం లాంటి కోపాన్ని మ్రింగు కోవటంలో ముందుగా శివుణ్ణి చెప్పి తరువాత నిన్ను పేర్కొనాలి. అటువంటి వాడవు ఆగుణాన్ని పాటించి అనంత కీర్తిని గడించాలి" అని ప్రబోధించాడు.

దానికి సమాధానంగా ధర్మరాజిలా అన్నాడు -

"సంజయా! నీవు పలికింది యథార్థమే. లోకంలో కొన్ని చర్యలు పైకి చూస్తే దర్మాల్లాగా అనిపించినా చివరకు అధర్మాలై చెడిపోతాయి. కొన్ని అధర్మాలుగా గోచరిస్తూనే చివరకు ధర్మాలై రూపొందుతాయి. కాబట్టి నన్ను నిందించ దలచుకున్నట్లయితే నేను చేస్తున్నది ధర్మమనో అధర్మమనో నిరూపించి మరీ దూషించు. కోపాన్ని పోగొట్టుకోవాలి. అహింసయే ఉత్తమ ధర్మం - ఇవి ధర్మాలే కదా! వంశానికి కళంకం తెచ్చేవారు, లోక కంటకులు అయిన పాపాత్ములను నిర్మూలించటం కూడా దర్మమని పెద్దలు చెప్పారు. అది

అలా ఉండనీ ....... రాజులకు యుద్ధం చేయటం ధర్మమా? అధర్మమా? నీవే చెప్పు.

మనందరికీ ఇది కర్తవ్యం. ఇది అకర్తవ్యం అని శాసించటానికి వాసుదేవుడున్నాడు. మనకీ వితర్కం దేనికి? ఇతడు ధర్మాధర్మవిదులకు గురుడు, కార్యాకార్య నిరూపకులకు శిక్షకుడు, ఉచితానుచితజ్ఞులకు ప్రదర్శకుడు. యదుభోజ అంధక వృష్ణి సంజయ కేకయ ప్రభృతులైన ప్రభవులందరూ ఆయన ఆజ్ఞ చొప్పున ధర్మమార్గంలో నడుస్తున్నారు. విశేషించి మాకు గోవిందుని బోధయే సమస్త పురుషార్థాలకూ మూలం కావటం చేత అతని మాట అవశ్యం అలంఘనీయం - " అని ధర్మరాజు పలుకగా శ్రీకృష్ణుడు సంజయునితో ఇలా లికాడు.

"నేనెప్పుడూ పాండవుల మేలు కోరేవాణ్ణి. ధృతరాష్ట్రుడు కూడా పుత్ర పౌత్రవంతుడు తని కూడా కీడెందుకు కలగాలని మనసులో అనుకుంటూ ఉంటాను. ఉంటాను. ఆరాజు లివితో నిన్నిక్కడికి పంపి నిండుమనసుతో వీరి యోగ క్షేమాలు తెలుసుకోవటం నాకెంతో సంతోషంగా ఉంది. నీవు సముచితంగా వచ్చి స్నేహం, ధర్మం వినయం తేట పడేటట్లు మాట్లాడటం కూడా నాకు సమ్మోదాన్ని కలిగించింది. ఇలా అన్నీ కలిసి కట్టుగా ఏర్పడగా ధర్మరాజు మాటలు చూడగా సంధి జరిగే పద్ధతి కనపడటంలేదు. అది అంతే... దుర్యోధనుడు మత్తుడు చివరకు అందరూ కలిసి ఉండటం అనే మాట ఎలా కలుగుతుంది? ధృతరాష్ట్రుని మనసు మనకందరికీ తెలుసు కదా! ఆ రాజు నెరపే స్నేహాన్నీ ఒలక బోసే వాత్సల్యాన్నీ నీ వెన్నో తియ్యతియ్యని మాటల్లో చెప్పావు? బాగుంది. కాని పాండవులు తమకు రావలసిన రాజ్యభాగం పొందకుండా వట్టి వట్టి నేర్పు మాటలతో సరిపుచ్చుకుంటారా?

పాండవులు పెద్దగా పట్టించుకోకుండా శాంతులై కౌరవులతో కలిసి ఉండటానికి కోరుకుంటే మంచిదే. ఓర్పు దయ ప్రకటించటం న్యాయమే. అయితే, తమకు న్యాయంగా రావలసిన రాజ్య భాగం తండ్రి పంచి ఇవ్వలేదని తెంపు చేసి యుద్ధాన్ని వీరు ప్రకటించినా అది ద్రోహమౌతుందా? ఈవిధంగా అవమానాలు పడుతూ తలవంచి బ్రతికిన దానికంటే, ఉజ్జ్వలులై ఎదుర్కొనటమే మేలు. నాకు చూడ పాండవులకు యుద్ధమే శరణ్యం లాగా కనపడుతున్నది. క్షత్రియులకు యుద్ధం ధర్మం. రాజులు ఇచ్చేవారే కాని వేడుకొనేవారు కారు. న్యాయార్జిత విత్తంతో జీవిస్తున్నప్పుడు అన్యాయంగా వారి ధనాన్ని ఎవరైనా అపహరిస్తే అప్పుడు శస్త్రాస్త్ర ధర్మాలను ఇంద్రాదులు చెప్పారు.

కౌరవులు క్రిందుమీదు లెరుగకుండా అధర్మమార్గాన నడిచేవారు. నీవిక్కడ చెపుతున్న ధర్మాలను కౌరవులకు కూడా చెప్పవద్దా? లోకంలో జూదాలాడలేదా? కౌరవులు

తులువలు కాకపోతే ద్రౌపదిని నిండుసభలోల పలువురు చూస్తూ ఉండగా పగపట్టి అంతగా అవమానిస్తారా? అప్పుడు భీష్మాదులైన పెద్దలందరూ నోరెత్తకుండా ఊరకున్నారు. అప్పుడు ధృతరాష్ట్రుడు నోరెత్తి తన కొడుకులను కోపగించి ఆ దుష్కృత్యాన్ని మాన్పినట్లైతే నా మనసే కాదు లోకులందరి మనస్సులూ సంతోషించి ఉండేవి. నిందిస్తూ నిండు కొలువులోకి జుట్టు పట్టుకొని దుశ్శాసనుడు ద్రౌపదిని లాక్కొని వచ్చి నిర్దయతో అవమానిస్తూంటే మామ ఆ సతి యేడ్పుకు ఎలా ఓర్చుకున్నాడు; ఆ సన్నివేశాన్ని ఎలా సహించాడు? అంతగా సహించిన ఆ రాజు ఈ నాడు ఇంతగా వీరిని ప్రేమిస్తూ యోగక్షేమాలు తెలుసుకోటానికి నిన్ను ఇంతగా పంపాడు. ఇది ఎలా సాధ్యపడింది?

అలనాడు నిండు సభలో 'ఇది కూడదు' అని అడ్డుపడే వాడు లేక అందరూ ఊరుకుంటే ద్రౌపది తనను తాను రక్షించుకొనే అదను ఏర్పడింది కాబట్టి సభలో అవమానం తప్పింది. పాండవులు బ్రతికి పోయారు. లేకపోతే ఆ కీడు రాజకుమారులు సహించదగిందేనా? సంజయా! అప్పుడు కర్ణ శూలాలుగా కర్ణుడన్నమాటలు నీవు వినలేదా!

"లేరిచట మగలు నీకును
వీరలు జూదమున వోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన! నీపైఁ
గూరిమిగల మగని వెదకి కొను మొరుననడే?"

ఈ మాటలు నరుని హృదయంలో ములుకుల్లాగా గుచ్చుకుంటూ దుర్భర వేదనను కలిగిస్తున్నాయి. ఎప్పుడన్నా ఆ రాజు దీనికి చికిత్స చేయటానికి యత్నించాడా? ఆ దుశ్శాసనుడు పాండవులను గొడ్డువోయిన వారనీ, పౌరుసం లేనివారనీ అనరాని, వినరాని మాటలెన్నో అని కించపరిచాడు. వాటికేమైనా ఓదార్పు పలికాడా ఆ రాజు? కాబట్టి ఈసంధి కార్యం సంఘటించటం అసంభవమని నేను భావిస్తున్నాను. అయినా -

పాండవులను ప్రార్థించి, హస్తినాపురానికి నేను వచ్చి, కౌరవులకు బుద్ధిగా చెప్పి, రాజ్య భాగాన్ని ఇప్పిస్తే, వారు మృత్యుపాశాలనుండి తప్పించుకొంటారు. అన్యాయం కాని నామాటలు వారు మన్నించారా సరి, లేక లెక్కలేకుండా వెక్కిరించారా వారు పాండవ బాణాగ్నితో కాదు, స్వీయలోభాగ్నిలోనే పడి మగ్గిపోతారు. నా తలపులో ఇరు పక్షాలవారి కలరూపు ఇటువంటిది -

"రోషమయ మహాతరువు సుయోధనుఁ, దురు
స్కంధ మందులోనఁ గర్ణుఁడలరుఁ

గొమ్మ సౌబలుండు గుసుమ ఫలములు దు
దుశ్శాసనుండు, మూల శక్తి తండ్రి"

"ధర్మజుండు ధర్మతరు వర్జునుఁడు ఘన
స్కంద, మనిల సుతుడు శాఖ, కవలు
పుష్పఫలము, లేను భూసురులును వేద
ములుఁ దదీయమైన మూల చయము".

ఈ రెండింటిలో సారవంతమైనదేదీ కానిదేది అని మనంవిచారించాలి. అయినా వీరిద్దరి మధ్య అసూయ అనవసరం. వీరిరువురూ కలిసి ఉండటం ఉచితం. ఎలాగంటే - ధృతరాష్ట్రుడు, అతని పుత్రులు అరణ్యం వంటివారు. అందులో పాండవులు సింహాల లాంటివారు సింహాలు లేని వనాన్ని జనం నిర్భయంగా నరుకుతారు. వనగర్భంలో ఉండని సింహాలకు వేగంగా చేటు చేకూరుతుంది. కాబట్టి వీరిద్దరూ ఎల్లప్పుడూ కలిసి ఉండటం సమంజసం. ధృతరాష్ట్రుడు పాండవులను దరికి చేర్చి తన కొడుకుల్లాగా చూచుకొంటే వారు శత్రామర్ధనానికి పనికి వస్తారు. తన సేవలకూ ఉపకరిస్తారు. నేను ఈ పని మీద హస్తినాపురానికి వస్తాను. ఆ రాజు నాయత్నానికి ఒప్పుకొన్నా సరే లేదా ఒప్పుకోకపోయినా సరే. దానిని బట్టి మేము వ్యవహరిస్తాం."

కృష్ణుని మాటలు విన సంజయుడు తాను వచ్చిన పని అయినదని తెలుసుకొని దర్మజాదుల వద్ద అనుమతి వేడుకొన్నాడు వెళ్లటానికి. తాను మాట్లాడిన మాటలలో దగనివి ఏమీ లేవుకదా అని ప్రశ్నించాడు. అందుకు దర్మజుడిలా అన్నాడు - "నీవిక పోయి రావచ్చు. ఇందరు వింటుండగా ఇంతవవరంగా నీవు మాట్లాడావు. నీ మాటల్లో ఉచితములు కానివి ఉనానయా? అలా అని ఎవరంటారు? ఎదుటివారి స్థితిగతులను చెప్పటంలో నీవు ఎటువంటి ఇబ్బందులను పడవు. అవినయాన్ని, కాఠిన్యాన్ని నీపలుకెప్పుడూ పొందదు. ఇటువంటి పనులు నిర్వహించటానికి నీవుగాని విదురుడు గాని తగినవారు అని పేర్కొని కరిపురంలో ఉన్న పెద్దలకు, పిన్నలకు, రాజలోకానికి, పరివారానికి అనువైన సంభావనలను అందించాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడు నిండు కొలువుండగా కొన్ని మాటలు చెప్పమన్నాడు.

"ఓ పుణ్యాత్ముడా! నీ బలంచేతనే పాండవులు ఆపదలేమీ లేకుండా ఆప్త బంధువులతో కలిసి సుఖంగా ఉఅన్నరు. వారిని వారి తండ్రిగారి రాజ్య పీఠంమీద నిల్పి, ప్రభుత్వ మిచ్చి బాల్యంలో పోషించావు. ఇప్పుడేమాత్రం దయలేకుండా వారికి అమితం కావాలని కోరటం న్యాయమా? దానితో సంతోషించవద్దు. అంతకంతకు రాజ్యాశ పెరిగితే

నిలువరించటం కష్టమౌతుంది. కాబట్టి శత్రువులందరు బెదరి చూడగా కలిసి ఉంటం మంచిది."

మాతాత భీష్మాచార్యులతో ఇలా పలకండి -

"శంతనుని వంశం అంతరించిపోకుండా నీవే నిలిపావు. అలాగే నీ అభిప్రాయాన్ని అనుసరించి నీ మనుమల నందరికీ పొందు కుదర్చి, అధర్మ వృత్తికీ, చావుకూ వారిని దూరం చేయగలితే పండితులందరూ మెచ్చుకొంటారు."

ఆ సమయంలో అచ్చటివారందరూ వినేటట్లు దుర్యోధనునితో ఈ విధంగా చెప్పండి-" బాహుబలాఢ్యులను బలహీనుల్లాగా బయటకు పంపిన వెర్రితనం, చాలకాలం అడవుల్లో కొండల్లో బాధలు పెట్టిన పరుసదనం, సభలో పాంచాలిని ఆ విధంగా తలపట్టి ఈడ్చిన తులవతనం - వీటినన్నింటిని ధర్మరాజు సహించాడు. నిజం. కురుకుమారులను రణరంగానికి బలిపెట్టబోకు. ఇతరుల సొమ్ముకు ఆశపడబోకు. వారి పాలు వారికిచ్చి కలిసి బ్రతకడం మంచిదనుము. మేము కలహాన్ని కోరకుండా పొందుకోరడం తనకే మేలవుతుంది. తన మనస్సులో ప్రజ్వలించే ఆశాజ్వాలను ఆర్పటానికి ఎవరూ ప్రయత్నం చేయరు. కాబట్టి నేను బుద్ధి చెప్పవలసి వచ్చింది. తన వద్ద ఉన్నతమంది మమావీరులు మరెక్కడా లేనిమాట నిజం. మావైపు ధర్మం ఉన్నది. అఖిలలోక సేవితుడైన కృష్ణుడు మాకు రక్షగా ఉన్నాడు. కాబట్టి మమ్మల్ని గెలవటం తనకు సాధ్యం కాదు.

అది అలా ఉండనీ, నేను భీమసేనాదులకూ, తమకూ పెద్దవాడను కావటం చేత వీరు, మీరు నా ప్రార్థనను భంగం చేయకుండా శాంతి దాంతులను వహించి నన్ను అలజడి పెట్టకుండా యుద్ధం మాని ఎవరి సంపదలు వారు తీసికొని సుఖం బుండటం మంచిది. అది పెద్దలకు బుద్ధిమంతులకు సంతోషం కలిగిస్తుంది. మాకు పెద్దగా రాజ్యాభాగం ఇవ్వటానికి ఇష్టం లేకపోయినా కుశస్థలం, వృకస్థలం, వాసంతి, వారనావతం చాలు; కాదా ఎక్కడైనా పాండవులైదుగురు కలిసి ఉండటానికి వీలైన తావులు ఇస్తే చాలు సర్వ శాంతి సమకూరుతుంది. బంధుమిత్ర పుత్ర గురు జనాదులతో అందరూ బ్రతికి సుఖంగా జీవించవచ్చు. ఇది నా అభిమతంగా ఆ మహాపురుషునికి తెలియ జెప్పు' మని ధర్మజుడు విశదపరిచాడు.

సంజయుడందరికీ నమస్కరించి బయలుదేరాడు. అర్జునుడు అతనితో ఇలా అన్నాడు -

"సంజయా! నీవు మాకు చాల సఖుడవు. మాబాల్యం నుండి కౌరవ పాండవుల తీరు నీకు తెలియనిది కాదు. మా భీమసేనుడనే మత్తగజాన్ని నాడూ, నేడూ ధర్మజుని

దయాతిశయమనే అంకుశం నిలువరిస్తూ వస్తున్నది. లేకపోతే వారి ఆట ఎప్పుడో కట్టి ఉండేది. ఈ నయ విక్రమ విచార క్లేశాలు వారికెందుకు?" అని సాధిక్షేపంగా పలికి సవ్యసాచి సగౌరవంగా సంజయుణ్ణి హస్తినా పురానికి సాగనంపాడు.

సంజయుడు సంజవేలకు రాజధాని చేరాడు. అంత:పురంలో ఉన్న ధృతరాష్ట్రునికి తన రాక ఎరింగించాడు. సూత్రప్రాయంగా తన సంధియత్నాన్ని వినిపించాడు -

"అనయము పెట్టె జూదమున యప్పుడ యెంతయు చిచ్చు వెట్టి కా
ల్చినయది నీ యుపేక్షయ వశీకృత చిత్తుడు ధర్మసూతి మె
త్తని పులి యెల్లవారలు నదర్మము నీ పయి బెట్టునంతకు
న్వినఁడును గానడుం బిదప నీకును నాకు మరల్చవచ్చునే".

)వరంగా మరునాడు నిండుకొలువులో వినిపిస్తానని సంజయుడు తన నివాసానికి పోయాడు. సంజయుని మాటలు ధృతరాష్ట్రునిలో అలజడి రేపాయి. రాత్రి నిద్ర పట్టలేదు. విదురుణ్ణి పిలిపించుకొని మనశ్శాంతికోసం రాత్రంతా నీతులు చెప్పించుకొన్నాడు. ధర్మరాజును వదలిపెట్టబోకు; దృఢమతతితో కొడుకులకు, మంత్రులకు నచ్చచెప్పి పొందుకుదిరేటట్లు సాధించు దానివలన దర్మము, కీర్తి, లాభము కలుగుతాయి - అని బోధించాడు. ధృతరాష్ట్ర డతని మాటలకు అంగీకారాన్ని తెలిపాడు. తెల్లవారింది.

ధృతరాష్ట్రుడు కొలువు తీర్చాడు. సంజయుడు తన రాయబారపు వృత్తాంతాన్ని పూసగుచ్చినట్టు చెప్పటం ప్రారంభించాడు. ధృతరాష్ట్రుడు వివిధాంశాలను గుచ్చిగుచ్చి అడిగి వివరాలు తెలుసుకొన్నాడు. అతడు వాసుదేవుని అభిప్రాయాన్ని గురించి సంజయుణ్ణి మొదట ప్రశ్నించాడు. శ్రీకృష్ణుడు సత్యభామా ద్రౌపదులు అర్జునుడు కలిసి ఏకాంత మందిరంలో ఉండగా సంజయుణ్ణి లోనికి పిలిపించుకొన్నాడు. దానివలన వారికి ధృతరాష్ట్రుని మీద ఉన్న అనురాగం వ్యక్తమౌతుందని చెప్పాడు. నరుని తొడలపై పాదాలుంచి నారాయణుడు శయనించి ఉన్నాడనీ సంజయుని చూచి ఇరువురూ లేచి నమస్కరించి నేలపై కూర్చుండి వినయంతో పలకరించారనీ చెప్పాడు. వారిరువురు కలిసి ధర్మజుని ఆజ్ఞలు పాటిస్తారట! వారిని కాదని ఎదుర్కొనటం యముని శిరస్సు త్రెంచటమే కదా అని హెచ్చరించాడు.

అలుగుటయే ఎఱుగని అజాతశత్రుడు అలిగాడంటే నీళ్లల్లో అగ్ని పుట్టినట్లన్నమాట! ఆ అగ్ని ఆర్పే పద్ధతి లేదు. కాబట్టి నేర్పుతో మీరు పనులు సాగించుకోవాలని గోవిందుడు

ధృతరాష్ట్రుణ్ణి ప్రబోధించానట్లు సంజయుడు తెలియపరిచాడు. గాండీవి రథానికి సారథినై అశ్వాలను తోలుకొని వస్తున్నప్పుడు కపిధ్వజచ్ఛటలు చూచి మీరు మూర్ఛపోతారు; కిరీటి బాణాలు చవిచూచి విచ్చిపోతారు అని కృష్ణుడు హెచ్చరించాడు. అప్పుడు భీష్మ ద్రోణుల ప్రాపును కర్ణుని గర్వాన్ని నమ్ముకొని ఉన్న దుర్యోదనుని దురదృష్టాన్ని స్మరిస్తూ నిశ్చేష్టుణ్ణయ్యానని సంజయుడు చెప్పాడు.

అలాగే ధృతరాష్ట్రుడు అర్జునుని సందేశాన్ని వినిపించుమని అడిగాడు. సవ్యసాచి పాండవ వాసుదేవ పరాక్రమాలను పేరు పేరున వర్ణించి చెప్పిన విధానాన్ని వివరించాడు సంజయుడు. ఆ మాటలు విని భీష్ముడు దుర్యోధనునితో ఇలా హిదవు చెప్పాడు -

"పార్థ వాసుదేవులు కలిసి ఏ వైపుండి యుద్ధానికి వస్తారో ఆ వైపు హరుడు కూడా కన్నెత్తి చూడలేడు. నీవు నేనెన్ని హితవులు చెప్పినా వినవు. బహుశం కౌరవులకు చేటుకాలం దాపురించినట్లుంది. ఈనాడు నా హితవు వినకపోతే రేపు యుద్ధంలో వారు పడిరి వీరు పడిరి అనే మరణవార్తలే వినవలసిన కాలం రావచ్చు. నీకు శకుని కర్ణ దుశ్శాసనుల మాటలే చెవి కెక్కుతాయి. అవే నీకు ఎగ్గును కలిగిస్తాయి." - అన్న మాటలు విని కర్ణుడు భీష్మునిపై మండిపడతాడు. అప్పుడు ఉత్తర గోగ్రహణం సమయంలో కర్ణుడు అర్జునుని చేత పొందిన పరాభవాన్ని భీష్ముడు జ్ఞాపకం చేస్తాడు. అర్జునుని వంటి విలుకాణ్ణి నేను భూతలం మీద చూడలేదని ప్రశంసిస్తాడు.

భీష్ముని మాటలు లెక్కసేయకుండానే ధృతరాష్ట్రుడు సంజయుని వైపు తిరిగి ధర్మజుని అభిప్రాయాన్ని గురించి అడుగుతాడు. ఒక్కమాటలో చెప్పాలంటే -

"వినుము నరేంద్ర! పాండు పృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁగోరు మీరు తమ యయ్య సగంబును భూమి యీకత
క్కిన మఱి కాని ముంద రొక కీడుఁ దలంపఁడు, మీ బలంబునె
ల్లను మదిఁ జీరికిం గొనడు లావున నేలఁ గొనందలంచినన"

ధర్మరాజు భీమాదుల పరాక్రమాలను తెలిపిన పద్ధతిని కూడా సంజయుడు స్పష్టపరిచాడు. ధృతరాష్ట్రుడు భీమ సేనాదుల బలాలను విని భయకంపితుడయ్యాడు. అతని భయాన్ని తొలగిఅంచటానికి దుర్యోదనుడు తన వైపున్న వారి బలపరాక్రమాలను ప్రస్తుతించాడు. సంజయుడు పాండవ దివ్య శక్తులను వివరించాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు- 'కౌరవ వీరులు అసాధ్యులు కదా వీరిని ఎలా సాధించగలమని పాండవులు భావిస్తున్నారో తెల్పుమని అడిగాడు. సంజయుడు ఇలా బదులు చెప్పాడు -

భీష్ముడు శిఖండి పాలపడతాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి పాలపడతాడు. రారాజు అతని తమ్ములు భీముని పాలబడి ప్రాణాలు వదులుతారు; కుమారులందరు అభిమన్యుని పాలు, శకుని సైంధవులు అశ్వత్థామ కర్ణులు మిగిలిన మహావీరులు సవ్యసాచి పాలు; కృతవర్మ సాత్యకిపాలు, శకుని ఉలూకాదులు నకుల సహదేవుల పాలు, శల్యుడు దర్మరాజు పాలు - అని పాండవ పక్షంలో కృతనిశ్చయులై ఉన్నారని సంజయుడు స్పష్టం చేశాడు. దర్మజుడు రాజై హరి జయంవైపు నడిపించగా సాగే పాండవ సైన్యాన్ని దుర్యోధనుడు లెక్కచేయడు. ఇక నాజన్మం దుఃఖభాజన మౌతుందో ఏమో అని ధృతరాష్ట్రుడు ఖిన్నుడైనాడు. దుర్యోదనుణ్ణి పాండవులతో సంధిచేయమని సామవాక్యాలు చెపుతాడు. దానికి కాదని దుర్యోధనుడు తన బలపరాక్రమాలను కీర్తించుకొంటాడు. అతనికి ఆసటగా కర్ణుడు వీరవాక్యాలు పలుకుతాడు. భీష్ముడు కర్ణుని ప్రగల్భాలను నిందిస్తాడు. దానికి కోపగించి భీష్ముడు కర్ణుని ప్రవర్తనను ఖండిస్తాడు. ఇతడా కౌరులను రక్షించేది అని అధిక్షేపిస్తాడు.

సంజయుని సందేశాన్ని దుర్యోదనుడు పెడచెవిని పెట్టాడు. ధృతరాష్ట్రుడు విని మౌనంగా ఊరకున్నాడు. సభాసదులందరు దిగ్గునలేచి ఇళ్లకు వెళ్లిపోయారు. సంజయుడు మాత్రం తండ్రికొడుకుల ముందు సాక్షిగా నిలిచాడు.

ఆ తరువాత వ్యాసుడు ప్రసన్నుడై ధృతరాష్ట్రుణ్ణి శ్రీకృష్ణుని నాశ్రయించుమని ప్రబోధిస్తాడు. దానికతడు అప్పటికి సుముఖతను ప్రకటిస్తాడు.

ఉపప్లావ్య నగరంలో ధర్మరాజు తమ్ములలను, బంధువులను, ద్రౌపదిని వెంటపెట్టుకొని శ్రీకృష్ణుని మందిరానికి వెళ్ళి కౌరవ సభకు అతణ్ణి దూతగా పంపితే శుభం కలుగుతుందనే అభిప్రాయంతో ఇలా మనవి చేశాడు.

"మహాత్మా! ఆపదల నుండి రక్షించటానికీ, శుభములు కలిగించటానికీ ఈ జన్మకు పాండు భూపాలుడు నిన్ను చూపించి వెళ్లాడు. మిత్రకార్యం చక్కజేసే సమయం వచ్చింది. నీవు కారణంగా అవినీతుడైన ఆ దుర్యోదనునితో యుద్ధం లేకుండా మా వంతు రాజ్యాన్ని మేము పొందగలుగుతాం." ఆ మాటలకు మాధవుడు సంతోషించి "మీరు చెప్పినట్లే చేస్తాను" అని పేర్కొన్నాడు. అందుకు ధర్మరాజు ఇలా అన్నాడు.

"నిన్న సంజయుడు పలికిన మాటలను బట్టి మా తండ్రి ధృతరాష్ట్రుని తలపు, దుర్యోదనుని వైఖరి మనకు తెలిసాయి కదా? రాజ్య భాగం ఇవ్వకుండా మంచి మాటలతో మా అలుక తీర్చటానికి యత్నించారు. పదమూడేండ్లు మేము పడరాని పాట్లు పడి నియమం పాటించి వచ్చియుఅన్నం. కుల ధర్మాన్ని పాటింపదలచుకోడా పెద్దరాజు. కొడుకు

వక్రబుద్ధిని మాన్పలేడు. ఇంతకంటె మాకు వేరే కీడేమైనా ఉందా? ఇక్కడి బంధువులు నీవు అబ్బురపడి వినేటట్లు మాకు అయిదూళ్లిచ్చినా చాలని అన్నాను కదా? దానికీ వారు పూర్తిగా వ్యతిరేకమే. ఆ దుర్యోధనుడు ఆ మాత్రం అంగీకరింపలేడా? ఔన్నత్యం లేకపోగా క్రూరత్వం ప్రదర్శిస్తే మరీ సహించలేం. సంపద నాకెందుకని అంటారా? నేను పోషింపవలసిన చుట్టాలకు గ్రాసవాసోదైన్యాలు వస్తాయి. కాబట్టి సంపదను మే మిరువురం పంచుకొని అనుభిస్తే సంతోషం కలుగుతుంది.

లోకంలో పెరవారైనా, పగవారైనా చంపుకోలునే ఎందుకు కోరతారో? మరి మార్గమే లేదా? అది మంచిది కాదా? బంధుమాత్రలు కౌరవుల వైపున్నారన్న సంగ గణించకుండా సంపద కోసం వారిని వధించటం దానివలన పాపాప్తి పొందటం ఆ దురవస్థలను సహించవచ్చునా? శస్త్ర జీవితమే క్షత్రధర్మం. మేము మరొక ధర్మాన్ని ఆచరించరాదంటారు. అయినా వంశ నాశనం అభిమతం కాదు. కాబట్టి మా క్షత్రియ దర్మ నిర్వహణం అత్యంత దుర్లభం. యుద్ధమైతే దానివలన అటు సంపద రావచ్చు లేదా ఇటు ప్రాణం పోవచ్చు. ఒక్కొక్కసారి పలువురు ఒక వీరుని చేతులో ఓడి పారిపోవటం సంభవించవచ్చు. బలవంతులు బలహీనుల చేత చెడటం కూడా సంఘటిల్లవచ్చు. రన రంగంలో జయాపజయాలు దైవాధీనాలు. పరాజయమైతే మరణం కంటె మనస్సును అధికంగా బాధిస్తుంది. పోరు లేని ఉపాయంతో శత్రువులను కడతేర్చగలిగిన వాడు గుండె మీద చెయిపెట్టుకొని నిద్రించగలుగుతాడు. మనసులో పగ ఉంటే పామున్న యింట్లో ఉన్నట్లుంటుంది. చిత్తశాంతి ఉండదు. కాబట్టి అధిక దీర్ఘ వైర వృత్తి ఎప్పుడూ తగదు.

"పగయడఁగించు టెంతయు శుభం, బది లెస్స, యడంగునే పగం
బగ, వగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే, కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు,నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!"

కావున శాంతియే తక్షణ కర్తవ్యం. అది అలా ఉండగా సంపద కావాలనీ, యుద్ధం కాకూడదనీ మేం కోరుతున్నాం. మా సంపద కోల్పోకుండా కుల క్షయం పుట్టకుండా మరొక పద్ధతిలో ఏ విధంగా చక్కబడినా అది మాకు నచ్చుతుంది. జనార్ధనా! మా మీద పక్షపాత వైఖరి ప్రకటించవద్దు. దర్మ నీతి వర్తనాలలో రెండువైపులా హితం అభ్యుదయం కలిగే విధాన్ని బోధించు విదురాది సజ్జనుల బుద్ధులకు నచ్చేటట్లు నిపుణంగానూ భూపతులకందరికీ తెలిసేటట్లు పరుషంగానూ వక్తవ్యాంశాన్ని తెలియజెప్పు.

రాజు అన్యాయంగా పరుషవాక్యాలు పలికినప్పటికీ వాటిని సహించి నిందు

సభలో నిలిచి మాట్లాడు. పెద్దల మాటలను, ప్రభువుల తలపులనూ మన్నించని దుర్యోధనుని యెదుట కురువృద్ధుల దలపులను మనం గౌరవించితే జనులు మెచ్చుతారు. దుర్యోధనుని పక్షం చేరి ధృతరాష్ట్రుడు అవినీతి చేసినప్పటికీ ఇక సంధి యత్నం సఫలం కాదని వెంటనే తిరిగి రాబోకు. ధైర్యంతో జనులెల్లరూ తెలిసికొనేటట్లు మా అభిప్రాయాలను సభలో నిశ్చింతగా ప్రకటించు. ఎన్ని సంకటాలు వచ్చినా ఎంత మనస్సు క్షోభించినా ఈ కార్యాన్ని నిర్వహించగలిగిన దక్షుడవు నీవే. నీ వే రకంగా ఈ కార్యాన్ని నడుపుతావో - అదే నాకు ప్రియిమైనది." ధర్మరాజు మాటలకు కృష్ణుడు ఇలా అన్నాడు.

"ధర్మనందనా! నీ మాట నిజం. ఆ ధృతరాష్ట్రుడు అట్టివాడే, తండ్రికి తగ్గకొడుకు దుర్యోదనుడు. నీ మనసులోని భావం నేను తెలుసుకొన్నాను. అనుమానం పెట్టుకోకు. వినదలచుకుంటే విను - నాకు నిజంగా కోపం వస్తే యుద్ధంలో నా కెదురు నిలిచి పోరాడే వాడు ఒక్కడు లేడక్కడ. కాబట్టి, నన్ను నిశ్చింతగా కౌరవ సభకు పంపు. నేను వెళ్లి రావటం వలన మేలు. అర్థసిద్ధి కలుగుతాయి. మనవైపు ఎటువంటి వంకపెట్టకుండా ఉండే స్థితి కలుగుతుంది." కృష్ణునిమాటలకు సంతుష్టుడై ధర్మరాజు కృతజ్ఞతా సూచకంగా అన్నమాటలివి-

"మేలగుగాక, నీ యిచ్చ వచ్చిన విధంగా వ్యవహరించి మేమూ వారూ కలిసి ఉండేటట్లు ఏ విధంగానైనా ఒప్పందం కుదిరించు. మనకది మంచిది. నీకు మేం తెలుసు, వారు తెలుసు. హితమేదో తెలుసు; సాధించవలసిన అర్థసిద్ధి తెలుసు; వాక్యపద్ధతి విశేషంగా తెలుసు, ఇంతతెలిసిన నీకు బుద్ధులు చెప్పటానికి నేనెవ్వరిని?" అని ఆప్యాయంగా అభినందించాడు.

శ్రీకృష్ణుడు ధర్మరాజుకు కౌరవులు చేసిన దుర్ణయాలను జ్ఞాపకంచేసి, ఆ సుయోధనునికి ఆయువున్నంతవరకు మీకు రాజ్యంలో ఆవంతభాగం పంచి ఇవ్వడు. కాబట్టి యుద్ధం తప్పదు. దానికి అనుగుణమైన వకునాలు ఎన్నో కనపడుతున్నాయి. కాబట్టి నీవు ఉత్సాహాన్ని తగ్గించుకోవద్దు. చతురంగ బలాలను ఆయత్తం చేసుకొంటూ, సాయం చేసే దొరలను పురి కొల్పుకొంటూ సమరానికి సన్నాహం సాగించుమని ప్రోత్సమించాడు.

పోరుకు ప్రోత్సాహం కలిగిస్తున్న పురుషోత్తముని చూచి భీముడు రోషంతో - ధర్మరాజు కోరుతున్నది శాంతిగాని యుద్ధం కాదని జ్ఞాపకం చేశాడు. పాలూ నీరూ లాగా పాండవులూ కౌరవులూ కలిసి నివసిస్తూ ఉంటే దుర్యోదనుడు దుర్మార్గపు చేష్టలతో ఇంతపని చేశాడు. కులక్షయానికి కారకుడయ్యాడు. అది తప్పదు. అయినా నీవీ రాయబారి బిరుదంతో సాధ్యమైనంతవరకు సార్థక్యాన్ని సాధించు. ఏ విధంగానైనా ప్రజలకు హితమయ్యేటట్లు సంధిని సాధించాలని నొక్కి చెప్పాడు.

భీముడు శాంతి వాక్యాలు మాట్లాడటం వినేవారికి ఆశ్చర్యం కలిగించింది. అతని పౌరుషం ఆరిపోకూడదని భావించి గోవిందుడు అతనిని అధిక్షేపించాడు. యుద్ధమంటే భయపడి భీముడు శాంతిని కాంక్షిస్తున్నాడని పరాచకాలాడాడు. దానికి భీము డేభిమానపడి శ్రీకృష్ణుని నెద్దేవ చేశాడు. క్రుద్ధుడైన భీముణ్ణి చూచి శ్రీకృష్ణుడు 'నీకు కోపం అలంకారమైనట్లు శాంతం కా'దని సర్ది చెప్పి యుద్ధోత్సాహాన్ని అతనిలో ఉరకలెత్తించేటట్లు చేశాడు.

అర్జునుని అభిప్రాయాన్ని అడిగాడు గోవిందుడు - అతడిలా అన్నాడు.

"నీ వొనరింపఁబూనిన పనిం గమలోదర కీడుపుట్టునే
కావనినట్లయుండి యవుఁ గార్యము లట్లగుటం బ్రయత్న సం
భావన సేత పౌరుషము పద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము తోడ్పడన్ వలయుఁదథ్యము రెండును నీ వినోదముల్".

దానికి సమాధానంగా కృష్ణుడు - "నేను సంధికోసం ఓపినంత పురుషకారం చేస్తాను. దైవం చేత ఏమౌతుందో నాకు తెలియదు. అయినా, బాల్యంనుండి మీకు కీడు చేయాలని ఇన్ని పాపాలు చేసిన దుర్యోధనుడు ఇప్పుడు సంధి సందేశాన్ని అంగీకరిస్తాడని నేను అనుకోను - అని ఖచ్చితంగా చెప్పాడు.

నకులుడు - వాసుదేవుని వ్యక్తిత్వం సంధి జరగటానికి ఎంతో తోడ్పడుతుందనీ, గోగ్రహణం తరువాత కౌరవులు తప్పక మెత్తబడతారనీ ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు. కాని, సహదేవుడు మాత్రం పౌరుషంతో సంధి యత్నాన్ని సమర్థించలేదు. సుయోధనుడు రాజ్యభాగాన్ని ఇస్తాడని విశ్వసించలేదు. సాత్యకి సహదేవుని అభిమతాన్ని సమర్థించాడు. వారిద్దఱి వీరాలాపాలను సభికులు విని ప్రశంసించారు.

చివరకు పాంచాలి కూడా తన అభిప్రాయాన్ని వాసుదేవునికి తెలియపరిచింది. ఆమెకు ధర్మజుని శాంతి వచనాలు దు:ఖాన్ని కలిగించాయి. గొంతు గద్గదమైపోయింది. అభిమానం అవమానాగ్నిచేత ప్రజ్వలితమైంది. అన్నతో ఆర్ద్రంగా ఇలా మొరపెట్టుకొంది.

"పద్మనాభా! నేను వరంవలన పుట్టాను. భరతవంశంలో మెట్టాను; పాండు భూపాలునికి కోడలైనాను. జనవంద్యులైన పాండవులను భర్తలుగా పొందాను; నీతి విక్రములైన పుత్రులను కన్నాను; అన్నదమ్ముల ప్రాపు గాంచాను, నేను ఇన్ని విధాలుగా ప్రసిద్ధి కెక్కాను. ఇవన్నీ ఒక యెత్తు. రాజసూయా వభృద స్నానంతో పవిత్రమైన నా వేణిని ఒక అధముడు ఈ అయిదుగురూ చూస్తూ ఉండగా నిండు సభలో లాగి అవమానించాడు. ఆ సభలో ఏకవస్త్రనయిన నన్ను దుశ్శాసనుడు అలా అవమానిస్తూ ఉండే వీరు చిత్రపటాల్లా మిన్నకుండి

పోతే ముకుందా! నిన్ను నేను విశ్వాసంతో స్మరించాను. ఆ సన్నివేశాన్ని సంధిసమయంలో మరువబోకు-" అని అంటూ -

"ద్రోవతి బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంద్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొందు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై".

గోవిందుని ముందు బెట్టి - "ఇవి దుశ్శాసనుని వ్రేళ్లను తగిలి సగము తెగిపోగా మిగిలి ఉన్న శిరోజాలు. వీటిని నీవు సంధివచనాలు పలికేటప్పుడు మరచిపోబోకు. నా క్రొమ్ముడిని పట్టి లాగిన ఆ దుర్మార్గుడు తన శరీరం రణరంగంలో ముక్కలు ముక్కలై గుర్తించటానికి వీలులేనంత దయనీయంగా చావాలి. అప్పుడు కాని నా గుండెలోని మంట చల్లారదు. ఇన్ని కష్టాలు పడటానికి కారకుడైన ఆ రారాజు పీనుగును కన్నార చూడకపోతే ఆ భీమసేనుని పెనుగద, ఆ సవ్యసాచి గాండీవం కాల్పనా?

"నెట్టన యిట్టి యల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టిన యట్లు పెద్యఉను గాలము దీనికి నాఋబెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తో
బుట్టువు నీవు తేజమునఁ బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా!"

అని గొంతు వణుకుతూ ఉండగా ద్రౌపది యేడ్చింది.

శ్రీకృష్ణుడామెను ఆదరంతో ఓదార్చాడు. కన్నీరు తుడిచి కూర్చుండబెట్టాడు. ఆమె పన్నెఱి వేణిని ముడవటానికి ముదితలను ఆదేశించాడు. ఆప్యాయంగా ఆమెకిలా ధైర్యం చెప్పాడు.

"చెల్లీ! నీనుండగా నీకెందుకీ శోకం. ధర్మజుడు పంపగా, భీమార్జునులు వెంటరాగా నేను రణరంగంలో శత్రుక్షయాన్ని చేస్తాను. మరొక రకంగా జరిగే అవకాశంలేదు. దురాత్ములైన కౌరవులు రాజ్యం ఇస్తారా? తల్లీ! నీవేడ్చే రోజులు పోయాయి. కౌరవుల భార్యల యేడ్పులు విని నీవు కలకల నవ్వే రోజులు దగ్గర పడ్డాయి. యముని మహిషపు లోహ ఘంటల వికృత నాదాన్ని వినాలని కుతూహల పడుతున్న కౌరవులకు సంధి కార్యశాంతి వచనాలు సంతోషాన్ని కలిగిస్తాయా? విధి లిఖితం అలాగే ఉంది. అది తప్పక జరిగి తీరుతుంది. నేను కూడా ప్రతిజ్ఞ చేసి చెపుతున్నాను - పాండవులు శత్రు సంహార ంచేసి ఉజ్జ్వల పుణ్య లక్ష్మీ సమేతులై అధిక

విభవాన్ని పొందుతారు. నీవు చూస్తావు; ఆలస్యం లేదు; ఇది నిజం" అని ఊరడించి పలికాడు.

ఆపైన కౌరవ పాండవులకు హితం చేయటానికి ధర్మరాజు పంపగా ధ్రుతరాష్ట్రుని వద్దకు రాయబారిగా పోతానని శ్రీకృష్ణుడు పయనమైనాడు. శ్రీకృష్ణుడా సాయంకాలానికి కుశ స్థలం చేరాడు. ధ్రుతరాష్ట్రునకు వర్తమానం అందింది. భీష్మాదులను దుర్యోధనాదులను పిలిచి శ్రీకృష్ణుని రాకను గురించి ఆలోచించాడు. శ్రీకృష్ణుని రాక శుభప్రదమనీ అతని మనస్సుకు నచ్చే పని చేస్తే ఇహపరదాయకమనీ విదురాదులు చెప్పారు. పాండవులకు రాజ్యంలో సగభాగం ఇస్తే గోవిందుడు సంతోషిస్తాడని భీష్మాదులు సూచించారు. దుర్యోధనుడు ఈ రెండింటినీ కాదన్నాడు. భాగమిస్తే భయపడ్డామని అధిక్షేపిస్తారనీ, శ్రీకృష్ణుణ్ణి లంచమిచ్చి వశపరుచుకొన్నా, లేదా బంధించి వశం చేసుకొన్నా పాండవ పక్షం వారందరూ రెక్కలు విరిగిన పక్షులాల్లగా తనకు వశమైపోతారనీ దుర్యోధనుడు దుష్టభావనం చేశాడు. భీష్మాదులు దానిని గర్హించారు.

మరునాడు శ్రీకృష్ణుడు హస్తినాపురికి వచ్చాడు. ప్రజలు అతనిని ఆసక్తితో చూచి పూలతో సీసలతో గౌరవించారు. మాధవుడు ధ్రుతరాష్ట్ర మందిరంలో కురువీరులందరినీ దర్శించాడు. విదురనింట భోజనంచేశాడు. కుంతని పలుకరించాడు. ధ్రుతరాష్ట్రుని నిండుకొలువులో జలదస్వర గంభీర స్వరంతో సకల జనులు, మహర్షులు సమ్మోదాంబుధిలో తేలేటట్లు మాట్లాడాడు.

"భరతకులంబు ధర్మమును బాడియు సత్యము బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండుననఁగా నుతిఁగన్నది యందు సద్గుణో
త్తరులను నీవు నీయనుఁగు దమ్ముఁడు నీ తనయుల్ యవోధురం
ధరశుభశీలు రీసుచరిత క్రమ మిప్పుడు దప్ప నేటికిన్?"

"ఈ వంవమున కెల్ల నీవ కుదురిం దెవ్వారి చందంబు లె
ట్లైె వర్తిల్లినఁ గీడ మేలుఁ దుది నీయందొందెడుం గాన స
ద్భావం బారసి లోని పొత్తు వెలి వృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధంమునం గౌరవ్య వంశాగ్రణీ!"

"వినుము సుయోధనాదులగు వీరు సధర్ములు గాక కార్యము
ల్గానక మహార్థ సిద్ధి యెడలుం దమ కిట్లన కన్వయంబు వ
ర్తన మిది గాదు నొక బెడిదంపుఁ దనంబున బంధుకోటికిన్

న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుంబుయిలోడ రేమియున్."

కౌరవ పాండవుల్ తెఱఁగు గైకొని శాంతత బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గులమంతకు నీ నృపకోటి కుర్వికిన్
బోరితమైన నింతకును బుట్టు మహాపద గావున ధరి
త్రీరమణాగ్రగణ్య గుణుతించి యవవ్యము బొం దొనర్పవే."

శ్రీకృష్ణ సందేశం సభాసదులు శ్రవణానందంగా విన్నారు. పాండవులు చివరకు చెప్పమన్న మాటలను క్రోడీకరించి ఇలా పేర్నొన్నాడు -

"సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపము చేత బొంకుచేఁ
చారముఁ బొంద లేక చెడఁబారిన దైన యవస్థ దక్షులె
వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవముండెడున్".

ని సభాసదుల నుద్దేశించి పలికి, ధృతరాష్ట్రునితో "వారి తండ్రి పాలు వారి కిచ్చి, నీ పాలు నీవు పుత్ర పౌత్రులతో అనుభవిస్తూ సుఖంగా ఉండటం బంధుమిత్ర కోటి మెచ్చే తెర'గని పేర్కొన్నాడు. చివరకు -

"వారలు శాంతి శూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నారటుఁగాక మీకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చు చుండుదురు భూవర రెండు బెఱంగులందు నీ
కారయఁ బద్యమేది యగు నవ్విధమేర్పడ నిశ్చయింపుమా!"

శ్రీకృష్ణుని గంభీరోపన్యాసం దుర్యోధనాదులకు తప్ప మిగిలిన వారందరిని ఆకర్షించింది; అతని వాదాన్ని ఏకగ్రీవంగా అంగీకరించేటట్లు చేసింది. నారదాది మహర్షులు, భీష్మాది కురువృద్ధులు, విదురాదులు దుర్యోధనుణ్ణి సంధికంగీకరించుమని కోరారు. అతడు వారి అభిమతాలను తిరస్కరించారు. దుర్యోధనుడు చిన్ననాటినుండి పాండవులకు నిష్కారణంగా తలపెట్టిన ఎగ్గులను శ్రీకృష్ణుడు ఏకరువు పెట్టి అధిక్షేపించాడు. కులపాంశనుని వధించి కులాన్ని రక్షించుకొనండని ప్రబోధించాడు. గాంధారి కొడుకుకు నీతులు చెప్పింది; ధృతరాష్ట్రుడు సుయోధనుణ్ణి సంధి కొడబడుమని అనునయించాడు. ఎవరెన్ని చెప్పినా దుర్యోధనుడు వినక దుశ్శాసనాదులతో మంతనాలు సలిపి శ్రీకృష్ణుణ్ణి నిండు సభలో బంధించి కారాగారంలో పడవేయాలని యత్నించాడు. అప్పుడు వాసుదేవుడు ధృతరాష్ట్రునితో ఎలుగెత్తి 'నీకొడుకు నేనొంటరివాడనని బంధించ యత్నిస్తున్నా'డని ప్రకటించి దరహాసం

చేశాడు. శ్రీకృష్ణుడు నిండుకొలువులో విశ్వరూప సందర్శనాన్ని ప్రసాదించాడు. ఆ తేజో రూపాన్ని జనం చూడలేక కన్నులు మూసుకొన్నారు; నారదాదులు భీష్మ విదుర ద్రోణ సంజయులకు గోవిందుడు దివ్యదృష్టినిచ్చాడు. వారా దివ్యరూపాన్ని దర్శించి పరమానందాన్ని పొందారు. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని ప్రార్థించి తానుకూడా దివ్యదృష్టిని పొంది దివ్యదర్శనం చేసుకొన్నాడు. మరల ఇతరులను చూడకుండానే దివ్యదృష్టిని ఉపసంహరింప చేయుమన్నాడు. అలాచేసి శ్రీకృష్ణుడు సాత్యకితో కలిసి సభలోనుండి వెలుపలకు వచ్చాడు.

హస్తినాపురినుండి హరి ఉపప్లావ్యానికి బయలుదేరాడు. కుంతిని దర్శించాడు. కొడుకుల యోగక్షేమాలు తెలిపాడు. వారికి సందేశమిమ్మని ఆమెను అడిగాడు. "క్షత్రియులు పరాక్రమార్జిత విత్తాన్ని అనుభవించాలి గాని, కందమూలదులను కాదని చెప్పింది. ఆ నాడు కొలువులో ద్రౌపది పొందిన భంగపాటును మరువవద్దనీ, ప్రతీకారం తీర్చుకొని చిరకీర్తిని గడించుకొమ్మనీ" వీరమాతలా సందేశం పంపింది.

శ్రీకృష్ణుడు కర్ణుణ్ణి తన రథమెక్కించుకొని కొంతదూరం తీసికొని పోయి అతని జన్మవృత్తాంతం చెప్పి, పాండవులలో కలిసిపొమ్మని కోరాడు; పాంచాలి అతనిని ఆరవ భర్తగా అంగీకరిస్తుందని హామీ ఇచ్చిడు. కర్ణుడు కృష్ణునికి తగిన సమాధానమిచ్చాడు. కుంతీదేవి తనను కనినప్పటికీ సూతపత్ని పెంచింది. అంతకాలం సూతపుత్రుడుగా ప్రసిద్ధి కెక్కి ఇప్పుడు కాదనటం పాలు పిండిన తరువాత పొదుగు కోసినట్లవుతుందని కర్ణుడు భావించాడు. కర్ణున్ని అర్జునుని ఎదురుగా నిలుపదగిన శక్తి అని దుర్యోదనుని విశ్వాసం. అతని విజయమంతా కర్ణునిపై గల ఆశ మీదనే ఆధారపడి ఉంది. ఇప్పుడు పాండవ పక్షం వస్తే పార్థునికి భయపడి వచ్చాడని అందరూ అంటారు. అంతేకాక నమ్మిన రాజును మోసం చెయ్యటమౌతుంది. కృతఘ్నత అవుతుంది. మరొకటి - యుద్ధానంతరం రాజు కాదగినవాడు ధర్మరాజు. కర్ణుడు అగ్రజుడని తెలిస్తే అతడు రాజ్యం స్వీకరించడు. ధర్మజుడు - అతని తమ్ములు ఋత్విజులుగా, శ్రీకృష్ణుడు ఉపద్రష్టగా రణ యజ్ఞంలో కురు కుమార పశు విశసనం చేస్తాడు" అని కర్ణుడు తన మనోగత భావాలను వ్యక్తం చేశాడు. రాబోయే యుద్ధంలో కర్ణార్జునులలో అర్జుననిదే విజయమని శ్రీకృష్ణుడు ప్రకటించి కర్ణుని ఇంటికి పంపి తాను ఉపప్లావ్యానికి చేరుకొన్నాడు.

కౌరవాన్వయ మహార్ణవం ఇంకిపోయేటంతగా ఏర్పడిన విపత్తును గురించి విదురుడు కుంతితో చెప్పి విచారించి వెళ్ళిపోయాడు. ఆమె ఈ విపత్తును తొలగించే మార్గంకోసం ఏకాంతంగా ఆలోచించింది. రహస్యంగా కర్ణుని వద్దకు వెళ్లి అతని జన్మ రహస్యాని తెలిపి, సహోదర స్నేహాన్ని అతని హృదయంలో పెంపొందింపజేసి, క్రమంగా

యుద్ధ యత్నాలను విముఖం చేయవచ్చునని భావించింది. గంగానదికి అనుష్ఠానార్థం కర్ణుడు రాగా అతనిని కుంతి దర్శించింది. అతడామెకు నమస్కరించాడు. ఆమె అతనితో జన్మవృత్తాంతాన్ని వివరించి చెప్పింది. కుంతీకుమారుడగుటచేతనూ, పాండవ ధార్తరాష్ట్రుల కంటె పెద్దవాడు కావటం చేతనూ భూమికి తానే రాజు కాదగినవాడవని ప్రోత్సహించింది. ఆమె మాటలకు అతడు చలించలేదు. "క్షత్రియ సంస్కారాలు చేయకుండా అప్పుడు నీటిలో ఆవిధంగా పారవేసి, ఈనాడు ఈ విధంగా పలకటం న్యాయమా! సూర్యానుగ్రహం వలన పుట్టిన నేను నింద్యుడను కాకపోయినా నా జన్మ రహస్యంగా ఉండిపోయింది. అది ఇప్పుడు ప్రకటనం చేయటం ఎంతవరకు మేలు? విజయ విక్రమం ప్రసిద్ధి చెంది ఉండగా నేనిప్పుడు పాండవులలో కలిస్తే భయపడి ఈ పని చేశాడని లోకుల నిందించరా? నాపై ఆశలు పెట్టుకొన్న దుర్యోధనుణ్ణి ఈ తరుణంలో విడవటం న్యాయమా? కాబట్టి నేను దుర్యోధనుని పక్షంలో ఉండి నీ కొడుకులతో యుద్ధం చేస్తా'నని అతడు సేవా ధర్మపరాయణుడై పలికాడు. పాండవులలో ఒక్క పార్థుని తప్ప మిగిలినవారు చేజిక్కినా వారిని చంపనని మాట ఇచ్చాడు. యుద్ధంలో కర్ణుడు గాని, అర్జునుడు గాని ఎవరో ఒకరు మిగులుతారు. అతనితో కలిసి కుంతీపుత్రుల అయిదుగురు కాగలరని ఆరుగురు ఎన్నడూ కారని హెచ్చరించాడు. ఆమె కర్ణుని కౌగిలించుకొని అదంతా విధివిలాసమని పేర్కొని, కర్ణుని మాటల కంగీకరించి, అతనిని ఆశీర్వదించి నిజ నివాసానికి వెళ్ళిపోయింది.

శ్రీకృష్ణుడు ఉపప్లావ్యంలో ధర్మరాజుకు హస్తినాపురి విశేషాలన్నింటినీ వివరించాడు. అప్పుడు "మాకు ధర్మచ్యుతి లేకుండా భావి కార్యాని నిశ్చయింప,'మని నారాయణుని ధర్మరాజు ప్రార్థించాడు. అతని నిర్ణయమిది -

"యుద్ధమ కాక కార్యమును నొండొక టెద్దియుఁ గల్గ నేర్చునే
బుద్ధులు సెప్ప వాక్యముల పోల వినందన నేల యట్టిచో
బద్ధునిఁ జేయఁజూచె నను బట్టి సుయోధనుఁడింక నయ్యసం
బద్ధుని తోడి సంధికి నుపాయము నా మతి దోప దెమ్మెయిన్".

శ్రీకృష్ణుని నిర్ణయంతో యుద్ధం నిశ్చయమైంది. అతని సూచనపై ధృష్టద్యుమ్నుడు పాండవ సర్వ సైన్యాధ్యక్షుడుగా అభిషిక్తుడైనాడు. అలాగే అక్షౌహిణీపతులైన దండనాథులను శ్రీకృష్ణుడే నిర్దేశించాడు. కౌరవులతో యుద్ధం చేయటానికి కురుక్షేత్రంలో సైన్యాన్ని సంఘటించాలని నియమించాడు. శుభశకునాల మధ్య యుధిష్ఠిరుని సైన్యం ఉత్సాహంతో కురుక్షేత్రానికి చేరింది.

దుర్యోదనుడు ద్రోణాదులను పదకొండు మందిని అక్షౌహిణీ పతులనుగా చేశాడు.

వారలను భీష్మునికి చూపి అతణ్ణి సర్వ సైన్యాధక్షునిగా అభిషేకించాడు. బలరాముడు తీర్థయాత్రలకు వెళ్లాడు. భీష్ముడు కురు పాండవ వీరుల అంతరాలను తెల్పి కర్ణుని అర్థరథుని గానూ, అర్జునుని సాటిలేని మహారదుని గాను పేర్కొన్నాడు. భీష్ముడు తాను శిఖండిని చంపలేనని చెప్పాడు. అయినను ఆ పాండవ సేనా సాగరం ఇంకిపోయేటట్లు యుద్ధం చేస్తానని సైన్యాన్ని ఉత్తేజపరిచాడు.

# భీష్మ పర్వం

పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రంలో కౌరవ పాండవ సేనలు యుద్ధానికి సన్నద్ధమై ఉన్నాయి. ధృతరాష్ట్రుడు కొడుకుల అవినయానికి నిర్వేదాన్ని పొందుతున్నాడు. త్రికాలవేదియైన వ్యాసుడు వచ్చి ధృతరాష్ట్రుని సమ్మతిమీద సంజయునికి దివ్యదృష్టిని ప్రసాదించి ఆ రెండువైపులవారు రాత్రింబవళ్లు వ్యవహరించే విధానాలను చూడగలిగేటట్లు, రహస్య భాషణాలు వినేటట్లు, మనోవృత్తాలు తెలుసుకొనేటట్లు వరమిచ్చాడు. అదువలన యుద్ధవృత్తాంతాన్ని సంజయుడు దివ్య దృష్టితో చూచి చెపుతుంటే ధృతరాష్ట్రుడు ఎప్పటికప్పుడు వింటూంటాడు.

యుద్ధం మొదలౌతుందేమో అని అనుకుంటున్న సమయంలో ధర్మరాజు పాదచారియై భీష్మునివైపు నడవటం మొదలు పెట్టారు. అందరూ ఆశ్చర్యపోయారు. శ్రీకృష్ణార్జున భీమనకుల సహదేవులు అతని వెంట నడిచారు. ధర్మరాజు భీష్ముని దగ్గరకు వెళ్లి నమస్కరించి యుద్ధం చేయటానికి అనుమతిని, ఆశీస్సులను కోరాడు. భీష్ముడు సంతోషించి వరం కోరుకోమన్నాడు. యుద్ధంలో భీష్ముని గెలిచే పద్ధతి చెప్పమని ధర్మరాజు ప్రార్థించాడు. అది సమయం కాదనీ, తరువాత కలుసుకోవటం సమంజసమనీ భీష్ముడు పేర్కొంటాడు. ధర్మజుడు కృతజ్ఞతలతో ముందుకు సాగాడు. ద్రోణుని సమీపించి నమస్కరించాడు. రణానికి అనుజ్ఞను కోరుతూ విజయాన్ని అభ్యర్థించాడు. 'నాచేత చాపం ఉండగా నన్ను జయించటం అసాధ్యం. నేను ప్రాయోపవేశం చేసి అస్త్రసన్యాసం చేస్తే అప్పుడు చంపవచ్చు'నని సూచించాడు. కృపాచార్యుని మరణ రహస్యాన్ని అడగాలని ఉన్నా ధర్మరాజు అడగలేక నమస్కరించాడు. ఆచార్యుడతనికి విజయం కలుగుతుందని ఆశీర్వదించాడు. అలాగే ధర్మజుడు శల్యునికి నమస్కరించి కర్ణరథ సారథ్యం చేసేటప్పుడు

పాండవులకు ఉపకారం చేయుమని కోరాడు. అతడు దాని కంగీకరించాడు. ఇలా పెద్దల అనుమతి విజయహేతువు కాబట్టి దానిని పొంది దర్మరాజు తన రథంమీదకు వచ్చాడు.

త్రోవలో వినోదం చూడటానికి వచ్చిన కర్ణునితో శ్రీకృష్ణుడు ఎకసక్కెంగా 'భీష్మపతనం వరకు పాండవులకు సహాయం చేయరాదా'? అని అడిగాడు. కర్ణుడు కురుపతికి ఇచ్చిన ప్రాణాన్ని మరొకవైపు చేర్చలేనని బదులు చెప్పాడు. కృష్ణుడు నవ్వి పార్థుని రథంవైపు నడిచాడు.

గాండీవి ధనుర్ధారియై రథమెక్కాడు. చక్రధారి నొగలెక్కాడు. పార్థుడు రథాన్ని రెండు సేనల నడుమ నిలుపుమన్నాడు. కృష్ణుడలాగే చేశాడు. యుద్ధవీరులలో తాతలను, గురువులను, సోదరులను, తనయులను, బంధుమిత్రులను చూచి విషణ్ణుడై విల్లంబును క్రిందవైచి దు:ఖావేశాన్ని ప్రకటించాడు. శ్రీకృష్ణుడు తత్త్వజ్ఞానోపదేశాన్ని భగవద్గీతగా బోధించి అతని మోహాన్ని మాన్పి విజయపథంవైపు నడిపించాడు. యుద్ధం ఆరంభమైంది.

భీష్ముడు మొదటిరోజు యుద్ధంలో పాండవసైన్యాన్ని చెండాడాడు. ఆ రాత్రి ధర్మరాజు తమ్ములతో కలిసి శ్రీకృష్ణుని జేరి భీష్మ ప్రతాపాన్ని గురించి నివేదించుకొన్నాడు. మరునాడు ధృష్టద్యుమ్నుణ్ణి క్రౌంచవ్యూహం పన్నుమని కృష్ణుడు సూచించాడు. రెండవరోజు భీష్మార్జునులకు, ద్రోణ ధృష్టద్యుమ్నులకు పోరు ఘోరంగా సాగింది. మూడవనాడు భీమదుర్యోధనుల యుద్ధం భీకరంగా చెలరేగింది. శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి భీష్మునిపై పురికొల్పాడు. పితామహుని ధాటికి పాండవసైన్యం వికావికలైపోయింది. పార్థునికి యుద్ధం భారమైపోయింది. శ్రీకృష్ణునికి ఆగ్రహం వచ్చి చక్రాన్ని చేపట్టి భీష్మునిపై లంఘించటానికి సిద్ధమయ్యాడు. గోవిందుని చేత మృతిపొందటం కంటె భాగ్యమే ముందని భీష్ముడు శ్రీకృష్ణ చక్రాన్ని ఆహ్వానించాడు. అర్జునుడు శ్రీకృష్ణుని వారించి ఇలా ప్రార్థించాడు -

"కోపము సంహరింపు యదుకుంజర! పాండవకోటి కెల్ల నుం
దేపవు గావె నీవిటు లధీరతఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁడైన ధర్మసుతుశౌర్యము ధైర్యము బాహువీర్యమున్
రూపతిపోక కాదె యను రూపమె నీకిది లోకనాయకా'

శ్రీకృష్ణుడు పార్థుని ప్రార్థనను మన్నించి రోషాన్ని చాలించి నొగలెక్కి మరల పగ్గాలను చేపట్టాడు. అర్జునుడు విజృంభించాడు. భీష్ముడు తొమ్మిదిరోజులు పాండవులకు దినదిన గండంగా సాగేటట్లు పరాక్రమించాడు. తొమ్మిదోరోజు అర్జునునిపై విరుచుకుపడుతున్న భీష్ముని శ్రీకృష్ణుడే స్వయంగా చక్రాయుధంతో మరల ఢీకొనబోయాడు. భీష్ముడు గోవిందుని

క్రీడను మందహాసంతో ఆహ్వానించాడు. మరల పార్థులు శ్రీకృష్ణుని ప్రాధేయపడ్డాడు.

" కయ్యము సేయనేనని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగమేమను నించుకసేపు పోరులన్
డయ్యుట దప్పె నా పయిగడంగిన భీష్మునిపాటు సూతురా
వయ్య రథంబుమీది కిటు లాశ్రితమానము వీటిఁ బుత్తురే".

శ్రీకృష్ణుడు కోపం తగ్గించుకొని మరల నొగలెక్కాడు. భీష్ముడు రణరంగంలో ఉండగా ఇక పాండవులకు విజయం అసాధ్యమనిపించింది.

తొమ్మిదవ నాటి రాత్రి ధర్మజుడు శ్రీకృష్ణుడు తమ్ములు వెంట రాగా రహస్యంగా భీష్ముని మందిరానికి వెడలి నమస్కరించాడు. వారందరిని చూచి పితామహుడు సంతోషించి ఏవరమైనా కోరుకోమని అడిగాడు. ధర్మరాజిలా అన్నాడు. "తాతా! మూడోకన్ను మూసుకొని త్రిశూలం దాచుకొని యుద్ధం చేస్తున్న రుద్రునిలాగా ఉన్న నిన్ను రణ రంగంలో జయించటానికి ఎవరికి సాధ్యం? గెలిచే మార్గం చూపించుమని వేడటానికి వచ్చాం" భీష్ముడార్ద్రుడైనాడు. శిఖండిని ముందుపెట్టుకొని అర్జునుడు వస్తే నేనా శిఖండిపై బాణాలు వేయకుండా ఉండిపోతాను. అప్పుడు అర్జునుడు నాపై శరసంధానం చేయవచ్చు. లేకపోతే నాచేత విల్లుండగా ఎవరైనా జయించటం కష్టమని ఉపాయం చెప్పి పంపాడు. తాతను చేజేతులా చంపుకోవలసి వస్తుందనే బాధలోలోన తొలచివేస్తున్నా పాండవులు పదవ రోజున భీష్ముడు చెప్పినట్లే చేశారు. శిఖండిని ముందుంచుకొన్న అర్జునుడు అతని శరం చాటునే తన విల్లుంచి వాడి బాణాలు సంధించి భీష్ముని శరతల్పం మీద ఒఱ్ఱగి పడిపోయేటట్లు చేశాడు. సూర్యుడస్తమించాడు. భీష్ముడు స్వచ్ఛందమరణ వర బలంచేత ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేంతవరకు ప్రాణాలు ఉగ్గబట్టాడు.

శరతల్పగతుడైన భీష్ముని దర్శించటానికి కురు పాండవ వీరులందరూ వచ్చారు. నమస్కరించి చుట్టూ నిలువబడ్డారు. ఆయనకు తలక్రింద ఎత్తుగా తలగడలను దుర్యోధనుడు తెప్పించగా అతడు వారించాడు. అర్జునునితో అనువైన మూడమ్ముల తలగడను ఏర్పాటు చేయించుకొన్నాడు. దప్పిక తీర్పటం కోసం నీరు తెచ్చారు కురువీరులు. కాని ఉజ్జ్వలమైన బాణంతో పాతాళగంగను త్రాగించమంటాడు భీష్ముడు. ఆపని గాండీవి చేసి తాత మెప్పును పొందాడు. అర్జునుణ్ణి మునినాదునిగా నారదుని వలన విన్నానని తెలిపి నారాయణుని మహిమను చెప్పి వారిని జయించటం సాధ్యం కాదని బోధించి ఇంద్రప్రస్థం రాజధానిగా అర్థరాజ్యాన్ని ఇచ్చి పాండవులతో కలిసి జీవించుమని దుర్యోధనునికి హితవు చెప్పాడు భీష్ముడు. అతడు పెడచెవిని బెట్టి వెళ్లిపోయాడు. పాండవులు నమస్కరించి వెడలిపోయారు.

ఆ తరువాత ఏకాంతంగా కర్ణుడు వచ్చి భీష్మని దర్శించాడు. భీష్ముడు కర్ణునికి రహస్యంగా అతని జన్మవృత్తాంతాన్ని చెప్పాడు. ఆ రహస్యం తనకు వ్యాసుడు చెప్పాడని తెలిపాడు. అందువలన కర్ణుణ్ణి పాండవులతో కలిసి ఉండుమని బోధించాడు. అందుకు కర్ణుడన్నమాటలు -

"వారు మహాబలుల్ హరియు వారినిఁ బ్రాపుగలందు వారలం
బోర జయింపరామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
క్ష్మారమణుండు సేయు తగు మన్నన లెల్లఁదలంచి చూచినన్
భూరి వివేక! యే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే".

"మాటలు పెక్కులాడి యనుమానము లేక సభంగడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ జలంబున: బాండవకోటి కెప్పుడుం
జేటు దలంచి యే బలుపు సేసితి వైరము నాకు నింక నీ
వీటికి వారికవీటికిని వెక్కసమయ్యెడు కయ్యమొప్పగున్".

"దైవాధీనము సర్వమున్ మనమతింత దప్పింపగా వచ్చునే
నీవింకన్ నను నొండువల్కక పరానీకంబుపైఁ బంపుమ
త్సేవా ధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబునం
భావింపప్ విహరించెదన్ మురరిపున్ బార్థుం దలంకించెదన్".

కర్ణుని మనోభావాలను భీష్ముడంగీకారం తెలిపి అభినందించి పంపాడు. భీష్ముడు ఒంటిగా అంపశయ్యపై శయనించి ఉన్నాడు.

# ద్రోణపర్వం

మరునాడు తెల్లవారింది. భీష్ముని మరణం వలన కౌరవ సైన్యం గోపాలకుడు లేని గోగణంగా వెలవెలపోయింది. దుర్యోధనాదులకు కర్ణుడు జ్ఞాపకం వచ్చాడు. భీష్ముడు పడిపోయేంతవరకు రణరంగంలోకి అడుగుపెట్టనని ప్రతిజ్ఞ చేసిన కర్ణుడు దుర్యోదనుని ఆహ్వానంపై రథమెక్కి యుద్ధం చేయటానికి సిద్ధమైనాడు. అంపశయ్యపై శయనించి యున్న భీష్ముని వద్దకు వెళ్లి అతని అభినందనలు పొందాడు. సర్వ సైన్యాధ్యక్షునిగా ద్రోణాచార్యుణ్ణి అభిషిక్తుణ్ణి చేయుమని కర్ణుడు సయోదనునికి సలహా యిచ్చాడు. సుయోధనుడు సేనాపతులందరినీ వెంటపెట్టుకొని ద్రోణాచార్యుని సన్నిధానానికి వెళ్లి

అతని అర్చించి సర్వసైన్యాధ్యక్షునిగా అభిషిక్తుణ్ణి చేశాడు. ద్రోణుడు ఉప్పొంగిపోయి దుర్యోదనుణ్ణి ఒక వరం కోరుకొమ్మన్నాడు. అతడు కర్ణ దుశ్శాసనాదులతో ఆలోచించి ధర్మరాజును పట్టి యిమ్మని కోరాడు. పట్టి యిస్తే ఏం చేస్తావని ఆచార్యుడు అడిగాడు. మరల జూదమాడించి అలవోకగా దీర్ఘకాలం అడవులకు పంపి, రాజ్యాన్ని సుఖంగా ఏలుకుంటానని సుయోదనుడు సుయోదనుడు సమాధానం చెప్పాడు. ద్రోణునికి లోన ఇష్టం లేకపోయినా రారాజును మెప్పించటానికి ఇలా శపథం చేశాడు.

"నరుఁడెడసొచ్చెనేని విను నా కది దుష్కరమేనొకండనే
సురగణమైన వ్రేలిఁగొని చూపగఁజాలరు వాఁడు లేనిచోఁ
దిరమయి పోర నిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది పుట్టినింటి వే
వురు వెఱఁగంది చూడ నలవుం జలముంజెడఁ బట్టి తెచ్చెదన్

ద్రోణుని ప్రతిజ్ఞను దుర్యోధనుడు సైనికులందరికీ చాటబంచాడు. దానిని గూఢచారులవలన ధర్మరాజు విని అర్జునుని పిలిచి ద్రోణ శపథాన్ని గురించి చెప్పాడు. ధర్మజుడున్నచోటును ఎల్లప్పడూ వదలకుండా పొదివికొని యుద్ధంచేయమని కోరాడు. "అగ్రజా! నేను ప్రాణాలతో ఉండగా నిన్ను పట్టుకోటానికి ఆ ద్రోణునకు కాదుకదా! ఆ స్తానునకైనా సాధ్యం కాదు. నీకు బయమెందుకు?"- అని అర్జునుడు ధైర్యం చెప్పాడు. ఆనాడు పాండవులు క్రౌంచవ్యూహం పన్ని సైన్యాలను నడిపారు. సేనా ముఖంలో కపికేతనుడు గాండీవాన్ని సారించి నిలిచాడు. కౌరవులు శకట వ్యూహాన్ని పన్నారు.

ద్రోణుడు పాండవ సైన్యం మీద దివ్యాస్త్రాలతో విరుకు పడ్డాడు. నరుడు గురునిమీద దివ్యాస్త్రాలతో తలపడ్డాడు. పోరు మహాఘోరంగా మొదలైంది. సంకుల సమరంగా సాగింది. భీమసేనుడూ, శల్యుడూ గదాద్వందయుద్ధం భీకరంగా చేశారు. పాండవ సేనాపతుల పరాక్రమం ప్రచండంగా ప్రదర్శితమౌతోంది. ద్రోణాచార్యుడు మండిపడ్డాడు. భీమ సాత్యకి పాంచాలాదులచే పరిరక్షితుడైన ధర్మరాజుమీద దారుణంగా దాడి మొదలు పెట్టాడు. పాండవ సేనానును పెక్కురు దర్మరాజును రక్షించుకొంటూ ఆచార్యుని మీద యుద్ధం సాగించారు. ద్రోణుడు కార్చిచ్చులాగా వ్యాపించి వీరులనందరినీ కలతపెట్టి ధర్మరాజును సమీపించి సంకుల సమరం చేశాడు. సైనికులందరూ ధర్మరాజు పట్టుపడ్డాడు అని కేకలు వేశారు. కర్ణునితో పోరు ఘోరంగా చేస్తున్న అర్జునుడు మెరుపులాగా ద్రోణాచార్యునికి అడ్డుపడ్డాడు. క్షీర సముద్రాన్ని మందర పర్వతం కలచి వేసినట్లుగా కౌరవసైనాన్ని అర్జునుడు అర్జునుడు సంక్షోభపరిచాడు. కురువీరులందరూ ఆచార్యునికి అండగా నిలిచి పోరాడినా గాండీవి పరాక్రమానికకి ఎదురు నిలిచి నెగ్గలేకపోయారు. ఈ

విధంగా ద్రోణుని మొదటి నాటి యుద్ధం ముగిసింది.

రెండవనాడు ద్రోణాచార్యులు గరుడ వ్యూహాన్ని పన్నాడు. పాండవులు మండలార్థ వ్యూహం మోహరించారు. కౌరవ పక్షాన సుశర్మ నాయకత్వంలో సంశప్తకులు - వేలమంది రథికులు, ఒక్కటిగా కూడి అర్జునునిపై పగ సాధించుకోటానికి దుర్యోధనుని అనుమతిని కోరారు. అతడంగీకరించారు. అర్జునుణ్ణి దర్మరాజుకు దూరంగా పంపటానికి సంశప్తకులు తోడ్పడ్డారు. దక్షిణదిశగా దూరంగా మోహరించిన సంశప్తకులు అర్జునుణ్ణి యుద్ధానికి ఆహ్వానించారు. పార్థునికి గడ్డు ప్రశ్న ఏర్పడింది. అటు యుద్ధాహ్వానాన్ని కాదనటానికి వీలులేదు. ఇటు అన్న దర్మరాజు రక్షణను వదలటానికి వీలు లేదు. వీరుడైన అర్జునుడు పాంచాలనరుడైన సత్యజిత్తు రక్షణలో దర్మరాజునుంచి తాను సంశప్తకులపై యుద్ధానికి ళ్లాడు. సంశప్తకులందరు కలిసి అర్జునుని మీద ఒక్కుమ్మడి దాడిచేసి దొమ్మియుద్ధం 'గించారు. బాణాలతో అర్జునుణ్ణి కప్పివేశారు. సారథియైన కృష్ణునికే అర్జునుడు కనపడటం ష్టమైంది. ఫల్గుణుడు అనిలాస్త్రాన్ని ప్రయోగించి క్రమ్మిన బాణ మేఘాలను వమ్ము చేశాడు. సంశప్తకులను చికాకు పరిచాడు.

అర్జునుడు సంవప్తకులవైపు పోగానే ద్రోణాచార్యుడు దర్మరాజు వైపు దాడి సాగించాడు. అపార బలాఢ్యుడు సత్యజిత్తు ధర్మరాజుకు రక్షగా నిలిచి విజృంభించాడు. కాని, శస్త్ర కళాచార్యుడైన ద్రోణుడు అతని విల్లును విరిచాడు. అతడు విల్లందినప్పుడల్లా దానిని ముకలు చేశాడు. చివరకు అర్థ చంద్రాకార బాణంతో అతని తల తెగకొట్టాడు. సత్యజిత్తు చనిపోగానే ధర్మరాజు ద్రోణుని పరాక్రమానికి భయపడి రణరంగంనుండి రధంమీ తొలగిపోసాగాడు. అంతలో మత్స్యరాజు తమ్ముడు సూర్యదత్తుడు ద్రోణుని నెదుర్కొన్నాడు. అతనికకి చేది మగధ కేకేయ రాజుల సైన్యాలు అండగా నిలిచాయి. ద్రోణుడు సూర్యదత్తుణ్ణి చంపి ధర్మజుని పట్టుకోటానికి తరుముకొని పోజొచ్చాడు. అప్పుడు దర్మరాజుకు అండగా యుయుధానుడు, ఉత్తమౌజుడు, వసుదానుడు, శిఖండి, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కితానుడు కమ్ముకొని ద్రోణుని ఎదురించారు. సుడిగాలికి కూలిన చెట్లలాగా పాండవసైన్యాలు పడిపోయాయి. దర్మజుడు భయపడి యుద్ధభూమినుండి తొలగిపోయాడు. మిగిలిన రాజులు భీముని అండజేరి పోరు సాగించారు.

దుర్యోధనుడు గజసైన్యాన్ని భీముని మీదకు పురికొల్పాడు. భగదత్తుడు ఇంద్రగజంలాంటి సుప్రతీకాన్ని భీమునిపైకురికించాడు. భీముడు ఏనుగులను మట్టుపెట్టాడు. భగదత్తుని గజం పాండవసైన్యాన్ని కలచివేసింది. అర్జునుడు భగదత్తుని పైకి రధాన్ని మళ్లించాడు. ఘోరయుద్ధం చేసి సుప్రతీకాన్నీ, భగదత్తుణ్ణీ అర్జునుడు నేలకకొరిగించాడు.

అర్జునుణ్ణి కర్ణుడు ఢీకొన్నాడు. మహాస్త్రాలతో మారణయుద్ధంచేశారు. అస్తమానం అయింది. యుద్ధం చాలించారు. ఆనాడు కూడా ధర్మరాజును పట్టి యివ్వనందుకు దుర్యోదనుడు ద్రోనాచార్యుణ్ణి నిందించాడు. అందుకాతడు కటకటపడి, "నరుని పరాక్రమం. నారాయణుని మాహాత్మ్యం తెలిసి కూడా ఇలా మాట్లాడటం న్యాయమా? ధర్మరాజు మీద చేయి పడకుండా పాండవ వీరులు ఎలా వరుసగా కాపాడుకుంటున్నారో గమనించావుకదా! రేపు అర్జునుణ్ణి దూరంగా పంపి వేయాలి. ధర్మరాజును పట్టాలి" అంటూ వ్యూహాన్ని పన్నాడు.

మరునాడు ద్రోణుడు పద్మవ్యూహాన్ని పన్నాడు. సంశప్తకులు అర్జునుః దూరతీరాలకు తీసికొని వెళ్లారు. వ్యూహం వలయాకారంగా ఉండటంచేత దుర్భేధ్యమైన చక్రవ్యూహం ఏర్పడింది. పాండవులలో పద్మవ్యూహాన్ని ఛేదించి విజయాన్ని సాధించే నేర్పు అర్జునునికీ, శ్రీకృష్ణునికీ ఉంది. అభిమన్యునికి పద్మవ్యూహాన్ని భేధించటం లోనికి ప్రవేశించటం తెలుసుగాని, విజయవంతంగా తిరిగి రావటం తెలియదు. ద్రోణుడు పాండవ సైన్యాన్ని బాణాలతో బాధిస్తున్నాడు. వ్యూహంలో ప్రవేశించటం పాండవవీరులకు శక్యం కావటం లేదు. ధర్మజుడు భీమాదులను వెంటబెట్టుకొని అభిమన్యుని వద్దకు వెళ్లి పద్మ వ్యూహాన్ని భేదించి పాండవుల గౌరవాన్ని నిలుపుమని, పార్థ గోవిందుల ప్రశంసలు పొందుమని కోరాడు. అభిమన్యుని వెంట భీమాదులందరూ వ్యూహంలో ప్రవేశించి దానిని బేదించగలరని ధైర్యం చెప్పాడు. అభిమన్యుడు దొరికిన అవకాశానికి ఆనందావేశాలతో ఊగిపోయాడు. భీమునిముందు ఈ విధంగా శపథం చేశాడు -

"నను విను కీచకాంతక ! మనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చియ
మ్మొనఁ గలఁగింప కిట్లు కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం
చిన జతనంబు నిష్ఫలము సేయుదువే, నరుఁడున్ సుభద్రయున్
తనయునిఁగాంచి సంతసము దాల్చుట యంతయు రిత్తఁబుత్తునే?"

"ఇదె యొక పిన్నవాఁడదరి యెక్కుడు మూఁకల క్రందు దోలెడుం
గదుపుల వెల్చు గోపకుని కైవడి నంచుజనుల్ నుతింపఁజే
సెదఁ విని మామ ప్రీతి విలసిల్లఁగ దండ్రియు సంతసిల్లఁ బె
ట్టిదుఁడగు కౌరవేంద్రునకు దెప్పర మయ్యెడు భంగిఁ బేర్చెదన్"

అభిమన్యుని వీరప్రతిజ్ఞను విని ధర్మజుడు అనుమతితో ఆశీర్వదించాడు. అభిమన్యుడు తన రథాన్ని ద్రోణ సైన్యం మీదకు నడిపించాడు.

మెరపు మెరసినట్లు ఆచార్యుని మీద బాణాలను కురిపించి అయనను దాటి

పద్మవ్యూహంలోకి ప్రవేశించాడు. అడవిని కాల్చే కార్చిచ్చులాగా ప్రళయకాలంలో సంహారక్రియకు పూనుకున్న రుద్రునిలాగా, పద్మవ్యూహంలోని వీరవరులనందరినీ కలవర పెట్టటం మొదలుపెట్టాడు. ఎదురుపట్ట కురువీరుల నందరినీ బాణాలతో బాధించాడు. అందులో వరుసగా సుయోధనుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుడు మొదలైన వారందరూ ఉన్నారు. విలువిద్యలో విజయుని మించిన అభిమన్యుణ్ణి ఆపటం అసాధ్యమని ఆచార్యుడు భావించాడు. అభిమన్యుని అపూర్వ పరాక్రమాన్ని కృపాచార్యుని యెదుట ప్రశంసించాడు. దుర్యోధనుడు దానికి కటకటపడి కవ్వడి కొడెకుడు దొమ్మిగా దాడి చేసి చంపాలని పన్నాగం పన్ని కర్ణాదివీరులను ప్రోత్సహించి ఒక్కుమ్మడి కమ్ముకోబోయారు. అంతలో అభిమానంతో దుశ్శాసనుడు తానొక్కడే పార్థుని కొడుకును ద్వంద్వ యుద్ధంలో ంపుతానని తలపడ్డాడు. ఇద్దరూ బలంగా ఢీకొన్నారు. ధర్మరాజును ఆనాడు నిండు సభలో పమానం చేసి మాట్లాడిన మాటలను స్మరించి దుశ్శాసనుణ్ణి మూర్ఛపోయేటట్లు బాణంతో ట్టాడు అభిమన్యుడు సారధి అతని రథాన్ని ఆవలికి తోలుకొని పోయాడు. అభిమన్యుడు 'రవి తప్పిన విధంగా మొగ్గరంలో యథేచ్ఛగా తిరుగనారంభించాడు. మేటి వీరుల ందరినీ వాడి బాణాలతో నొప్పించాడు. పేరు పేరునా పిలుస్తూ వారిని అధిక్షేపించాడు.

"నిలు నిలు కర్ణ యో కృపుడ నీవిటులేల కడంక దక్క సౌ
బల ధృతి దూలనేమిటికి బాహ్లిక యిత్తఱిఁ గౌరవేంద్ర నీ
బలము జలంబుఁజూపి నిలుపందగు సేనల నంచు బెక్కుభం
గులఁబురికొల్ప నెవ్వరును గోల్తల సేయర, యేమి సెప్పుదున్".

ఎదురు లేని వీరుడులాగా, ఆర్పలేని కార్చిచ్చులాగా, మీదపడ్డ మహా ప్రళయంలాగా అభిమన్యుడు అరిభయంకరంగా యుద్ధం సాగించాడు.

పద్మవ్యూహం భేదించిన అభిమన్యుని వెంట భీమాదులు మోహరంలో ప్రవేశించి న్యాన్ని నుమాడటం మొదలు పెట్టారు. వారిని సైంధవుడడ్డం పడ్డాడు. పాండవులను ఒకరోజు నిలువరింపగలిగే శక్తిని శివుని నుండి వరంగా పొంది యున్నాడు సైంధవుడు. ఆరోజే ఆరోజయింది. పాండవులెంత భయంకరంగా పోరాడినా సైంధవుని అడ్డుదాటి ఒక్క అడుగు ముందుకు వేయలేకపోయారు. వెనుకాడకుండా ముందుకు చొచ్చుకొని పోయే కొద్దీ పాండవ సహాయం అందకపోవటంతో ఒంటరివాడయ్యాడు. అయినా అభిమన్యుడు అగ్గిపిడుగు. వృషసేనుణ్ణి మూర్ఛపడగొట్టాడు. దుర్యోధనుని కుమారుడైన లక్ష్మణుణ్ణి ద్వంద్వయుద్ధంలో ఓడించి చంపాడు. మధ్యాహ్న మార్తాండ తేజంతో వెలుగొందే అభిమన్యుణ్ణి అర్జున తుల్యునిగా ఆచార్యుడు ఆశ్చర్యంతో ప్రశంసిస్తూ దుర్యోధనునికి చెప్పాడు.

అభిమన్యుని చంపే ఉపాయం అడిగాడు సుయోధనుడు. అతని చేతిలో విల్లంబు ఊడగా జయించటం కష్టమని సూచించాడు ద్రోణాచార్యుడు "కవచధారణ"మనే విద్య నేను అర్జునునికి చెప్పిందే, అభిమన్యుడు నేర్చుకొన్నాడు. ఆవిద్య నేర్చిన వానిని ఓడించటం కష్టం. అయినా మోసంతో అల్లెత్రాడును తెంచి విల్లును విరుగగొట్టి, గుర్రాలను కూలగొట్టి, సారథిని చంపి, ఒక్కసారి ఇతన్ని కమ్ముకొని చంపితే చంపవచ్చుని గాని లేకపోతే అతని వైపు దేవతలకు కూడా తేరిపార చూడటం చేతకాదని ఉపాయాన్ని అందించాడు. దీనికి కర్ణాదులు పూనుకున్నారు. భయపడినవానివలె కర్ణుడు అభిమన్యుని వెనుకపోయి అతని విల్లును త్రుంచాడు. వెంటనే ద్రోణుడు గుర్రాలను కూల్చాడు. కృపాచార్యుడు సారథిని చంపాడు. శకుని, కృతవర్మ, బాహ్లీకుడు, అశ్వత్థామ మొదలుగా అనేకులు ఒక్కసారి అతనిమీద అస్త్రశస్త్రాలను కుండపోతగా కురిపించారు.

అభిమన్యుడు కత్తీడాలూ తీసికొని గగనానికి ఎగసి, మండలాకారంగా తిరుగుతూ వీరుల నందరినీ ఒంటిగా ఎదుర్కొన్నాడు. అతని కత్తిని డాలును ద్రోణుడు విరగగొట్టాడు. అభిమన్యుడు రథచక్రాన్ని తీసికొని భూమిపై నిలిచి మండలాకారంగా తిరుగుతున్న మహాజ్వాలలాగా విజృంభించాడు. అతని శరీరం రక్తప్లావితమైంది. కాని పౌరుషంతో ఎర్రగా జేవురించి శత్రువులకు భయంకరంగా ఉంది. అతని యుద్ధక్రీడను దేవతలు మెచ్చుకుంటున్నారు. కౌరవ వీరులందరు కలిసి అభిమన్యుని చక్రాన్ని తునియలు చేశారు. అతడు గదను తీసికొని అశ్వత్థామపై దాడి చేశాడు. అశ్వత్థామ భయపడి రథం దిగి పరుగు తీశాడు. ఏడువందలమంది రథికులను గదతో చావమోదాడు. దుశ్శాసనుని కొడుకును యమలోకానికి పంపించాడు. ఇలా మదించిన ఏనుగు సరోవరంలో దిగి పద్మాలను చిందర వందర చేసినట్లు పద్మవ్యూహ రక్షకులైన మహావీరుల నందరినీ మహాసంక్షోభంలో ముంచాడు. అభిమన్యునిచేత అవమానింపబడిన వారంతా అన్యాయంగా అతనిని వధించటానికి ఏకమయ్యారు. లోతైన నీటిలో దిగిన గజాన్ని బోయలు దయమాలి కొట్టి చంపినట్లు వీరులందరూ అభిమన్యుణ్ణి చుట్టుముట్టి ఆయుధాలతో కొట్టి చంపారు. అపరాద్రిపై అస్తమించిన సూర్యబింబంలా, అడవినంతా కాల్చి అరిన కార్చిచ్చులా, అలలు ఎండబారిన మహాసముద్రంలా, నేలమీద పడిన చంద్రబింబంలా అరివీర భయంకరంగా యుద్ధం చేసిన అభిమన్యుడు నేలకొరిగాడు. రక్తసిక్తమైన ఆ నేలమీద పడి ఉన్న అభిమన్యుడు యోగనిద్రలో ఉన్న విష్ణువులాగా వెలుగొందాడు. "పెక్కంద్రు గూడి ఇమ్మెయినొక్కని జంపుట అధర్మ మహో" అని దిక్కులు పిక్కటిల్లేటట్లు భూతసమూహం కేకలు వేశాయి.

అభిమన్యుని మరణానికి శోకింపని మానసి లేడు. అతని పరాక్రమాన్ని కీర్తించని

వీరుడు లేడు. ధర్మజుని శోకం కట్టలు తెగింది. వ్యాసమునీంద్రుడు వచ్చి అతన్ని ఊరడించాడు. సాయంకాలానికి సంశప్తకులను సంహరించి సవ్యసాచి శిబిరానికి తిరిగి వస్తూ అపశకునాలను చూచి ఏదో కీడును అనుమానించాడు. స్కంధావారానికి వచ్చాడు. దీనవదనాలతో ఉన్న తనవారిని చూచాడు. వారిలో అభిమన్యుడు కానరాలేదు. 'ద్రోణుడు పన్నిన పద్మవ్యూహాన్ని భేదించటానికి అభిమన్యుణ్ణి పంపలేదు కదా! వాడికి భేదించటం వచ్చుగాని వీరులు చుట్టుముట్టినప్పుడు విడిపించుకొనటం తెలియదు. మీ ఉపాయము మాసిపోను. నాకొడుకును రణభూమి కర్పించలేదు కదా! చెప్పండి వాడులేకుండా నేనెలా బ్రతికేది? అని ఆవేదన పడుతూ నిజం తెలిసి,

"హా!యను, ధర్మరాజ తనయా! యను, నన్నెడబాయ నీకుఁజ
న్నే? యను! దల్లినేఁపఁజనునే యనుఁ గృష్ణుడు వీడె వచ్చె రా
వే! యను నొంటి వోకఁ దగవే యను, నేగతిఁబోవు వాఁడ నే
నో యభిమన్యుఁడా! యను! బ్రియోక్తుల నుత్తర జేర్పవేయనున్"

ఇలా అనేక విధాల ప్రియపుత్రుని కోసం విలపించి విలపించి అర్జునుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు - "భీముడు దగ్గరలేడా? ఒంటరిగా పంపారా? ద్రుపదుడు, సాత్యకి, విరటుడు వీరంతా ఎక్కడికి పోయారు? అందరూ ఉండగా అభిమన్యుడు చనిపోవటానికి కారణం ఏమిటి? చనిపోయినాడు సరే యుద్ధంలో వెనుకాడకుండా విక్రమాన్ని ప్రకటించి పేరుపొందాడా? పలువురు తనను చుట్టుముట్టి అస్త్రశస్త్రాలతో బాధిస్తున్నప్పుడు తోడు పడేవారెవ్వరూ లేక నాన్నా! నాన్నా! అని ఎన్నిసార్లు నన్ను పిలిచి ఉంటాడో! తప్పు తప్పు.... నేను పొరపాటన్నాను. గోవిందుని మేనల్లుడు యుద్ధంలో ఓడుతాడా మిన్ను మీద పడ్డా బాహాగర్వాన్ని వలుతాడా?" అని పలురకాల ప్రశ్న పరంపరలు కురిపించాడు పార్థుడు. ధర్మజుడు జరిగిన దంతా వివరంగా చెప్పాడు. అభిమన్యునికి భీమాదుల సాయం అందకపోవటానికి సైంధవు డడ్డగించటమే కారణమని స్పష్టం చేశాడు. అర్జునుడు సైంధవ కృత్యానికి మండిపడి అతనిన చంపుతానని ఇలా భయంకర శపథం చేశాడు.

"అనిమిష దైత్య కిపంపురుషులాదిగ నెవ్వరు వచ్చి కాచి నంద
దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజ మిత్రుఁడు గ్రుంకకుండుము
న్న నరవరేణ్య యిత్తెఱఁగు నా కొనరింపఁగ రాకయున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండీవంబుతోన్"

శపథంతో పాటు అర్జునుడు గాండీవ జ్యారావాన్ని మ్రోగించాడు. పద్మనాభుడు పాంచజన్యాన్ని పూరించాడు.

అర్జునుని ప్రతిజ్ఞ కౌరవ స్కంధావారంలో ప్రతిధ్వనించింది. సైంధవుడు ప్రాణభయంతో గజగజలాడిపోయి పారిపోవ ప్రయత్నించాడు. ద్రోణాదులది క్షత్రియ ధర్మం కాదని, తమ రక్షణలో తనకెట్టి కీడు రానీయమని మాటయిచ్చి మోహరంలో నడుమ భద్రంగా దాచి యుద్ధాన్ని సాగించారు కౌరవులు. అర్జునుడు తన ప్రతిజ్ఞను ఎలాగైనా సఫలమయ్యేటట్లు వరమిమ్మని శ్రీకృష్ణుని ప్రార్థించాడు. సాత్యకిని ధర్మరాజు రక్షకునియోగించి సైంధవ వధకు విజయుడు విజృంభించాడు. ద్రోణుడు సూచీ వ్యూహం పన్నాడు. అర్జునుడు మొట్టమొదట ద్రోణునికి నమస్కరించి ఆశీస్సులను కోరాడు. ఆచార్యుడు నవ్వి "నన్ను గెలవకుండా సైంధవుని దరికెలా జేరగల"వని చిరునవ్వు నవ్వాడు. దానిని అనుమతిగా గ్రహించి విజయుడు యుద్ధాన్ని ప్రారంభించి ఆచార్యుని అతిక్రమించి మోహరంలో ప్రవేశించాడు. కర్కశంగా యుద్ధం చేస్తూ శ్రుతాయుధాదులను విందానువిందులను చంపాడు. ద్రోణుడు అర్జునుని పట్ల పక్షపాతాన్ని చూపుతున్నాడని దుర్యోదనుడు నిందించి స్వయంగా కవచధారిచై కిరీటితో యుద్ధం చేశాడు. అతడు సుయోధనుని కవచాన్ని ఛేదించి రథాన్ని ధ్వంసం చేశాడు. ఇంతలో ద్రోణుడు ధర్మరాజుతో యుద్ధానికి తలపడి అతని రథాన్ని విరుగగొట్టాడు. ధర్మజుడు నేలపైకి దిగి నిరాయుధుడై చేతులు పైకెత్తి ఊరుకున్నాడు. అతని పై బాణాలు ద్రోణుడు సంధించలేక చుట్టూ ఉన్న గుర్రాలను, ఏనుగులను సంహరించాడు. అంతలో సహదేవుడు ధర్మజుని తన రథంమీద కెక్కించుకొని తొలగిపోయాడు.

అర్జునుని ప్రతిజ్ఞ అందరికీ ముఖ్యాంశమైపోయింది. అతనికి అండదండలుగా ఉండటానికి సాత్యకిని పంపాడు ధర్మరాజు. అతడు మొగ్గరంలో ప్రవేశించి దుశ్శాసనాదులను ఓడించి ముందుకు సాగాడు. అతనికి తోడుగా భీముడు కూడా ద్రోణాదుల నతిక్రమించి అర్జునునివైపు దాడి సాగించాడు. కర్ణుడు భీమసేనుని డీకొని ఓడించి, అధిక్షేపించి చంపకుండా వదులుతాడు. కర్ణార్జునులు ద్వంద్వయుద్ధంలో తారసిల్లుతారు. పోరు ఘోరంగా సాగుతుంది. దుర్యోదనాదులు కర్ణునికి సాయంగా నిలిచి యుద్ధం చేయసాగారు. వారికి బలహీనపరిచి అర్జునుడు ముందుకు పోగా అశ్వత్థామ శల్య వృషసేనులు సైందవునికి అడ్డంగా నిలిచారు. ప్రొద్దు బాగా వాటారింది. శ్రీకృష్ణుడు ఒక ఉపాయం పన్నాడు. మాయా తిమిరంతో సూర్య బింబాన్ని కప్పివేశాడు. సూర్యుడస్తమించాడని కౌరవ వీరులుప్పొంగిపోయారు. సైంధవుడు తలయెత్తి పడమరవైపు చూచాడు. అర్జునుడు అదనెరిగి వాడి బాణంతో సైందవుని తలతెగనరికాడు. దానిని క్రిందపడకుండా ఆకాశంలోనే చిత్రవిచిత్ర బాణవిద్యా నైపుణ్యంతో నిలుపుతూ వచ్చాడు. మాయా తిమిరం తొలగించాడు శ్రీకృష్ణుడు. సూర్యుడస్తమించకుండానే సైంధవుని చంపి అర్జునుడు తన శపథాన్ని కాపాడుకొన్నాడు. ఆ తరువాత పాశుపతాస్త్రంతో

సైంధవ శిరాన్ని వృద్ధక్షత్రుని ఒళ్లో పడేటట్లు చేశాడు. అతడా శిరస్సును నేలమీద పడవేశాడు. ఆ ఋషి శిరం వేయి వక్కలైపోతుంది. సైంధవుని శిరం ఎవనివలన నేలమీద పడుతుందో అతని శిరస్సు వేయి వ్రక్కలౌతుందని శాపం ఉంది. అందువల్ల శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఆ కీడు నుండి తప్పించాడు.

ద్రోణుని అయిదవనాటి యుద్ధం ప్రారంభించే ముందు పాం బాలురను చంపనిదే కవచం విడువనని శపథం చేసి, సంకుల యుద్ధంలో విరాట ద్రుపదులను సంహరించాడు. పాండవ పక్షంలో విజృంభించి మాయా యుద్ధం చేసి కౌరవసేనను నురుమాడిన ఘటోత్కచుని చంపటానికి ఇంద్రదత్తమై, అర్జునుని కోసం దాచిపెట్టుకొన్ని శక్తిని కర్ణుడు వినియోగించవలసి వచ్చింది. 'అశ్వత్థామ హతః' అనే వాక్యాన్ని ధర్మజ్ఞుడు పెద్దగా పలికి 'కుంజరహః' అనే పదాన్ని వాద్యాల చప్పుళ్ళలో కలిసి పోయేటట్లు అన్నాడు. ఆ మాటవిని ద్రోణుడు అస్త్రసన్యాసం చేసి యోగాసనంతో రథంమీద కూర్చుండి తనువుత్యజించాడు. దృష్టద్యుమ్నుడు ధర్మజాదులు వారిస్తున్నా వినకుండా ద్రోణుని తలనుగను బట్టి కుత్తుకను కత్తితో కోశాడు. ద్రోణుని తేజం ఆరిపోయింది.

దృష్టద్యుమ్నుని చర్యను అందరూ గర్హించారు. అశ్వత్థామ కోపోద్రిక్తుడై పాండవ సైన్యం మీద నారాయణాస్త్రాన్ని ప్రయోగించాడు. శ్రీకృష్ణుని సూచనపై పాండవవీరులందరూ నేలపై దిగి, ఆయుధాలు తొలగించి నమస్కరించి నారాయణశక్తిని భక్తితో గౌరవించారు. ప్రాణాలు దక్కించుకొన్నారు. అశ్వత్థామ ఆగ్నేశాయాస్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి దానిని వమ్ము చేశాడు. దానితో అశ్వత్థామ చేసేది లేక రణరంగం నుండి తిరిగి పోయాడు. ద్రోణపర్వం దీనితో సమాప్తం.

# కర్ణ పర్వం

ద్రోణుని తరువాత దుర్యోధనుడు సర్వసేనాధిపతిగా కర్ణుని అభిషిక్తుని చేశాడు. కర్ణుడు ప్రహర్షంతో పాండవులమమణగిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. మొదటినాటి యుద్ధంలో కర్ణుడు తన శరపాండిత్యాన్ని ప్రకటించాడు. కాని దుర్యోధనుడు ధర్మరాజుతో యుద్ధంచేసి మూర్ఛిల్లుతాడు. దుశ్శాసనుడు సహదేవునితో పోరి మూర్ఛపోతాడు. అలాగే, కృపాచార్యుని చేతిలో ధృష్టద్యుమ్నుడు ఓడిపోతాడు. కర్ణుని చేతిలో నకులుడు విరథుడై అవమానింపబడతాడు. కర్ణుడు తన రథసారథిగా శల్యుని ఒప్పించమని దుర్యోధనుణ్ణి కోరాడు. శల్యుడు దుర్యోధనుని కోరిక మేరకు కర్ణరథ సారథ్యానికి అంగీకరించాడు.

శ్రీకృష్ణుని లాగా అశ్వ హృదయం తెలిసిన వివేక శల్యు. ). చెవులకు చేదైన మాటలైనా అతడు చెప్పినవి రథికుడు వినే నియమంతో సారథ్యానికి అంగీకరించాడు.

సారథి రథికుని యోగక్షేమాలను, విజయాన్నీ కోరాలి, అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తించే మాటలు మాట్లాడాలి. కాని, శల్యుడు, ధర్మజుని కిచ్చిన వరం ప్రకారం కర్ణుని హృదయాన్ని బాధ పరిచే మాటలను పాండవులు పరాక్రమాన్ని ప్రశంసించే వాక్యాలను, కర్ణుని లోపాలను ఎత్తి చెప్పే ఎత్తిపొడుపు మాటలను వద్దన్న కొద్దీ పలుకుతూ కర ఉత్సాహాన్ని నీరుగాప్ప యత్నం చేశాడు. అందువల్లనే నమ్మించి మార్గదర్శకులై మనసు నొవ్వ పలికే మాయావుల వర్తనాన్ని శల్య సారథ్యం అని లోకంలో వ్యవహారంలోకి వచ్చింది. అడుగడుగునా శల్యుని మాటలు శల్యాల్లాగా మనసును బాధించినా అభిమానధనుడైన కర్ణుడు యుద్ధోత్సాహాన్ని పోషించుకుంటూ ముందుకు సాగాడు. మనసిచ్చి తనకుగల శాపవృత్తాంతాలనన్నింటినీ అతనితో చెప్పుకొన్నాడు.

పరశురాముని మెప్పించి కర్ణుడు బ్రహ్మాస్త్రాన్ని పొందాడు. కాని తనకుల బ్రాహ్మణకులమని అబద్ధం చెప్పాడు. క్షత్రియోచిత వర్తనాన్ని ప్రదర్శించటం గమనించి పరశురాముడు అవసరం వచ్చినప్పుడు బ్రహ్మాస్త్రం స్ఫురించకుండా శపించాడు. ఒక బ్రాహ్మణుని యజ్ఞధేనువును పొరపాటున తన బాణంతో చంపినందుకు ఆ విప్రుడు కోపించి వచన శల్యాలతో నిహతుడయ్యేటట్లు, యుద్ధంలో అత్యంతోత్సాహాన్ని ప్రకటిస్తున్నప్పుడు రథ చక్రం నేలలో క్రుంగేటట్లు, ఎవరిని ఎదుర్కొని గెలవాని శ్రమిస్తూ ఉంటాడో అతని చేతిలోనే కర్ణుడు చనిపోయేటట్లు శపించాడు. ప్రపంచంలో ఏ మహావీరుని గురించీ తనకు భయం లేదుకాని, జామదగ్న్య, బ్రాహ్మణశాపాలు మాత్రం తనకు భయాన్ని గిస్తాయని కర్ణుడు శల్యునితో ఆత్మీయంగా చెప్పుకొంటాడు. అతడు దాన్ని సాకుగా తీసికొని కర్ణుని మనసు బాధపడేటట్లు పలుమాటలు మాట్లాడతాడు. కర్ణుడతనిని మందలించి రథాన్ని ముందుకు సాగించమంటాడు.

కర్ణుని రెండవనాటి యుద్ధం దేవతలు మెచ్చేటట్లు సాగింది. కర్ణుడు ధర్మరాజుపై విజృంభించి నొప్పించి అవమానించి కుంతికిచ్చిన మాట ప్రకారం ప్రాణాలతో వదలివేశాడు. పాంచాల కుమారులనేకమంది ప్రాణాలను హరించాడు. దీనికి మండిపడ్డ భీమసేనుడు కర్ణునితో ఘోరంగా పోరి మూర్ఛితుణ్ణిచేసి త దూషించిన అతని నాలుక కోసి చంపటానికి యత్నించాడు. కాని, అతనిని చంపే ప్రతిజ్ఞ అర్జునుడు చేశాడని వదలివేశాడు. భీమనాయకమైప పాండవ సైన్యం వీరవిహారం చేస్తుండగా ధర్మజుడు గాయాలతో శిబిరం చేరి విశ్రాంతి తీసుకొంటున్నాడు. అర్జునుణ్ణి సంశప్తకులు చుట్టుము యత్నించారు.

అర్జునుడు ధర్మరాజు యోగక్షేమాలు తెలిసికొనటానికి శిబిరం వైపు రథాన్ని నడిపించమన్నాడు శ్రీకృష్ణుణ్ణి. భీముని బాధ్యతో యుద్ధాన్ని ఉంచి నరుడు ధర్మరాజును దర్శించటానికి బయలు దేరాడు.

అర్జును డానాడు రణరంగంలో ప్రవేశించే ముందు కర్ణుని వధించి గాని తిరిగి రానని ప్రతిజ్ఞ చేశాడు. ధర్మరాజు బడలికను పరామర్శించటానికి అర్జున శ్రీకృష్ణులు శిబిరానికి మధ్యాహ్నమే తిరిగి వచ్చాడు. వారిరువురూ ధర్మజుని కుశల ప్రశ్నలతో పలకరించారు. అర్జునుడు కర్ణుణ్ణి యుద్ధంలో చంపి వచ్చాడనే అభిప్రాయంతో అతన్ని అభినందించాడు. పరశురాముని శిష్యుడైన కర్ణుడు మహావీరుడనీ అతన్ని తలపూవు వాడకుండా సంహరించటం సంతోషమనీ తమ్ముణ్ణి మెచ్చుకొన్నాడు. తనకు అంతకు పూర్వమే కర్ణుని వలన కలిగిన భంగపాటును చెప్పి, కర్ణుడు పాండవులకు చేసిన ఎగ్గులు పేర్కొని, కర్ణుని చంపిన విధాన్ని వివరించుమని అర్జునుణ్ణి ఆసక్తిగా అడిగాడు.

అప్పుడు అర్జునుడు ఇలా చెప్పాడు. "అగ్రజా! నేను సంశప్తకులతో సంకుల మరం సాగిస్తునప్పుడు అశ్వత్థామ నన్నెదుర్కొని బాణావర్షం కురిపించాడు. శ్రీకృష్ణుని ాణాలతో కప్పాడు. చాకచక్యంతో అతని దాడిని తిప్పికొట్టి ముందుకు సాగాను. అంతో మీరు కర్ణుని చేత బాధితులయి రణరంగం వదలి వచ్చారని, శిబిరంలో ఉన్నారని భీమ సేనుని వలన విన్నాను. మిమ్ములను కుశలమడిగి తిరిగిపోయి కర్ణుని సంహరిస్తాను."

అర్జునుని మాటలకు ధర్మరాజుకు కోపం వచ్చింది. కర్ణుడింకా బ్రతికి ఉన్నాడన్న వార్త అతనికి ఉడుకెక్కించింది. కిరీటిని కినుకతో ఇలా అన్నాడు. "యుద్ధంలో మరణించటం, ంరలిపోవటం అనేవి రెండూ జరుగుతూ ఉంటాయి. నేనిలా రణరంగాన్ని వదలి రావటం ల్ల మీ అందరికీ చులకనయ్యాను. అర్జునా! నేను కర్ణునకు ఓడానన్నావు. నేనే కాదు, నీవూ ిడావు, నకుల, సహదేవులూ ఓడారు. మనతో కూడి ఉండటం వల్ల వాసుదేవుడూ ఓడాడాఉ. కాబట్టి మనమింక యుద్ధానికి పోవలసిన పనిలేదు. వనాలకు బోయి తపస్వులమై ఉందాం లేదా వినయంతో కురురాజును సేవిద్దాం. కర్ణుని జయించలేనని ఆనాడే ద్వైతవనంలో చెప్పినట్లయితే నేనీ యుద్ధ ప్రయత్నం చేసేవాడినే కాను. అశక్తుడు రాజ్యాన్ని కాంక్ష చేయుటం దోషం. కర్ణుణ్ణి వధిస్తానని ప్రతిజ్ఞ చేసి నన్ను ఇక్కడికి తెచ్చావు. నేను శత్రువుల నడుమ అవమానాలకు ఓర్చాను. నీ ప్రతిజ్ఞను ఈ వాసుదేవుడు కూడా విన్నాడు. అది వమ్మయింది. నీవు పుట్టిననాడు ఆకాశవాణి, మహర్షులు నిన్ను యుద్ధానికి వెనుదీయని వీరునిగా, కురుసేనను గెలిచే యోధునిగా కీర్తించారు. వాళ్ళమాటలు అనుమానంలో బడ్డాయి. నీవు రాధేయునకు భయపడతావని తెలిస్తే దుర్యోధనునితో పగపెట్టుకొనేవాడినే

కాను. దుర్యోధనాదులు చూస్తూ ఉండగా కర్ణుడు నన్ను యుద్ధంలో అవమానాలపాలు చేశాడు. నన్నా ఆపద నుండి కాపాడినవాడు భీముడు. అతడొక్కడే ప్రాణాలను లెక్క సేయకుండా పరబలాలు బడలువడేటట్లు పోరుతున్నాడు. ఈరోజు అభిమన్యకుమారుడుగాని, ఘటోత్కచుడుగాని ఉన్నట్లయితే నాస్థితి ఇలా ఉండేదా!

"హరి గలు గంగ నేటికి భయంబున వచ్చితి నీదు గాండివం
బెరవుగ నిచ్చి నీవు నొగ లెక్కి హరిన్ రథి ।జేయు। గన్నని
ష్ఠుర భుజవిక్రమోగ్రుఁడగు సూత తనూభవు, దత్సహాయులం
బొరిగొనడే సుయోధనుని పోఁడిమి దూలఁగ నొక్క మాత్రలోనే"

కుంతీ మహాదేవి కడుపున కొడుకువూ పుట్టకుండా, పిండంగానే ఏదో గండానిక5ఇ గురి అయి ఉండవలసినది. ఇప్పుడు ఇంత పుట్టేది కాదు."

ధర్మజుని మాటలకు ధనంజయుడు మండిపడ్డాడు. కత్తి పైకెత్తి ధర్మజునిపై లంఘించాడు. కృష్ణుడు అడ్డుపడి - 'పార్థా! మనం కౌరవులమీద దాడి చేయటం లేదు. ధర్మజుని పరామర్శిస్తున్నాం. ఇది సంతోషకాలం గాని క్రోధ సమయం కాదు. అన్నగారిని వధించరాదు' అని హెచ్చరించాడు. 'కృష్ణా! నా గాండీవాన్ని ఇతరుల చేతి కిమ్మని అన్నవాని తల పగులగొడతానని నేను ప్రతిజ్ఞ చేశాను. మా అన్న ధర్మాత్ముడైనా నా మాటను నేను నిలువ బెట్టుకొంటాను. దీనికి నీవేం చెపుతావో చెప్పు. సకల ధర్మ సాకల్య వేదివి. నీవు చెప్పినట్లు నేను చేస్తాను" అని అర్జును డన్నాడు.

"లోకంలో సత్యాహింసలు ఉత్తమ ధర్మయుగళం. అందులో సత్యాన్ని అహింసతో రక్షించటం ధర్మం. అహింసను అసత్యంతోనైనా రక్షించటం న్యాయమని పండితులంటారు. సత్య రక్షణకోసం సోదరుడు ధర్మపరుడు అయిన ధర్మరాజును చంపటం ధర్మపథం కాదు. ప్రాణహాని వచ్చినప్పుడుగాని, సర్వధనాపహరణ సమయంలో గాని చెప్పే సత్యం అసత్యంగా, అసత్యంగా, అసత్యం సత్యంగా ఆర్యులు గ్రహిస్తారు. ఇప్పుడు ధర్మ సూక్ష్మాన్ని పాటించాలి. పెద్దను దూషించటం వారిని చంపటం వంటిదే. అందు వలన నీ ప్రతిన తీరునట్లుగా ధర్మరాజుని వధించకుండా, నోరార నిందించు. ఆ మీద గరునిందా పాపం పోయేటట్లు మీ అన్నకు నమస్కరించి కీర్తించు" అని సూచించాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు గోవిందుని హితవును పాటించాడు.

అన్నను దూషించి అర్జునుడు తనను తాను చంపుకోవటానికి కత్తి ఎత్తుకొన్నాడు.

అదేమిటని శ్రీకృష్ణుడడిగాడు. అంతటి పుణ్యాత్ముని, అగ్రజుని అనరాని మాటలని ప్రాణాలతో బ్రతికి ఉన్నదానికంటె ఆత్మహత్య ఉత్తమమని భావించానని అర్జునుడు బదులు చెప్పాడు. శ్రీకృష్ణుడు దానికీ ఒక ఉపాయాంతరం సూచించాడు. ఆత్మస్తుతి చేసుకొంటే ఆత్మాహత్యా ఫలం అబ్బుతుందని చెప్పాడు. శ్రీకృష్ణుడు చూపిన ధర్మసూక్ష్మాన్ని పాటించి ఆపద్బాంధవునిగా అతనిని అన్నదమ్ములు అర్చించారు.

ధర్మజుని దీవెనలందుకొని శ్రీకృష్ణుడు నాగలెక్కాడు, అర్జునుడు రథ మెక్కాడు. కర్ణుని వధ ప్రకారాన్ని భావించే గాండవికి చెమటలు పట్టాయి. శ్రీకృష్ణుడది గమనించి అర్జునునిలో ఆత్మస్థైర్యాన్ని, కర్ణునిపై క్రోధాన్నీ, యుద్ధోత్సాహాన్ని కలిగించే మాటలు పలికాడు. "ఏదేవలకే జయింపరాని మహావీరులను నీవు అవలీలగా రణంలో ఓడింపగలిగావు. నీ ధనుర్వేద కౌశలానికి భూతలంమీద గాండీవాన్ని పట్టి నీ గర్వాన్ని ప్రకటించు. అలనాడు ౦ండు సభలో ద్రౌపదిని చూచి 'లేరిచట నీకు మగలును'అని కారుకూతలరచిని కర్ణునికి ాణాలతో బదులు చెప్పే రోజు వచ్చింది. నేను సంధికి పోయినప్పుడు నన్ను కొట్టటానికి పురికొల్పింది కర్ణుడే. నీ ముద్దుల కొడుకు అభిమన్యుడు అసామాన్య వీరుడుగా పోరుతున్నప్పుడు వంచనతో వెనకనుండి విల్లును విరుగగొట్టి అతని వధకు అంకురారోపణం చేసిన నిర్దయుడు, కపటి ఈ కర్ణుడే. వాడు మీపట్ల చేసిన అన్యాఆయాలను అతనిని చంపి గ్రద్దలకు వేసినా పాపం లేదు. విజృంభించు. కర్ణుని నిర్దాక్షిణ్యంగా వధించు" అని ప్రేరణ చేశాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు ఉత్సాహంతో

"నీ తోడ్పాటున నే, త్రివిష్టపములన్ గెల్వంగ నూ ।కింతు నా
చేతం గర్ణుడు రూపు మాలి చను, మెప్పింతున్ నినుం, జూడు మీ
దైతే యాంతక!" యంచు శేషనిభహస్తం బుద్ధతిం జూచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంత కోదండమున్

కర్ణార్జునులిద్దరూ కాలాంతకుల్లాగా తలబడ్డారు. ఒకరి మీద ఒకరు దివ్యాస్త్రాలను ప్రయోగించుకొని తమ ధరున్వద పాండిత్యాన్ని చాటుకొన్నారు. దుర్యోధనుడు మిగిలిన యోధులను అర్జునునిమీద పురిగొల్పాడు. బీభత్సుడు పిడుగు పాటుగా యుద్ధం చేస్తున్నాడు. అతని మీద ప్రయోగించానలి పూజలో పోషించుకొన్ని సర్పముఖాస్త్రాన్ని అర్జునుని కంఠానికి గురిచూసి కర్ణుడు ప్రయోగించి 'ఫల్గుణా' చచ్చావీదెబ్బతో, అని అరిచాడు. శ్రీకృష్ణుడు ప్రమాదనాఇ్న గమనించి అర్జునుని రథాన్ని అయిదంగుళాలు క్రుంగేటట్లు బొటనవ్రేలుతో ఒత్తాడు. సర్పముఖాస్త్రం అర్జునుని కంఠానికి బదులు కిరీటాన్ని తన్నుకొని పోయింది. పార్థుని ప్రాణాలు రక్షింపబడ్డాయి. ఖాండ దహనంలో కసిపట్టిన పాము తపస్సు చేసి

సర్పముఖాస్త్రంగా కర్ణుని వద్దకు చేరి అర్జున వధ కోసం అదనుచూస్తున్నది. ఆనాడు లక్ష్యం సాధించలేకపోయింది. తిరిగి కర్ణుని వద్దకు పోయి మరలా ప్రయోగించమని కోరింది. వీరుడు అస్త్రాన్ని ఒకసారే ప్రయోగిస్తాడని చెప్పి కర్ణుడు పున: ప్రయోగానికి తిరస్కరించాడు. కర్ణార్జునుల శస్త్రాస్త్రయుద్ధం అపూర్వంగా సాగింది. నెత్తురు సెలయేళ్ళుపారుతున్న పర్వతంలా ఉన్నాడు కర్ణుడు.

అంతలో కాలుడు అదృశ్యాకారంతో అందరూ వినేటట్లు ప్రకటించాడు. 'బ్రాహ్మణ శాపంవల్ల కర్ణుని రథచక్రం నేలలో క్రుంగుతుంది. ఆతడు అసువులను కోల్పోతాడు' - అని. పరశురామదత్తమైన భార్గవాస్త్రంకర్ణునికి స్ఫురించలేదు. అతడు క్రుద్ధుడై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించినా అది చాలలేదు. కవ్వడి కూడా బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి కర్ణుని బ్రహ్మాస్త్రాన్ని ఉపశమింపజేశాడు. కర్ణుని రథచక్రం క్రుంగింది. ఒకచేత్తో చక్రాన్ని ఎత్తుతూనే మరోచేత్తో యుద్ధం సాగించాడు. అర్జునుడు అతనిపై వాడి వాడి బాణాలు వేశాడు. "రథచక్రం క్రుంగింది. దానిని ఎత్తేంత వరకు బాణాలు వెయ్యకు. నేను భూమిమీద ఉన్నాను. నీవు రథం మీద ఉన్నావు. నామీద బాణాలు వేయటం వీర ధర్మం కాదు" అని కర్ణుడు అర్జునునికి ధర్మపన్నాలు చెప్పాడు. దానికి శ్రీకృష్ణుడు స్పందించి "ధర్మాలు, నీతులు ఈనాడు జ్ఞాపకం వచ్చాయా?"

"గొంతియు నందఱు కొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁజేసి,
కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ
డగు ధర్మసుతు సిరి యపహరించి
యంతఁబోవక ద్రుపదాత్మజఁదెచ్చి స
భాస్థలి నమ్మాయి భంగపఱిచి
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోషయా
త్రావిధి నెపమున దాడి వెట్టి

బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీ సుయోధనుడు దలఁపఁ
గాని యిప్పాపముల కాది కర్త వీవ
యన్ని యెడలను నీ పాడి యెందుఁబోయె"

ఈ మాటలతో కర్ణుడు కోపించి తీవ్ర బాణాలను అర్జునునిపై సంధించాడు. పోరు గోరంగా సాగింది. అప్పుడు అర్జునుడు కర్ణుని సంహరించే సంకల్పం చేసి క్రూరమైన ఒక మహాస్త్రాన్ని

గాండీవానికి సంధించాడు. "నేను తపస్సులో, దానంలో, గురుజనసేవలో నిత్యవ్రత శీలుణ్ణైతే ఈ బాణం కర్ణుని శిరస్సు త్రెంచుగాక" అని అంటూ వదిలాడు. ఆ బాణం ఆకాశంలో కాంతులు నింపుతూ ఉభయసేనలు మూర్ఛలో మునిగేటట్లు ప్రకాశించి మహానాదం చేస్తూ కర్ణుని శిరస్సు ఖండించింది. తూడును వీడిన కమలం లాగా కర్ణుని శిరస్సు తెగిపడినా తేజస్సుతో వెలుగొందింది. శల్యుడు రథాన్ని వెనుకకు మరల్చాడు. కృష్ణార్జునుల తేజస్సు దిక్కుల నిండి ప్రకాశించింది.

"అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వర సంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యీ క్రతువు విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుడును గర్ణుడున్ సమర రూపమునం, దగ నీ ప్రబంధ మిం
పొనరఁబఠించినన్ వినిన నొందు నరుం జిర సౌఖ్యసంపదల్."

కర్ణ పర్వంలోనే మరొక భీషణ సుందర ఘట్టం దుశ్శాసన భీమసేనుల ద్వంద్వయుద్ధం. మత్తగజాలులా వారిద్దరూ భయంకర ద్వంద్వయుద్ధం చేశారు. నరసింహస్వామి రాక్షసరాజు వక్షాన్ని చీల్చినట్లు భీముడు దుశ్శాసనుని గుండెను చీల్చి, ప్రేవులు తీసి, నెత్తురు త్రావి బీభత్సంగా వధించాడు. పిన్ననాటినుండి కౌరవులు భీమునిపట్ల చేసిన ద్రోహాలు, దుశ్శాసనుడు ద్రౌపదికి చేసిన అవమానం, భీముణ్ని 'పశువా' అని పిలిచి గేలిచేసిన మాటల మంటలు భీమునిలో రౌద్రమూర్తిని ప్రజ్వలింపజేశాయి. దుశ్శాసనుణ్ణి బలిచేశాయి.

# శల్యపర్వం

కర్ణుని మరణం దుర్యోధనునికి తీరని శోకంగా మారింది. కృపాచార్యుడు అప్పుడైనా పాండవులతో సంధి చేసుకోవటం మంచిదని హితవు చెప్పాడు. కాని, సుయోధనుడు పెడచెవిన బెట్టాడు. శల్యుని సర్వసైన్యాధ్యక్షునిగా చేసి అతడు సరస్వతీ నదీతీరానికి వెళ్లాడు. పద్ధెనిమిదో రోజు యుద్ధం ప్రారంభమైంది. శల్య భీముల మధ్యా శల్య ధర్మజుల మధ్యా, యుద్ధం సంకులంగా సాగింది. చివరకు ధర్మరాజు ప్రయోగించిన శక్తి వలన శల్యుడు మరణించాడు. నకులుడు చిత్రసేన సత్యసేన, సుశర్ములను సంహరించాడు. సహదేవుడు ఉలూకుని చంపాడు.



దుర్యోధనుడు ద్వైపాయన హ్రీదంలో దాక్కొన్నాడు. కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ - ముగ్గురూ కలిసి దుర్యోధనుని వద్దకు వెళ్లి యుద్ధానికి సిద్ధం కమ్మని కోరారు. విజయమో, వీర స్వర్గమో ఏదో రణ రంగంలో తేల్చుకొమ్మని ప్రబోధించారు. సుయోధనుడు యుద్ధం ఆనాటికి మాని మరునాటికి చూచుకొందామని అంటాడు.



ధర్మజుడు శ్రీకృష్ణాదులతో కలిసి ద్వైపాయన హ్రీదం వద్దకు వచ్చాడు. అందులో దాగియున్న అతనిని అధిక్షేపించాడు. రణానికి ఆహ్వానించాడు. అభిమానధనుడైన దుర్యోధనుడు ధర్మజుని మాటలు పడలేక జలాశయం నుండి బయటకు వచ్చాడు. 'ఒక్కొక్కరు నాతో పోరటానికి రం'డని పిలిచాడు పాండవులను. 'అనేకమంది అభిమన్యునితో యుద్ధం చేసినట్లు చేయమంటావా?' అని ఎత్తిపొడిచాడు. ధర్మరాజు. రారాజు నిరుత్తరుడైనాడు. శ్రీకృష్ణుడు భీమ దుర్యోదనుల గదా ద్వంద్వ యుద్ధాన్ని నిర్దేశిస్తాడు. వారిలో గెలిచినవారిదే రాజ్యం. బలరాముడు భీమ దుర్యోదనుల గదా యుద్ధాన్ని చూడటానికి వచ్చాడు. ఇరువురు వీరులు మహావృషభాల్లాగా మహాస్సర్పాల్లాగా, మదగజాల్లాగా, మహాపర్వతాల్లాగా వివిధ భంగిమల్లో గదాయుద్ధాన్ని సాగించారు. వారిద్దరి బలతారతమ్యాన్ని చెప్పమని అర్జునుడు కృష్ణున్ని అడిగాడు. బలంలో భీముడు మిన్న, నేర్పున రారాజు మిన్న అని గోవిందుడు చెప్పాడు. యుద్ధంలో భీముడు బలాన్ని ప్రదర్శించినా దుర్యోధనుని నైపుణ్యాన్ని మించటం శ్రమగా మారుతున్నది. శ్రీకృష్ణుని సూచనపై అర్జునుడు భీముని ప్రతిజ్ఞను తొడలు చూపి జ్ఞాపకం చేశాడు. వాయుపుత్రుడు ఆ సూచన గ్రహించి గదాయుద్ధ నియమ విరుద్ధమైనప్పటికీ దుర్యోధనుని తొడలను విరుగగొట్టాడు. సింహంచేత చంపబడ్డ ఏనుగులా పడి ఉన్నాడు. తొడలు విరిగిన దుర్యోధనుడు. భీముడతని వద్దకు పోయి "ఏకవస్త్రఅయిన పాంచాలిని ఈడ్చి తెప్పించిన పాపఫలాన్ని అనుభవించు దుష్టాత్మా!" అని ఎడమకాలుతో అతని

శిరస్సును తన్నాడు. "బంధుద్రోహీ! ఆనాడు మమ్మల్ని పశువులని పిలిచావు రాజగర్వంతో. ఈనాడు నేను నిన్ను పశువా! అని పిలుస్తున్నాను. ఇక్కడ నీకెవరైనా దిక్కున్నారా!" అని అధిక్షేపించాడు. ధర్మనందన గోవింద పాంచాల ప్రవరుల కందరికీ నేలపై బడిన దుర్యోధనుని చూపి, అతడు చేసిన యెగ్గులన్నీ ఎంచి, తలను మరలా కాలితో తన్నాడు. ధర్మజుడు భీముణ్ణి వారించాడు.

దుర్యోధనుడు శ్రీకృష్ణున్ని నిందించటం, శ్రీకృష్ణుడు దుర్యోధనుని నిజరూపాన్ని తెలిపి అధిక్షేపించటం సాగాయి. పాండవులు కృష్ణ సాత్యకులతో కౌరవ శిబిరానికి చేరారు. అగ్ని దత్తమైన అర్జునుని రథం. దాని పని పూర్తి కావటంతో దగ్ధమైపోయింది. శ్రీకృష్ణుడు హస్తినాపురికి పోయి గాంధారిని ఊరడించి తిరిగి పాండవుల వద్దకు వచ్చాడు. కృపకృతవర్మ అశ్వత్థామలు తొడలు విరిగి పడియున్న దుర్యోధనుని వద్దకు వెళ్ళి దుఃఖించారు. అశ్వత్థామ తన తండ్రిని చంపిన పాండవులపై పగ సాధించ ప్రతిజ్ఞ బూనుతాడు. సుయోధనుడు అతనిని సర్వసైన్యాధ్యక్షునిగా అభిషేకం చేశాడు.

# సౌప్తిక పర్వం

అశ్వత్థామ ఆరాత్రి ఒక గుడ్లగూబ కాకులను చంపటం చూచాడు. అలాగే నిద్రపోతున్న వారిని వధించాలని నిశ్చయించి పాండవ స్కంధావారం మీద అర్ధరాత్రి దాడిచేశాడు. అశ్వత్థామకు శివుడు దివ్యఖడ్గాన్ని ప్రసాదించాడు. దానితో పాండవ స్కంధావారంలో నిద్రలో మునిగి ఉన్న దృష్టద్యుమ్నాదులను, ఉపపాండవులను శిఖండిని సంహరించాడు. గుర్రాలను, ఏనుగులను సేనలను మట్టుపెట్టాడు. ఆ తరువాత కృప కృతవర్మలతో కూడి దుర్యోధనుని వద్దకు వెళ్లి అతనికి నివేదించాడు. సంతృప్తితో దుర్యోధనుడు ప్రాణాలు వదిలాడు.

పాండవులు, శ్రీకృష్ణుడు, సాత్యకి మొదలైనవారు అశ్వత్థామ దాడి చేసిన రాత్రి పాండవ స్కధా ంలో లేకపోవటంతో వారికి అపాయం కలగలేదు. కాని, దృష్టద్యుమ్న, ఉపపాండవాదుల మరణం పాండవాదులకు మహాశోకం కలిగించింది. విజయం కలిగిందని సంబరపడుతున్న సమయంలో జరిగిన ఈ ప్రలయం నిర్వేదాన్ని పొందించింది. శ్రీకృష్ణుడు వారందరినీ ఓదార్చాడు. ద్రౌపదికి కబురంపారు. ఆమె పుత్రభాతృమరణానికి అవేదన చెందింది. అభిమన్యు ఘటోత్కచుల మరణం తరువాత ఉపపాండవుల మరణవార్త ఆమెను కలత పెట్టింది. కొడుకులు లేకుండా రాజ్యభోగాలు ఎటువంటి సుఖాన్నీ యివ్వలేవని వాపోయింది. ఆ దారుణకృత్యానికి మూలకారకుడైన అశ్వత్థామను పట్టి అతని శిరస్సు మీద

పుట్టుకతో వచ్చిన శిరోమణిని తెచ్చి యిస్తే తప్ప తాను ప్రాణాలతో బ్రతుకజాలనని ప్రతిజ్ఞ చేసింది. ఆ ప్రతిజ్ఞ తీర్చే భారం భీమసేనునికి వప్పజెప్పింది.

నకులుడు సారథిగా పూన్చిన రథమెక్కి భీముడు అశ్వత్థామ పైకి దండెత్తాడు. శ్రీకృష్ణుడు మిగిలిన పాండవులను గూడ భీమునికి తోడుగా పొమ్మన్నాడు. శ్రీకృష్ణుడు కూడా వారి వెంట వెళ్లాడు. భాగీరథీ తీరంలో తపస్సు చేస్తున్న అశ్వత్థామను చూచి భీముడు కోపించి "ఒరే క్రూరుడా! నిన్న రాత్రి అంతటి పాపం చేసి తెల్లవారేసరికి ఇంతటి తపస్వివయ్యావా? కపట తపస్సు చాలించి, యుద్ధానికి లే" అని పరుషంగా పిలిచాడు. అశ్వత్థామ వద్ద బ్రహ్మశిరోనామక మహాస్త్రం ఉంది. దాన్ని అతడు ప్రయోగిస్తే అర్జునుడు దానికి మారుగా అతని వద్దనున్న బ్రహ్మశిరోనామక మహాస్త్రాన్ని ప్రయోగించాలని శ్రీకృష్ణుడు సూచించాడు. అశ్వత్థామ బ్రహ్మశిరాన్ని ప్రయోగించాడు. అర్జునుడూ ప్రయోగించాడు. ఆ అస్త్రాల జ్వాలల వలన లోకాలు సంక్షోభించాయి. ఆ మంటల మధ్య వ్యాస మునీంద్రుడు ప్రత్యక్షః ఇరువురినీ అస్త్రాలను ఉపసంహరించుకోమని కోరాడు. అర్జునుడు దాని కంగీకరిం ఉపసంహరించుకొన్నాడు. అశ్వత్థామ ఉపసంహరించలేకపోయాడు. అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రానికి లక్ష్యంగా పాండవ వంశంలో గర్భవతులైన స్త్రీల పిండాలన్నీ దగ్ధమౌతాయి. అర్జుని అస్త్రానికి అశ్వత్థామ హతం కావాలి. కాని పార్థుడు ఉపసంహరించుకొని యోగ్యతను ప్రకటించాడు. అందుకు అశ్వత్థామ శిరోరత్నాన్ని ప్రతిగా ఇవ్వాలని వ్యాసుడు నిర్ణయించాడు. పాండవ స్త్రీల గర్భస్థ శిశువును ఒక్కరిని మిగుల్చమని వ్యాసుడు, శ్రీకృష్ణుడు, అశ్వత్థామను కోరారు. అతడంగీకరించలేదు. అందుకో గోవిందుడు ఆగ్రహించి "ఉత్తర గర్భస్థ శిశువును నేను రక్షిస్తాను. మానవుల మీద ప్రయోగించకూడని మారణాస్త్రాన్ని ప్రయోగించినందుకూ, దయను కాలరాచినందుకూ నీవు దుర్గంధభూయిష్టమైన రక్తంకారే శరీరంతో జీవిత శేషాన్ని ఏకాకిగా దుర్భర దుఃఖంతో సాగించు" అని అశ్వత్థామను శ్రీకృష్ణుడు శపిస్తాడు. ఉత్తరకు జన్మించే పరీక్షిత్తుకు కృపాచార్యులచే అస్త్రవిద్య నేర్పించి భూతలాన్ని పెక్కేళ్లు పాలింపజేయిస్తానని శ్రీకృష్ణుడు ప్రకటించాడు. అశ్వత్థామ హతాశుడై శిరోరత్నాన్ని పాండవుల కర్పించి అరణ్యాలకు తపస్సు కోసం పోయాడు. భీమసేనుడు అశ్వత్థామ శిరోరత్నాన్ని తెచ్చి యిచ్చి ద్రౌపదిని ఓదార్చాడు.

# స్త్రీపర్వం

ధృతరాష్ట్రుడు గాంధారీ సమేతంగా రణభూమికి వచ్చి, శవాలై పడిఉన్న ఆప్తుల నందరినీ పేరుపేరునా తెలుసుకొంటూ గుండెలు పగిలేటట్లు దుఃఖించాడు. కృపాచార్యుడు, విదురుడు యథోచితంగా వారికి ఓదార్పు వాక్యాలు చెప్పారు. కాని, చల్లారే శోకాగ్ని కాదది.

ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రులను దర్శించటానికి తమ్ములతో శ్రీకృష్ణాదులతో కలసి వచ్చాడు. దు:ఖాతి శయంతో ధృతరాష్ట్రుడు అందరినీ కౌగిలించుకొన్నాడు. భీముని పేరు చెప్పినప్పుడు శ్రీకృష్ణుడు భీమాకారంతో చేసిన ఒక ఉక్కుబొమ్మను ధృతరాష్ట్రుని కౌగిలికి అందించాడు. తన బిడ్డలనందరినీ చంపాడని ఆ గ్రుడ్డిరాజుకు భీముని మీద ఉన్న క్రోధంతో ఆ ఉక్కుబొమ్మయే భీముడనుకొని అది నుగ్గయేటట్లు ఒత్తి తన పగ తీర్చుకొన్నానని సంతోషపడ్డాడు. తరువాత శ్రీకృష్ణుని వలన నిజం తెలుసుకొని తలవంచుకొన్నాడు. ఆ తరువాత గాంధారికి పాండవులు మ్రొక్కపోగా ఆమె వారిని శపింపతలంచటం వ్యాసుడు గ్రహించి ఆమెను వారించాడు. భీమాదులు ఆమెను ఊరడించాడు. ఆపైన పాండవులు ద్రౌపదీ సహితంగా కుంతీదేవికి నమస్కరించి ఆమెను ఓదార్చారు. కుంతీ ద్రౌపదులు గాంధారి వద్దకు వెళ్ళి పరస్పరం ఉపశమన వాక్యాలు చెప్పుకొన్నారు.

గాంధారి యుద్ధభూమికి పోయి ఒక్కొక్కరి శవాన్ని తెలిసికొని ఎలుగెత్తి దుఃఖించింది. ఆమె వెంట రాజకుటుంబ స్త్రీలందరూ ఆ మహా శోకగీతంలో స్వరాలు కలిపారు. అప్పునందరికోసం కన్నీరు మున్నీరుగా దుఃఖించి గాంధారి తనకు అరవ ప్రాణమైన దుర్యోధనుని చావుకు దయనీయంగా విలపించి దీనికంతటికీ మూలకారకుడు శ్రీకృష్ణుడే అని భావించి అతడు నిజంగా యుద్ధాన్ని మాన్పదలచుకొన్నట్లయితే కౌరవ కులం బ్రతికి ఉండి ఉండేదని తలంచి - అతనిపై కోపించి శపించింది. "మీ యాదవులు యుద్ధంలో ఇలాగే ఒకరితో ఒకరు పోరి చనిపోదురు గాక! ఇప్పటి నుండి ముప్ఫయి ఆరేళ్ళకు నీవు కూడా ఎవరి సహాయం లేని ఒంటిచావున పోయెదవు గాక!" అని ఘోర్గఅ శపించింది. శ్రీకృష్ణుడు ఆమె మాటలకు నవ్వి "యాదవులకు ఇదివరకే ఇటువంటి శాపం ఉంది. ఇప్పుడు నీవు కొత్తగా పెట్టింది ఏమీ లేదు గాంధారీ దేవీ! నన్ను శపించే ముందు నీవు ఆత్మ విమర్శ చేసుకొని ఉండవలసింది. నీ కొడుకులు చేసిన పాపకృత్యాలను ఒక్కసారి స్మరించుకొని ఉండవలసింది. నేను, నీవు, భీష్ముడు, ద్రోణుడు, బాహ్లికుడు, ధృతరాష్ట్రుడు - ఇలా ఎందరమో నీ కొడుక్కు బుద్ధులు చెప్పాం. వినలేదు. పైపెచ్చు అవినయంతో ధిక్కరించాడు. ఆ అపరాధాల కన్నింటికీ ఇప్పుడు ఫలాన్ని అనుభవించాడు. దీనికి దుఃఖించవలసింది, కోపగించుకోవలసింది నీవారిని చూచి మాత్రమే. నన్నెందుకమ్మా అనవసరంగా నిందిస్తావ్? వీరమాతలు, వీరపత్నులు నీలాగా నిబ్బరాన్ని కోల్పోయి మాట్లాడటం సముచితం కాదమ్మా!' ' అని కర్ణకఠోరంగా మందలించాడు గోవిందుడు. గాంధారి నిరుత్తరురాలై నిశ్శబ్దంగా ఉండి పోయింది.

ధృతరాష్ట్రుడు యుద్ధంలో చనిపోయినవారి లెక్క అడిగాడు ధర్మరాజును. అతడు

ఎఱుకపడినవారని, ఎన్నదగినవారిని 76 కోట్ల 20వేలమందిగాను, 24వేల 320మందిని సైనికులుగాను పేర్కొన్నాడు. వారందరికి అగ్ని కార్యాలు, అపరకర్మలు చేయించే యేర్పాట్లు చేయటానికి ధర్మరాజు పూనుకొన్నాడు. ఆ సమయంలో కుంతి యెల్లవారు వినేటట్లుగా కర్ణుడు తనకు సూర్యుని అనుగ్రహం వలన తొలిచూలుగా పుట్టాడనీ, అతనికి తిలోదకాలు వదలాలనీ దుఃఖిస్తూ చెప్పింది. ధర్మజాదులు ఆ నిజం తెలుసుకొని వాపోయారు. "కర్ణుడొక్కడు కౌంతేయుడని ముందే తెలిసి ఉన్నట్లయితే కురుకులంలో కలత పుట్టేదే కాదు; భారతయుద్ధం ప్రవర్తిల్లేదే కాదు; ఇంత ప్రజా నష్టం జరిగి ఉండేదే కాదు" అని ధర్మరాజు చింతించారు. ఇంతకాలం ఇంత కీలకమైన రహస్యం కుంతీదేవి దాచి ఉంచటం చేత చరిత్రలో జరగరాని కీడు జరిగిపోయింది కాబట్టి ఆడువారినోట ఆవగింజ కూడా నానదని ధర్మరాజు శాపం పెట్టాడు.

గంగానదీ ప్రాంతంలో డేరాలను వేయించి రాజ కుటుంబీకుల నందరినీ ఒక నెలరోజు అపకర్మలు, తిలోదకాలు నిర్వహించి అశౌచశుద్ధి జరిపించుకోవటానికి ఉండే ఏర్పాట్లు జరిగాయి. మునులందరూ వచ్చి ధర్మరాజుని విజయానికి అభినందించారు. కాని, ధర్మరాజు జ్ఞాతివధవల కలిగిన మహాపాపం అశ్వమేధం వలన గాని పోదని భావించాడు. పట్టాభిషేకానంతరం అశ్వమేధయాగం చేయాలని సంకల్పించాడు.

# శాంతిపర్వం

ధర్మరాజు పట్టాభిషేకం హస్తినాపురంలో మహావైభవంగా జరిగింది. మణిరత్నాలతో పూజించిన శంఖాన్ని శ్రీకృష్ణుడు పూరించి ధర్మజ ప్రభుత్వాన్ని ప్రకటించాడు. పరమేశ్వరుడైన వాసుదేవుణ్ణి పాండవులు పూజించి స్తుతించారు. ధర్మరాజు ఉత్తమ ప్రభువు ఆచరింపవలసిన ధర్మాలను బోధించుమని శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు భీష్ణుణ్ణి నిర్దేశించాడు. అంపశయ్య మీద శయనించియున్న భీష్మని వద్దకు శ్రీకృష్ణుని ముందుచుకొని ధర్మజాదులు వెళ్ళారు. భీష్మడు పుండరీకాక్షుని భక్తితో కీర్తించాడు.

"హరి, సహస్రశీర్షుఁ, డలఁతు
వేదమయు, సహస్రపాదు, డలఁతు
లైన వారికంటె నలఁతి పెద్దలకును
జాలఁ బెద్ద యగు దయాళుఁ గొలుతు"

"అమృతమయు, ఋగ్యజుస్సా

నుములయు పని షడ్వచస్సమాజములకు వా
చ్చమయిన పురుషోత్తము ని
క్కము రూపగువాని భక్తిగమ్యు దలంతున్"

"సర్వమునందును దానున్
సర్వముఁ దనయందు నుండు సంచారంబున్
సర్వమునకుఁ దనవలనన
సర్వాత్మకు నట్టి వృష్ణి సత్తముఁదలఁతున్"

"యదువంశంబున వాసుదేవుఁడన గ్రీడార్థంబు జన్మించి, దు
ర్మద దైత్యావళి గూర్చి, పార్థునకు సారథ్యంబు త్రైలోక్యస
మ్మదమారంగ నొనర్చి దేవముని సమ్మానోద్ధృతిన్ భూభారం
బు దొలగించిన చక్రి నంబురుహనాభుం గొల్తుఁ కృష్ణాకృతిన్"

"శరణాగతంబుఁడ భక్తుడఁ
బరమ పదవి గోరెదను శుభంబుగ నన్నుం
బరికించి యేది మే ల
య్యెరవు దొరకొనందఁదలపవే కమలాక్షా!"

భీష్మస్తుతికి శ్రీకృష్ణుడు ప్రసన్నుడైనాడు. భూతలాన్ని ధర్మబద్ధంగా పరిపాలింపనున్న ధర్మరాజుకు రాజధర్మాలను, ఆపద్ధర్మాలను, మోక్షధర్మాలను బోధించుమని కోరాడు. శ్రీకృష్ణుని కోరికను భీష్ముడు సంతోషంతో శిరసావహించాడు. ధర్మరాజు పట్ల వాత్సల్యంతో భీష్ముడు ధర్మగీతను బోధించాడు. అలనాడు కృష్ణుడు అర్జునునికి బోధించింది భగవద్గీత; నాడు ధర్మజునికి భీష్ముడు బోధించింది శాంతనవగీత!

భీష్ముడు బోధించిన రాజధర్మాలలో తలమానికమైనది ప్రజలకు రాజుకూ ఉండే సంబంధాన్ని బోధించేది -

"రాజునకు ప్రజ శరీరము,
రాజు ప్రజకు నాత్మ, గాన రాజుంబ్రజయున్
రాజోత్తమ! యన్యోన్యని
రాజితులై యుండవలయు రక్షార్చనలన్"

రాజు అంటే ప్రభుత్వం. ప్రభుత్వానికి ప్రజలు శరీరం; ప్రజలకు ప్రభుత్వ ఆత్మ కాబట్టి ప్రభుత్వం ప్రజలను రక్షించటంలో, ప్రజలు ప్రభుత్వాన్ని సేవించటంలో అన్యోన్యం

విశ్వాసంతో కూడి ఉండాలి.

"తను దాన తొలుత గెలువన్
మనుజపతికి వలయుఁబిదప మార్తుర గెలువన్
మనమునఁ దలంచునది యును
దను గెలువని పతికి గెలువఁదరమే పగఱన్"

రాజు మొదట తనను తాను జయించుకోవాలి. అంటే తన ఉన్న కామ క్రోధ లోభ మద మోహ మాత్సర్యాలనే అంతశ్శత్రువులను ముదుగా జయించాలి. ఆ తరువాత శత్రురాజులను జయించ సంకల్పించాలి. తనను గెలుచుకొనలేని రాజుకు పగఱను జయించటం సాధ్యం కాదు.

ధర్మాలలో కొన్ని అధర్మాలుగా, అధర్మాలు కొన్ని ధర్మాలుగా లోకంలో గోచరిస్తూ ఉంటాయి. వాటిని నిర్మలమైన బుద్ధితో సందర్భశుద్ధిని బట్టి నిర్ణయించుకోవాలి.

"ధర్మ మధర్మము భంగి, న
ధర్మము ధర్మంబు మాడ్కిఁ దనయా! తోఁచున్
నిర్మలమతి నరయవలయు
ధార్మికతన కోరువాడు దన కేర్పడగన్"

ఆపద్ధర్మాలలో ఈ సూత్రం అత్యంతాచరణీయం.

మోక్షధర్మాలలో మొదట చెప్పుకోదగింది నిస్సంగత్వం. తామరాకుపై నీటి బిందువులాగా నీటిలో తామరపూవులాగా ప్రకృతినంటి కూడా దానియందు సంగుడు కాగుండా ఉండటం నిస్సంగత్వం. అది మోక్షానికి ముఖద్వారం.

"జలముఁ గదిసియుండ జలముచే నార్ద్రంబు
గాక యుండునట్టి కమల దళము
భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియును ద
ద్వికృతి! బొందకుండు వీత దొష!"

భీష్ముడు సర్వ ధర్మాలను ధర్మరాజుకు బోధించాడు. వాటినన్నింటిని విని "తాతా! ఎన్నో ధర్మాలను విన్నాను. అయితే, సర్వ ధర్మాలకంటె ఉత్తమ ధర్మమేమిటో చెప్పి నన్ను కృతార్థుణ్ణి చేయమని ప్రార్థించాడు ధర్మరాజు. మానవ దర్మాలన్నింటిలో మకుటాయమైనది ఈ ధర్మం.

"ఒరు లేమేమి యొనర్చిన
నరవర! యప్రియము దనమనంబున కగుఁదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పదములకెల్లన్"

ఇతరులు ఏమేమి చేస్తే తన మనస్సుకు ఇష్టం ఉండదో, వాటిని ఇతరుల పట్ల చేయకుండా ఉండటం ఉత్తమ ధర్మాలలో ఆచరణ శ్రేష్ఠమైంది. ఇది మహాభారత ధర్మసారం.
- అనుశాసనిక పర్వం -

శ్రీకృష్ణుని అనుమతితో ధర్మరాజుకు సకల ధర్మనీతి సారాన్ని ఇతిమాస పురస్సరంగా వరించి, శరీరాన్ని పరిత్యజించటానికి వాసుదేవుని అనుమతి కోరాడు. "దేవ దేవ! ాలుబిడ్డలు లేనివాణ్ణి. నిన్ను నమ్ముకొన్ని భక్తుణ్ణి. నాయందు దయచూపుము. నమస్కారము. ాధవా! ఈ పాండవులకు నీవే గతివి. వీరిని కరుణతో రక్షించు. కృష్ణుడెక్కడ ఉంటే గెలుపు అక్కడ ఉంటుందని దుర్బుద్ధి అయిన ఆ దుర్యోధనునికి ఎన్నోసార్లు చెప్పాను. నామాట అతడు పెడచెవిన పెట్టి తనవారినెల్ల పోగొట్టుకొన్నాడు. చివరకూ తానూ చనిపోయాడు. నరనారాయణులనే పరమ మునులు భూలోకంలో అర్జున వాసుదేవులుగా పుట్టి లీలామానుషవిగ్రహాలై చరిస్తున్నారని పూర్వ నాతో వ్యాసుడూ, నారదుడూ చెప్పారు. నా నేర్చిన విధంగా ధర్మాచరణం చేశాను. నాకింక అనుజ్ఞ ఇమ్ము!" అని ప్రార్థించాడు.

"గాంగేయా! నీవు పుణ్యాత్ముడవు; నీ కెప్పుడూ కీడు కలలేదు నీ పితృభక్తి వలన మరణం నీ అధీనంలో నిలిచింది. నీకు నేను అనుజ్ఞ ఇచ్చాను. నీవు వసువులను తిరిగి కలుసుకో" అని శ్రీకృష్ణుడన్నాడు. ఆనందంతో భీష్ముడు యోగశక్తితో తన శరీరంలో నుండి ప్రాణాలను బయటకు వెలించాడు. అతని ఆత్మ కపాలాన్ని భేదించుకొని మహోల్కాకారంతో ఆకాశంలోకి ఎగసి, కొంతదూరం సాగి అంతర్ధానమైపోయింది. భీష్ముడు దివంగతుడయ్యాడు.

# అశ్వమేధ పర్వం

ధర్మరాజు హస్తినాపురంలో రాజ్యం చేస్తుంటే కొన్నాళ్ళు అర్జునుడూ, శ్రీకృష్ణుడు కలిసి ఇంద్రప్రస్థ పురంలో నివసించారు. యుద్ధ సమయంలో శ్రీకృష్ణుడు చెప్పిన తత్త్వజ్ఞాన విశేషాలను సమాహితంగా వినలేకపోవటం చేత వాటిని వాసుదేవుని చేత మరల చెప్పించుకొని పార్థుడు సావధానంగా విన్నాడు. పాండవుల అనుమతితో శ్రీకృష్ణుడు ద్వారకకు బయలు దేరాడు.

కురుక్షేత్ర యుద్ధం తరువాత కురు సామ్రాజ్యంలో ఎన్నడూ లేనంత ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. భూమి బంగారం ఈనటం తగ్గింది. ధర్మజుడు హిమవత్పర్వతారణ్యాలలో స్వర్ణ నిధులను త్రవ్వి తేవటానికి తమ్ములతో కలసి బయలుదేరాడు. వేదవ్యాసుడు వారిచేత త్ర్యంబక పూజలు చేయించి అపార స్వర్ణరాసులు దొరికేటట్లు చేశాడు. చూచేవారికి కళ్ళు మిరిమిట్లు కొలిపేటట్లు బండ్ల కెత్తించిన బంగారం హస్తినాపురి చేరింది. ఆ ధనంతో అశ్వమేధం చేయమని వ్యాసుడు ధర్మజును నిర్దేశించాడు.

శ్రీకృష్ణుడు సకల బంధు సమేతంగా హస్తినాపురానికి వచ్చాడు. అందరు కలిసి సుఖంగా ఉంటున్న తరుణంలో ఉత్తరకు మగబిడ్డ పుట్టాడు. కాని, మహాబాణాగ్నితో దగ్ధమై చనిపోయిన వాడుగా ఉన్నాడు. కుంతీ సుభద్రలు శ్రీకృష్ణునితో మృతబాలుని గురించి చెప్పి పాండవ వంశాంకురాన్ని బ్రతికించుమని బహువిధాలుగా ప్రార్థించాడు. అశ్వత్థామ మొదట అతడు చేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకం చేశారు. ఆ బిడ్డ చనిపోతే ఆ శోకంతో తామంతా ప్రాణాలు వదలటం తథ్యమని మొరపెట్టుకున్నారు. వారితో కలిసి మాధవుడు ప్రసూతి మందిరానికి వెళ్ళాడు. ద్రౌపది ముందుగా వెళ్ళి ఉత్తరకు శ్రీకృష్ణాగమాన్ని చెప్పింది. ఉత్తర లేచి వాసుదేవునికి మ్రొక్కి ఈ బిడ్డ చేత మ్రొక్కిద్దామని ముచ్చటపడ్డాను కాని అశ్వత్థామ అస్త్రశక్తికి గురి అయ్యాడు. నీ మాట ఓటువోయింది. అని ఆశిశువును అంకతలంమీద ఉంచుకొని శ్రీకృష్ణాదులను తేరిపార చూడుమని చెప్పుతూ మృతుడైనవాడు తెలివొందక పోవటంతో మూర్ఛపోయింది ఉత్తర. కొంతసేపటికి తరువాత తేరుకొని లేచి శ్రీకృష్ణునికి 'శరణు శరణు' అని మ్రొక్కింది. శ్రీకృష్ణుడు ఆమెను 'ఓడకు ఓడకు' అని అభయహస్తం ఇచ్చాడు. మృతబాలుణ్ణి శయనం మీద పరుండబెట్టమన్నాడు. నా మాట అబద్ధం కాకుండా ఇదిగో బ్రతికిస్తున్నాను సంతోషంతో అందరూ చూడండని హెచ్చరించాడు. బ్రహ్మముఖాస్త్ర ప్రభావానికి విరుగుడు పెట్టాడు. బాలకుని శవానికి ప్రాణం పోశాడు. బాలుడు కదిలాడు, కళ్ళు తెరిచాడు; కౌరవాంగనలు సంతోషంతో తేలిపొయ్యారు. ఉత్తర బాలుని తెచ్చి శ్రీకృష్ణుని పాదాలకు ప్రణమిల్ల చేసింది. అతడు బాలుణ్ణి దీవించి పరీక్షిత్తు అని పేరు పెట్టి కానుకలు చదివించాడు. పాండవులు పరమానందాన్ని పొందారు.

ధర్మజుడు అశ్వమేథ యజ్ఞం చేయటానికి శ్రీకృష్ణుని అనుమతి పొందాడు. ఉత్తమాశ్వాన్ని నియోగించాడు. అర్జునుణ్ణి అశ్వరక్షకునిగా, భీమనకులును రాష్ట్ర రక్షకులుగా, సహదేవుణ్ణి కుటుంబ కార్య నిర్వాహకునిగా నియుక్తులను. చేశాడు. ధర్మరాజు యోగ దీక్షితుడైనాడు. వేదవ్యాసుడు ప్రధాన ఋత్విజుడు.

యాగాశ్వం బయలు దేరింది. ధరణిని ప్రదక్షిణంగా తిరిగి ఉత్తర దిశవైపు సాగింది.

త్రిగర్త దేశాధిపతులు అందరూ కలిగి అశ్వాన్ని అడ్డగించారు. అర్జునుడు వారిని దయతో పలుకరించి, భారత యుద్ధంలో చాలమంది రాజులు చనిపోవటం కారణంగా ధర్మరాజు దయామయుడై గుఱ్ఱాన్ని పట్టుకొన్ని వారిని మంచి మాటలతో ఒప్పించి రక్తపాతం జరుగకుండా చూడుమని చెప్పారని హెచ్చరించి యుద్ధాన్నుండి విరమించుకొమ్మని కోరాడు. కాని, త్రిగర్త దేశాధిపతులు అర్జునునితో తలపడి యుద్ధం చేశారు. చివరకు అతని చేతిలో ఓడిపోయారు.

ప్రాగ్జ్యోతిషపురం వద్ద భగదత్తుని తనయుడు గుర్రాన్ని పట్టి అర్జునునితో మూడు రోజులు యుద్ధం చేశాడు. బాలురను చంపవద్దనే ధర్మజుని మాటకు కట్టుబడి దయాబుద్ధితో అతన్ని వారించాడు అర్జునుడు. సింధు దేశంలో అశ్వం ప్రవేశించింది. సైంధవుని పుత్ర పౌత్రులు పూర్వ వైరాన్ని పాటించి యుద్ధం ప్రకటించారు. యుద్ధంలో సైంధవుని కొడుకుని చంపి, దుశ్శల ప్రార్థనపై మనుమణ్ణి రక్షించి ముందు సాగాడు.

మణిపూర పురానికి చేంది యజ్ఞాశ్వం, చిత్రాంగదకు, అర్జునునిని వలన కలిగిన బభ్రువాహనుడు వచ్చినవాడు తన తండ్రి అని గ్రహించి ఎదురేగి నమస్కరించాడు. అర్జునుడు అతణ్ణి ఆదరించకుండా క్షత్రియోచితమైన యుద్ధానికి పిలిచాడు. తండ్రీ కొడుకుల మధ్య ఘోరమై యుద్ధం జరిగింది. అందులో అర్జునుడు బభ్రువాహనుని చేత మృతుడౌతాడు. నాగలోక వాసియైన ఉలూచి సంజీవమణిచేత అర్జునుణ్ణి బ్రతికించింది. 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అనే సూక్తిని తండ్రికి సత్యమయ్యేటట్లు చేశాడు బభ్రువాహనుడు. అందుకు అర్జునుడు ఆనందించాడు.

అర్జునుడు ఆ తరువాత జరాసంధ పౌత్రుణ్ణి, గాంధారపతిని, జయించి శ్రీకృష్ణాదులను కలుపుకొని విజయంతో హస్తినాపురానికి చేరాడు. ధర్మరాజు సశాస్త్రీయంగా మహా వైభవంగా అశ్వమేధ యాగాన్ని నిర్వహించి, తన రాజ్యాన్నంతా యజ్ఞ దక్షిణగా వ్యాసభట్టారకునికి దానం చేశాడు. దానిని కోటి కోట్ల మాడలకు మరల ధర్మజుడు కొనుక్కొని తన ప్రభుత్వాన్ని సాగించాడు. యజ్ఞానికి వచ్చిన రాజులనందరినీ అమోఘంగా సత్కరించాడు. యజ్ఞానంతరం అవభృంధ స్నానం చేసి, బంధు వధ వలన కలిగిన మహాపాపాన్ని పోగొట్టుకొన్నాడు. భూతలం మీద తిరుగులేని చక్రవర్తిగా ప్రశస్తి పొందాడు.

# ఆశ్రమవాసపర్వం

ధృతరాష్ట్రుడు గాంధారీ సమేతంగా వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించాడు. కుంతి కూడా వారి వెంట వనానికి వెళ్ళింది. పాండవులు వనంలో ఉన్న వారిని దర్శిస్తూ ఉండేవారు.

కొంతకాలం ఆశ్రవాస జీవితం గడిపి వారు దివంగతులయ్యారు.

# మౌసల పర్వం

యాదవకులంలో ముసలం పుట్టింది. యాదవులందరూ కలసి శ్రీకృష్ణ సహితులై సముద్రతీరానికి వెళ్లారు. సాత్యకీ కృతవర్మలకు భేదాభిప్రాయాలు వచ్చాయి. మద్యపాన మత్తుడైన సాత్యకి కృతవర్మ తల నరికాడు. యాదవులందరు పరస్పరం పోరాడుకొని నశించపోయారు. శ్రీకృష్ణుడు అర్జునునికి ద్వారకకు తీసికొన రమ్మని దారకుణ్ణి పంపాడు. బలరాముడు యోగబలంతోనూ శ్రీకృష్ణుడు బోయవాని బాణం నెపంతోనూ శరీరాలను పరిత్యజించి పరమపదాలను పొందారు. అర్జునుడు ద్వారకకు రాగా వసుదేవుడు యాదవ నాశవృత్తాంతాన్ని చెప్పి అతనూ చనిపోయాడు. అర్జునుడు వనంలో పడిఉన్న బలరామ శ్రీకృష్ణుల కళేబరాలను చూచి విలపించి వాటికి దహన సంస్కారాలు చేశాడు. ద్వారకా నగరం సముద్రంలో మునిగిపోయింది. రుక్మిణ్యాదులు అగ్నిప్రవేశం చేశారు. యాదవ క్షయాన్ని అర్జునుడు - వేదవ్యాసునికి తెలియజేశాడు. చివరకు -

"మన సారథి, మన సచివుడు,
మనవియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్
మన విభుడు, గురుడు, దేవర
మనలను దిననాడి చనియె మనుజాధీశా!"

అని వాపోతూ ధర్మరాజుకు నివేదించాడు.

వేదవ్యాసుడు ఇలా ప్రబోధించాడు -

"ధరణి భరంబు వాప నవతారము నొందిన విష్ణు, డత్తెఱం
గరుడుగ నిర్వహించి యజరామర నిష్కల నిర్వికార భా
స్వర నిజ సత్పదంబు నుపశాంతి పరుండయి పొందె; దానికిం
గురుకుల వర్య! వోకమున గుందుదురే మిము బోటి బోదనుల్".

# మహాప్రస్థానిక పర్వం

వాసుదేవ నిర్యాణం విన్న తరువాత ధర్మరాజుకు మనస్సులో విరక్తి కలిగింది. కర్మత్యాగం చేసి మహాప్రస్థానం చేయాలని సంకల్పించాడు. మొదట అర్జునునికి తరువాత భీమాదులకు తన అభిప్రాయం చెప్పాడు. వారూ అతని వెంట నడవటానికి అంగీకరించారు.

ద్రౌపది కూడా దానికి సుముఖురాలైంది.

ధర్మరాజు ప్రజాపరిషత్తును సమావేవపరిచి తన అభిప్రాయాన్ని తెలిపి, పరీక్షిత్తును రాజు చేసి, కృపాచార్యుని గురువుగా నియమించి, ధౌమ్యాదులను పురోహితులనుగా నుంచి ప్రస్థానాన్ని సాగించాడు. మొదట తూర్పుగా సముద్రతీరం వరకు నడిచారు. అగ్నిదేవుని ఆదేశం మీద విజయుడు గాండీవాన్ని సముద్ర జలంలో పడవేశాడు. క్రమంగా దక్షిణ పశ్చిమ సముద్రాలను దర్శించి ఉత్తరంగా యోగమార్గంలో హిమవత్పర్వతాన్ని దాటి మేరు పర్వతాన్ని సమీపించారు. ముందు ధర్మజుడు, అతని వెనుక వరుసగా, భీమసేనుడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది, ఒకశునకం మహాప్రస్థానం యోగమార్గంలో సాగిస్తున్నారు.

పాంచాలికి యోగం సడలింది. ఆమె నేలపై పడి ప్రాణాలు వదిలింది. భీముడు గానికి కారణమేమిటని అన్నను ప్రశ్నించాడు. ఆమెకు పతులైదుగురైనా అర్జునునిమీద అనురాగం అధికంగా చూపేది దానిఫలితం ఈ పతనం అని ధర్మజుడు చెప్పి నిశ్చింతగా ముందుకు వెళ్లిపోతున్నాడు. సహదేవుడు పడిపోయాడు. భీముడు కారణమడిగాడు. తనకంటె పండితుడు లేడని విర్రవీగేవాడని ధర్మజడు చెప్పాడు. ఆపైన నకులుడు నేలపై పడ్డాడు. కారణం సౌందర్యగర్వమని అగ్రజుడు చెప్పాడు. ఆ తరువాత అర్జునుడు వాలిపోయాడు. భీముడు ఆవేదనతో కారణమడిగాడు. కౌరవుల నందరినీ ఒకే రోజున సంహరిస్తానని అన్నాడు. సాటి విలుకాండ్రను గర్హించాడు. మాటలొకటి చేతలొకటి అయినందుకు ఫలమాపతనమన్నాడు ధర్మరాజు. భీమసేనుడు కూడా యోగం సడలి ఒరిగిపోతూ దానికి అన్నను కారణం అడిగాడు. భోజనప్రీతి ఎవ్వరినీ లక్ష్యం చేయకుండా మాట్లాడే లక్షణం ఈ పతనానికి కారణమని చెప్పాడు. ఇక ధర్మరాజూ అతని వెంట నడుస్తున్న శునకం మిగిలాడు. వారు వెనుదిరగకుండా ప్రస్థానాన్ని సాగించారు.

ఎదుట ఇంద్రుడు దివ్య రథంతో ప్రత్యక్షమై ధర్మరాజు ధర్మనిరతిని ప్రశంసించి రథమెక్కుమని కోరాడు. మొదట తనవెంట వచ్చిన తమ్ములను భార్యను తనవెంట దివ్యరథంలో రావటానికి ఇంద్రుణ్ణి అనుమతి కోరాడు. వారు తనువులు త్యజించారనీ, వారిని స్వర్గంలో చూడవచ్చుననీ ఇంద్రుడు సమాధానం చెప్పాడు. ఆశ్రితురాలైన శునకాన్ని వదలలేనని చెప్పాడు ధర్మరాజు. హీన జంతువు కాబట్టి పరిత్యజించుమని ఇంద్రుడు కోరాడు. ఆశ్రిత ధర్మరక్షణం క్షత్రియుల కర్తవ్యమనీ, శునకాన్ని అనుమతించకపోతే తనకు స్వర్గలోక సుఖమే వద్దనీ అతడు స్పష్టం చేశాడు. ఆ మాటలకు మెచ్చి శునకాకారంతో ధర్మజుని వెంట వస్తున్న యమధర్మరాజునిజాకారంతో ప్రత్యక్షమై అతనిని అభినందించాడు.

దివ్యరథాన్ని ఎక్కించాడు. అప్పుడు ఇంద్రుడు ధర్మరాజును ఇలా ప్రస్తుతించాడు.

"దానములం దపంబులను దద్దయుఁ బేర్గలయట్టి వారలన్
మానవనాథులన్ వినమె, మాసెఁదదీయ యశంబు లెల్ల నీ
మానిత కీర్తి దీప్తులు సమస్త జగంబులయందుఁ బర్వుటన్‌ఁ
మేనుల తోడ వారిటులు నేర్చిరె రా నమరత్వ సిద్ధికిన్?"

బొందితో అమరత్వాన్ని పొందిన ఘనత ధర్మరాజుకే దక్కింది. అది ధర్మవీరవ్రతానికి పరిపూర్ణ జీవిత ఫలం!

# స్వర్గారోహణ పర్వం

ధర్మరాజు తన తమ్ములు, భార్య, తనవారు, బంధువులు ఏ యే లోకాల్లో ఉన్నారో చూడాలని కోరికగా ఉన్నదని దేవేంద్రునికి మనవి చేసికొన్నాడు. తగిన దూతనిచ్చి అతడు కోరిన వారిని చూపించుమని ఆజ్ఞాపించాడు. ధర్మజుని వెంట ఆసక్తితో నారదాదులు కూడ వెళ్లారు.

మొట్టమొదట స్వర్గంలో ఉన్నతాసనంలో వీరలక్ష్మీ విరాజితుడై దుర్యోధనుడు కనపడ్డాడు. అతడు చేసిన ఎగ్గులను స్మరించి అతని చెంత మనలేనని భీమాదుల చెంతకు పో సంకల్పించాడు. ధర్మజుడు. స్వర్గంలోని ఆకృతులు తేజశ్శరీరాలు వారకి కామక్రోధాదులు ఉండవు కాబట్టి లౌకిక దృష్టిని వదలి సమదృష్టితో చూడుమని నారదుడు ధర్మజునికి బోధించాడు. అయినా, కులక్షయకారకునికి అమరలోకవానమా? అని సమాధానపడలేకపోయాడు ధర్మజుడు. ఆ మీద కర్ణుని చూడాలని ఉన్నదన్నాడు. ఆపై ద్రుపద విరాటాదులను, పాంచాలిని, సోదరులను, తనయులను చూపుమని కోరాడు. నారదాదులంగీకరించారు. అంతలో దేవదూతను భీమాదులున్న చోటికి తీసుకొని పొమ్మని త్వరపెట్టాడు. అతడు ధర్మజుని ఒక దుర్గంధవాటికకు తీసికొని పోయాడు. అతి భయంకరంగా ఉన్న ఆ ప్రదేశం నరకం. నరకవాసులు ధర్మజుని మేని సుగంధానికి సంతసించి కొంతకాలం అక్కడనే ఉండుమని ప్రార్థించారు. వారెవరని ప్రశ్నించాడు ధర్మజుడు. వారు వరుసగా కర్ణుడు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది, దృష్టద్యుమ్నాదులు, పాపులైన దుర్యోదనాదులకు స్వర్గ సౌఖ్యాలేమిటి? ధర్మవర్తనులైన భీమాదులకు నరక బాధలేమిటి? అని ఉద్వేగాన్ని ప్రకటించాడు ధర్మరాజు. జీవులకు ఏది స్వల్ప భోగమో అది మొదట; దీర్ఘకాలానుభవం తరువాత అనుభవానికి వస్తాయి కాబట్టి భీమాదులు స్వల్పకాల

నరక బాధలనుభవించి శాశ్వత వీర స్వర్గానుభవాలను పొందుతారు అనీ, దుర్యోధనాదులు స్వల్ప పుణ్యానుభవం పొంది ఆ తరువాత దీర్ఘకాల నరక యాతన లనుభవిస్తారనీ మహేంద్రుడు చెప్పాడు.

ధర్మరాజు చిత్తం అసూయాదులకు లోనుగాకుండా ఆకాశగంగంలో మునిగి తనువు త్యజించి నిజరూపస్థితిని పొందటం సముచితమని ఇంద్రుడు హితవు చెప్పాడు. ధర్మజుడు స్వర్గ గంగలో మునిగి తేజశ్శరీరాలతో నిర్వికారుడై దేవత్వంతో ప్రకాశించాడు.

ఇది తెలుగులో చెప్పిన మహాభారత కథాసారం.

"ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు
నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్య దర్మ సంప్రాప్తియు
వినయార్థులకు మహావినయమతియు,
పుత్రార్థులకు బహుపుత్ర సమృద్ధియు
సంపదర్థులకు నిష్ట సంపదలును
గావించునెప్పుడు భావించి వినుచుండు
వారలకిమ్మహాభారతంబు

భక్తి యుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తి వత్సలుండు
భవభయంబు లెల్లఁబాపి యిష్టార్థ సం
సిద్ధి కరుణతోడఁ జేయుచుండు!"

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

**సర్వే జనా స్సుఖినో భవన్తు**

- o -

# భగవద్గీతామృతం

"ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధం చేయటానికి సిద్ధంగా ఉన్న మా కౌరవులూ, ఆ పాండవులూ ఏం చేశారు?" అని అడిగాడు ధ్రుతరాష్ట్రుడు. సంజయుడు తాను వర దృష్టితో చూచిందీ విన్నదీ జరిగింది జరిగినట్లు చెప్ప నారంభించాడు.

"మహారాజా! పాండవసైన్యాలు వ్యూహానుబంధురంగా మోహరించటం చూచి సుయోదనుడు ద్రోణాచార్యుని సమీపించాడు. ఆచార్యా! బుద్ధి కుశలుడైన మీ శిష్యుడు ధృష్ట ద్యుమ్నుడు పన్నిన పాండవ సైన్య వ్యూహం చూడండి. అందులో మహాశూరులైన భీమార్జునాది మహారదులను గమనించండి. ఇరుగో మనవైపునన నిలచిన భీష్మాది మహాయోధులను చూడండి. భీష్మాభిరక్షితమైన మనసైన్యం అపరిమితం. భీమ పరిరక్షితమైన పాండవ సైన్యం పరిమితం. మీరందరు కలిసి సేనాముఖాలను రక్షించుకొంటూ భీష్ములవారిని కాపాడాలి" అని హెచ్చరిక చేశాడు. భీష్ముడుప్పొంగి దుర్యోధనుడుల్లాసపడేటట్లు వృద్ధుడైనా సింహనాదం చేసి శంఖాన్ని పూరించాడు. వెనువెంటనే కౌరవవీరుల శంఖభేరీ భాంకారాదులు ప్రచండంగా మోగాయి. శ్వేతాశ్వాలు పూన్చిన మహారథంలో నుండి కృష్ణార్జునులు తమ దివ్యశంఖాలను - పాంచజన్య దేవదత్తాలను - దిక్కులు పిక్కటిల్లేలటట్లు పూరించారు. దర్మరాజాదుల శంఖాలు వాటితో కలిసి మ్రోగాయి. ఆ మమానాదానికి భూమ్యాకాశాలే కాక ధార్తరాష్ట్రుల హృదయాలు కూడా దద్దరిల్లాయి.

యుద్ధానికి సన్నద్ధులై యున్న కౌరవ వీరులను చూచి అర్జునుడు గాండీవాన్ని ఎత్తిపట్టి 'అచ్యుతా! నా రథాన్ని రెండుసేనల మధ్య నిలువబెట్టు. యుద్ధానికి ఎవరు వచ్చారో నే నెవరితో యుద్ధం చేయాలో ఒకసారి ముందుగా పరిశీలిస్తాను" అని కోరాడు.

కపిధ్వజం రెపరెపలాడగా శ్రీకృష్ణుడు రథాన్ని రెండు సేనల నడుమఁ భీష్మ ద్రోణాదులకు ఎదురుగా నిలిపి "అర్జునా! యుద్ధానికి వచ్చిన వురువీరులను గమనించు" అని సూచించాడు. గాండీవి ఉభయసేనలను పరికించాడు. ఎట్టఎదుట యుద్ధానికి సిద్ధంగా ఉన్న తండ్రులనూ, తాతలనూ, గురువులనూ, మేనమామలనూ, సోదరులనూ, పుత్రులనూ, పౌత్రులనూ, మిత్రులనూ వివిద బంధువర్గాలనూ తిలకించాడు. పొంగి పొరలిన అపారమైన

కనికరంతో, ముంచుకువచ్చిన తీవ్ర విషాదావేశంతో శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు.

"కృష్ణా! యుద్ధాసక్తులై రణరంగంలో నిలిచిన ఈ బంధుకోటిని చూడగానే నా అవయవాలు తడబడుతున్నాయి. నోరు ఎండిపోతున్నది; శరీరమంతా గగుర్పాటుతో కంపించిపోతున్నది. గాండీవం చేతిలో నుండి జారిపోతున్నది. దేహమంతా దహించుకుపోతున్నది; నిలబడే శక్తికూడా లేకుండా పోతున్నది. నా మనస్సు కలవరపడుతున్నది గోవిందా! స్వజనాన్ని చంపుకుంటే వచ్చే ప్రయోజనమేదీ నాకు కనపడటం లేదు. అందువల్ల నాకు విజయం మీద ఆసక్తిలేదు. రాజ్యం మీద ఆశలేదు. సుఖాలమీద అపేక్షలేదు. ఈ రాజ్యాలూ, ఈ భోగాలూ, ఈ సుఖాలూ ఎవరికోసమని అనుకుంటున్నానో ఆ బంధువులందరూ - ప్రాణాలకు తెగించి ఈ రణరంగానికి వచ్చారు. మధుసూదనా! వీళ్లందరూ నన్ను చంపితే చంపనీ, నేను మాత్రం వీరిని వధించలేను. పాతుకులైన దుర్యోధనాదులను కూడా నేను చంపను. పాపులను చంపితే పాపమే వస్తుంది. రాజ్య లోభులైన కౌరవులు వంశక్షయంవలన కలిగే దారుణ ఫలితాలను గణించకుండా యుద్ధానికి సిద్ధమైనారు. నేను ఈ పాపానికి పూనుకోలేను. ఇదుగో నా అస్త్రశస్త్రాలను విసర్జిస్తున్నాను. నిరాయుధుణ్ణైన నన్ను కౌరవులు చంపితే చంపనీ. నాకు మరింత మంచిది" - అని అర్జునుడు కృపణుడై ధనుర్బాణాలను విసరివైచి రథంమీద కుప్ప కూలినట్లు కూర్చుండి కన్నీరు మున్నీరు నింపుతున్నాడు.

అప్పుడు భగవాన్ శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు - "అర్జునా! ఈ సంకట సమయంలో ఈ పాడు విషాదం నీకెక్కడ దాపురించింది? ఇది ఉత్తములకు అనర్హం. అపకీర్తిదాయకం, నరకహేతువు, పౌరుషం లేని ఈ పిరికి దనాన్ని పరిత్యజించు. శత్రుమర్దనుడవైన నీవు ఈ తుచ్ఛమైన మనోదౌర్బల్యాన్ని వీడి యుద్ధానికి సిద్ధంకా" అని ప్రోత్సహించాడు వాసుదేవుడు.

అర్జునుడు - "మాధవా! పూజింపదగిన పెద్దల ప్రాణాలు తీసి, వారి రక్తంతో తడిసిన రాజ్యాన్ని భోగించటం కంటె, బిచ్చమెత్తుకొని జీవించటం మంచిది. యుద్ధం చేయటంలోని ధర్మాదర్మాలను నిర్ణయించుకొనే శక్తి నా బుద్ధికోల్పోయింది. ఓ వాసుదేవా! నాకు శ్రేయస్సు ఏదో నీవే నిశ్చయించి బోధించు. నేను నీ శిష్యుణ్ణి వరణన్న ఆర్తుణ్ణి. సర్వలోకాధిపత్యం స్వర్గాధిపత్యం లభించినా ఈ శోకాగ్ని చల్లారేటట్లు లేదు."- అని అన్నాడు.

శ్రీకృష్ణుడు - మందహాసంతో అర్జునుణ్ణి మందలిస్తూ ఇలా ప్రబోధించాడు - "పార్థా! విచారించకూడని వాటిని గురించి నీవు విచారిస్తున్నావు. పై పెచ్చు ప్రజావంతునిగా మాట్లాడుతూన్నవు. వివేకవంతులు ఉన్నవారిని గురించి గాని, పోయిన వారిని గురించి గాని శోకించరు. నిజానికి నీవూ, నేనూ, వీరందరూ నిత్యులమే. వరీరం బాల్య యౌవన

వార్ధక్యదశలు దాటి ఎలా వస్తుందో ఆత్మకూడా అనేక శరీరాలను మారి వస్తుంద. జీవాత్మ నిత్యుడు, చావు అతని శరీరానికి మాత్రమే. ఆత్మ చంపేదీకాదు, చచ్చేదీ కాదు. మరి దేనితోనూ చంపబడదు. ఆత్మ ఒకప్పుడు పుట్టలేదు. అందువలన దానికి ఆది లేదు. అదెప్పుడూ చావదు అందువలన అంతమూ లేదు. మానవుడు చినిగిపోయిన దుస్తులను విసరి పారేసి కొత్తవి తొడుక్కున్నట్లు జీవుడు జీర్ణ శరీరాలను విసర్జించి నూత్న దేహాలను దరిస్తూ ఉంటాడు. ఆత్మను ఆయుధాలు చీల్చలేవు. అగ్ని దహించలేదు. నీరు నాన్పలేదు. గాలి ఎండిచలేదు. పుట్టిన వాడు చనిపోవటం సహజం. చనిపోయిన వాడు మరో జన్మ ఎత్తటం కూడా సహజమే. దీనికి దుఃఖించినా లాభం లేదు.

క్షత్రియునికి దర్మయుద్ధం చేయటం స్వధర్మం. యుద్ధంలో పడిపోయేవి వీరుల దేహాలు. ఆ దేహాలలో ఉన్న ఆత్మ వధించటానికి సాద్యమైనది కాదు. ధీమంతులు ఈ సత్యాన్ని తెలుసుకొని దుఃఖించరు. నీవు యుద్ధం చేయకపోతే స్వధర్మ భ్రష్టుడవై అపకీర్తికి పాపానికి పాలౌతావు. యుద్ధం చేసి మరణిస్తే వీర స్వర్గాన్ని పొందుతావు. లేదా జయించి రాజ్యలక్ష్మిని చేపడతావు. కాబట్టి సుఖదుఃఖాలను, లాభనష్టాలను జయాపజయాలనూ లెక్కించకుండా నీ స్వధర్మాన్ని - ఈ దర్మయుద్ధాన్ని నిర్వహించు - నడుం కట్టి లే!

పార్థా! నీవు కర్మ చేయటానికే అధికారివి. ఫలానుభవానికి కర్తవు కావు. అందువలన ఫలాఫలాల పట్ల అనాసక్తమైన సమభావం పెంచుకో. దాన్నే యోగమంటారు. కోరికతో చేసే పనుల కంటె కోరికతోచేసే పనుల కంటె కోరిక లేకుండా చేసే కర్మలు శ్రేష్ఠములు. విషయాలనే సదా ధ్యానిస్తూ ఉంటే మనసులో కోరికలు పుడతాయి. కోరికయే కామం. కామం వలన క్రోధం, క్రోధం వలన మోహం. మోహం వలన మతివిభ్రమం. దానివలన బుద్ధినాశం, దానివలన సర్వనాశం కలుగుతుంది. కాబట్టి మొదట కోరికలను వదలిపెట్టాలి. ఫలంమీద మోహం లేకుండా మనస్సు నిగ్రహించుకోవాలి. అటువంటివాడు స్థితప్రజ్ఞుడౌతాడు. అతనికి మోఓం కరతలామలకం.

అర్జునా! ముక్తి మార్గలు రెండని నేను పూర్వం నిర్దేశించాను. అవి - సాంఖ్యులకు జ్ఞానయోగం; యోగులకు నిష్కామ కర్మయోగం కర్మలు చేయకుండా ఎవ్వడూ ఈ లోకంలో క్షణం ఉండలేడు. ఎవరి కర్తవ్యం వారు నిర్వహించవలసిందే. అయితే, ఫలాపేక్ష లేకుండా భగవంతునికి సమర్పిస్తున్న భావంతో కర్మలు ఆచరించటం ఉత్తమం. అలాచేస్తే అవి యజ్ఞ కర్మలవుతాయి. పరమాత్మ నుండి వేదం పుట్టింది. వేదం నుండి కర్మ సత్కర్మల వలన యజ్ఞం, యజ్ఞం వలన వర్షం, వర్షం వలన అన్నం, అన్నం వలన ప్రాణులూ ఉద్భవిస్తున్నాయి. ఈ జగత్ చక్రాన్ని అనుసరించి నిష్కామ కర్మలనే యజ్ఞాన్ని నిర్వహించి సర్వవ్యాపియైన

పరమాత్మని సేవించి మోక్షం సాధించగలిగే వారు యోగులు.

జనకాదులు నిష్కామ కర్మ చేసి మోక్షాన్ని పొందారు. లోకక్షేమం కోసం నీవు సత్కర్మ చేయాలి. ఉత్తములు ఆచరించిన కర్మలనే జనులు అనుసరిస్తూ ఉంటారు. వారు నెలకొల్పిన ప్రమాణాలే తరువాతి వారికి మార్గదర్శకాలౌతాయి. నీవు కూడా నిష్కామ కర్మ చేయాలి. ఆశలు, మమకారాలు వదలిపెట్టి నిశ్చింతగా యుద్ధం చెయ్. అధ్యాత్మనిష్ఠమైన బుద్ధితో నీవు చేసే సమస్త కర్మలన్నీ నాయందు సమర్పించు. స్వధర్మమే అన్నింట శ్రేయస్కరం. పరధర్మాన్ని ఎంత పట్టుదలతో పాటించినా అది ఎప్పటికైనా భయానకమే. పరధర్మంలో పప్పుకూడు తిన్నా అందులో ముప్పు ముంచుకు వస్తుంది. స్వధర్మంలో చివరకు ప్రాణాలు పోయినా శ్రేయస్సు లభిస్తుంది."

అర్జునుడు - "వాసుదేవా! మనుష్యుడు తన కిష్టం లేకపోయినా బలవంతాన దేని చేతనో నెట్టబడినట్లు పాంప చేస్తూ ఉన్నాడు? ఆప్రేరక శక్తియేది?

భగవాన్ శ్రీకృష్ణుడు - అదియే కామం. అదే క్రోధం. అవి రెండూ రజో గుణం నుండి పుట్టాయి. వాటికి తీరని ఆకలి. పాపకారిత్వం సహజ లక్షణాలు. అవి మానవునికి మహాశత్రువులు. అగ్నిని పొగ ఆవరించినట్లు, అద్దాన్ని ధూళి కమ్మివేసినట్లు కామం జ్ఞానాన్ని కప్పివేస్తుంది. కామం ఇంద్రియాలను మనస్సును బుద్ధిని ఆశ్రయించి వ్యాపించి జ్ఞానాన్ని ఆవరించి జీవుణ్ణి మోహింపజేస్తుంది. మానవుడు ఈ రహస్యాన్ని తెలుసుకొని విషయాల కంటె మిన్నయైన ఇంద్రియాలను, ఇంద్రియాలకంటె బలమైన మనస్సును మనస్సుకంటె శ్రేష్ఠమైన బుద్ధిని, బుద్ధికంటె పరమైన ఆత్మమైన తెలుసుకొని కామాన్ని నిగ్రహించాలి.

అర్జునా! ఇంతవరకు నీకు చెప్పిన ఈ అవ్యయమైన యోగాన్ని మొట్టమొదట నేను సూర్యునికి బోధించాను. అతడు మనువునకిచ్చాడు. ఆ తరువాత మనవునుండి ఇక్ష్వాకువు మొదలైన వారికి అందింది. రాజ్యషులు తెలుసుకొనే ఈ పురాతన యోగవిద్యను నా మిత్రుడవు భక్తుడవు అయిన నీకిప్పుడుపదేశించాను. ఇది చాలా రహస్యమైనది." అని శ్రీకృష్ణుడు చెప్పగానే

అర్జునుడు - "కృష్ణా! నీవు సూర్యునికి మొదట బోధించానంటున్నావు. నీవా మా సమకాలీనుడవు. సూర్యుడా ఎప్పటివాడో? మరి నీవతనికి బోధించటం ఎలా జరిగింది?" అని అడిగాడు. దానికి సమాధానంగా శ్రీకృష్ణుడిలా అన్నాడు.

"అర్జునా! నీకూ నాకూ ఇప్పటి ఈ జన్మలే కాదు ఇంతకు పూర్వం ఎన్నో జన్మలు గడిచాయి. అవన్నీ నాకు తెలుసు. నీకు తెలియవు. చావు పుట్టుకలు లేనివాడనైనా సమస్త

పరమాత్మని సేవించి మోక్షం సాధించగలిగే వారు యోగులు.

జనకాదులు నిష్కామ కర్మ చేసి మోక్షాన్ని పొందారు. లోకక్షేమం కోసం నీవు సత్కర్మ చేయాలి. ఉత్తములు ఆచరించిన కర్మలనే జనులు అనుసరిస్తూ ఉంటారు. వారు నెలకొల్పిన ప్రమాణాలే తరువాతి వారికి మార్గదర్శకాలౌతాయి. నీవు కూడా నిష్కామ కర్మ చేయాలి. ఆశలు, మమకారాలు వదలిపెట్టి నిశ్చింతగా యుద్ధం చెయ్. అధ్యాత్మనిష్ఠమైన బుద్ధితో నీవు చేసే సమస్త కర్మలన్నీ నాయందు సమర్పించు. స్వధర్మమే అన్నింట శ్రేయస్కరం. పరధర్మాన్ని ఎంత పట్టుదలతో పాటించినా అది ఎప్పటికైనా భయానకమే. పరధర్మంలో పప్పుకూడు తిన్నా అందులో ముప్పు ముంచుకు వస్తుంది. స్వధర్మంలో చివరకు ప్రాణాలు పోయినా శ్రేయస్సు లభిస్తుంది."

అర్జునుడు - "వాసుదేవా! మనుష్యుడు తన కిష్టం లేకపోయినా బలవంతాన దేని చేతనో నెట్టబడినట్లు పాంప చేస్తూ ఉన్నాడు? ఆప్రేరక శక్తియేది?

భగవాన్ శ్రీకృష్ణుడు - అదియే కామం. అదే క్రోధం. అవి రెండూ రజో గుణం నుండి పుట్టాయి. వాటికి తీరని ఆకలి. పాపకారిత్వం సహజ లక్షణాలు. అవి మానవునికి మహాశత్రువులు. అగ్నిని పొగ ఆవరించినట్లు, అద్దాన్ని ధూళి కమ్మి వేసినట్లు కామం జ్ఞానాన్ని కప్పివేస్తుంది. కామం ఇంద్రియాలను మనస్సును బుద్ధిని ఆశ్రయించి వ్యాపించి జ్ఞానాన్ని ఆవరించి జీవుణ్ణి మోహింపజేస్తుంది. మానవుడు ఈ రహస్యాన్ని తెలుసుకొని విషయాల కంటె మిన్నయైన ఇంద్రియాలను, ఇంద్రియాలకంటె బలమైన మనస్సును మనస్సుకంటె శ్రేష్ఠమైన బుద్ధిని, బుద్ధికంటె పరమైన ఆత్మమైన తెలుసుకొని కామాన్ని నిగ్రహించాలి.

అర్జునా! ఇంతవరకు నీకు చెప్పిన ఈ అవ్యయమైన యోగాన్ని మొట్టమొదట నేను సూర్యునికి బోధించాను. అతడు మనువునకిచ్చాడు. ఆ తరువాత మనవునుండి ఇక్ష్వాకువు మొదలైన వారికి అందింది. రాజ్యషులు తెలుసుకొనే ఈ పురాతన యోగవిద్యను నా మిత్రుడవు భక్తుడవు అయిన నీకిప్పుడుపదేశించాను. ఇది చాలా రహస్యమైనది." అని శ్రీకృష్ణుడు చెప్పగానే

అర్జునుడు - "కృష్ణా! నీవు సూర్యునికి మొదట బోధించానంటున్నావు. నీవా మా సమకాలీనుడవు. సూర్యుడా ఎప్పటివాడో? మరి నీవతనికి బోధించటం ఎలా జరిగింది?" అని అడిగాడు. దానికి సమాధానంగా శ్రీకృష్ణుడిలా అన్నాడు.

"అర్జునా! నీకూ నాకూ ఇప్పటి ఈ జన్మలే కాదు ఇంతకు పూర్వం ఎన్నో జన్మలు గడిచాయి. అవన్నీ నాకు తెలుసు. నీకు తెలియవు. చావు పుట్టుకలు లేనివాడనైనా సమస్త

దర్శించుకొంటారు. సర్వ జీవులయందు పరమాత్మను సమదర్శనం చేయగలిగిన వారు పండితులు. తపో యజ్ఞ ఫలాలకు భోక్తగా, సర్వలోక మహేశ్వరునిగా, సర్వభూతాంతరాత్మునిగా నన్ను తెలుసుకొన్నవాడు పరమకాంతిని పొందుతాడు.

సన్యాసమన్నా, యోగమన్నా ఒక్కటే. సంకల్పాలను సత్యసించకుండా ఎవరూ యోగి కాలేరు. లోకంలో ఎవరికి వారే బంధువు. ఎవరికి వారే శత్రువు. ఎవరైనా సరే తనకు తానే ఉద్ధరించుకోవాలె కాని అధోగతి పాలు కాకూడదు. శాస్త్రీయ - అనుభవ జ్ఞానాలతో తృప్తి పొందివాడూ, మట్టి పెళ్ళను బంగారాన్ని సమంగా చూడగిలిగినవాడూ, నిర్వకారుడూ, జితేంద్రియుడూ అయినవాడు యోగిగా పిలువబడతాడు. ఆహార విహారాల్లోనూ, స్థితి గతులలోనూ, నిద్రా జాగృతుల్లోనూ నియమాన్ని పాటించే వారి యోగం సులభంగా సిద్ధిస్తుంది. యోగి చిత్తం గాలి లేనిచోటి దీపంలాగా నిశ్చలంగా ఉంటుంది. యోగ సిద్ధి హిందినవారు సమభావంతో సర్వ భేతాలలో తమ ఆత్మనూ, తన ఆత్మలో సర్వభూతాలనూ ర్శించగలుగుతారు. సమస్త జీవుల సుఖ, దుఃఖాలను తనవిగా భావించేవాడు యోగులలో ఉత్తముడని నా అభిమతం.

ఈ సమ దర్శనయోగాన్ని సాధించాలంటే సహజ చంచలమైన మనసుకు సామాన్యంగా సాధ్యమయ్యే పనికాదు. సాధన వలన, వైరాగ్యం వలన చిత్తాన్ని వశపరచుకోవాలి. ఈ యోగసాధనం చేస్తే మధ్యలో తనువు చాలించినా మరుసటి జన్మలో సంస్కార రూపంగా ఆ సాధన అందిపుచ్చుకొని వస్తుంది. కాబట్టి యోగి పట్టు వదలకుండా ప్రయత్నించి యోగాన్ని సాధించాలి. తపస్వుల కంటె, జ్ఞానుల కంటె, కర్మ పరులకంటె యోగి గొప్పవాడు. కాబట్టి అర్జునా! నీవు యోగివి కమ్ము! నాయందు మనస్సు నిల్పి శ్రద్ధతో నన్ను సేవించేవాడే యోగులలో మహాయోగి. నాయందే మనస్సు పెట్టి, నన్నే గతిగా నమ్ముకొని, యోగ సిద్ధికి ప్రయత్నించవలసిన నీవు నా సంపూర్ణ రూపాన్ని ఎలా తెలుసుకోగలవో చెపుతాను విను.

వేలమంది మనుషుల్లో యోగసిద్ధికోసం ప్రయత్నించే వాడు ఏ ఒక్కడో ఉంటాడు. అటువంటి సిద్ధులలో కూడా ఏ ఒక్కడో యదార్థంగా నన్ను తెలుసుకోగలుగుతాడు. భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం - అనే ఎనిమిది రూపాలుగా నా ప్రకృతి విభక్తమై ఉంది. ఇది అపరా ప్రకృతి. నా పరాప్రకృతి జీవరూపమైంది. దానితో ఈ జగత్తునంతా ధరిస్తున్నాను. నా పరాపర ప్రకృతుల నుండి సర్వ భూతములు పుడుతున్నవి. నేను ఈ జగత్తు సృష్టి ప్రళయాలకు మూలకారణాన్ని. ధనంజయా! నాకంటె పరమైనది మరేదీ లేదు. హారంలోని మణులన్నీ సూత్రం ఆధారంగా నిలిచినట్లు నేను ఆధారంగా ఈ జగత్తు నిలిచి ఉంది. నేను జలంలో రసాన్ని, సూర్యచంద్రుల్లో ప్రకాశాన్ని, వేదాలలో ఓంకారాన్ని, ఆకాశంలో తేజస్సును, నరులలో పౌరుషాన్ని, పృథివిలో గంధాన్ని, అగ్నిలోని తేజస్సును; ప్రాణకోటిలోని జీవనశక్తిని, తపస్వులలోని తపస్సును, సర్వభూతాలకు మూల

బీజాన్ని, బుద్ధిమంతులలో బుద్ధిని, భూతకోటిలోని ధర్మబద్ధమైన కామాన్ని, త్రిగుణాలు నా వల్లనే పుట్టాయి. అయితే, వాటిలో నేనుండను. నాలోనే అవి ఉంటాయి. త్రిగుణాత్మకమైన నా మాయను దాటటం దుర్లభం. నన్ను శరణు చెందినవారు మాత్రమే దానిని దాటగలుగుతారు.

అర్జునా! ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు - అనే నాలుగు రకాల పుణ్యాత్ములు నన్ను సేవిస్తూ ఉంటారు. వీరిలో జ్ఞాని ఉత్తమోత్తముడు. అతడు భక్తితో నన్నెప్పుడూ ఎడబాయడు. అతడు నాకు పరమ ప్రియుడు. నేనతనికి ప్రాణ ప్రియుడను.'

అర్జునుడు - ఓ పురుషోత్తమా! బ్రహ్మమంటే ఏమిటి? అధ్యాత్మమంటే ఏమిటి? కర్మమంటే ఏమిటి? అధిభూతమనీ, అధిదైవమనీ నేటి నంటారు? ఈ దేమంలో అధియజ్ఞుడెవడు? ప్రాణాలు పోయేటప్పుడు యోగులు నిన్నెలా తెలుసుకుంటారు? - అని అడిగాడు.

భగవాన్ శ్రీకృష్ణుడు ఇలా పేర్కొన్నాడు. "నశించనిదీ, సర్వోత్కృష్టమైనదీ అయిన పరమాత్మ బ్రహ్మము, జగద్దృశ్యాన్ని ప్రకటించు అతని స్వభావమే అధ్యాత్మం. సర్వబూతాలను సృష్టించే పరమేశ్వర వ్యాపారమే కర్మ. నాశాన్ని పొందే భూతములు అధిభూతములు, అదే అపర ప్రకృతి. పరప్రకృతి అయిన పురుషుడే అధిదైవతం. దేహంలో అంతర్యామి నైన నేనే అధియజ్ఞుడు అని పిలువబడుతున్నాను. అవసాన కాలంఓల ఎవరు నన్నే స్మరించుకొంటూ శరీరాన్ని వదులుతారో వారు తప్పకుండా నన్ను పొందుతారు. మరణ సమయంలో ఎవరు ఏ భావాలతో భౌతిక శరీరాన్ని వీడుతారో ఆ భావాలకు తగిన స్థితినే వారు పొందుతారు. కాబట్టి అర్జునా! సర్వకాల సర్వావస్థలలో నన్నే స్మరిస్తూ యుద్ధాన్ని సాగించు. నీ మనోబుద్ధులు నాకు అర్పితం కావటం వలన నీవు తప్పన నన్నే పొందగలుగుతావు. అభ్యాసయోగ యుక్తమైన అనన్యచిత్తంతో చింతించి చింతించి పరమ పురుషుణ్ణి చేరుకోగలుగుతారు ఎవ్వరైనా. మరణ కాలంలో భక్తియుక్తుడై, యోగశక్తి నాశ్రయించి, మనస్సునేకాగ్ర పరచి, కనుబొమల నడుమ ప్రాణశక్తిని పదిలంగా బంధించి, సర్వజ్ఞుడు, పురాణపురుషుడు, సర్వ సృష్టి నియామకుడు, సూక్ష్మాతిసూక్ష్ముడు, అచింత్యుడు, ఆదిత్యవర్ణుడు. తమస్సున కతీతుడు అయిన పరమ పురుషుణ్ణి ఎవరు గాఢంగా స్మరిస్తారో వారా దివ్యతత్వాన్ని పొందగలుగ్తఆరు. దీన్ని తెలుసుకొన్న యోగులు వేదయజ్ఞ తపోదానుల వలన పొందే పుణ్య ఫలాన్ని కూడా మించిన పరమపదాన్ని పొందగలరు.

అర్జునా! నీకిప్పుడు అతి రహస్యమైనది. విజ్ఞాన సహితమైనదీ అయిన జ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాను. అసూయలేని నీవు దీన్ని తెలుసుకోవటం వలన అశుభాల నుండి విముక్తడవౌతాడు. శుభాలకు చేరువౌతావు. ఇది రాజవిద్య, పరమరహస్యం, పవిత్రం, ప్రత్యక్షానుభవగమ్యం, ధర్మయుతం, శాశ్వతం, సులభసాధ్యం! ఈ ధర్మంలో శ్రద్ధలేని వారు

నాకు దూరులై జననమరణ రూప సంసారంలో పడి సతమతమౌతూ ఉంటారు. నేను అవ్యక్త రూపుణ్ణి. ఈ జగత్తంతా వ్యాపించి ఉంటాను. సర్వ జీవులూ నాయందే ఉన్నాయి. కాని, నేను మాత్రం వాటియందు లేను. కౌంతేయా! ప్రళయకాలంలో సమస్త భూతాలూ నా ప్రకృతియందు లయిస్తాయి. సృష్టికాలంలో మరలా వాటిని నేను సృజిస్తాను. అయినా ఆ కర్మలయందు అనాసక్తుణ్ణి, ఉదాసీనుణ్ణి, నన్ను ఈకర్మలు బంధించలేవు. ప్రకృతి నా పర్యవేక్షణలో ఈ చరాచర జగత్తును సృష్టిస్తున్నది. అందువల్ల ఈ జగత్తు నానావిధాలుగా పరివర్తనం చెందుతున్నది. సమస్త ప్రాణకోటికీ మహేశ్వరుణ్ణైన నా పరమార్థం తెలియని మూఢులు మానవరూపంలో ఉన్న నన్ను సామాన్యునిగా భావించి ఆదరించటం లేదు.

నా పరమేశ్వరత్వాన్ని దర్శించలేనివారు ఆసురీ ప్రవృత్తులు. దర్శించి భజించేవారు దైవీ ప్రవృత్తులు. దైవీ ప్రవృత్తులు దృఢవ్రతులై సతతం నన్ను భక్తితో కీర్తిస్తూ, సేవిస్తూ ఉంటారు. మరికొందరు జ్ఞానయజ్ఞంతో నన్ను ఉపాసిస్తారు. విశ్వాంతరాత్ముణ్ణైన నన్ను ఏకభావన చేత కొందూ, భేదభావంతో మరికొందరూ సేవిస్తూ ఉంటారు. నేనే క్రతువును. నేనే యజ్ఞాన్ని నేనే స్వధాకారాన్ని, స్వాహాకారాన్ని, మహౌషధాన్ని, మంత్రాన్ని, అగ్నిని, ఆజ్యాన్ని, హోమాన్ని, సోమాన్ని, నేనే ఈ జగత్తుకు తల్లిని, తండ్రిని, ధాతను, త్రాతను, నేనే ఓంకారాన్ని, ఋక్సామయజుర్వేదాలను, ఈ జగత్తుకు గతిని, పతిని, సాక్షిని, నివాసాన్ని ప్రభవస్థానాన్ని, ప్రళయస్థానాన్ని, ఆధారాన్ని, శాశ్వత బీజాన్ని అమృతాన్నీ నేనే, మృత్యువునూ నేనే. సత్తునూ నేనే, అసత్తునూ నేనే.

సోమయాజులు నన్ను యజ్ఞాలతో పూజించి స్వర్గాలను కోకుంటారు. వారా వివాల పుణ్యభోగాలను అనుభవించి పుణ్యం క్షీణించగానే మర్త్యలోకంలో ప్రవేశిస్తారు. కర్మకాండల నాశ్రయించినవారికి ఈ రాకపోకలు తప్పవు. అలాకాక - అనన్య చింతతో నన్ను ఎల్లప్పుడూ ఎవరు ఉపాసిస్తూ ఉంటారో వారి యోగక్షేమాలను నేను స్వయంగా చేపట్టి నిర్వహిస్తూ ఉంటాను.

ఎవరు ఏ రూపంలో నన్ను సేవిచినా వారు నన్ను సేవించిన వారే అవుతారు. భక్తిపూర్వకంగా ఒక్కపత్రం గాని, ఒక్క పుష్పంగాని, ఒక్క ఫలంగాని, చివరకు జలంకాని అర్పించినా దాన్ని ప్రేమతో స్వీకరిస్తాను. అర్జునా! నీ కర్మలను, ధర్మములను సమస్తాన్నీ అనన్య భక్తితో నాకు అర్పించు. కర్మ బందాల నుండి విముక్తుడవౌతావు! స్యాస యోగయుక్తుడవై నన్ను చేరుకోగలుగుతావు. పార్థ! నన్నే చింతించు; నన్నే భజింజు; నన్నే సేవించు; నన్ను శరణు కోరు; నీవు తప్పక నన్ను పొందగలుగుతావు.

అర్జునుడు - "కృష్ణా! నీవు ఏయే విబూతులతో ఈ విశ్వమంతా వ్యాపించి ఉన్నావో వివరించి చెప్పు - వినాలని ఉంది".

శ్రీకృష్ణుడు - "కురుశ్రేష్ఠా! నా దివ్య విభూతులలో ముఖ్యమైన వాటిని కొన్నింటిని

చెపుతాను. సర్వభూతములందున్న ఆత్మను నేను. వాటి ఆది మధ్యాంతాలనూ నేనే. ఆదిత్యులలో విష్ణువును నేను. స్వయం ప్రకాశకులలో సూర్యుణ్ణి నేను; మరుత్తులలో మరీచిని, చుక్కలలో చంద్రుణ్ణి, వేదాలలో సామవేదాన్ని, దేవతలలో దేవేంద్రుణ్ణి, ఇంద్రియాలలో మనస్సును, ప్రాణులలో చేతనాశక్తిని, రుద్రులలో శంకరుణ్ణి, యక్షరాక్షసులలో కుబేరుణ్ణి, వసువులలో పావకుణ్ణి, పర్వతాలలోనే మేరువును, పురోహితులలో బృహస్పతిని, సేనాపతులలో కుమారస్వామిని, జలాశయాలలో సముద్రాన్ని, మహర్షులలో భృగువును, శబ్దాలలో ఓంకారాన్నీ, స్థావరాల్లో హిమాలయాన్ని, వృక్షాలలో అశ్వత్థాన్ని, దేవర్షులలో నారదుడ్ని, అశ్వాలలో ఉచ్చైశ్రవాన్ని, ఏనుగులలో ఐరావతాన్ని, ఆయుధాల్లో వజ్రాయుధాన్ని, ధేనువులలో కామధేనువును, ఉత్పాకులలో మన్మధుణ్ణి, పాములలో వాసుకిని, నాగులలో శేషుణ్ణి, దైతులలో ప్రహ్లాదుణ్ణి, మృగాలలో సింహాన్ని, పక్షులలో గరుత్మంతుణ్ణి, మానవులలో నరేంద్రుణ్ణి. ఎక్కడ సత్వం, తేజస్సు ప్రకాశిస్తూ ఉంటుందో అదంతా నా విభూతిగానే గ్రహించు.'' అని ప్రబోధించాడు శ్రీకృష్ణభగవానుడు.

అర్జునుడు ఇలా అభ్యర్థించాడు - ''వాసుదేవా! నన్ను అనుగ్రహించి, పరమరహస్యమైన అధ్యాత్మజ్ఞానాన్ని బోధించావు. దీనివలన నా మోహాంధకారం పటా పంచలైంది. పురుషోత్తమా! నీ మహాత్మ్యాన్ని విన్నాను నీ ఈశ్వర స్వరూపాన్ని కూడా చూడాలని నాకు కోరికగా ఉంది. అందుకు నాకు యోగ్యత ఉంటే దర్శనం ప్రసాదించు.''

పార్థుని ప్రార్థనను మన్నించి భగవానుడు విశ్వ రపదర్శనాన్ని అనుగ్రహించాడు. దాన్ని చూడటానికి దివ్యదృష్టిని ప్రసాదించాడు. నానా విధ దివ్య సహస్ర రూపాలు, వర్ణాలూ, వసువులు రుద్రులూ, అశ్వినులు, మరుత్తులూ ఆశ్చర్యకరాలైన అపూర్వ దృశ్యాలు, జడ చేతనాత్మకమైన సర్వ జగత్తూ అద్భుతంగా ఆ విశ్వరూపంలో వెలుగొందుతూ గోచరించింది. అర్జునుడు ఆశ్చర్యచకితుడై మేను పులకరింపగా ఆ దివ్యరూపానికి శిరసానవస్కరించి, అంజలి ఘటించి భక్తి పారవశ్యంతో ఇలా ప్రార్థించాడు.

''ఓ ప్రభూ! అనేక ముఖాలతో, నేత్రాలతో, దివ్యాభరణాలతో, దివ్యాయుధాలతో, దివ్య మల్యాంబరాలతో, దివ్య గంధానులేపనాలతో, నీరూపం అనంతం విశ్వతోముఖం. నీలో సర్వభూతసముదాయాన్నీ సందర్శిస్తున్నాను. కమలాసనుడైన బ్రహ్మను, మహర్షులను, దివ్యసర్పాలను చూస్తున్నారు. అది మధ్యాంతరహితమైన నీ రూపాన్ని తేజోరాశిగా దర్శిస్తున్నాను. సర్వ దిక్కులూ వ్యాపించిన నీ రూపం మూడు లోకాలను గజ గజలాడిస్తున్నది. సర్వ దేవతా సమూహాలూ నీలో ప్రవేశిస్తున్నవి. కొందరు భయంతో చేతులు జోడిస్తున్నారు. మహర్షులు సిద్ధులు స్వస్తి వాచకాలు పలుకుతున్నారు. రుద్రాదులు నిన్ను భయంతో చూస్తున్నారు. కరాళ దంష్ట్రలతో కాలాగ్నుల్లాగా దిగ్భ్రమ కలిగించే నీ బహుముఖాలను చూస్తే భయోద్వేగం కలుగుతోంది. కౌరవ సైన్యంలో ఉన్న భీష్మద్రోణ కర్ణ దుర్యోధనాది

మహావీరులదరూ, మా వైపున్న మరికొందరు వీరులు మృత్యు గుహలాగా ఉన్న నీ ముఖంలోకి గబగబా ప్రవేశిస్తున్నారు. కొందరు నీ కోరల నడుమ పిండి అయిపోతున్నారు. సముద్రంలో కలిసే నదుల్లాగా నీలో ఈ సైన్య సమూహాలన్నీ లీనమైపోతున్నాయి. మంటల్లో పడ్డ మిడతల్లాగా జీవరాశి నీనోట ప్రవేశిస్తున్నాయి. దేవదేవా! ఇంత ఉగ్రరూపాన్ని తాల్చిన నీవెవరవో నాకు దయతో వివరించి చెప్పు"

భగవంతుడు ఇలా చెప్పాడు - అర్జునా! లోక క్షయంకోసం విజృంభించిన కాల పురుషుణ్ణి నేను. ప్రళయమే నా ప్రవృత్తి. ఈ యుద్ధం జరుగక పోయినా ఈ వీరులు చనిపోయేవారే. భీష్మ ద్రోణ కర్ణాది వీరులందరూ ముందుగా నావలననే చచ్చిపోతున్నారు నీవు నిమిత్తమాత్రంగా వీరందరిని యుద్ధంలో సంహరించి నిష్కళంకమైన కీర్తినీ, నిష్కంటకమైన రాజ్యాన్నీ అనుభవించు లే" - అని భగవానుడు ప్రోత్సహించాడు.

అర్జునుడు ఆ విశ్వరూపునికి అన్ని దిక్కులా నమస్కరించాడు. బంధువుగా భావించి పలకరించినందుకు క్షమాపణలు కోరుకొన్నాడు. భయంకరమైన ఆ రూపును చాలించి మనోహర చతుర్భుజ రూపంతో ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించాడు.

భగవానుడు ఇలా అన్నాడు - 'అర్జునా! నా యోగశక్తి ప్రభావంతో తేజోమయమైన ా విశ్వరూపాన్ని చూడగలిగావు. ఇంతకు పూర్వం ఎవ్వరూ దీనిని దర్శించి ఉండలేదు. నీ క్కనికే ఈ అదృష్టం కలిగింది. ఈ నాభయంకర రూపాన్ని చూచి తల్లడిల్లిపోవలసిన నిలేదు - ఇదుగో నా యిప్పటి సౌమ్య రూపాన్ని ధరిస్తున్నాను. నిర్భయంగా ప్రీతితో దర్శించుకో" అని తన మానుషరూపాన్ని చూసాడు జనార్దనుడు. అనన్య భక్తితో తనను అందుకోమని అర్జునుణ్ణి ప్రబోధించాడు పురుషోత్తముడు.

అప్పుడు అర్జునుడడిగాడు - సగుణరూపాన్ని భజించేవారు ఉత్తములా? నిర్గుణతత్వాన్ని ఆరాధించేవారు ఉత్తములా? అని

భగవానుడు ఇలా సమాధానం చెప్పాడు - నాయందే మనస్సు నిల్పి శ్రద్ధతో నా సగుణరూపాన్ని సేవించే వారు ఉత్తమ భక్తియోగులని నా అభిప్రాయం. అక్షరమూ, అవ్యక్తమూ అయిన నిర్గుణతత్వాన్ని ఉపాసించేవారు కూడ నన్నే పొందుతారు. నిర్గుణోపాసనం కష్టం. సమస్త కర్మలను నాయందె సమర్పించి నేనే సర్వోత్తముణ్ణని భావించి ధ్యానించే భక్తులు సులబంగా సంసార సముద్రాన్ని అభ్యాసం కంటె జ్ఞానం, జ్ఞానం కంటె ధ్యానం, ధ్యానం కంటె కర్మ ఫలత్యాగం శ్రేష్ఠం. ఆ త్యాగం వలన చివరకు శాంతి లభిస్తుంది.

సర్వ ప్రాణులను ద్వేషించనివాడు, అందరికీ మిత్రుడూ, దయామయుడు, అహంకార మమకారాలు లేనివాడు, సుఖ దుఃకాలయందు సమభావం కలవాడు, ఓర్పు కలవాడు, నిత్య సంతృప్తుడు, యోగి, దృఢ నిశ్చయుడు, సంయమి, మనోబుద్ధులను నాకర్పించినవాడు, అపేక్ష లేనివాడు, పరిశుద్ధుడు, సమర్థుడు, ఉదాసీనుడు, చింతలేనివాడు.

సర్వారంభ పరిత్యాగి అయినవాడు నాకు నిజమైన భక్తుడు.

అర్జునుడు - కృష్ణా! ప్రకృతి, పురుషుడు, క్షేత్రం, క్షేత్రజ్ఞుడు, జ్ఞానం - జ్ఞేయం అంటే ఏమిటో నాకు తెలియజెప్పగోరుతున్నాను.

భగవానుడు - పార్థ! ఈ శరరం క్షేత్రం. దానిని తెలుసుకొన్నవాడు క్షేత్రజ్ఞుడు. క్షేత్రాల లన్నింటిలో ఉన్న క్షేత్రజ్ఞుణ్ణి నేనే. క్షేత్ర క్షేత్రజ్ఞ జ్ఞానమే నిజమైన జ్ఞానం. ఆధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం. తత్వజ్ఞానార్థ దర్శనం జ్ఞానమని గ్రహించాలి. దానికి భిన్నమైనది అజ్ఞానం. దేనిని తెలిస్తే మోక్షం లభిస్తుందో ఆపరబ్రహ్మం జ్ఞేయం. దేహేంద్రియాలకు కారణకర్త ప్రకృతి. సుఖ, దుఃఖాలను అనుభవించేవాడు పురుషుడు. ఓకే సూర్యుడు సమస్త లోకాలనూ ఎలా ప్రకాశింపచేస్తే ఉంటాడో అలాగే క్షేత్రజ్ఞుడైన పరమాత్మ క్షేత్రాలనన్నింటినీ వెలిగింపచేస్తూ ఉంటాడు. జ్ఞాననేత్రంలో ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగాన్ని తెలుసుకొంటారో వారు ఉత్తమగతిని పొందగలుగుతారు.

సర్వభూతములకు ప్రకృతి తల్లి : నేను తండ్రిని. నా బీజప్రదానం వలన ప్రకృ నుండి సమస్త భూతములు ఉత్పత్తి అవుతున్నాయి. ప్రకృతి వలన సత్వము, రజస్సు, తమస్సు - అనే మూడు గుణాలు కలుగుతున్నాయి. అవే జీవాత్మను దేహంలో బంధిస్తున్నాయి. సత్వగుణం నిర్మలమైంది. ప్రకాశవంతమైంది. దోష రహితమైంది. దానివలన జ్ఞానముదయిస్తుంది. రజోగుణం రాగాత్మకమైంది. జీవుణ్ణి కర్మబంధంతో కట్టివేస్తుంది. దాని వలన లోభం కలుగుతుంది. తమోగుణం అజ్ఞాన ప్రమాద నిద్రలతో కూడి ఉంటుంది. దీని వలన జీవుడు కూడా అజ్ఞాన ప్రమాదమోహ మగ్నుడై చెడిపోతాడు. ఎవరు నన్ను అచంచల భక్తి యోగంతో సేవిస్తారో వారు ఈ గుణత్రయాన్ని అతిక్రమించి మోక్షాన్ని పొందుతారు.

సంసారం ఒక అశ్వత్థ వృక్షం. దానికి నాశం లేదు. దాని మూలంపైకి కొమ్మలు క్రిందికి ఉంటాయి. పరమాత్ముడే దానికి ఆధారం. జీవులే దానికి కొమ్మలు. అవి క్రిందక ప్రాకుతూ ఉంటాయి. కొమ్మలు గుణాల వలన పెరుగుతాయి. ఆ కొమ్మలలో కొండములు కర్మలు, వేదాలు, ఆకులు, విసయాలు, చిగుల్ళు, పుణ్య పాపకర్మలు ఊడలు, దీనికి ఆది మధ్యాంతములు లేవు. దీనిని వైరాగ్య ఖడ్గంతో తెగనరకాలి. ఈ సత్యం తెలిసినవాడే వేదవేత్త. వైరాగ్య ఖడ్గంతో అశ్వత్థాన్ని తెగనరికి ఈ సంసార చక్రానికి మూలశక్తిగా నిలిచిన ఆపరబ్రహ్మాన్ని అన్వేషించి పునరావృత్తి రహితమైన బ్రహ్మపదాన్ని పొందాలి. ఆ సనాతనమైన పరబ్రహ్మాంశమే జీవాత్మది. ప్రకృతిలోని జ్ఞానేంద్రియాలనూ మనస్సునూ ఆకర్షిస్తుంది. దేహంలో జీవుడు వసించేటప్పుడూ, దాన్ని వదిలేటప్పుడూ పూవుతావిలాగా జ్ఞానేంద్రియాలనూ మనస్సును వెంటబెట్టుకొని పోతాడు. ఆ జీవాత్మ నేనే. ప్రాణులలో జఠరాగ్నిగా ఉండి ప్రాణాపానాల సహాయంతో చతుర్విధాహారాలను జీర్ణం చేస్తున్నాను. అందరి హృదయాల్లో నేనే ఉన్నాను. వేదాల వలన తెలియదగినవాడను నేనే. వేదాంత కర్తను: వేద వేత్తను కూడా నేనే. నిగుణ

గోప్యమైన ఈ తత్వాన్ని తెలిసినవాడు బుద్ధిమంతుడు; కృతార్థుడు.

అభయాది సాత్త్విక గుణాలు దైవీ సంపద గలవారికీ, దంభాది రాజ సగునాలు ఆసురీ సంపద గలవారికి సహజ లక్షణాలు. దైవీ సంపద, మోక్షానికీ, ఆసురీ సంపద సంసారబంధానికీ కారణాలౌతాయి. కామక్రోధ లోభాలు మూడు నరక ద్వారాలు. వాటిని పరిత్యజించి తనను తాను ఉద్ధరించుకొన్నవాడు పరమపదాన్ని పొందుతాడు.

భక్తికి శ్రద్ధ అవసరం. శ్రద్ధ సాత్త్వికమనీ, రాజసమనీ, తామసికమనీ మూడు రకాలు. సాత్త్వికులు దేవతలను ఆరాధిస్తారు, రాజసికులు యక్షరాక్షసులను పూజిస్తారు; తామసికులు భూత ప్రేత పిశాచాలను కొలుస్తారు, సాత్త్విక శ్రద్ధతో చేసేది యజ్ఞం; రాజస శ్రద్ధతో కూడింది తపస్సు; తామసిక శ్రద్ధతో ప్రవర్తిల్లేది దానం. ఏవైనా ఫలాన్ని కోరకుండా భగవదర్పితంగా చేస్తే పరమాత్మను చెందుతాయి.

స్వర్గాది ఫలాలను ఆశించి చేసే కామ్యకర్మలను వదలివేస్తే సన్యాసమంటారు. కర్మల నాచరిస్తూ ఫలాపేక్షను విడిచిపెడితే త్యాగమని పిలుస్తారు. సంసారులు పుణ్య, పాప, మిశ్ర కర్మలు చేసి వాటి ఫలాలను ఇహపరాల్లో అనుభవిస్తారు. కర్మ ఫలాసక్తిని వదలిన సన్యాసులకు అకర్మఫలాలు అంటవు. అర్జునా! పరమేశ్వరుడు సర్వ ప్రాణుల హృదయాల్లోనూ ఉన్నాడు. వారిని తన మాయతో యంత్రాల్లాగా ఆడిస్తున్నాడు. ఆ జగత్ప్రభువైన ఈశ్వరునే శరణ వేడుకో. ఆయన దయ వల్ల పరమ శాంతినీ, శాశ్వతమైన మోక్షాన్నీ పొందుతావు. పరమ రహస్యమైన ఈజ్ఞానాన్ని నీకు ఉపదేశించాను. దీన్ని వివేచించి నీకు తోచినట్లు చెయ్. చివరి మాటగా చెపుతున్నాను.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥"

సర్వ ధర్మాలను పరిత్యజించి నన్నే శరణు పొందు. నిన్ను సమస్త పాపాల నుండి విముక్తుణ్ణి చేస్తాను. దుఃఖించకు. పరమ రహస్యమైన ఈ గీతాజ్ఞానాన్ని ఏ రూపంలోనైనా నా భక్తులకు అందజేసే వారుకూడా నన్ను పొందగలుగుతారు.

అర్జునా! ఇంత ఏకాగ్ర చిత్తంతో అంతా విన్నావు. నీ అజ్ఞాన మోహం ఇప్పటికైనా తొలగిందా! అని ప్రశ్నించాడు భగవాన్ శ్రీకృష్ణుడు ప్రసన్నంగా.

పార్థుడు ఆర్ద్రంగా ఇలా విన్నవించుకున్నాడు -

ఓ అచ్చుతా! నీ దయ వలన నాకు మోహం నశించింది. జ్ఞానం కలిగింది సందేహాలన్నీ పటాపంచలైనాయి : నీ ఆదేశాన్ని అక్షరాలా ఆచరిస్తాను.

శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన భగవద్గీతను పరమానందభరితుడై కని, విని, ధృతరాష్ట్రునికి చెప్పి, ఉప్పొంగిపోయిన సంజయుడిలా భరతవాక్యాన్ని పాడాడు -

"యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతి ర్మమ"

యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడూ, గాండీధారియైన పార్థుడూ ఎక్కడ కలిసి ఉంటారో అక్కడ సిరిసంపదలూ, విజయాభ్యుదయాలూ, ఐశ్వర్య సౌభాగ్యాలూ, స్థిరనీతి శాంతాలూ వర్థిల్లుతాయి!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఆంధ్రమహాభారతం - అమృతత్వసాధనం

" న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగేనైకేన అమృతత్వ మానశుః ।
పరేణ నాకం నిహితం గుహాయామ్
విభ్రాజతే యద్యతయో విశంతి ॥"

ఇతిహాసాలు, పురాణాలు, మహాకావ్యాలు కాలక్షేపకానికి చదివేవి కావు. అవి అందించే మహోపదేశాలను మననం చేసుకోవడానికి అధ్యయనం చేసేవి. పంచమ వేదమైన మహాభారతం మానవలోకానికి ఒక మహత్తరమైన సందేశాన్ని ఇస్తుంది. మానవుడు జీవితంలో సాధింపవలసింది అమృతత్వమే అన్నది ఆ కార్ష్ణవేదం అందిస్తున్న జీవన సందేశం.

## అమృతత్వసాధనమంటే?

మహాభారతంలో మొదలూ, ముగింపూ - మానవుడు అమృతత్వసిద్ధి కోసం చేసే ాధన యొక్క ప్రారంభ పరిణతావస్థలను తెలుపుతూ ఉన్నాయి. ఆది పర్వంలో ఉదంకోపాఖ్యానం చూచినా, క్షీరసాగర మథనోపాఖ్యానం గమనించినా, సర్పయాగ ఘట్టాన్ని చదివినా మానవుడు విషాదుల వల్ల కలిగే మరణాన్ని జయించాలన్న కోరిక బలంగా కనబడుతుంది. శుక్రాచార్యుడు సాధించిన 'మృతసంజీవని'-యుద్ధంలో చనిపోయినవారిని బ్రతికించే ఒక మహామంత్రం. ఆ మంత్రం వెనుక మానవులు, దానవులు, దేవతలు మృత్యువుబారి పడకుండా తప్పించుకునే ఉపాయంకోసం ప్రయత్నించిన ఒక ప్రస్థానం మనకు ప్రత్యక్షం అవుతుంది. కచుని చరిత్ర, యయాతి చరిత్ర శుక్రాచార్యునితో ముడిపడి ఉన్నాయి. శుక్రాచార్యుని కూతురు దేవయాని. ఆమె మొదట వలచినవాడు బృహస్పతి కుమారుడు కచుడు. రాక్షసు లతనిని చంపినా, బూడిదచేసి మద్యంలో కలిపి శుక్రునిచే తాగించినా మృతసంజీవని ప్రభావం చేత దేవయాని కచుణ్ణి బ్రతికింప చేయిస్తుంది. మహాభారతకథకు మృతసంజీవని ఒక మహారంభం. మానవుని అమృతత్వసాధనకు అదొక శుభారంభం.

లోకంలో మరణం, లేదా మృతి మాట ఉంది. దేహి ప్రాణ త్యాగం చేసినప్పుడు, దేహం పొందే జడత్వం మృత్యువు. పుట్టిన జీవి గిట్టడం సహజం. జన్మ ఎత్తిన ప్రాణి మృత్యువు

పొందక తప్పదు. మానవుడు ఈ రెండింటిని జయించాలని తీవ్రంగా ప్రయత్నం చేస్తూ వచ్చాడు. ఈ ప్రయత్నాన్ని అధ్యాత్మిక ప్రస్థానం అంటారు. మరణం లేకుండా ఉండే స్థితిని పొందితే అమరత్వం అనాలి. జన్మ ఎత్తకుండా ఉండే నిత్యస్థితిని మోక్షమన్నారు. పుట్టిన జీవి మరణం లేకుండా బ్రతకటం ఒక ఎత్తు. అసలు పుట్టుక లేకుండా బ్రహ్మ స్థితిలో నిలవడం మరొక ఎత్తు. మొదటి మార్గానికి ఫలం స్వర్గం. రెండవ ప్రస్థానానికి ఫలం బ్రహ్మత్వం. ఈ రెండు రకాల సాధనల్లో మొదటిది, సామాన్యంగా కర్మ మార్గాన్ని అనుసరించే వారికి లభ్యమౌతూ ఉంటుంది. జ్ఞానమార్గం అనుసరించే వారికి బ్రహ్మానందస్థితి గమ్యమౌతూ ఉంటుంది. భక్తిమార్గ ప్రస్థానంలో ఉభయసిద్ధులకు అవకాశం ఉంది. మహాభారతం ఈ మూడు మార్గాలను ముచ్చటగా మేళవించింది. ఆ సమన్వయానికి పాండవులు ఆదర్శోదాహరణాలు. అయితే వారు ప్రధానంగా ధర్మ, కర్మ మార్గంలో నడిచిన వారు. దానికి పోషకంగా భక్తిని జ్ఞానాన్ని పొందుపరుచుకున్న వారు. యక్షప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన దక్షుడు జ్ఞాని అయిన ధర్మరాజు. ద్రౌపది అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన వాడు ధర్మరాజొక్కడే అని కురుసభలో భీష్మాదులచే ప్రశంసలందుకున్నవాడు. ధర్మరాజు ధర్మ తరువు వంటి వాడని శ్రీకృష్ణుని చేత కీర్తింపబడినవాడు. పంచమవేదమైన మహాభారతంలో ప్రతిపాదింపబడిన జ్ఞానానికంతటికీ ఆచరణ రూపమైన ఆదర్శోదాహరణగా నిలచిన వాడు - ధర్మరాజు. అతడు వస్తుతః జ్ఞాని. ఏకాగ్రచిత్తంతో స్మరించి, ధ్యానించి, తపించి యమ, సూర్య, అగ్ని, ఇంద్రాది దేవతలను సుముఖులుగా చేసుకున్న ఉత్తమ భక్తశిఖామణి ధర్మరాజు. అయితే అంతటి జ్ఞానాన్ని, అంతటి భక్తిని ఆచరణంలో ప్రదర్శించి చూపటమే ఆయన ధ్యేయం. అందువల్ల ధర్మరాజు జీవితంలో కర్మకు వన్నె పెట్టే భక్తి జ్ఞానాలే ప్రకాశిస్తూ ఉంటాయి. అందువల్ల ధర్మరాజు ధర్మ కర్మ వీరుడుగా ప్రసిద్ధి పొందాడు.

భీముడు ప్రచండ బలవీరుడు. పాండవుల పురుషార్థసాధనకు భీముడు బలమైన ప్రతినిధి. ధర్మరాజు సాధింపదలచుకున్న లౌకిక కార్యాలన్నీ భీముని సాయంతోనే నెరవేర్చుకుంటాడు. భీమునికి ధర్మరాజు ధర్మమూర్తి. అతని మాట ధర్మశాసనం. అతని ఆజ్ఞ వేదం. అన్న మాటను జవదాటకుండా ఆచరించే ఆదర్శ కర్మవీరుడు భీముడు. అతనికి భ్రాతృ భక్తియే దైవం. అదియే అతని ధర్మానురక్తి. అతనికి అన్నయే జ్ఞానం. అన్నయే భక్తి. అతణ్ణి అనుసరించటమే కర్మ. కప్పను, నీటిని గర్భంలో ధరించిఉన్న శిలామూర్తి లాగా భక్తిజ్ఞానములను గుప్తంగా దాచుకున్న కర్మఠుడు భీముడు.

అర్జునుడు యుద్ధవీరుడు. నరనారాయణులలో నరు డాతడు. నారాయణ భక్తియుక్తుడు. ధర్మజుడు దైవకార్యాన్ని సాధింపవలసి వచ్చినపుడు, అర్జునుణ్ణి దివ్యోపకరణంగా

వాడుకుంటాడు. ఇంద్రుని సాయం కావాలన్నా, పరమేశ్వరుని నుండి పాశుపతాస్త్రం పొందాలన్నా, సాక్షాత్ నారాయణుడైన శ్రీకృష్ణునితో అనుసంధానం పెంచుకోవాలన్నా అర్జునుడే అనువైన వాహిక. కృష్ణుని పట్ల అనన్యచిత్తంలో భక్తిని ప్రసరించే పరమయోగి అర్జునుడు. భగవద్గీతను శ్రీ కృష్ణభగవానుని చేత స్వయంగా విన్న మహాజ్ఞాని. అతని భక్తి, అతని జ్ఞానం-అతని గాండీవ పాండిత్యాన్ని ప్రదర్శించడానికి పోషకంగా నిలిచాయి. అతడు యుద్ధాలలో విజయుడు, సాటిలేని మేటి వీరుడు. కర్మ మార్గాన్ని అనుసరించినా జ్ఞానాన్ని గౌరవించినవాడు. భక్తిని పండించుకున్న వాడు.

నకుల సహదేవులు జంట వీరులు. వారికి అన్నలే దేవుళ్లు. వారి సేవయే భక్తి. వారు చెప్పిన పని చేయటమే కర్మ. వారు సేవాతత్పరులైన కర్మ వీరులు.

ద్రౌపది పాండవ ధర్మపత్ని. అబల రూపంలో అవతరించిన అహంకారశక్తి. ధర్మరాజుని జ్ఞానశక్తిని, భీమాదుల క్రియాశక్తిని తన ఇచ్ఛాశక్తితో నడిపించ గలిగిన నారీమూర్తి. ఒక్కోసారి పిలిస్తే చాలు ఎక్కడ ఉన్నా భగవంతుడు ఆమెకు ప్రసన్నుడౌతాడు. కురుసభలో కోకలందించిన శ్రీకృష్ణుడు, విరాటనగరంలో అంగసంరక్షణ చేకూర్చిన సూర్యభగవానుడు ఆమె భక్తి శక్తికి ప్రత్యక్షసాక్ష్యంగా నిలిచిన భగవద్రూపులు. ఆమె ప్రధానంగా కార్యశూరురాలు. అగ్నినుండి పుట్టిన అయోనిజ. జ్వాలలాగా తనలో భక్తిజ్ఞానాలను పండించుకున్న పరిణత మూర్తి. సాధ్వి, పతుల సేవ ఎలా చేయాలో, సత్యభామకు బోధించిన అనుభవ జ్ఞానశీలి. భక్తిజ్ఞానాలున్నా అవమానాగ్నితో అనవరతం జ్వలిస్తూ శత్రుశేషం లేకుండా సంహార యజ్ఞం సాగించిన సాహసురాలు. కర్మమార్గావలంబి ద్రౌపది.

ఇలా పాండవులు ప్రధానంగా ధర్మ కర్మ ప్రవృత్తులకు ప్రతీకలుగా భారతంలో కనపడతారు. వీరందరిలో అగ్రగణ్యుడు ధర్మరాజు. ఆయన యమధర్మరాజు అంశంలో పుట్టిన అపూర్వ ధర్మమూర్తి. మృత్యు దేవత అనుగ్రహంతో పుట్టిన ధర్మరాజు మృత్యువును జయించటం మహాభారత కథలో ఫలితాంశం. బొందితో స్వర్గానికి వెళ్లాడు - అన్న వాక్యానికి. కొద్ది మంది మాత్రమే ఉదాహరణప్రాయంగా నిలవగలరు. వారిలో ధర్మరాజు అగ్రగణ్యుడు. సశరీరస్వర్గం కర్మమార్గాన్ని అనుసరించే ధర్మవీరుడు సాధించగలిగిన సమగ్రఫలం. దానినే అమరత్వం అంటారు. స్వర్గ నరకాలను దర్శించిన తరువాత ధర్మరాజు ఆకాశగంగలో మునిగి, స్వస్వరూప స్థితిని పొందాడు. మరణావస్థకు గురి అయ్యే దేహాన్ని ధరించినన్నాళ్లు అమరలోకాన్ని అందుకున్నా, అమృతత్వసిద్ధి లభించదని, నశ్వరమైన దేహాభిమానాన్ని వదలి అనశ్వరమైన ఆత్మస్థితిలో నిలిచినప్పుడే అమృతత్వస్థితి అందుకున్నట్లని సశరీర స్వర్గానంతరం స్వసంకల్పంతో దేహత్యాగాన్ని చేసి ఆత్మ స్థితిలో నిలవడమే అమృతత్వ మని,

ఆంధ్ర మహాభారత కథ ప్రబోధిస్తుంది. అమృతత్వసాధనలో ఇది ఒక పరిణతస్థితి. దీన్ని అందుకోవడానికి మహాభారత కథలో సాగిన మానవయత్నాలను మనం గమనిస్తే ఆప్రస్థాన వైఖరి రసరమ్యంగా ప్రసన్నమౌతుంది.

## అమృతత్వసాధనలో ఆదిదశ 'మృతసంజీవని' విద్య

వృషపర్వుడనే దానవరాజుకు శుక్రాచార్యుడు గురువు. దేవదానవ యుద్ధాలలో దానవులు చనిపోతే వారిని బ్రతికించడానికి శుక్రాచార్యుడు 'మృతసంజీవని' అనే విద్యను కనిపెట్టాడు. ఆ విద్య వల్ల యుద్ధంలో చనిపోయిన దానవులందరూ బ్రతుకుతూ ఉండేవారు. ప్రతిరోజు శుక్రుడు అసంఖ్యాకంగా దానవుల్ని పునర్జీవితులుగా చేస్తుండేవాడు. ఇది దేవలోకంలొ కలవరం రేకెత్తించింది. మృతసంజీవని విద్యను ఏ విధంగానైనా పొందాలని దేవతలు యోచించారు. వారిలో బృహస్పతి బుద్ధికుశలుడు. ఆయన తన పుత్రుడైన కచుణ్ణి పిలిచి శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి మృతసంజీవని విద్యను ఏ విధంగానైనా పొందమని కోరతాడు. 'నియమ వ్రత శీలుడవై శుక్రుణ్ణి సేవించి, అతని ప్రీతికి పాత్రుడవై, అతడు మనసు కరిగి దయతో నీ కా విద్యను బోధించేటట్లుగా ప్రయత్నించు,' అని ప్రేరేపిస్తాడు. 'శుక్రాచార్యులకు దేవయాని అనే కూతురున్నది. ఆమెంటే ఆయనకు చెప్పలేనంత మమకారం. ఆమె మాటను ఆయన జవదాటడు - కాబట్టి ఆమెను ముందుగా సముఖురాలుగా చేసుకో. శుక్రాచార్యుణ్ని భక్తితో సేవించు. నీ కిష్ట సిద్ధి కలుగుగాక !' అని దీవించి కచుణ్ణి శుక్రాచార్యుని వద్దకు పంపుతాడు బృహస్పతి.

## కచదేవయాని కథ

కచుని సుకుమారత్వానికి, మృదు మధుర వినయ ప్రియ వచనాలకు, నియమ వ్రత శీలానికి శుక్రాచార్యుడు ఎంతో సంతోషించి అతనిని దరికి చేర్చుకుంటాడు. శుక్రుణ్ణి బృహస్పతిలాగా భావించి కచుడు సేవిస్తూ ఉంటాడు. శుక్రుని ఆశ్రమంలో గురుశుశ్రూషలు కచుడు విధి తప్పకుండ నిర్వహించాడు. శుక్రాచార్యునికి ప్రియశిష్యుడై మెలగజూచాడు. అది దానవుల కన్ను కుట్టింది. దేవతల మీద, బృహస్పతి మీద ఉన్న కోపంతో కచుణ్ణి సంహరించాలని భావించారు దానవులు.

ఒకనాడు కచుడు హోమధేనువును కాస్తూ ఒంటరిగా వనానికి వెళ్లాడు. అదే సమయమని భావించి దానవులు కొందరు అతణ్ణి చంపి మద్దిచెట్టుకు బంధించి వెళ్ళిపోయారు. సాయంకాలం అయింది. హోమధేనువు ఒంటిగా ఇంటికి తిరిగి వచ్చింది. కాని, కచుడు మాత్రం రాలేదు.

అప్పటికే కచుని మీద వలపు తొలిరేకలు మసలుతున్న హృదయంతో దేవయాని తండ్రితో ఇలా అన్నది.

*"వా(డి మయూఖముల్ గలుగువా( డపరాంబుధి గ్రుంకె ధేనువుల్*
*నే( డిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్ని హోత్రముల్*
*పో(డిగ వేల్వగా బడియె బ్రొద్దును బోయె( గచుండు నేనియున్*
*రా(డు వనంబులోన మృగరాక్షస పన్నగబాధ నొందెనో."*

*ఆది. 3. 112.*

మనసులో బాధపడుతూ చెప్పిన దేవయాని మాటలు శుక్రాచార్యుని హృదయాన్ని ద్రవింపజేశాయి. దివ్యదృష్టి సారించి అసురుల చేత చంపబడిన కచుణ్ణి గమనించాడు. మృతసంజీవనిని పంపి అతనిని సంజీవితుని చేసి తన వద్దకు పిలిపించుకున్నాడు. దేవయాని అందుకు మనసులో ఎంతో సంతోష పడింది. మనసులో కోరికను మాత్రం బయట పెట్టకుండా దాచుకుంది.

ఒకనాడు కచుడు పూజకై పూలు తీసుకురావడానికి అడవిలోకి ఒంటరిగా పోయాడు. అదను కనిపెట్టి అసురులు అతన్ని పట్టి అగ్నిలో పడవేసి, కాల్చి, బూడిదచేసి దానిని మద్యంలో కలిపి శుక్రాచార్యున కిచ్చి అతనిచేత తాగించారు. శుక్రాచార్యునికి సహజంగా ఉన్న సురాపానమోహంచేత పూర్వాపరాలు తెలియక ఆ సురను తాగాడు. సాయంకాలం అయింది. కచుడు తిరిగి రాలేదు. దేవయాని కనులవెంట నీరు పెట్టుకుంటూ కచుడు రాలేదని తండ్రిని ఎలుగెత్తి అడిగింది. "సంజీవని విద్య తమ వద్ద ఉందని అసురులు గర్వాంధులై ఆ కచుణ్ణి సంహరించడానికి చూస్తున్నారు. ఒక వేళ ఆ విధంగా అతడు చనిపోతే ఉత్తమ గతులు పొందుతాడు. నీ వెందుకు అని కోసం దుఃఖిస్తావు?" అని శుక్రుడు దేవయానిని అడిగాడు. "అతిలోకోత్తరుడు బృహస్పతి సుతుడు. నీ శిష్యుడు. బ్రహ్మచార్యాశ్రమసంపన్నుడు అయిన ఆ కచుడు అకారణంగా దనుజుల చేత సంహరింపబడితే నేను అతని కోసం శోకించకుండా ఎలా ఉండేది. ధర్మచ్యుతిని సంహించని మీరు ఈ అధర్మాన్ని ఎలా సహిస్తారు. కచుడు కనపడితే తప్ప నేను ఆహారం ముట్టను" అని దేవయాని ఎక్కుపెట్టి ఏడుస్తూ కూర్చుంది. చాలా సేపటికి గాని శుక్రుడు ప్రసన్నం కాలేదు. యోగదృష్టితో లోకాలన్నీ చూశాడు. ఎక్కడా కచుడు కనపడలేదు. సురాసమ్మిశ్రిత భస్మమయుడై తన ఉదరంలోనే ఉన్న కచుణ్ణి చివరికి చూచాడు. అప్పుడు సురాపానం వల్ల ఎంత చేటు కలుగుతుందో స్వయంగా తెలుసుకున్నాడు. ఆవేశంతో, పలువురు వినేటట్లుగా ఇలా ప్రబోధించాడు.

" మొదలి పెక్కు జన్మములఁ బుణ్య కర్మముల్
పరఁగఁ బెక్కు సేసి పడయఁబడిన
యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన
చెఱుచు మద్యసేవ సేయ నగునె?"

" భూసురు లాదిగఁ గలజను
లీసుర సేవించి రేని ఇది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు
చేసితి మర్యాద దీనిఁ జేకొనుడు జనుల్."

ఆది. 3.120-121.

శుక్రుడు నాటినుండి సురాపానాన్ని మహాపాతకంగా శపించాడు. తన కడుపులో ఉన్న కచుణ్ణి సంజీవితుణ్ణి చేశాడు. ఉదరంలో నుంచే కచుడు శుక్రుణ్ణి ఇలా ప్రార్థించాడు.

"ఓ పుణ్యాత్ముడా ! నాకు తనువును ప్రాణాన్ని సత్వాన్ని ప్రసాదించావు. నీ ఉదరంలో నుండి వెలువడే మార్గాన్ని నాకు చూపించు". ఆ మాటలు విని శుక్రుడు ఇలా అన్నాడు. " నీవు నా ఉదరాన్ని చీల్చుకుని గాని బయటకు రాలేవు. అలా వస్తే అప్పుడు నేను మరణిస్తాను. నన్ను సంజీవితుణ్ణి చేయాలి నీవు" అని శుక్రాచార్యుడు కచుడికి సంజీవిని ఉపదేశించాడు. ఆ తరువాత ఉదయాద్రి దరీ ముఖం నుండి ఉదయించిన పూర్ణచంద్రబింబంలా కచుడు శుక్రుని గర్భం నుండి వెలువడ్డాడు. శుక్రాచార్యుడు విగతజీవుడై పడిపోయాడు. శుక్రుణ్ణి కచుడు మృతసంజీవని విద్యచే పునురుజ్జీవితుణ్ణి చేశాడు. ఉచ్చారణ దక్షతచేత అభిహితమైన శబ్దం లాగా శుక్రాచార్యుడు సంజీవితుడై ప్రకాశించాడు. కచుడు అలా సంజీవని విద్యను పొంది చాలా కాలం శుక్రాచార్యుణ్ణి సేవించి ఒకనాడు అతని అనుమతితో దేవలోకానికి ప్రయాణమయ్యాడు.

అమరావతికి తిరిగి వెళుతున్న కచుణ్ణి చూచి వియోగదుఃఖంతో దేవయాని ఇలా అన్నది.

" నీవును బ్రహ్మచారివి వినీతుడ వేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవని తోడ శుక్రుదయఁ జేయుము నాకుఁ బ్రియంబు నావుడున్ "

ఆది - 3. 129.

దేవయాని మాటలకు కచుడు విషాదాకులచిత్తు డయ్యాడు. "గురువులకు శిష్యులు పుత్రులు. లోక ధర్మ పథంలో ఇది అనుసరింపవలసిన పరమార్థం. నీవు నాకు గురుపుత్రివి. అంటే నాకు సహోదరివి. లోక నింద్యమైన ఈ తనూ సంగమాన్ని నీవు భావించటం తప్పు. పలకటం మరింత తప్పు". అని హితబోధ చేశాడు.

దేవయానికి అపరిమితమైన కోపం వచ్చింది." నా కోరిక తీర్చని నీకు, నీ యందు సంజీవని పనిచేయకుండ ఉండుగాక !" అని శాపం పెట్టింది. కచుడు ధీరుడై ఇలా సమాధానం చెప్పాడు. "నేను ధర్మ పథాన్ని తప్పిన వాణ్ణి కాను. నీ శాపం వల్ల సంజీవని నా యందు పనిచేయకపోయినప్పటికీ, నా చేత ఉపదేశం పొందిన వారిపట్ల అది ఫలిస్తుంది. మరి నీవు ధర్మవిరోధంగా భావించావు, ప్రవర్తించావు. కాబట్టి నిన్ను బ్రాహ్మణుడు వివాహ మాడకుండుగాక!" అని ప్రతిశాపం ఇచ్చాడు కచుడు. అతడు అమరావతికి తిరిగివెళ్ళి పోయాడు.

## ధార్మిక దృక్పథం అమృతత్వ సాధనం

'జాతస్య మరణం ధ్రువం' అన్నది సత్యోక్తి. మృతువును జయించాలనే పుట్టిన మానవుడు చేసే ప్రయత్నం అమృత ప్రస్థానం. అందులో శుక్రాచార్యుడు సాధించింది, మృతసంజీవని. అంటే దేశ కాల పాత్ర పరిధిలో ఒక జీవి మరణిస్తే అదే స్థితిలో అతడు పునర్జీవితుడౌతాడు. అందులోను యుద్ధంలో మరణించిన వారే పునర్జీవితులు కావటం ఈ కథలోని వాస్తవం. ఒకవేళ అందరు బ్రతుకుతారని భావించినా జరారోగ భయాలు ఈ విద్యచేత నివారింపబడవు. వయస్స్తంభనం ఈ విద్య వల్ల అసాధ్యం. సహజ మృత్యువు దశను కూడా ఈ విద్య నివారిస్తుందని స్పష్టంగా లేదు. ఒక వేళ ఈ విద్యయే లభిస్తే అది యౌవన దశలోని వారికి వర ప్రసాదం. తదితరుల కంత ప్రయోజనకారి కాకపోవచ్చు. దీని వల్ల శరీరానికున్న అనిత్యత్వం నివారింపబడటంలేదు. మృతసంజీవని అమృతత్వం కాదు. కాని ఆవైపులో మానవుడు సాధించిన మొదటి మెట్టు.

విశేషమేమంటే ఈ విద్య దానవలోక గురుడైన శుక్రుడు సాధించింది. అమృతత్వ సాధనలోని తామసిక లక్షణం ఇందులో ఉంది. పడిపోయిన శరీరం ప్రాణవంతం కావటమే ఇందులోని పరమార్థం. శరీరం శిథిలం కాకుండా శాశ్వతంగా నిలిపే ప్రక్రియ ఇందులో లేదు. ఇది శరీరధారికి సాధ్యమవుతుందా ? అన్న ప్రశ్న మృతసంజీవని విద్య మానవలోకానికి మిగిల్చింది.

మృతిని శరీరం వరకే భావించటం అసుర ప్రవృత్తి. శరీరం యొక్క అనిత్యత్వం

గుర్తించి మానవునికి అమృతత్వాన్ని అందించేది ధర్మం ఒక్కటేనని తెలిసికొని అనుసరించటం దేవతల లక్షణం. ఆ తెలివిడితో అనిత్యమైన దేహంతో నిత్యమైన ధర్మసాధన ప్రస్థానం తెలిసి సాధించటం మానవత్వం. కచుడు దేవలోకానికి సంబంధించిన వాడు. భస్మమైన అతని శరీరం తిరిగి రూపు కట్టడానికి తోడ్పడింది మృతసంజీవని. నిజానికి రాక్షసులు కాల్చిన శరీరం బూడిద అయినా అతడు మరలా బ్రతకగలిగాడు. ఆ కచుడే సోదరిగా భావింపదగిన దేవయానిని శరీర వ్యామోహంతో భార్యగా స్వీకరించినట్లయితే ధర్మంతో పాటు బూడిద పాలై పోయుండేవాడు. ధర్మచ్యుతుడైన వ్యక్తికి పునర్జీవితం లేదు. దానవులకు మృతసంజీవని విద్య. దేవతలకు ధార్మికనిష్ఠ విద్య. దానవవిద్య పరిమిత ప్రయోజనం కలిగిందే. ధార్మిక విద్య దేహానికి ముక్తికలిగినా మనిషికి ధర్మంతో జీవించే అమృత యోగాన్ని అందించే విద్య. దేహ స్పృహ కలిగిన దేవయానికి ఆత్మ స్పృహను కలిగించి అసురలోకంలో అమృత యోగానికి నాందిని ఆలపించాడు కచుడు.

ఆంధ్రమహాభారతం గార్హస్థ్య ధర్మం ద్వారా మానవులు సాధించే అమృతతత్వాన్ని ప్రబోధించటానికి పుట్టిన పంచమవేదం.

*"శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే*
*లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీ పుంస యోగోద్భవాం*
*తే వేదత్రయ మూర్తయ స్త్రి పురుషా స్సంపూజితా వస్సురై*
*ర్భూయాసుః పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే "* ఆది - 1.1

అన్నది మంగళశ్లోకం. ఇందులో కీర్తింపబడిన త్రిమూర్తులు సతీసహితులు. గార్హస్థ్య ధర్మ రక్షా పరతంత్రులు. స్త్రీ పుంస యోగ రూపమైన లోకానికి శ్రేయస్సును చేకూర్చటం ఈ శ్లోకం లోని ఆకాంక్ష.

సమాజంలోని సర్వ ధర్మాలు గార్హస్థ్య ధర్మం కేంద్రంగా పరిభ్రమిస్తూ ఉంటాయి. ఇల్లు చక్కగా ఉంటే ఇలాతలం అంతా సుభిక్షంగా ఉంటుంది. ఆశ్రమ ధర్మాలు అక్షయంగా సాగుతాయి. సృష్టిలో స్త్రీ పురుష సంబంధాలలో ధర్మ స్పృహ అక్షయంగా నిలిస్తే సమాజంలో శాంతి అమృతప్రదంగా అందగిస్తుంది. దేవయాని కచుణ్ణి కోరటంలో లౌకిక స్త్రీ పురుష సంబంధాన్ని మాత్రమే పరిగణించింది. అతడు బ్రహ్మచారి అని, తాను కన్య అని వాదించింది. మన సిదివరకే అతనికి దత్తమై ఉండటం వల్ల వివాహం నిశ్చితమని నిరూపించటానికి యత్నించింది. లౌకిక స్త్రీ పురుష సంబంధాలను పరిగణనంలోకి తీసుకుంటే దేవయాని వాదంలో లౌకికన్యాయం ఉంది. కాని కచుడు అది ధర్మ బద్ధం కాదని త్రోసిరాజన్నాడు.

దేహ సంబంధమైన దేవయాని వాదం శుక్రాచార్యుని మృతసంజీవని వంటిది కచుని ధార్మిక దృక్పథం దేవతల అమృతత్వ సాధనం వంటిది.

ఈ ఉభయ లోకాల చైతన్యాల నడుమ ధర్మసాధన మార్గంగా సాగేది మా ప్రస్థానం. చంద్ర వంశజుడైన యయాతి ఈ ప్రస్థానానికి మార్గదర్శి. కచుని చేత పరిత్యక్తురాలైన దేవయాని యయాతి జీవితంలో ప్రవేశించింది. చనిపోయిన వారిని బ్రతికించే విద్యకు గురువైన శుక్రాచార్యుని కుమార్తె దేవయానికి చంపటం తెలుసు. చావటం తెలుసు. కాని పునర్జీవింపచేయటం తెలుసునా ? అనే ప్రశ్న ఉదయింప చేస్తుంది.

దేవయానితో గార్హస్థ్య జీవితాన్ని సాగించటానికి మొదలు పెట్టిన యయాతి, మానవుడు సాధించే అమృతత్వసాధనలో త్యాగమనే మహాగుణం అమృతత్వానికి అపరరూపమే అని తలమింప చేసే ఫలితాలను అందించాడు. ఈ గాథ మరొక మధురమైన సాధన దశ.

## త్యాగేనైకేన అమృతత్వ మానశుః

దేవయానికి ప్రాణ స్నేహితురాలు వృషపర్వుని కూతురు శర్మిష్ఠ. వాళ్ళిద్దరూ కలిసి స్నేహానురాగాలతో విహరిస్తూ ఉండేవారు. ఒకసారి వేయిమంది కన్యకలతో కలిసి శర్మిష్ఠ దేవయానిని కలుపుకుని ఒక సరోవరంలో స్నానం చేయటానికి వెళ్ళింది. ఆ కన్యకలందరు తమ చీరలను ఒడ్డుమీద ఉంచి నీటిలో దిగి జలక్రీడలాడటం మొదలుపెట్టారు. అంతలో ఒక సుడిగాలి వచ్చింది. ఒడ్డుమీద ఉన్న గుడ్డలన్నింటినీ కుప్పగా కలిపివేసింది. కన్యకలందరూ జలక్రీడ చాలించి ఒడ్డుకు చేరారు. ఎవరి దుస్తులు వారు వెతుక్కుంటూ గుర్తించి కట్టుకుంటున్నారు. శర్మిష్ఠ తొందరలో దేవయాని చీరను కట్టుకున్నది. దేవయానికి శర్మిష్ఠ చీర మిగిలింది. ఆ చీర కట్టుకోడానికి దేవయాని ఇష్టపడలేదు. "లోకోత్తర చరిత్రుడైన శుక్రాచార్యుని కుమార్తెను, నీకు పూజ్యురాలిని, భూసురకన్యను, నేను నీవు విడిచిన బట్టలను కట్టుకోవచ్చునా చెప్పు?" అని దేవయాని గద్దించింది.

శర్మిష్ఠ తెల్లవోయింది " మానాన్నగారి దగ్గర మీ నాన్న గారు పనిచేస్తారు. వారు మా తండ్రిని దీవించి వారికి హితం చేకూరుస్తుంటారు. వారిద్దరి మధ్య తేడాలు లేవు. మనిద్దరి మధ్య ఎందుకు? మీనాన్న గొప్పతనం గురించి నీ గొప్పతనం గురించి ప్రత్యేకించి నాకు వేరుగా చెప్పాలా! నేను కట్టుకున్న చీర నీకు కట్టుకోడానికి అంత పనికిరాదా?" అని అభిమానంతో క్షత్రియవనితగా పలికింది.

దేవయాని తన పట్టు వీడలేదు. శర్మిష్ఠ తన రోషం మానలేదు. కట్టిన చీర విప్పటం

క్షత్రియ వనితకు అవమానం అనుకున్నది - శర్మిష్ఠ. ఒకరు విప్పిన చీరను కట్టుకోవడం బ్రాహ్మణ వనితకు తగదనుకున్నది - దేవయాని. మాటలు పెరిగాయి. శర్మిష్ఠ, దేవయానిని ఆ పక్కనే ఉన్న పాడుబడ్డ బావిలోకి త్రోసి వేయిమంది కన్యకలతో ఇంటికి తిరిగి వచ్చింది. అదే సమయంలో నహుషపుత్రుడు అయిన యయాతి వేటకై ఆ ప్రాంతానికి వచ్చాడు. ఆ సరోవరంలో నీరు త్రాగడానికి ఆ తీరానికి చేరుకున్నాడు. ప్రక్కనే ఉన్న పాడుబడ్డబావిలో దేవయాని ఆర్తనాదం విన్నాడు. లతల నడుమ చిక్కుబడి ఉన్న ఆ లలితాంగిని చూచాడు. ఎవరైనా తనను రక్షిస్తారేమోనని ఎదురుచూస్తూ కన్నీరుకారుస్తూ ఉన్నది. ఆ విషాదమూర్తిని విలోకించాడు. వరుణ దేవుని భార్యయే, భర్త మీద అలిగి జలనివాసం విడిచి భూస్థలానికి వచ్చిందా అన్నట్లు ఆర్తమూర్తి అయిన దేవయానిని కన్నారా చూశాడు. నూతిలో ఉన్న ఆమెపట్ల సానుభూతి ప్రకటించాడు.

" నీవెవరివి? ఇలా ఒంటరిగా ఈ పాడుబడ్డ బావిలో ఎందుకున్నావు?" అని ఎలిగెత్తి అడిగాడు.

## యయాతి వృత్తాంతం

దేవయాని యయాతినిని గుర్తించింది. ఇదివరలో ఎన్నోసార్లు వేటకోసమై వచ్చి తన తండ్రిని చూచి వెళ్ళినవాడే. మాటను పోల్చుకున్నది. రూపును పోల్చుకున్నది. తాను శుక్రాచార్యుని కూతురునని చెప్పుకున్నది. ప్రమాదవశాత్తు బావిలో పడ్డానని పేర్కొన్నది. తనను బయటికి తీసి రక్షించుమని వేడుకున్నది. ఆమె దయనీయ స్థితిని చూచి యయాతి దయాంతరంగుడైనాడు.

*'జలధి విలోలవీచి విలసత్కల కాంచిసమంచితావనీ*
*తలవహనక్షమం బయిన దక్షిణ హస్తమునం దదున్నమ*
*ద్గళ దురు ఘర్మ వారికణ కమ్ర కరాబ్జము పట్టి నూతిలో*
*వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్'* ఆది - 3-144.

దేవయానిని బావినుండి పైకితీసి యయాతి తననగరానికి తిరిగి వెళ్ళాడు. దేవయానిని వెతుక్కుంటూ 'ఘూర్ణిక' అనే చెలికత్తె అక్కడికి వచ్చింది. ఇంటికి రమ్మని దేవయానిని కోరింది. దేవయాని కోపంతో అగ్నిజ్వాలగా మండిపోయింది.

" ఆశర్మిష్ఠ చేసిన ఈ అవమానాన్ని నేను సహించలేను. ఆమె కన్నతండ్రి వృషపర్వుడు పాలించే ఈ నగరంలో నేను ప్రవేశించను. ఈ సంగతి మా తండ్రి, శుక్రాచార్యులకు చెప్పి ఆయన్ని ఇక్కడకు పిలిపించు'' మని ఘూర్ణికను ఆజ్ఞాపించింది.

శుక్రాచార్యుడు దేవయాని దగ్గరకు ఆత్రుతతో వచ్చాడు. కోప ఘూర్ణిత బాష్పపూరి అయిన దేవయానిని చూశాడు. క్రోధం వల్ల కలిగే అనర్థాలను మనస్సులో భావించాడ కుమార్తెకు బోధించాడు -

"అమ్మా ! దేవయాని! లోకంలో కోపాన్ని అణుచుకున్నవారు ఎంతో ఉత్తములు కీర్తింపబడుతారు. అనేక నియమాల కోర్చి, అపారదక్షిణల నిచ్చి, వేల యజ్ఞాలు చేసి వారికంటె కోపం లేని వారు గొప్పవారని తత్త్వవేత్తలు చెబుతారు. ఎదుటివారు కోపగించిన తాము కోపగించుకోనివారు, ఎదుటివారు ఎగ్గులు పలికినా నిర్లిప్తంగా ఉండి, మారుపలకని వారు, అవమానాలపాలైనా, పగసాధించక ఓర్పు వహించేవారు, ధర్మజ్ఞులని లోకులు కీర్తిస్తారు. కాబట్టి బుద్ధిగల వారికి క్రోధం మంచిది కాదు. శర్మిష్ఠ రాజకుమార్తె. చిన్న పిల్ల దానితో నీకు పంతమెందుకు? ఇంటికి పోదాం రా" అని శుక్రాచార్యుడు దేవయానిని అనునయించాడు.

"అనురాగం, నేర్పు, సాహసం కలవారిని లెక్క చేయకుండా అవమానించే అవివేకుల వద్ద ఉండటంకంటె కష్టం మరేదైనా ఉందా? ఈ వృషపర్వనగరంలో నేనిక ప్రవేశించేది లేదు. ఎక్కడికైనా వెళ్ళిపోతాను" అని బెదిరించింది దేవయాని.

శుక్రునికి దేవయాని అంటే ప్రాణం. ఆమే గతియని నమ్ముతాడు. అందువల్ల ఆమెతో తాను కూడా వస్తానని చెప్పి ఆమెను ఒప్పించే ప్రయత్నం చేస్తున్నాడు. ఈ సంగతి వృషపర్వుడు గూఢచారులవల్ల తెలుసుకున్నాడు. శుక్రాచార్యుల వద్దకు వచ్చాడు, వినయంతో నమస్కరించాడు. శుక్రాచార్యుల మృత సంజీవని విద్య ప్రభావంతో దేవతలను మించే సంపదను దైత్యులు సంపాదించగలిగారని, ప్రాణాలతో బ్రతకగలిగా రని, దానవ చతురంగ బలమంతా శుక్రాచార్యుల వరదత్తమని ప్రశంసించి, దేవయాని మనసుకు ఏది ఇష్టమైతే దానిని తప్పక ఇస్తానని వృషపర్వుడు పేర్కొన్నాడు. ఆ మాటలు విని దేవయాని ఆనందపడింది. సమయం వచ్చింది కదా! అని వేయిమంది కన్యకలతో కూడిన శర్మిష్ఠ తనకు దాసిగా ఉండాలని కోరింది. ఆ మాటను కాదనలేక వృషపర్వుడు అంగీకరించాడు. శుక్రుడు సంతోషించాడు. శర్మిష్ఠ కన్యకా సహస్రంతో ప్రతిరోజు దేవయానిని సేవిస్తోంది.

ఒకనాడు అందరూ కలిసి ఉద్యానవనానికి వెళ్ళారు. ఆ సమయంలో యయాతి సమీపారణ్యంలో వేటకై వచ్చి ఆ వనంలో ప్రవేశించాడు. దేవయానిని చూచి అతిథి సత్కారాలను పొందాడు. ఆమె పక్కనే 'అతిశయ రూప లావణ్య గుణసుందరి' అయిన శర్మిష్ఠను ఆమె చెలికత్తెలను చూచి వారిని పరిచయం చేసుకున్నాడు. అప్పుడు దేవయాని

యయాతి యందు అనురక్తురాలై తనను వివాహం చేసుకొమ్మని అడిగింది. నన్నయ ఆ సందర్భాన్ని ఎంతో గొప్పగా చిత్రించాడు.

*'నిగ్రహ మేది నన్ను దరణీప్రభ కూపము వెల్వరించునాఁ*
*డుగ్రమయూఖు సాక్ష్యముగ నున్నతదక్షిణపాణిఁ జేసి భూ*
*పాగ్రణి నాదు దక్షిణ కరాబ్జము పట్టితికాన మున్ను పా*
*ణిగ్రహణంబు సేసి తది నీ యెడ విస్మృతిఁ బొందఁ బాడియే.'*

*'నన్ను వివాహమై నహుషనందన యీలలితాంగిఁ దొట్టి యీ*
*కన్నియ లందఱున్ దివిజకన్యలతో నెన యైన వారు నీ*
*కున్నతిఁ బ్రీతి సేయఁగ నృపోత్తమ వాసవుఁ బోలి లీలతో*
*నిన్నరలోక భోగము లనేకము లందుము నీవు నావుడున్.'* *(ఆది. 3. 160-161)*

దేవయాని మాటలకు యయాతి అభ్యంతరం చెప్పాడు. క్షత్రియులు బ్రహ్మణ కన్యలను వివాహమాడటం ధర్మవిరుద్ధమని పేర్కొన్నాడు. దేవయాని తన వాదనను వీడలేదు. "సకల లోకపూజ్యుడైన శుక్రాచార్యుడు ఈ వివాహాన్ని అంగీకరిస్తే, నన్ను నీ దాన్నిగా స్వీకరిస్తావా?" అని దేవయాని యయాతిని అడిగింది. శుక్రాచార్యుడు ఇది ధర్మ విరుద్ధం కాదని చెబితే తన కభ్యంతరం లేదని యయాతి పేర్కొన్నాడు. దేవయాని శుక్రాచార్యుని స్మరించింది. తేజోమూర్తి అయిన శుక్రుడు వారి ఎదుట ప్రత్యక్షం అయ్యాడు. అందరూ ఆ మునికి నమస్కరించారు.

దేవయాని శుక్రాచార్యునితో ఇలా అన్నది:

" ఈ యయాతి మహారాజు నన్ను నూతి నుండి వెలికి తీస్తున్నప్పుడే నా కరగ్రహణం చేశాడు. అందువల్ల ఆయన ఈ జన్మకు నాకు భర్త అయినాడు. ఒకరు పట్టిన నా చేతిని మరొకరికి ఇవ్వటం న్యాయమా? అందువల్ల నాకు యయాతియే భర్త. మీరంగీకరిస్తే నన్ను వివాహం చేసుకుంటానంటున్నాడు. నన్ను వివాహం చేసుకోవటంవల్ల యయాతికి ధర్మ విరోధం కలగదని మీరు అనుగ్రహించాలి."

ఈ మాటలు విన్న శుక్రుడు పుత్రికావ్యామోహంతో ఆమె వివాహాన్ని సమర్థించటానికి పూనుకున్నాడు. అపక్రమదోషం లేకుండా వరమిచ్చాడు. వారిద్దరికీ వైభవంగా వివాహం చేశాడు. దేవయానితో పాటు సహస్రకన్యా పరివృత అయిన శర్మిష్ఠను అరణంగా అందించాడు. వారందరికీ అన్నపాన భూషణాది సౌకర్యాలను యయాతి కల్పించాలని, శర్మిష్ఠతో కలిసి శయనించటం పరిహరించాలని ఆజ్ఞాపించాడు.

యయాతి దేవయానిని, శర్మిష్ఠను కన్యాసహస్యాన్ని వెంట తీసుకుని నిజనగరానికి వెళ్ళాడు. దేవయానిని అంతఃపురంలో మహారాణి భవనంలో ఉంచాడు. ఆమె అనుమతితో శర్మిష్ఠను అశోక వన సమీపంలోని ఒక గృహంలో నివాసముంచాడు. దేవయాని యందు యయాతి యదు, దుర్వసులనే ఇద్దరు కుమారులను సంతతిగా పొందాడు.

దేవయాని అహంకారవతి. తా ననుకున్న పని ఏ విధంగానైనా సాధించుకునే గండ్రగొండి. తన మనసు కచుడి మీదనే లగ్నమైంది కాబట్టి అతడే తన భర్త అని మొదట వాదించింది. అతడు ధర్మాన్ని చూపి ఆమె వలపు ఆధర్మమని నిరూపించేసరికి పడగ చితికిన పాము తోకతో కాటేసినట్లు కచుణ్ణి శపించి పగ దీర్చుకుంది. ప్రేమ త్యాగాన్ని, సహనాన్ని కోరుతుంది కాని పగను శాపాలను రెచ్చగొట్టదు. దేవయాని స్వార్థపరురాలైన అహంకార ప్రణయిని. ఆమె స్వార్థంముందు పితృభక్తి, రాజభక్తి, స్నేహానురక్తి. భర్తృ రాగ ప్రవృత్తి అన్నీ దాసోహ మనవలసిందే.

యయాతి ధర్మపాలకుడైన ప్రభువు. రక్షించుమని కోరిన దేవయానిని బావి నుండి పైకి తీసి కాపాడాడు. తన ధర్మం తాను నిర్వహించినట్లు నిజపురికి తిరిగి వెళ్ళాడు. దేవయాని సౌందర్యం మీద అతడు చూపు నిలపలేదు - అది అతని ధర్మ ప్రవృత్తికి చక్కని నిదర్శనం.

దేవయాని యయాతిని వివాహం ఆడటానికి 'పాణిగ్రహణం' అని - ఒక పారిభాషిక పదం ఎన్నుకున్నది. చేయి చేయి కలిసింది కాబట్టి యయాతితో తనకు పెళ్లైపోయిందని వాదించింది. అది వితండవాదం అనటానికి వీల్లేదుకాని 'సమయానుకూలవాదం' అనవచ్చు. దాన్నొకధర్మంగా ప్రతిపాదించింది. ఆమె చూపించిన ఆ ధర్మం అధర్మం అని భావిస్తున్న యయాతికి శుక్రాచార్యుని చేత అది ధర్మమని చెప్పించి ఒప్పించాలనే ప్రయత్నం చేసింది. తండ్రిని తన అభిప్రాయానికి అనుకూలంగా మాట్లాడమని కోరింది. అ వివాహంలో ఉన్న అపక్రమ దోషాన్ని శుక్రాచార్యుడు శాస్త్రసమ్మతంగా సమర్థించలేక పోయాడు కాని, ఆ వివాహం వల్ల అటువంటి దోషం యయాతికి కలుగకుండా ఉండేట్లు వరమిచ్చి ఊరుకున్నాడు. శుక్రాచార్యునిమీద దేవయాని తీవ్రప్రవృత్తిప్రభావం ఎంత బలంగా ఉండేదో ఈ సన్నివేశంవల్ల తెలుస్తోంది.

శుక్రాచార్యుడు శర్మిష్ఠను సహస్రకన్యా సమేతంగా యయాతి నగరానికి పంపాడు. కాని, మహారాణి అయిన దేవయానికి కలిగే శయన సౌఖ్యం మాత్రం ఆమెకు కలుగకూడదని శాసించాడు. ఈ మాటలు అంటున్నప్పుడు శుక్రుడు దేవయాని తండ్రిగా కనపడతాడే కాని స్వతంత్ర వ్యక్తిత్వంతో భాసింపడు. పుట్టింట్లో తన తండ్రిని తన చుట్టూ తిప్పుకున్న

దేవయాని, అంతఃపురంలో యయాతిని కూడా తన చుట్టూ రంగుల రాట్నంలా తిప్పుకోవాలనే ప్రయత్నం చేసింది. భర్తకు తనకు తాను సమర్పించుకోవటానికి బదులు భర్తయే తనకు సమర్పితం కావాలని కోరుకుంటుంది. పరస్పరానురాగబద్ధమైన ప్రణయంగా కాక దేవయాని అహంకారాగ్నికి ఆహుతి అర్పిస్తున్న సవనక్రియగా యయాతి సంసారాన్ని మార్చివేసింది. యయాతితో కలిసిఉన్న అనుక్షణం దేవయాని తాను శుక్రాచార్యుని పుత్రికనని జ్ఞాపకం చేస్తున్నట్లుండేది. ఆమెపట్ల అపరాధం జరిగితే పైన శుక్రాచార్యుడు ఉన్నాడని భయపెడుతున్నట్లుగా ఉండేది. అభిజాత్యంరీత్యా కూడా యయాతికంటె తానే ఉన్నతమైనదానినని జాత్యహంకారాన్ని ప్రదర్శించుకుంటుండేది.

గార్హస్థ్య ధర్మం సతీపతుల అద్వైత ప్రణయ సిద్ధికి ఫలరూపం కావాలి కాని అహంకారాల అనంత సంఘర్షణలకు రణరంగం కారాదు. ఒకరిలో ఒకరు కరిగి జాలువారుతున్నట్లు ఉండాలి కాని ఒకరికై ఒకరు జాగరణ చేస్తున్నట్లు ఉండకూడదు. దేవయాని గార్హస్థ్య ధర్మం ఉండకూడని విధంగా సాగింది. అందువల్ల కొడుకులు పుట్టినా, ధర్మం క్రమంగా కొడిగట్టడం మొదలయ్యింది. యయాతికి ఆత్మతృప్తి లేదు. సంసారం వల్ల ఏ అమృతాన్ని కోరుకున్నాడో అది అతనికి లభించలేదు. అతని గార్హస్థ్య ధర్మంలో దేవయాని బడబాగ్నిలా ప్రజ్వలించింది. క్రమంగా మృతిచెందుతున్న మానసిక గార్హస్థ్య ధర్మం యయాతిలో మరలా పునర్జీవింపచేసిన శక్తి శర్మిష్ఠ.

శర్మిష్ఠ యౌవనవతి అయింది. అనన్య సామాన్యమైన సౌందర్యంతో వెలిగిపోతోంది. ఆ వయసులో పతిని పొంది సుతులను పడసి సుఖించాలని ప్రతి యువతీ కోరుకుంటుంది. అమెకు అంతరాంతరాలలో అటువంటి గాఢమైన అనురాగం ఉండేది. దేవయాని ఏవిధంగా యయాతిని కోరి వరించి సాధించుకున్నదో అలాగే తానూ ఆ మహారాజును పొందాలని ఆశపడుతూ ఉండేది. అదృష్టవశాత్తు ఒకనాడు యయాతి అశోక వన విహారానికి ఆ వైపు వచ్చాడు. ఒంటరిగా ఉన్న శర్మిష్ఠను చూశాడు. అమెయందు ప్రసన్నచిత్తుడయ్యాడు. ఆమె వినయ సంభ్రమాలతో రాజుకు నమస్కరించింది. తగిన సమయం దొరికిందని ఆ రాజుతో ఇలా మాట్లాడింది:

*'నీలగళోపమాన కమనీయ గుణోన్నతిఁ జెప్పఁ జాలు న*
*న్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవు గాన నాకునుం*
*బోలఁగ భర్త వీవ యిది భూనుత ధర్మపథంబు నిక్కువం*
*బాలును దాసియున్ సుతుఁడు నన్నవి వాయని ధర్మముల్ మహిన్.'*

(-ఆది. 3. 174.)

" ఆ దేవయానిని పరిగ్రహించినపుడే ఆమెకు అరణంగా వచ్చిన నేను కూడా నీకు పరిగ్రహయోగ్యురాలనే కాబట్టే నీవు కరుణించి నన్ను కూడా మీ సతిగా స్వీకరించు" మని ప్రార్థించింది.

యయాతి శుక్రాచార్యుడు విధించిన నియమాన్ని పేర్కొంటూ " ఆ మహాముని మాటలకు నేనంగీకరించాను. ఇప్పుడు నేను అబద్ధమాడలేను" అన్నాడు శర్మిష్ఠతో. అప్పుడు శర్మిష్ఠ ఒక ఆపద్ధర్మాన్ని జ్ఞాపకం చేసింది. "ప్రాణం మీదకు వచ్చినపుడు, సర్వసంపద అపహరింపబడేటప్పుడు, విప్రవధ జరిగేటప్పుడు, వధూ జన సంగమ సమయంలో, వివాహ సమయాల్లో అసత్యమాడినా, ఆదోషముండదని ముని వచన ప్రమాణం ఉంది. నీవు వివాహ సమయంలో ఈ నియమానికి అంగీకరించావు కాబట్టి నీకు అసత్యదోషం కలుగదు' అని నచ్చచెప్పింది. యయాతి శర్మిష్ఠకు అనుకూలుడై ఆమె అభిమతాన్ని అంగీకరించాడు. అతని వల్ల ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. దేవయానికి ఆసంగతి తెలిసి, శర్మిష్ఠ దగ్గరకు వచ్చి సంతాన లబ్ధికి కారణం అడిగింది. శర్మిష్ఠ, ఒక మహాముని వరం వల్ల పుత్రుడు జన్మించాడని పేర్కొన్నది. దేవయాని నిజ నివాసానికి వెళ్ళిపోయింది. ఆ తరువాత యయాతి శర్మిష్ఠ యందు అనురక్తుడై వ్యవహరించాడు. వారిద్దరికీ ముగ్గురు కొడుకులు పుట్టారు. ద్రుహ్యుడు, అనువు, పురుడు - వారి పేర్లు.

ఒకనాడు ఆ ముగ్గురు కొడుకులు కలిసి త్రేలాగ్నుల్లాగా ఆడుకుంటున్నారు. ఆ సమీపంలో యయాతి మహారాజు కూర్చున్నాడు. దేవయాని ఆ ప్రదేశానికి వచ్చింది. యయాతి ప్రతిరూపాలుగా ఉన్న ఆ కుమారులను చూచింది. వారెవ్వరని యయాతిని ప్రశ్నించింది. అతడు మారు మాట్లాడలేదు. దేవయాని ఆ బిడ్డలను అడిగింది. శర్మిష్ఠా, యయాతులు తమ తల్లిదండ్రులని చెప్పారు. తనకు తెలియకుండ యయాతి శర్మష్ఠ వల్ల సంతానాన్ని పొందటం తెలుసుకుని కోప దుఃఖతాడితయై శుక్రాచార్యుని ఆశ్రమానికి హుటాహుటిగా బయలుదేరింది. తండ్రి పాదాల మీదపడి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. యయాతి కూడా ఆమె వెంట శుక్రాచార్యుని ఆశ్రమానికి చేరుకున్నాడు. దేవయాని గద్గద కంఠంతో, ఇచ్చిన మాటను తప్పి యయాతి శర్మిష్ఠ యందు ముగ్గురు కొడుకులను పొందిన కథనంతా తండ్రికి వివరించి, యయాతి తనకు తీరని అవమానం చేశాడని మొరపెట్టుకున్నది. శుక్రుడు యయాతి మాటను వినే ఓపికను గాని, తీరికనుగాని ప్రకటించలేదు. తన ప్రియమైన పుత్రికకు యౌవన గర్వంతో రాగాంధుడై యయాతి అప్రియం చేశాడు కాబట్టి. అతడు జరాభార పీడితుడు కావాలని శపించాడు.

యయాతి వినయంతో ఇలా అన్నాడు: "ఋతుమతి అయి పుత్రార్థం పతిని కోరితే

భార్యకు ప్రతికూలుడై ఋతు విఫలత్వం చేస్తే అతనికి భ్రూణహత్యాదోషం వస్తుందని పండితులంటారు. దానికి భయపడి శర్మిష్ఠా ప్రార్థనాన్ని అంగీకరించి, క్రమంగా ఆమె యందు సంతానాన్ని పొందాను. దీనికి మీ వంటి దివ్య మునీంద్రులు కోపగించటం, శపించటం న్యాయమా? నాకు దేవయాని యందు కూడా విషయోప భోగ విరక్తి ఇంకా కలుగ లేదు. మీ శాపం వల్ల కలిగే జరాభారం నాకే కాదు, మీ కుమార్తెకు కూడా దుఃఖ దాయకమే. కాబట్టి ఈ శాపాన్ని మీరు నివారించాలి" అని ప్రార్థించాడు.

శుక్రుడు యయాతి ప్రార్థనకు కరిగిపోయాడు. శాపోపసంహారాన్ని సూచించాడు. శాపం వల్ల కలిగిన జరాభారాన్ని యయాతి కొడుకుల్లో ఎవరైనా ధరిస్తే, అతని యౌవనాన్ని గ్రహించి యయాతి విషయోప భోగాల్ని, రాజసుఖాన్ని పొందవచ్చునని భోగ తృప్తిని పొందిన తరువాత యయాతి, జరాభారాన్ని తీసుకుని తన కొడుకు యౌవనాన్ని తిరిగి ఇవ్వవచ్చునని, యయాతి ముసలితనం అలా భరించిన పుత్రుడు ఆయన తరువాత రాజ్యానికి అర్హుడౌతాడని, వంశకర్త కూడా అవుతాడని శుక్రుడు అదేశించాడు. యయాతి దేవయాని సహితుడై తన పురానికి తిరిగివచ్చాడు.

శుక్రుని శాపం వర్తించింది. యయాతి జరభారాన్ని తాల్చాడు. కొడుకుల్ని పిలిపించి క్రమంగా అందర్ని జరాభారాన్ని తీసుకుని యౌవనాన్ని ఇమ్మని అడిగాడు. ఒక్క పురుడు తప్ప మిగతావారంతా ముక్తకంఠంతో యయాతి కోర్కెను త్రోసిరాజన్నారు. విధివశాత్తు కలిగిన రోగాన్ని కాని, ముసలితనాన్ని కాని ఎవరైనా భరిస్తారు కాని, తెలిసి తెలిసి ఎవరైనా జరాభారాన్ని తలమీద వేసుకుంటారా? తల నెరసిన సాక్షాత్తు మన్మథుణ్ణైనా తరుణులు దరికి చేరనివ్వరు. ముసలితనంతో కృంగిపోయిన సాక్షాత్తు కుబేరుణ్ణైనా అభీష్టభోగాలకు బాహ్యునిగానే భావిస్తారు" అని తండ్రి మాటను మొదటి నలుగురి కొడుకులు తిరస్కరించారు. అందుకు యయాతికి కోపం వచ్చింది. యదువంశం వారు రాజ్యానికి అయోగ్యులని శపించాడు. తుర్వసు వంశం వారు ధర్మాధర్మ విచక్షణా రహితులైన కిరాతకులకు రాజులవుతారని శపించాడు. ద్రుహ్యు వంశంవారిని అరణ్య ప్రదేశాలకు రాజులయ్యేటట్లు శపించాడు. అనువంశం వారిని అల్పాయుష్కులుగా తనువు చాలించేటట్లు శపించాడు.

## వంశకర్త పూరు మహారాజు

చివరకు శర్మిష్ఠ మూడవ కొడుకు పూరుడు తండ్రిని దర్శించాడు. తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవాలని కీర్తించాడు. తనువిచ్చిన తల్లి దండ్రులకు తనువిచ్చుకోవడం తనయుల సుకృతమని పేర్కొన్నాడు. తన యౌవనాన్ని తండ్రికోసం త్యాగమూర్తిగా దానం చేశాడు.

యయాతి అతని యౌవనంతో సహస్రవర్షాలు అభిమత సుఖాలు అనుభవించి తృప్తుడై, పురుయౌవనాన్ని తిరిగి ఇచ్చి తన జరాభారాన్ని తాను స్వీకరించి పురునకు పట్టాభిషేకం చేసి వంశకర్తగా వెలుగొందే మహత్తును కల్పించాడు. పురుని త్యాగమే యయాతి గార్హస్థ్య ధర్మానికీ, గార్హస్థ్య దర్మంలో ముఖ్యమైన పుత్ర ధర్మానికీ త్యాగగుణం వల్ల కలిగే అమృతత్వసిద్ధికి మూలకారణమౌతుందని స్పష్టమౌతుంది.

'త్యాగేనైకేనైవ అమృతత్వ మానశుః-' అనే ఉపనిషత్ సూక్తికి పురు మహారాజు చరిత్రం ఉన్నతమైన ఉదాహరణం. మానవులు గార్హస్థ్య ధర్మంలో త్యాగం వల్లనే అమృతత్వాన్ని సాధించగలుగుతారన్నది వంశకర్తయైన పురుడు ప్రబోధిస్తున్నాడు.

గార్హస్థ్య ధర్మ పీఠానికి నాలుగు పాదాలున్నాయి. ఒకటి - యజమాని లేదా గృహస్థుడు; రెండు - ఇల్లాలు లేదా గృహిణి. మూడు - పుత్రుడు లేదా సంతానం; నాలుగు- ధర్మం ఇది సత్యధర్మ త్యాగ శాంతి ప్రేమ అహింసాది భేదాలతో ఎన్నో రకాలుగా భాసించవచ్చు. వాటన్నింటిలో త్యాగ రూప ధర్మం వలన అమృతత్వ సిద్ధి సత్వరంగా లభిస్తుంది.

యయాతి కథలో మానవలోకం అమృతత్వాన్ని గురించి దర్శింప వలసిన మార్గం సూచింపబడింది. దానవులకు శరీరం ముఖ్యం; చనిపోయిన శరీరం మరలా బ్రతకటం ముఖ్యం. బ్రతకటం మీద ఉన్న ఊనికి ఎలా బ్రతకాలి అన్న జీవన విధానం మీద లేదు అసురలకు. మానవునికి ముఖ్యం ఎలా చచ్చాడన్నది కాదు ఎలా జీవితాన్ని సాగించాడన్నది. మనిషి చనిపోయినా అతణ్ణి బ్రతికించేది దర్మం, అందులోనూ శ్రేష్ఠమైన ధర్మం త్యాగం. అందువలన మానవ జీవితంలో మరణాన్ని భౌతికంగా జయించే పద్ధతి కంటె ధార్మికంగా జయించే పద్ధతికి ప్రాముఖ్యం ఏర్పడింది.

మానవ జీవితంలో మృత్యు వొక అనివార్య వాస్తవం. కాని, చనిపోయే దేహం నిర్వహించే ధర్మం అజరామరం. దానిని సాధించటమే మానవ జీవన గమ్యం. దేవయాని వివాహ ధర్మాన్ని భౌతిక ధర్మంగా గ్రహించింది. అందువలన ఆమె శరీర సుఖం భర్త ముసలితనంతో మృగ్యమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఆమె తన గృహాన్ని అహంకారంతో కూలగొట్టుకున్నది; కోపంతో బుగ్గిచేసుకున్నది. ఆమెకు స్వార్థం తప్ప పరార్థం లేదు. పరమార్థం ఆమెకు తెలియదు. ఇటువంటి ప్రవృత్తి గల యిల్లాలు గార్హస్థ్య ధర్మాన్ని చంపగలదు.

అయితే, శర్మిష్ఠ ప్రేమతో, తనను తాను భర్తకు సమర్పించుకొనటంతో, ధర్మంతో

గార్హస్థ్య ధర్మానికి మరలా ప్రాణం పోసింది. యయాతి దేవయాని వలన యజమానిగా మృతుడయ్యాడు; శర్మిష్ఠ వలన మరల యజమానిగా పునరుజ్జీవితుడైనాడు. గృహిణీత్వం దేవయాని వలన ప్రాణచైతన్యాన్ని కోల్పోయింది; శర్మిష్ఠవలన పంచప్రాణాలతో పల్లవించింది. దేవయాని కొడుకులు తల్లిదండ్రులపట్ల భౌతికధర్మం పచరించేవారు. శర్మిష్ఠ కొడుకులలో చివరివాడు పుత్రధర్మాన్ని రక్షించినవాడు. గార్హస్థ్య ధర్మంలో మూడవ పాదం సంతానం. అది యదువు మొదలైనవారిలో నిర్వీర్యమై పోయింది; పురునిలో పునర్జన్మ ఎత్తింది. పురుని ధర్మం త్యాగం. త్యాగమే యయాతి గార్హస్థ్య ధర్మానికి అమృతత్వసిద్ధి నిచ్చింది. దానికి ఫలంగా పురునికి సామ్రాజ్యంతోపాటు, వంశకర్త అయ్యే యోగ్యత కలిగింది.

## వంశకర్త యైన భరతుని వృత్తాంతం:

భరతుడు శకుంతలా దుష్యంతుల పుత్రుడు. యయాతి కథలో గార్హస్థ్య ధర్మం ఒక గృహిణి చేత మూర్ఛితమైతే, మరొక గృహిణి పునరుద్ధరించిన కథ చిత్రింపబడింది. అందుకు యయాతి కూడా ఒక బలమైన హేతువైనాడు; దోహదశక్తిగా నిలిచాడు. వారిరువురి ప్రయత్నాలు విఫలమైనప్పుడు వారి గార్హస్థ్య ధర్మాన్ని నిలిపింది పుత్రుడైన పూరుడు.

దుష్యంతుని చరిత్రం యయాతి చరిత్రంకంటె ఒక అడుగు ముందుకు వేసింది. దుష్యంతుడు గాంధర్వ వివాహ ధర్మంతో శకుంతలను వివాహమాడాడు. ఆమెను అంతఃపురానికి తీసికొనిపోతానని మాట ఇచ్చాడు. కాని, మాట తప్పాడు. శకుంతల భర్త ఎదుటకు పుత్రునితో కలిసి వచ్చింది. అత డామెను భార్యగా గుర్తించలేదు. దానితో వివాహ ధర్మంతో పాటు, సత్యం కూడా కుప్పకూలిపోయింది. శకుంతల గార్హస్థ్య ధర్మంలో యజమానికి, భార్యకు, సుతునికి, సత్యానికి ఉన్న ప్రాధాన్యాన్ని భర్తకు నిండుకొలువులో వివరించి చెప్పింది. దుష్యంతుడు ఆమె మాటలను పెడచెవిని పెట్టాడు. అప్పుడు అకాశవాణి నిజం బైట పెట్టింది. అపవాద భీతితో అబద్ధమాడానని దుష్యంతుడు నిండుసభలో అంగీకరించి, శకుంతలను పట్టమహిషిగా స్వీకరించి భరతునికి యౌవరాజ్యాభిషేకం చేశాడు.

గార్హస్థ్య ధర్మం నాలుగు పాదాలతో నడవాలంటే ఆ ధర్మాన్ని నిర్వహించే వారికి అంతఃకరణ శుద్ధి ఉండాలని దుష్యంతుని కథ బోధిస్తుంది. చిత్తశుద్ధి లేకపోతే సత్యం ప్రకటితం కాదు; సత్యం నిలువకపోతే సంసార వ్యవస్థ అస్తవ్యస్త మౌతుంది. ఇల్లాలికి అన్యాయం జరుగుతుంది; పుత్రునికి అస్తిత్వం లేకుండా పోతుంది. యజమాని అసత్యదోషంతో

అంతరించి పోతాడు. కాబట్టి గార్హస్థ్య ధర్మానికి అమృతత్వం కలిగించేది సత్య ధర్మ నిరతి అన్న సత్యాన్ని సర్వాంగ సమృద్ధంగా చాటే ఉపాఖ్యానం దుష్యంతోపాఖ్యానం.

దుష్యంత మహారాజు కథను దుష్యంతోపాఖ్యాన మనీ, శకుంతలోపాఖ్యాన మనీ పిలుస్తూ ఉంటారు. ఆ రెండు పేర్లూ ఆ కథకు సార్థకమే.

ఆ కథలో ఆ రెండు పాత్రలకూ ప్రాధాన్యం ఉంది. దుష్యంతుడు తాకిక ధర్మానికి ప్రాతినిధ్యం వహిస్తాడు. శకుంతల ఆత్మ ధర్మానికి ప్రతీకగా నిలబడుతుంది. అతడు ఒక అవస్థలో చిక్కుకున్న వ్యక్తి. స్వీయ ధర్మాన్ని రక్షించుకోటానికి యత్నిస్తాడు. ఆమె గార్హస్థ్య వ్యవస్థా ధర్మాన్ని పరీక్షించుకోటానికి ప్రయత్నిస్తుంది. వ్యక్తి ధర్మం లోకాపవాద భీతితో వ్యవస్థా ధర్మాన్ని గార్హస్థ్య ధర్మాన్ని నిరాకరిస్తే ఏర్పడే ధర్మ సంకట స్థితిని చిత్రించేది ఈ కథ. ధర్మ సంకటాన్ని కలిగించేది లౌకిక వ్యవస్థకు అధిపతి అయిన దుష్యంత మహారాజు. ధర్మస్థితి నిలుపుకొనేది "ధర్మోరక్షతి రక్షితః' అనే న్యాయాన్ని కాపాడిన శకుంతల.

ఈ కథలోనిది ధర్మ సమస్య. రాజు వర్ణాశ్రమ ధర్మ రక్షకుడు. క్షత్రియ ధర్మోచితంగా రాజ్యాన్ని బాహుబలంతో పాలిస్తున్నాడు. అతడు వేటకు పోవటం కూడా క్షత్రియ ధర్మమే. అరణ్యంలో మహర్షిని దర్శించడానికి ఒంటరిగా వెళ్ళటం అతని రాజోచిత ధర్మమే. ఆశ్రమంలో శకుంతల కనబడుతుంది. ఆమె యందు అతని మనసు లగ్నమౌతుంది. ఆమె ముని కన్య అయితే తనకు వివాహయోగ్యురాలు కాదు కదా అని భావించడం కూడా అతని వర్ణ ధర్మ రక్షణ చిత్త వృత్తియే. శకుంతల మేనకా విశ్వామిత్రుల పుత్రిక అని తెలిసిన తరువాత ఆమెను వివాహమాడ నిశ్చయించటం కూడా వర్ణ ధర్మమే. గాంధర్వ విధిని శకుంతలను చేపట్టటం కూడా క్షత్రియ ధర్మమే. ఆమెకు పుట్టిన పుత్రునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేస్తానని అతడు మాట ఇవ్వటం కూడా క్షత్రియ ధర్మమే. అయితే, గాంధర్వ వివాహంలో కర్తలు ఫల భోక్తలు భార్యాభర్తలే.

దుష్యంతుడు మొదట వ్యక్తి, ఆపై రాజు, ఆ తరువాత శకుంతలాపతి, ఆపై ఆమె కుమారుని వారసునిగా ప్రకటించిన తండ్రి. ఈ నాలుగు అవస్థల నడుమ సంఘర్షణ రాకుండ చూచుకోవసిన బాధ్యత ఆయన కున్నది. గాంధర్వ వివాహ ధర్మాన్ని రక్షించి శకుంతల వివాహాన్ని రహస్యంగా, అమంత్రకంగా చేసుకొన్న సత్యాన్ని ప్రజల ముందు, అమాత్యుల ముందు ప్రకటించవలసిన బాధ్యత అతనికున్నది. కాని, లోకాపవాద భీతి చేత ఆ ధర్మాన్ని నిర్వహించలేక పోయాడు. అతని వర్తనం ధర్మ సంకటాన్ని, ధర్మగ్లానిని కలిగించే స్థితిని కల్పించింది. దానిని శకుంతల భక్తి వారించింది. ఆకాశవాణి సత్యాన్ని ప్రకటించి, ధర్మాన్ని రక్షించి, గార్హస్థ్య దర్మ వ్యవస్థను భూతలం మీద నిలిపింది.

ఈ ఉపాఖ్యానతత్వం లౌకిక ధర్మం, ఆత్మ ధర్మాన్ని ఆదరించినప్పుడే సత్యం నిలుస్తుందని బోధిస్తున్నది. ఆ మహార్థాన్ని చెప్పడానికి అనువుగా కథ నడుస్తుంది. ఎలాగంటే -

(అ) కణ్వ మహర్షి ఆశ్రమంలో లేని తరుణంలోనే దుష్యంతుడు శకుంతలను గాంధర్వ విధిని వివాహమాడి, ఆ తరువాత అమాత్యులను మహర్షివద్దకు పంపి ఆమెను అంతఃపురానికి రప్పించుకొంటానని ఊరట పలికి వెడలిపోయి మిన్నకున్నాడు. దుష్యంతుడు మాట నిలువ బెట్టుకొనే కనీస ప్రయత్నం చేయలేదు. అతడు వంచనకు పాల్పడ్డాడని స్పష్టమౌతుంది.

(ఆ) కణ్వుడు జరిగినదంతా దివ్యదృష్టితో చూచి వివాహం ధర్మబద్ధమైనదని అంగీకరించి, కూతురు కోరిన వరాలిచ్చి ఆమె యోగక్షేమాలను చూస్తాడు. వంశకర్త అయిన భరతుడు పుట్టి, సర్వదమనుడుగా పెరిగి, యౌవరాజ్య పట్టాభిషేక యోగ్యత వచ్చేంతవరకు కణ్వమహర్షి ఆశ్రమంలో శిక్షణ పొందుతాడు. కణ్వుడు దాదాపు రెండు దశాబ్దాలు నిశ్శబ్దంగా ఉండి చేసిన పని అపూర్వం. దుష్యంతుని వంటి బలం భరతుడు పుట్టుకతో తెచ్చుకొన్న గుణం. కాని, జీవితమంతా యజ్ఞదీక్షలతో గడిపే వంశకర్త సంస్కారం భరతుడు కణ్వమహర్షి శిక్షణలో పెంచుకొన్న గుణం. దుష్యంతుని వారసునిలో లౌకిక ధర్మం కంటె ఆత్మ ధర్మం బలంగా ప్రతిష్ఠాపింపబడింది.

(ఇ) ఈ ఉపఖ్యానంలో భరతుడు నిశ్శబ్ద పాత్ర. తల్లితో కలసి హస్తినాపురం చేరి నిండు సభలో దుష్యంతుని దర్శిస్తాడు. తల్లి దండ్రుల నడుమ జరిగిన సంభాషణ వింటాడు. తల్లిని తండ్రి నిరాకరిస్తున్నా, తనను పుత్రునిగా మన్నించక పోయినా భరతుడు కోపాన్ని ప్రకటించడు; పల్లెత్తి మాటాడడు. తనకు రావలసిన యౌవరాజ్య పట్టాభిషేకం సంగతి పట్టించుకోడు. తల్లి వెంట ఆవు వెంట లేగదూడలాగా నడుస్తాడు. ఈ సహనం, ఈ శాంతి కణ్వ సంస్కృతి; విరుద్ధ సత్త్వాల నడుమ గూడ స్నేహ శాంతులను దర్శించగల ఆశ్రమ సంస్కృతి. నన్నయ ఈ అంశాలన్నీ చెప్పకుండానే చెప్పినట్లు కథ నడిపాడు.

## దుష్యంత మహారాజు పాత్రను నన్నయ పోషించిన విధం

(1) చంద్రవంశంలో పురుని తరువాత వంశకర్తకాగల భరతుని కన్న దండ్రి దుష్యంతుడు. అతని జీవిత చరిత్రలో ప్రధాన గుణంగా కనపడేది అనంతసాహసం. దుష్యంతుడు బాల్యంలోనే అనన్య సాధారణ పరాక్రమవంతుడు, సాహసోపేతుడు, సింహశరభాది

క్రూర మృగాలను లేడి పిల్లలను పట్టినట్లు పట్టి ఆడించేవాడు. యౌవనంలో పర్వతాలను పెరికి పర్వతాలపై వైచి బల సాహసాలను ప్రదర్శించేవాడు. సింహాసన మెక్కే నాటికి అతడు అనంతసత్త్వుడు. భూవలయాన్ని భుజ బలంతో సాధించి చక్రవర్తి అయినాడు. మహారణ్య భూముల్ని సైతం నిష్కంటకంగా పాలించాడు. పరాక్రమంతో పరిపాలన చేస్తూ వంశపారంపర్యంగా వస్తున్న ధర్మమార్గాన్ని పాటించాడు. అతని రాజ్యంలో ప్రజలు శాంతి సౌఖ్యాల ననుభవించారు.

దుష్యంతు డొకనాడు వేటకు బయలుదేరాడు. అరణ్యమనే మహాసముద్రాన్ని స్వీయబలమనే మందర పర్వతంతో కలచివేశాడు. వన్య మృగాలన్నీ సంక్షోభం చెందాయి. వేటలో సైతం ఆ రాజు మహా సాహసాన్ని ప్రకటించాడు. మృగాలను అపారంగా చంపాడు. అతని రథ వేగాన్ని సైనికులు అనుసరించలేక అలసిపోయారు. దుష్యంతుడు ఒక పుణ్య నదీ తీరంలో గల వనంలో విశ్రాంతికి ఆగాడు.

అతడు సహజంగా సాహసి కాబట్టి అంతటితో ఆగలేదు. ఆ వనంలో ప్రవేశించాడు. శకుంతలను దర్శించాడు. ఆమెపై మనసు లగ్నం కావటంతో సాహసించి ఆమె జన్మ వృత్తాంతం అడిగాడు. ఆమె మేనకా విశ్వామిత్రుల పుత్రికయని తెలిసిన తరువాత అదే సాహసంతో ఆమెను వివాహమాడు మని కోరాడు. కణ్వ మహర్షి వనంలో నుండి తిరిగి వచ్చేంత వరకు ఆగుమనీ, ఆతడు సమర్పిస్తే స్వీకరించుమనీ శకుంతల మనవి చేసింది. దుష్యంతుడు అప్పుడు కూడా సాహసాన్నే ప్రదర్శించాడు. గాంధర్వ వివాహానికి ఆమెను ఒప్పించాడు; ఏకాంతంగా ఆమెను వివాహమాడాడు. ఆమెను పొందాడు. కణ్వమహర్షి తిరిగి రాక పూర్వమే హస్తినకు తిరిగి బయలుదేరి వెళ్లాడు. కణ్వాశ్రమంలో అతని ప్రవర్తనం క్షత్రియ వర్ణ ధర్మోచితంగా ఉండవచ్చును. కాని అందులో ఎంతో సాహసం ఇమిడి ఉంది.

తన వలన శకుంతలకు కలిగిన పుత్రునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేస్తాననీ వాగ్దానం చేయటంలోనూ, ఆమెను అంతఃపురానికి తీసికొని పోవటానికి పురోహితామాత్యాదులను పంపుతానని మాట యివ్వటంలోనూ, హస్తినాపురం చేరిన తరువాత శకుంతల వివాహ విషయాన్ని మంత్రులకు, సభికులకు చెప్పకుండ రహస్యంగా దాచి ఉంచటం లోనూ, లోకాపవాద భీతితో భార్యాపుత్రులను స్వీకరించకుండా నిరాకరించడంలోనూ ధర్మ సంకటాన్ని కలిగించే సాహసం చేశాడు దుష్యంతుడు. అతని సాహసమే ధర్మ సంఘర్షణకు కారణమయింది.

(2) దుష్యంతుని సాహసానికి అతని సౌందర్యం, అతని సంస్కారం వన్నె చేకూర్చాయి. కణ్వాశ్రమ దర్శన ఘట్టంలో తపోవనాల పట్ల అతడు ప్రదర్శించిన భక్తి వినయాలకు ప్రకృతి కూడా పులకించి పూలుచల్లి దీవించింది. శకుంతలను అతని సౌందర్యం ఆకర్షించింది; అత డేమి చెపితే దాని నంగీకరించేటట్లు ఆమెను వశం చేసుకొన్నది. ఆమె మునికన్యయా కాదా అని అడిగిన మాటలు అతని సంస్కారాన్ని తెలుపుతున్నాయి. ప్రియురా లడిగిన వరాన్ని వెంటనే యిచ్చిన అతని ఔదార్యం శకుంతలను ప్రణయసూత్రంతో కట్టి వేసింది. మూలంలో సౌందర్యం ఉండగా తెలుగులో నన్నయ దుష్యంతునికి సంస్కారాన్ని కూడా జోడించాడు. కాళిదాసుని అభిజ్ఞాన శకుంతల నాయకుని ఉదాత్త లక్షణాలు కొన్ని ఆంధ్ర భారత దుష్యంతునికి నన్నయ అలవరచి పుణ్యం కట్టుకొన్నాడు.

3) దుష్యంతుడు స్వభావతః ధీరోదాత్తుడే. కాని, ధర్మాన్ని లౌకిక వ్యవస్థగా దర్శించి లౌకిక స్థాయిలో రక్షించటానికి పూనుకొన్న రాజు. క్షత్రియుడు క్షత్రియ కన్యనే వివాహమాడాలనీ, గాంధర్వ వివాహ విధి వారి వర్ణ ధర్మమనీ తెలిసి, వివాహమాడిన వాడు - తన వివాహ విషయం ప్రజలకు ముందుగా ప్రకటించలేకపోయాడు. ఆత్మ ధర్మాన్ని పాటించే రాజు (శ్రీరామునిలాంటి వాడు), అయినట్లయితే నిర్భయంగా చెప్పగలిగేవాడు. సాక్ష్యాధారా లనే లౌకిక వ్యవస్థ మీద ఆధారపడే రాజు ఆ పని చేయలేడు. దుష్యంతుడు ఎంత సాహసికుడో, ఆత్మ ధర్మ నిర్వహణంలో అంత పిరికివాడై పోయాడు అతని ప్రవర్తన ఇతరులచే వంచకునిగా భావించేటట్లు చేసింది. అతడు ధర్మాన్ని ప్రకటంగా రక్షించలేక పోయాడు. కాని, శకుంతల రక్షించింది. ఆమెవలన అతడు రక్షింపబడ్డాడు.

(4) దుష్యంతుడు దుష్ట పాత్రగా పైకి కనపడుతున్నా కథాంతంలో శిష్టపాత్రగా పరిత లంగీకరించేటట్లు నన్నయ చిత్రించాడు.

"అన్యు లెఱుఁగమిఁజేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నందఱ కిప్పు డెఱుఁగఁ
జెప్పె నాకాశవాణి యచ్చెరువు గాఁగ" (ఆది పర్వం.4.108)

అది దుష్యంతుని వివేక భూషణం. లౌకికవ్యవస్థలో గాంధర్వ వివాహ నిర్వాణ విధిని ఆత్మధర్మ నిర్వాణ సాహసం లేని వారు నిర్వహించటం కష్టం. ప్రజలకు ఆదర్శం కాగలిగిన వారి రహస్య వివాహాలను రహస్యంగా ఉంచటం ప్రమాదం. అది

లోకనిందకు కారణం కూడా కావచ్చు. సంస్కారవంతులు ఈ సమస్యను పరిష్కరించుకొనలేక ఒక్కొక్కసారి సంసారాలనే దూరం చేసుకోవలసి వస్తుంది. వ్యవస్థలో ఈ దోషాన్ని వ్యక్తి అప్రమత్తంగా ఆత్మ ధర్మంగా భావించి నిపుణంగా తొలగించుకోవాలి. అటువంటి ఆశకే ఆకాశవాణి ప్రతీక. ఎన్నిఇబ్బందులు వచ్చినా వివాహ ధర్మాన్ని రక్షించుకొనే వారికి దైవం అనుకూలిస్తుందన్న విశ్వాసాన్ని ఈ ఉపాఖ్యానం కలిగిస్తుంది. దుష్యంతుని సంసారం కుదుట పడిందంటే పఠితలు గార్హస్థ్య ధర్మం రక్షింప బడిందని ఆనందించి, ఆ అనుభూతికి కారకుడైన దుష్యంతుని నాయకునిగా మనస్సుల్లో గౌరవిస్తారు.

దుష్యంతుడు ఆదర్శ నాయకుడు స్వయంగా కాక పోవచ్చును; ఆదర్శ నాయికకు భర్తగా ఆ గౌరవాన్ని పొందుతున్నాడు. లౌకిక జీవితంలో ఎంత సాహసం కావాలో ఆత్మ ధర్మాచరణంలో కూడా అంత సాహసం కావాలని మనకు తెలియ చెప్పుతూ తాను నేర్చుకున్నందుకు మన సహానుభూతిని పొందుతున్నాడు. ఆకాశవాణి సత్యధర్మ ప్రతీకాత్మకతకు ప్రతినిధిగా భావిస్తే రాజు అపవాదభీతితో కాదంటున్నా ప్రజలు శకుంతలను, భరతుణ్ణి అతని భార్యా పుత్రులుగా అంతరంగంలో అంగీకరించారని వస్తు ధ్వని. అలా కథను అద్భుతంగా ముగింపు జేసినందుకు దుష్యంతునితో సహానుభూతిని పొందుతాము. నన్నయ కథాశిల్పం అటువంటిది!

## శంకుతల పాత్ర ప్రాధాన్యం

(1) దుష్యంత మహారాజు చరిత్రను శకుంతలోపాఖ్యానమని పిలిచే పరిపాటి ప్రచారంలో ఉంది. అంటే అది నాయికా ప్రాధాన్యమున్న కథ అన్నమాట. ఒక కథలోని కార్యశక్తిని ఎవరు ఆరంభించి ముందుకు తీసుకొని వెళ్ళి దాని ఫలాన్ని అనుభవిస్తారో వాడు నాయకుడు లేదా ఆమె అయితే నాయిక. ఈ ఉపాఖ్యానంలోని కథా బీజం దుష్యంతుడు శకుంతలను చూచి ప్రేమించటంగా కనపడుతున్నా శకుంతల వరం వివాహకార్యాన్ని ప్రారంభించిన బీజమౌతున్నది. ఈ కథలో దుష్యంతుడు భార్య నేలుకోవటం కంటె పుత్రుడైన భరతునికి పట్టాభిషేకం చేయటయే ఫలం. దానికి మూలం శకుంతల కోరిక. దానిని సాధించుకొనే యత్నమే ఈగాథ. కాబట్టి 'నయుత వృత్తం ఫలం ప్రాప్నోతి చ' అనే నాయక లక్షణం శకుంతల యందు సార్థక మౌతున్నది.

(2) శకుంతల ధీరురాలు, ఉదాత్తురాలు - కణ్వాశ్రమంలో ఒంటిగా ఉన్న... ము

దుష్యంతుని చూచి అతని సౌందర్యానికి లోలోన కరిగిపోయి అతని నే విధంగానైనా భర్తగా పొందాలని తలంచింది, కాని బయట పడలేదు. ఆమెకు గల ఆ అసక్తియే గాంధర్వ వివాహానికి అంగీకరింప జేసేటట్లు చేసింది. స్వీయ జన్మ వృత్తాంతాన్ని విన్నది విన్నట్లు చెప్పవలెనన్నా ఆమె ధీరురాలు అయి ఉండవలె. కన్నతల్లి దండ్రులను మరపించి పెంచిన తండ్రి వనంలో నుండి తిరిగి వచ్చే లోపల క్షత్రియో చితమైనప్పటికీ సాహసించి గాంధర్వ వివాహానికి అంగీకరించిందంటే ఆమె వర్తించిన తీరు ఉదాత్త సాహస గుణానికి గీటురాయి.

(3) శకుంతల సమయోచిత ప్రజ్ఞను ప్రదర్శింపగల ప్రతిభా మూర్తి. దుష్యంతు డతిథిగా వచ్చినప్పుడు సత్కారబాధ్యత లన్నింటిని సమర్థవంతంగా స్వీకరించింది. రాజున కిచ్చిన సమాధానాలలో భక్తి వినయ వివేకాలను ప్రదర్శించి ఉత్తమ సంస్కారవతిగా ప్రకాశించింది. రాజు తన వివాహమును గురించి అడిగినప్పుడు తన యోగ క్షేమం కంటె తన సంతాన భద్రతను ముందుగా దర్శించి పుత్రునికి యౌవ రాజ్య పట్టాభిషేకాన్ని వరంగా కోరింది. తల్లి దండ్రుల వలన తనకు ఏర్పడిన దయనీయ స్థితి తన సంతానానికి కలుగ కూడదని ఆమె ముందుగా జాగ్రత్త పడింది. కణ్వ మహర్షి సుముఖతను గమనించి " నా చిత్తం బెప్పుడు ధర్మువును తగిలి యుండునట్లును, నాకుద్భవిల్లెడు పుత్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్యబల సమన్వితుండును, వంశకర్తయుఁ" గావలెనని కోరింది. మంచి అవకాశాన్ని ఎప్పుడూ జార విడుచుకోని మనోజ్ఞమూర్తి శకుంతల.

(4) గార్హస్థ్యాశ్రమంలోని స్త్రీ వ్యక్తిత్వానికి సజీవ రూప కల్పన శకుంతల. గాంధర్వ వివాహ పద్ధతి ననుసరించి శకుంతల దుష్యంతుణ్ణి వివాహమాడింది. తాను కులసతి అయింది. కణ్వు డామె వివాహాన్ని మన్నించాడు. కణ్వాశ్రమ సంస్కృతిలో ఆమె కులసతివ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా సాధించింది. గార్హస్థ్య ధర్మానికి భార్య, భర్త, సంతానము, సత్యము అనేవి నాల్గు స్తంభాలుగా నిలబడాలని, వాటిమీద ఆ వ్యవస్థ పదిలంగా నిలవాలని ఆమె నేర్చుకున్నది. దానినే ఆచరించింది. దుష్యంతుని సభలో దానినే బోధించింది. భార్య 'గృహనీతి విద్యకు ఆచార్యకము' అనే సూక్తికి ఆమెయే ఆదర్శంగా నిలిచింది. సత్య ప్రాతిపదిక లేని సంసారం నిస్సారమని దుష్యంతుని వర్తనం ఋజువు చేసింది. ఆమె ఆశలు, ఆశయాలు కుప్పగూలిపోయే పరిస్థితి యేర్పడింది. కాని, ఆమె దైవభక్తురాలు కావటం చేత భగవంతునిపై భారం వేసి ప్రార్థించింది. ఆకాశవాణి నిజం చెప్పి ఆమె గార్హస్థ్య దర్మాన్ని నిలిపింది.

దుష్యంతుని చూచి అతని సౌందర్యానికి లోలోన కరిగిపోయి అతని నే విధంగానైనా భర్తగా పొందాలని తలంచింది, కాని బయట పడలేదు. ఆమెకు గల ఆ ఆసక్తియే గాంధర్వ వివాహానికి అంగీకరింప జేసేటట్లు చేసింది. స్వీయ జన్మ వృత్తాంతాన్ని విన్నది విన్నట్లు చెప్పవలెనన్నా ఆమె ధీరురాలు అయి ఉండవలె. కన్నతల్లి దండ్రులను మరపించి పెంచిన తండ్రి వనంలో నుండి తిరిగి వచ్చే లోపల క్షత్రియో చితమైనప్పటికీ సాహసించి గాంధర్వ వివాహానికి అంగీకరించిందంటే ఆమె వర్తించిన తీరు ఉదాత్త సాహస గుణానికి గీటురాయి.

(3) శకుంతల సమయోచిత ప్రజ్ఞను ప్రదర్శింపగల ప్రతిభా మూర్తి. దుష్యంతు డతిథిగా వచ్చినప్పుడు సత్కారబాధ్యత లన్నింటిని సమర్థవంతంగా స్వీకరించింది. రాజున కిచ్చిన సమాధానాలలో భక్తి వినయ వివేకాలను ప్రదర్శించి ఉత్తమ సంస్కారవతిగా ప్రకాశించింది. రాజు తన వివాహమును గురించి అడిగినప్పుడు తన యోగ క్షేమం కంటె తన సంతాన భద్రతను ముందుగా దర్శించి పుత్రునికి యౌవ రాజ్య పట్టాభిషేకాన్ని వరంగా కోరింది. తల్లి దండ్రుల వలన తనకు ఏర్పడిన దయనీయ స్థితి తన సంతానానికి కలుగ కూడదని ఆమె ముందుగా జాగ్రత్త పడింది. కణ్వ మహర్షి సుముఖతను గమనించి " నా చిత్తం బెప్పుడు ధర్మువును తగిలి యుండునట్లును, నాకుద్భవిల్లెడు పుత్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్యబల సమన్వతుండును, వంశకర్తయుఁ" గావలెనని కోరింది. మంచి అవకాశాన్ని ఎప్పుడూ జార విడుచుకోని మనోజ్ఞమూర్తి శకుంతల.

(4) గార్హస్థాశ్రమంలోని స్త్రీ వ్యక్తిత్వానికి సజీవ రూప కల్పన శకుంతల. గాంధర్వ వివాహ పద్ధతి ననుసరించి శకుంతల దుష్యంతుణ్ణి వివాహమాడింది. తాను కులసతి అయింది. కణ్వు డామె వివాహాన్ని మన్నించాడు. కణ్వాశ్రమ సంస్కృతిలో ఆమె కులసతివ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా సాధించింది. గార్హస్థ్య ధర్మానికి భార్య, భర్త, సంతానము, సత్యము అనేవి నాల్గు స్తంభాలుగా నిలబడాలని, వాటిమీద ఆ వ్యవస్థ పదిలంగా నిలవాలని ఆమె నేర్చుకున్నది. దానినే ఆచరించింది. దుష్యంతుని సభలో దానినే బోధించింది. భార్య 'గృహనీతి విద్యకు ఆచార్యకము' అనే సూక్తికి ఆమెయే ఆదర్శంగా నిలిచింది. సత్య ప్రాతిపదిక లేని సంసారం నిస్సారమని దుష్యంతుని వర్తనం ఋజువు చేసింది. ఆమె ఆశలు, ఆశయాలు కుప్పగూలిపోయే పరిస్థితి యేర్పడింది. కాని, ఆమె దైవభక్తురాలు కావటం చేత భగవంతునిపై భారం వేసి ప్రార్థించింది. ఆకాశవాణి నిజం చెప్పి ఆమె గార్హస్థ్య ధర్మాన్ని నిలిపింది.

ఆమెను కరుణతో పెంచాడు. ఆమె అదృష్టవంతురా లనిపించుకొన్నది. దుష్యంతు డామెను వివాహమాడాడు. వరమిచ్చాడు కాని, ఆమెను తన అంతఃపురానికి తీసికొని పోలేదు. మరల కణ్వుడే ఆమెను, ఆమె పుత్రుణ్ణి ఆదుకొన్నాడు. కణ్వాశ్రమం శకుంతలకు కల్పవృక్షచ్ఛాయ అయింది. హస్తినాపురంలో ప్రవేశించిన శకుంతల భర్తచేత పరిత్యజింపబడింది. మరల ఆమె పుట్టింటికి పోరాదు. పోలేదు. ఆమె నమ్మిన ధర్మమే ఆమెను కాపాడింది. 'ధర్మోరక్షతి రక్షితః'' అనే సూక్తికి శకుంతల జీవితం ఆదర్శం! ఆమె అక్షరాలా 'భరతమాత!'

## వంశకర్త భరతుడు

భరతుడు విశాల రాజ్యాన్ని పాలించాడు. అనేక యాగాలు చేసి భూరి దక్షిణలతో భూసురులను సంతోషపెట్టాడు. ఇది ఈ వంశకర్త విశిష్ట లక్షణం. ఈ గుణాన్ని ధర్మరాజు తన జీవితంలో పండించుకొన్నాడు. చక్రవర్తి చేయ గలిగిన రాజసూయ యాగాన్ని, అశ్వమేధ యాగాన్ని చేసి తన ప్రభుత్వాన్ని యజ్ఞదీక్షలతోనే గడిపాడు. లౌకిక ధర్మంలో కూడా ఆత్మధర్మం ఆవిష్కృతమయ్యేటట్లు. జీవిత యాత్ర సాగించి ఆదర్శుడైన - ఇతిహాస నాయకు డయ్యాడు. భరతుని శీలం ధర్మరాజులో ప్రతిఫలించింది. ఇది ధ్వనింప జేయటమే ఉపాఖ్యానానికీ, ఆఖ్యానానికీ ఉన్న సంబంధం.

చంద్రవంశంలో చంద్రునివలె ప్రకాశించినా మచ్చతో అపకీర్తికి పాలైన వాడు దుష్యంతుడు. అతని మచ్చను తన ఆశ్రమ ధర్మ శీలంతో కడిగి వైచి, ఉదాత్తునిగా నిర్మల కీర్తి మంతునిగా మార్చింది శకుంతల. తల్లి యే సంస్కృతిలో పెరిగిందో ఆసంస్కృతిలో తానూ పెరిగి భావి భారత వంశకర్తగా పరిణతి చెందినవాడు భరతుడు. భరత పట్టాభిషేకం ఉపాఖ్యాన ఫలం. దానికి నిమిత్తమాత్రుడు బీజప్రాయుడు దుష్యంతుడు; కృషి చేసింది, ఫలాన్ని సాధించింది శకుంతల; కాబట్టి దుష్యంతోపాఖ్యానం అన్నదాని కంటె శకుంతలోపాఖ్యానమనే చాలా మంది ఈ కథను మనసు పడి పిలుస్తారు.

మహాభారతంలో పాండవులు అక్షరాలా పౌరవులనీ, భరతవంశీయులనీ అనిపించుకొన్నారు. పాండవులు గార్హస్థ్యధర్మాన్నీ, క్షత్రియ దర్మాన్నీ, మానవ ధర్మాన్నీ అసిధారావ్రతంగా రక్షించారు. ద్రౌపది గృహిణీ ధర్మానికి పరిపూర్ణ ప్రతీకగా నిలిచింది. ఆమె అడుగడుగునా కౌరవాదులచేత అవమానాలు పొందినా ఆమెను రక్షించింది గార్హస్థ్య ధర్మం, గృహిణీధర్మం; సత్యదర్మం. ఎన్ని ఇక్కట్టులు వచ్చినా ధర్మాన్ని ఆదంపతులు వీడలేదు. వారి గార్హస్థ్య ధర్మానికి త్యాగం, సత్యం అనేవి రెండు చక్రాలు. ఒకటి పురు మహారాజు నిల్పిన వంశధర్మం; మరొకటి భరతచక్రవర్తి నిలిపిన వంశ ధర్మం. ఆ రెండూ పాండవులలో పరిపూర్ణత చెందాయి; అమృతత్వసిద్ధిని సంపాదించాయి.

# వంశకర్తలైన కురు పాండు మహారాజులు

కురు మహారాజు, పాండు మహారాజు చంద్రవంశంలో వంశకర్తలుగా ప్రసిద్ధి చెందిన మహావీరులు. విపుల రాజ్యాలను జయించి, గడించి అపార సంపదను యజ్ఞయాగాదులలో ప్రజలకు పంచిపెట్టే వితరణరూప త్యాగగుణం కురు మహారాజుకు అమృతత్వసిద్ధిని కలిగించింది. పాండవులు కూడా కురుమహారాజు సంప్రదాయాన్ని కాపాడారు. ధర్మజుడు రెండుసార్లు రాజసూయయాగం చేసి తన సార్వభౌమత్వాన్ని జీవితం తొలిదశలో, మలిదశలో కూడా ప్రతిష్ఠించుకొని, అపార ధనరాసులను వితరణంగా త్యాగంచేసి కీర్తి నార్జించి వంశకర్తల కీర్తికి పరిపూర్ణత్వాన్ని అమృతత్వాన్ని సాధించి పెట్టారు.

పాండు మహారాజు అపార బలపరాక్రమశాలి. దిగ్విజయవరంపరతో కురుభీష్మాది వీరులను మరిపించిన మహాయోద్ధ. అత డెంత పరాక్రమవంతుడైనా ఆవంత అహంకారం లేనివాడు; గురుజనభక్తి ఆయన జన్మవ్రతం. కుటుంబంలో ఉన్న వారి నందరినీ చీలిపోకుండా ఒక్కటిగా అట్టి పెట్టాలన్న ఉదార హృదయుడు. గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుని మనస్సు నొప్పింపక గౌరవించిన అనుంగుతమ్ముడు. గార్హస్థ్య ధర్మంలో వంశరక్షణమనే ఒక సంప్రదాయానికి ఆయన నారు వేసి నీరు పోసి రక్షించాడు. పాండవులు తండ్రి తమ కిచ్చిన ఈ వారసత్వాన్ని తమ జీవితంలో అసిధారావ్రతంలా పాటించారు.

ధర్మజుడు వంశనాశనాన్ని కోరలేదు. శాంతిని ఆకాంక్షించాడు. శ్రీకృష్ణుని చేత ఆ పరమధర్మాన్ని కురుసభలో అందరికీ అందింపజేశాడు. కాని, వంశధర్మాన్ని మూలమట్టం చేసినవారు దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు. దానికి తగిన ఫలాన్ని వా రనుభవించారు వంశకర్తలు నిర్మించిన త్యాగం, సత్యం, వితరణం, వంశరక్షణం అనే విశిష్ట ధర్మా నన్నింటినీ మృతికి పాలు చేసి తాము మృత్యువు పాలైనారు ధృతరాష్ట్ర నందనులు. వాటి నన్నింటినీ రక్షించి వంశాన్నీ, వంశ గౌరవాన్నీ, ధర్మాన్నీ పోషించి తాము అమృతత్వసిద్ధి పొందారు పాండవులు.

అందువలననే ధర్మజుడు సశరీర స్వర్గం పొందాడు. ఇది వంశకర్తలు ప్రవర్తిల్ల చేసిన ధర్మానికి ధర్మజుడు కల్పించిన అమృతత్వం. అమృతమైన ధర్మమే మానవు అమృతత్వసాధనం!

# ధర్మవీరం రసామృతం

భారతీయ సంస్కృతి మీద అఖండ ప్రభావం వేసిన సాహిత్య గ్రంథాలు మూడు. అవి: వాల్మీకి రామాయణం, వ్యాస మహాభారత భాగవతాలు. సాహిత్య గౌరవంతో పాటు మానవుని బహిరంతర్జీవితాదర్శ నిరూపణం, పురుషార్థ సాధనోపాయం ఈ కావ్యాలలో రసవత్తరంగా నిరూపించబడటం వల్ల ప్రతి భారతీయుని హృదయ దేవాలయంలో వీటికి నిత్యార్చనలు జరుగుతున్నాయి. కాల క్రమేణా వాటిని సంస్కృతం నుండి తమ తమ మాతృభాషలలోనికి అనువదించుకొని తత్కావ్యార్థ ప్రసాదాన్ని సర్వజనభోగ్యంగా భారతీయులు తీర్చిదిద్దు కున్నారు. అటువంటి వారిలో తెలుగువారు లెక్కించదగిన వారు. తెలుగులో ముందు భారతం అవతరించింది ; తరువాత రామాయణ భాగవతాలు అనువదించబడ్డాయి. మూల గౌరవం ఏమాత్రం తగ్గకుండా తెలుగులో ఆ కావ్యాలను రూపొందించిన కవులు వందనీయులు. మన సాహిత్యంలో అన్ని గ్రంథాలు ఒక ఎత్తు; ఈ మూడు గ్రంథాలు మరొక ఎత్తు.

తెలుగు ప్రజల నోముల పంటలుగా త్రిమూర్తులుగా భూమి మీద అవతరించి, మహాభారత కావ్య ప్రపంచాన్ని సృజించి పురుషార్థ సాధనోపాయాన్ని సూచించి తరించిన కవిత్రయం ప్రాతఃస్మరణీయం. వాగనుశాసనుడైన నన్నయభట్టారకుడు, కవి బ్రహ్మ అయిన తిక్కన సోమయాజి, ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱా ప్రెగడల కవితా స్రవంతుల కలయికతో ఇది పవిత్ర త్రివేణీ సంగమ క్షేత్రమై రస పూర్ణమూ పుణ్యవంతమూ అయి ఐహికాముష్మిక సుఖాలనిస్తూ ఉంది.

"రసస్తు కథానాయకాశ్రయస్తద్విపక్షాశ్రయోవా" అన్న ధ్వన్యాలోక కర్త మతానుసారం రసం నాయక ప్రతినాయకాశ్రమని స్పష్టమౌతుంది. మహాభారతం భరతవంశజులైన చక్రవర్తుల చరిత్ర అయినప్పటికీ పాండవుల సంపూర్ణ జీవితమే ప్రధానంగా వర్ణింపబడిన ఇతిహాసం. మహాభారతావతారికలో ఒక విధంగా ఈ విషయాన్ని రాజరాజు ముఖంగా నన్నయ్య సూచించాడు.

"హిమకరుఁ దొట్టి పూరు భరతేశు కురుప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణశోభితు లైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెమ్మెయిన్" — ఆది. 1.14.

అనటంలో ఈ కావ్యేతివృత్తం పాండవచరిత్ర ప్రధానమని స్పష్టమౌతుంది. అంటే, ఈ కావ్యంలో నాయకులు పంచ పాండవులని భావించడానికి వీలులేదు. కావ్యారంభం నుండి ఫలప్రాప్తి వరకు ఎవరి జీవితం సమగ్రంగా వర్ణింపబడుతుందో అతన్నే నాయకునిగా ఎన్నుకోవడం సంప్రదాయం. సమంజసం. అందువల్లనే భీమాదులు దివంగతులైన తరువాత కూడా ధర్మాన్ని విడిచిపెట్టక, శరీరంతో స్వర్గానికి వెళ్ళి యమేంద్రాదుల దయా విశేషం వల్ల దేవత్వం పొందిన వాడు - ధర్మరాజవడం వల్ల అతడే ఫలభోక్త అయిన నాయకుడు ఔతున్నాడు. భీమాదులు జీవికాజీవుల్లాగా పరస్పరం భాతృ స్నేహంతో వర్తించి భక్తి శ్రద్ధలతో ఆజన్మాంతం ధర్మరాజును సేవించి తరించి ఉండటం వల్ల వాళ్ళు అనునాయకులౌతున్నారు. వీరికి ప్రత్యర్థి రారాజు. కర్ణాదులు అతనికి అండగా నిలిచారు. ఈ ఇరుపక్షాల వారికి ఏర్పడే సంఘర్షణే భారత ప్రధాన కావ్యేతివృత్తం.

## ధర్మరాజు నాయకుడు:

మహాభారతం సంపూర్ణ మానవ జీవిత ప్రతిబింబరూపం, దానికాదర్శవంతుడైన ధర్మరాజు నేతగా నిలిచాడు. అతడు ధర్మజ్యోతిర్లింగ రూపుడైన స్వయంభూదేవుడు. పేరులోనే ధర్మం మూర్తీభవించిన మహితాత్ముడు. ఆ విరాడ్రూపాని కాలయప్రాయులు నకుల సహదేవులు. అంగరక్షకులు భీమార్జునులు. లోకంలో ఎలాంటి కార్య సాధనమైనా పురుషకార దైవయత్న సంసిద్ధిపై ఆధారపడి ఉంటుంది. ధీమంతుడగు ధర్మసాధకుడు ఈ అర్థద్వయాన్ని సప్రయత్నంగా సాధించి కృతార్థుడౌతాడు. ధర్మరాజు అలాంటి ధీమంతుడు.

ధర్మరాజు స్వయంగానే గొప్ప అదృష్టవంతుడు. జన్మతః ధర్మతత్త్వజ్ఞాని. ఇతని అదృష్టం - భీమార్జులను తమ్ముళ్లుగా పొందడమే. ఎందుకంటే వారులేనిది ధర్మరాజు ధర్మసాధనం లేదు. వారిలో భీము డరిభయంకరుడు, సింహబలుడు. ధర్మరాజు ధర్మదీక్షారక్షణకు పురుషకారం సిద్ధం చేయగల సమర్థుడు. అర్జునుడు నరనారాయణులలో నరాంశసంభూతుడు. నారాయణుని మనసు నాకర్షించిన రాజభక్తుడు. అతిలోక శక్తిసంపన్నుడు. దేవ సంభావితుడు కావటంవల్ల అన్నకు దైవయత్నం చేకూర్చి పెట్టడంలో దివారాత్రాలు కృషి చేసినవాడు. ఒకడు బహుశక్తియుక్తుడు; మరొకడు దైవ విద్యాశక్తి సమన్వితుడు. వీరిద్దరి సుస్థిర సంరక్షణం వల్ల 'కుండలో ఉంచిన దీపం' లాగా ఎటువంటి అవాంతరాలు లేకుండా యుధిష్ఠిరుడు తన వ్రతాన్ని నిశ్చింతగా నిర్వహించాడు. 'శ్రేయాంసి బహువిఘ్నాని 'అన్నట్లుగా ధర్మరాజు ధర్మ శీలానికి అడుగడుగునా ప్రతిపక్షం నుండి పరీక్షలే వచ్చేవి. వ్రతరక్షకులైన భీమాదులు సమయోచితభావావేశంతో వాటిని ఎదుర్కోడానికి సిద్ధమయ్యేవారు. ధర్మరాజు అనుమతి ఇచ్చినట్లయితే ఆత్మార్పణానికి కూడా వెనుదీసేవారు కారు. శత్రువుల

రాక్షస కృత్యాలకు ఘూర్ణిల్లిన భీమాదుల హృదయజలధులు ఎప్పటికీ ధర్మరాజు శాసనమనే మర్యాదను దాటి ఎరుగవు. ఇలాంటి అవ్యాజమైన సమన్వయ సూత్రం పాండవులను ఏకీకృతులను చేసి కృష్ణాశ్రితులుగా తీర్చిదిద్దటం వల్ల వేద ధర్మానికి ఉపనిషత్పురుషుని సాంగత్య మబ్బినట్లైంది.

శ్రీ కృష్ణుని దృష్టిలో నాయకుడైన ధర్మరాజు ధర్మవృక్షం. ప్రతి నాయకుడైన సుయోధనుడు రోషమయ వృక్షం. వాటిని నిరూపిస్తూ సంజయునితో కృష్ణుడన్న మాటలు-

"రోషమయ మహాతరువు సుయోధనుఁ డురు
స్కంధ మందులోనఁ గర్ణుఁ డలరుఁ
గొమ్మ సౌబలుండు గుసుమఫలములు దు
శ్శాసనుండు మూలశక్తి తండ్రి."
"ధర్మజుండు ధర్మతరు; వర్జునుఁడు ఘన
స్కంధ ; మనిలసుతుఁడు శాఖ; కవలు
పుష్పఫలము; లేను భూసురులును వేద
ములుఁ దదీయమైన మూలచయము " — ఉద్యో. 1.355 - 356.

దైవమూలమూ, ధర్మరూపమూ అయిన ధర్మరాజు అనే మహావృక్షమే దీనిలో, శ్రేష్ఠమనడంలో విప్రతిపత్తి లేదు. దుర్యోధనుడు అర్థకామనిష్ఠుడు. అతనికి ధర్మదృష్టి లేదు. అర్థసాధనలో 'పురుషకారాన్ని' మాత్రమే నమ్మి, దైవ సహాయాన్ని నిర్లక్ష్యం చేసి స్వార్థం కొరకు ప్రాకులాడే దురభిమాని. అతన్ని అనుసరించే వారు అతని తమ్ముళ్ళు. అందువల్లనే వ్యాసుడు -

"క్రూరులు విలుప్త ధర్మా
చారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల
కారణమున నెగులు పుట్టు కౌరవ్యులకున్ " — ఆది. 5. 160.

అని నిరూపించాడు. ఐహికంగా దుర్యోధనుడు అదృష్టవంతుడు. సురాంశజులైన భీష్మాదులు అతని పక్షంలో ఉండటమే అతని అదృష్టం. కాని, ధర్మదృష్టి కలిగిన భీష్మాదులెన్ని హితవులు చెప్పినప్పటికీ అతడు పెడచెవిని పెట్టాడు. కర్ణుని దివ్యాస్త్ర పాండిత్యాన్ని నమ్మాడు. కర్ణుడు ధర్మైకశీలుడు. సేవాధర్మానికి, ఆత్మధర్మానికి ఎటువంటి విచ్ఛిత్తి జరగకుండ జీవితాన్ని ఎంతో సంశ్లిష్టంగా నడుపుకున్న వీరుడు. దుర్యోధనుడు భుజబల ప్రధానుడవ్వడం వల్ల భీమునికి అతడు ప్రతి. దివ్యాస్త్ర శస్త్ర సంపన్నులైన

భీష్మాదులు అర్జునునికి ప్రతి. ఇక ధర్మంలో ధర్మరాజు కెవ్వడూ సరిలేడు. దీని అర్థం ఇది: నాయకుడు బల విద్యాశక్తులు అనే సమర్థోపకరణాలతో సప్రయత్నంగా ధర్మ ఫలాన్ని సాధింపగల సమర్థుడు. ధర్మరాజు అంగి ; భీమాదులు అంగాలు. అంగి స్వయం ప్రతిభాయుతుడు. దైవాశ్రితుడు. ప్రతి నాయకునికి దీనిలో ప్రత్యేక వ్యక్తిత్వం లేదు. కర్ణదుర్యోధనులు విద్యా బలశక్తులనే ఉపకరణాలు. వీటిని ధర్మబద్ధంగా ప్రయోగించే యజమాని లేడు. భీష్మాదులు అటువంటి ప్రయత్నాలెన్నో చేసి విఫలులయ్యారు. ధర్మ సాధకాలు కాని ఈ ప్రతి వీరశక్తులు విశృంఖలవృత్తిని అనుసరించి స్వీయనాశనానికి దారితీశాయి. ధర్మరాజు ప్రవృత్తిలో ధర్మానికి అర్థకామాలు ఊడిగాలు చేస్తాయి. సుయోధనునిలో అర్థకామాలు బలీయాలై ధర్మాన్ని బహిష్కరిస్తాయి.

ధర్మరాజు జన్మకాలంలో అశరీరవాణి అతనిని యుధిష్ఠిరుడని కీర్తించింది :

"కురుకులవిభుఁ డగు ధర్మ
స్థిరమతి యగు నీతఁ డనుచు ధృతిఁ జేసి యుధి
ష్ఠిరుఁడను నామముఁ దా ను
చ్చరించె నాకాశవాణి జన వినుతముగాన్" — ఆది. 5. 97.

స్వర్గారోహణ పర్వంలో యముడీ విషయాన్ని సమర్థించాడు.

" ... చలన మొకప్పుడైన, నీదు మదికించు కేనియులేదు, దమము
శమము సత్యంబు మద్గత సారభక్తి, నీకు నగ్గలములు మహనీయచరిత "

అని. ధర్మరాజు జీవితాద్యంతాల్లో దేవతలే అతనిని ధర్మ స్థిరమతి అని కీర్తించడం వల్ల ఆద్యంత సమన్వయంతో అతడు ధర్మవీరుడై వెలుగుతున్నాడన్నది నిర్వివాదాంశం. యుధిష్ఠిరుడనే పేరును అకాశవాణి పలకడంలో ఒక విచిత్రార్థం ఇమిడి ఉంది. యుద్ధంలో స్థిరమైన వాడని వ్యుత్పత్త్యర్థం. ఇది అభిధ. ధర్మరాజు అహింసాది గుణసమన్వితు డైనప్పటికీ క్షత్రియవంశ సంజాతుడు. కాబట్టి యుద్ధం ఇతని కుల ధర్మం అయింది. ఈవిధంగా కాక, ఈ శబ్దాన్ని యౌగికార్థంలో గ్రహించినట్లైతే సత్ప్రవత్తులకూ, దుష్టప్రవృత్తులకూ అనవతరం జరుగు అంతర్యుద్ధంలో దుష్టవృత్తులకు ఓడిపోని స్థిరైకచిత్తు డనే భావం ఏర్పడుతుంది. ఇది ధర్మం చేత అనుశాసితమని పైమాటల సారాంశం. ఇటువంటి ధర్మ ప్రవణ్యతం ఏవిధంగా ధర్మరాజు జీవితంలో వ్యాపించి స్థిరత్వం పొందిందో పరామర్శించి నట్లయితే అది అంగిరస చర్చ అవుతుంది.

తండ్రి మరణానంతరం హస్తినాపురికి వచ్చిన పాండు కుమారులు ధార్తరాష్ట్రుల

కలిసి బాల్యక్రీడల్లో మునిగి తేలారు. ఈ క్రీడల్లో పాండవులందరూ ఒకటి. వారి మనః ప్రవృత్తులు సర్వథా ఏకరూపాలే. అవి అన్నీ ధర్మజుని అనుశాశితాలు. ఈ క్రీడల్లో భీముడు తన భుజబలంతో దుర్యోధనాదులను వేధించేవాడు. అతని ధాటికి తట్టుకోలేక దుర్యోధనుడు ఉపాంశు వధ చేయాలని, భీముణ్ణి పాములతో కరిపించి, నీటిలో త్రోయించి, విషాన్నం పెట్టించి సాయశక్తుల ప్రయత్నించాడు. కాని అనంత ప్రత్యుడైన భీముడు వాటిని అవలీలగా తప్పించుకున్నాడు. భావి జీవితంలో ధర్మరాజుకు భుజశక్తిగా నిలిచే భీముణ్ణి అరిబాధాకరునిగా చిత్రించటం ఎంతో సమంజసంగా ఉంది. ఈ అర్థం దుర్యోధనుని మాటల్లో వ్యంగ్యంగా కనిపిస్తుంది.

ప్రృథ్వి : "ఉపాంశువధఁ జేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే
నపాండవముగ సముద్ర వలయాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధిక కీర్తి నై యేలెదన్" — ఆది. 5. 168.

అన్నమాటల్లో - భీముడు, ధర్మరాజుకు రక్షకుడై ఉన్నంతకాలం అతడు బంధింపబడడు భీముడు లేని పక్షంలో ధర్మరాజుకు బలం లేదు - అన్న భావం ఇమిడి ఉంది. అలాగ భీముడు ఉద్ధతుడు, మదాంధుడు కాడు. అన్నమాటకు అడుగుదాటని వాడు. ఉపాంశువధ ప్రయత్నం వలన క్రుద్ధుడై, కౌరవతంత్రాన్ని బట్ట బయలు చేయాలని సంసిద్ధుడౌతున్న భీముణ్ణి చూచి ధర్మరాజు అర్థవంతమైన శాంతి వచనాలతో వారింపగా, దానిని విని అతడౌచిత్యాన్ని తెలుసుకొని భీముడు మౌనం వహించాడు. ఈ సందర్భంలో సమయోచిత కార్య నిర్వహణ దక్షత, పరస్పర స్నేహ దృష్టి, క్షమ, దూరదృష్టి, ధర్మం, అప్రమత్తత అనే గుణాలు ధర్మజాదులలో కనిపిస్తున్నవి. భీముని ఆవేశం ధర్మరాజు చేత శాసించబడుతూ ధర్మపోషక మౌతుంది. జీవితంలో వారి కష్టాల కిదే నాంది.[1] ఇకమీదట - అడుగడుగున ఇటువంటి విగ్రహ ప్రవృత్తి భీమాదులలో, అటువంటి నిగ్రహ ప్రవృత్తి ధర్మరాజులో కనిపిస్తూనే ఉంటాయి.

విద్యార్థులుగా కౌరవపాండవులు ద్రోణుని దగ్గర ధనుర్వేదాన్ని అభ్యసించడం మొదలుపెట్టారు. ద్రోణుడు శిష్యుల నందర్నీ చూచి -

1. "తతో యుధిష్ఠిరో రాజా భీమ మాహ వచోऽర్థవత్
తూష్ణీంభవ న తే జల్ప మిదంకార్యం కథం చ న
ఇతః ప్రభృతి కౌంతేయ రక్షతాన్యోన్య మాదృతాః
ఏవ ముక్త్వా.....భ్రాతృభిస్సహిత స్సర్వై రప్రమత్తోऽభవ త్తదా!"
—సం. భార. ఆది: అ.129. శ్లో. 345.

"అస్త్రవిద్యలు గఱచి నాదైన యిష్ట
మొగిన తీర్పంగ నిం దెవ్వఁ డోపు ననినఁ
బాయ మొగమిడి కౌరవుల్ పలుక కుండి
రేను దీర్చెద నని పూనె నింద్రసుతుఁడు" — ఆది. 5. 224.

ఈ పద్యంలో కౌరవులు మారుపలకలేదని వ్రాశాడు కవి. పాండవులలో నలుగురు మాట్లాడ లేదు. ఈ విషయాన్ని తెల్పకముందే అర్జునుడు మాత్రం గురుభక్తి దీపించేట్లుగా, పౌరుషం రాణించేట్లుగా "ఏను దీర్చెద" అని వీరోక్తులు పలికా డని వర్ణన. ఇలా చెప్పటంలో ఒక సున్నితమైన రహస్యం ఉంది. కౌరవులందరూ ఒకటి. పాండవులందరూ ఒకటి. వీరిలో ఎవ్వరేమన్నప్పటికీ అందరూ అన్నట్లే. అర్జునుని మాట - పాండవుల మాట అని తాత్పర్యం. దీని కొక ఆక్షేపణం రావచ్చు- కౌరవు లనగా కురువంశ సంభూతులని అర్థము కదా! అందువల్ల పాండవులుకూడా కౌరవులే అవుతారని. అది సత్యమే ఃయినప్పటికీ ఈ సందర్భంలో ఆ పదము 'ధార్తరాష్ట్రులు అనే అర్థంలో ప్రయోగింపబడింది. ః అర్థం కానిపక్షంలో పద్యరచనా విధానం మారవలసి ఉంటుంది. అర్జునుడు ఃప్ప కౌరవులెవ్వరూ మాట్లాడలేదు అని ఉండవలసింది. కాబట్టి ఆ ఆక్షేపం పరాస్తం కాక తప్పదు.

## గురుదక్షిణ

ద్రోణుడు శిష్యులందర్నీ రప్పించి, తనకు గురుదక్షిణ ఇవ్వమని అడిగాడు. అందరూ నమస్కరించి, ఎదుట నిలబడి ద్రోణుని ఇష్టం చెప్పమని అడుగగా, ద్రుపదుని పట్టి ఇమ్మని కోరుకున్నాడు. కోరిన మరుక్షణంలోనే 'రాజనందను లెల్లరు' రథారూఢులై ద్రుపదునిపై దాడికి వెళ్ళారు. పాండవులు మాత్రం ద్రోణుని చుట్టూచేరి, అతన్ని అనుసరించారు. ద్రుపదునితో జరిగిన యుద్ధంలో నిలువలేక 'కురుకుమారులు' (ఆది. ప. 76) పరాభూతులై పాండవుల దగ్గరికి పరుగెత్తి రావటం చూచి, అర్జునుడు ఆచార్యునికీ ధర్మరాజుకూ నమస్కరించి, పాంచాలునితో యుద్ధంచేసి గురుదక్షిణ చెల్లించుకున్నాడు. ఇక్కడ గమనించవలసిన విషయం - కౌరవు లావేశంతో గర్వాంధులై ముందుకు దూకి ఓడిపోయారు. ('ధార్తరాష్ట్రులు' అనే అర్థంలో 'రాజనందనులు' 'కురుకుమారులు' అన్న శబ్దాలు ప్రయోగింపబడటం గమనార్హం). పాండవులకు తాము గెలవగలమనే నమ్మకం ఉంది. లేనిపక్షంలో కౌరవులకు గురుదక్షిణను సాధించి ఇచ్చారనే గౌరవం కలుగుతుందేమోనని, కీర్తికి త్వరపడేవారే. అంతేకాక, పాండవులైదుగురు గురుదక్షిణకై పాటుపడలేదు. యుద్ధానికి వెళ్ళింది భీమార్జునులు మాత్రమే. ధర్మరాజు, నకుల సహదేవులు ద్రోణుని దగ్గరే కూర్చున్నారు.

ఇది ఏవిధమైన శిష్యధర్మం? అన్న సంశయం ఏర్పడుతుంది కదా! అందుకే పాండవులందరూ ఒక్కటి అనడం. పైపెచ్చు అర్జునుడు యుద్ధానికి వెళ్ళుతూ, ధర్మరాజును గురుతుల్యునిగా భావించి నమస్కరించి వెళ్ళటం. దీనివల్ల వ్యంగ్యంగా పాండవనాయకత్వం అతనిలో ప్రతిష్ఠితమౌతుంది. ఇలాంటి తత్త్వమే మహాభారతమంతా కనిపిస్తుంది. ధర్మరథస్థుడు ధర్మరాజు. చక్రాలు కవలలు. హయాలు భీముడు. సారథి అర్జునుడు. వేదాలు మార్గం. వీరిదొక మహాప్రస్థానం. అందువల్లనే భీమార్జునాదు లాశ్రయంగా వ్యక్తమయ్యే వీరరసమంతా నాయకాశ్రమయ్యే ధర్మవీరానికి పోషకమౌతూ శోభిస్తుందని అర్థం.

ధర్మరాజు యౌవరాజ్యపట్టాభిషిక్తుడై, నలుగురు తమ్ముళ్ళు తనను సేవిస్తూ ఉండగా పరమధర్మమూర్తిగా ప్రజల మన్నలు పొందాడు. దుర్యోధనుని కిది కన్నెర్ర అయ్యింది. అతడు తండ్రితో పోరుపెట్టి పాండవుల్ని వారణావతీ నగరానికి పంపడానికి ఏర్పాట్లు చేశాడు. ధృతరాష్ట్రుని ఆజ్ఞను శిరసావహించి కిమ్మనకుండగా ధర్మరాజు ప్రయాణమయ్యాడు. ఈ సందర్భంలో అతని గురుభక్తి ప్రశంసింపదగింది. అది అన్యాయమని ఘోషించే ప్రజలతో వ్యాసుని ధర్మరాజు ఇట్లా అన్నాడు -

> "పితా మాన్యో గురు శ్రేష్ఠో యదాహ పృథివీపతిః
> ఆశంకమానై స్తత్కార్య మస్మాభిరితినో వ్రతమ్"

ధర్మదీక్షలో అతని కున్న ఉత్సాహం ప్రకటిస్తున్నట్లున్న దీ శ్లోకం. ఇటువంటి రసవత్తర సంభాషణను నన్నయ్య ఎందుకో వదిలిపెట్టాడు. కారణం ఏమైనప్పటికీ నన్నయ్య భారత విమర్శనంలో పాఠకుడు ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. మితహిత సత్యవాక్య పరిపాలకుడైన నన్నయ్యగారి పాత్రలన్నీ అతని ప్రవృత్తినే ముద్రించుకుని ఉంటాయి. ధర్మప్రధానుడైన యుధిష్ఠిరుడు పరమమౌనాన్ని దాల్చి కర్మశూరునిలాగా చేష్టాత్మకంగా ధర్మప్రవృత్తిని ప్రపంచించాడు. నన్నయగారి ధర్మరాజు పాత్రలో ఎంతమౌనం ఉంటుందో, అంత గాంభీర్యం ఇమిడి ఉంటుందన్న మాట! భావుకుని సూక్ష్మపరిశీలనం వల్ల అది ప్రకాశమానం అవుతుంది.

## లాక్షాగృహదహనం

దుర్యోధనుడు కపటుడు కావటం వల్ల నాయకుణ్ణి కుతంత్రాలతో చంపడానికి ప్రయత్నించాడు. లాక్షాగృహదహనాదులు ఇలాంటివే. ధర్మాన్ని ఆశ్రయించినట్లయితే రారాజు కర్థసిద్ధి లేదు. స్వార్థసహితమైన అర్థం ధర్మబద్ధం అవటం కష్టం. త్యాగాదులు అతనిలో 'మృగ్యం'. అందువల్ల ఈర్ష్యాదు లధిక మయ్యాయి. అవి ధర్మంమీద విజృంభించాయి.

అలాంటప్పుడు ఆత్మరక్షణ కొరకు నాయకుని బలోపాయాలు అవసరమైనవి. అవి భీమాదులలో స్థానం ఏర్పరచుకుని ధర్మరాజును పాదివి పట్టుకుని రక్షించాయి.

లాక్షాగృహంలో దగ్ధం కాకుండా భీమరక్షితులైన కుంతీధర్మజాదులు మహారణ్యగర్భానికి చేర్చబడ్డారు. హిడింబాసురుని ఆజ్ఞవల్ల అతని సోదరి హిడింబ వారిని చంపడానికి వచ్చి, పాండవసింహుడైన భీముణ్ణి చూచి ప్రేమించి, ధర్మజాదులను వదలి తనను స్వీకరించి సుఖించమని ప్రార్థించింది. భీముడు మనోహరాకృతిలో ఉన్న ఆ కన్యను చూచి మోహావేశుడుగాక ధర్మైకచిత్తంతో గురుజనరక్షణమే తన కర్తవ్యం అని పలికి ధృతిని ప్రకటించాడు. ఈ విధంగా —

*"విను బేల యెట్టి కష్టుఁడుఁ*
*దన పురుషగుణంబు సెడఁగఁ దల్లిని దోఁబు*
*ట్టినవారి విడిచి రాగం*
*బునఁ జపల స్త్రీసుఖంబుఁ బొందునె చెపుమా !"* — ఆది. 6.197.

హిడింబ తన మనసంతా భీముని కిచ్చిన స్త్రీ. ఏ విధంగానైనా మెప్పించి అతని పొందును కోరిన కామిని. అందువల్లనే కుంతీ మొదలైనవారిని ఒప్పించినట్లయితే సురక్షిత స్థలానికి తీసుకెళ్ళగలనని మార్గాంతరం తెలిపింది. భీముని కిది వీరధర్మంగా తోచలేదు. రాక్షసాగమన భీతి, స్త్రీ సహాయాభ్యర్థనం అతడు కలలో కూడా సహించలేడు.

*"అధిక వీరుండు రక్కసుఁ డరుగుదెంచు*
*నని మనంబున భయమంది వనజనేత్ర !*
*వీరి సుఖసుప్తులై యున్నవారి నిద్ర*
*సెడఁగ బోధింపనోప నా కడిమి వినుము"*

*"క్రచ్చఱ నొక్క రక్కసుఁడ కాదు సురాసురులెల్ల నొక్కఁడై*
*వచ్చిన నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁజేసి వారలన్*
*వ్రచ్చి వధింతుఁగాక యిటు వచ్చి శ్రమంబడియున్న నిచ్చట*
*న్మెచ్చుగు వీరిదైన సుఖనిద్రకు భంగము సేయనేర్తునే !"*

- ఆది. 6. 199-200

అని తన బలోన్నతి తేటపడేట్లుగా పలికాడు. అప్పుడు హిడింబ తన అన్నను గురించి పలికిన పలుకులు విభావాలు, స్త్రీ సహాయం వల్ల ఆత్మరక్షణ చేసుకోమనే మాటలు ఉద్దీపనలు; శౌర్యధైర్యబలప్రతాపగురుజనరక్షాదు లనుభావాలు - వీటితో పుష్టి చెందిన ఉత్సాహం

బలసంబంధి కావటం వల్ల బలవీరమై, గురుజన రక్షణ రూపమై ధర్మబద్ధం అవుతుంది. హిడింబునితో జరిగిన యుద్ధం ఈ వీరానికి పోషకం.

భీముడు హిడింబను తిరస్కరించి చంపడానికి ప్రయత్నించాడు. స్త్రీవధ పేరు వినగానే ధర్మరాజు చివుక్కుమన్నాడు. అది ధర్మవిరుద్ధం. వెంటనే తమ్ముణ్ని వారించి ఈ విధంగా ప్రబోధించాడు.

"వధకు నర్హుఁడై వచ్చిన వానిఁ జంపి
తదియు ధర్మువ యిది చాల నబల దీని
కలుగఁజన దాత్మరక్షకు నగ్గలంబు
ధర్మరక్షయ యుత్తమ ధార్మికులకు."

" ఆపద యయినను ధర్మువ
ప్రాపుగ రక్షింప వలయుఁ బరమార్థము ధ
ర్మాపాయము ధార్మికులకు
నాపద జన్మాంతరమున ననుగత మగుటన్." — ఆది. 6. 220 - 221.

భీమాదులు మదేభాల లాగా ఆవేశంతో ధర్మలతా సంచయాన్ని ఎప్పుడైనా ధ్వంసం చేయడానికి ప్రయత్నించవచ్చు. కాని ధర్మరాజు ధర్మాంకుశం వారిని సన్మార్గంలో నడిపించింది.

ఏకచక్రపురంలో నివసించే సమయంలో పాండవులుండే బ్రాహ్మణుని ఇంట్లో ఒక పెద్ద ఆపద సంభవించింది. బకాసురుని కాహారంగా ఆ ఇంట్లో ఒకరు వెళ్ళవలసి ఉండటంవల్ల వాళ్ళందరూ దుఃఖిస్తున్నారు. వాళ్ళకు కలిగిన ఆపదను తీర్చడానికి కుంతీబోధితుడై దయాపూరిత అంతః కరణుడై —

"ఎఱిఁగి నాకుఁ జెప్పు మిది యేమి యెవ్వరి
వలన నింతయయ్యె వగవ నేల
యెంత కడిఁదియైన నిది యేను దీర్చి యీ
విప్రునకుఁ బ్రియంబు విస్తరింతు" —ఆది. 6-246.

అని ఉత్సాహం చూపాడు. భీముని స్వభావం తెలుసుకున్న ధర్మరాజు కుంతీదేవి కారుణ్యబుద్ధికి, బ్రాహ్మణభక్తికి, ధర్మచిత్తానికి, సంతోషించి తాను కూడా భీముణ్ణి నియోగించాడు. భీముడు బ్రాహ్మణుని కొరకు తానే ఆనాటి ఆహారంగా రాక్షసుణ్ణి చేరి సంహరించడానికి నిశ్చయించుకున్నాడు. అతన్ని చూచి -

"ఇంచుకయేని పాపమున కెన్నడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి వానినెల్లఁ గ్ర
క్కించెద నీ మదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలుఁబ్రోలి కేఁ
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా !"

— ఆది. 6. 297.

అని అతనిపై దూకి ద్వంద్వయుద్ధం చేసి ముష్టిఘాతాలతో వాడిని చంపాడు. భీముని ఉత్సాహానికి ఆలంబనం బకాసుర విజృంభణం. అతని మాటలు ఉద్దీపనలు. ధైర్యాద్యనుభావాలతో అవి వ్యక్తీకరింపబడి ఉగ్రామర్షగర్వోత్సుక్యాది సంచారీభావాలలో పరిపుష్టిచెంది యుద్ధవీరంగా పరిణతి చెందింది. ఇది బ్రాహ్మణుని రక్షించుట కొరకైన దయలో అంతర్లీనం కావటంతో ఇది అంగం. పోషకం. అది ధర్మాత్మకం కావటం వల్ల ధర్మరాజు ఆనందానికి హేతువైంది.

## ద్రౌపది స్వయంవరం

ద్రౌపదీ స్వయంవర సమయంలో అర్జునుని యుద్ధవీరం సుందరమైంది. సకల రాజసమూహాలు మత్స్యయంత్రభేదన సమర్థకాలు కాకపోగా బ్రాహ్మణవేషదారి అయిన అర్జును డవలీలగా దానిని విరిచాడు. అర్జునుడు ద్రౌపదిచేతిలోని పూలదండను స్వీకరించడా చూచి కౌరవేంద్రాదులు మత్సరంతో ద్రుపదునిపైకి దండెత్తి -

మత్త : "ఏల రాఁబనిచెన్ మహీశుల నెల్లఁ జుట్టమపోలె ము
న్నేల సత్కృతిఁ జేసె నిందఱ కిమ్మహారథు లుండఁగా
నేల కన్యక నిచ్చె విప్రున కిందు నేఁడు శఠుండు పాం
చాలుఁ డిప్పుడ వీని నిర్గతసత్త్వుఁ జేయుద మాజిలోన్"

— ఆది. 7. 190.

అని రణోత్సాహన్ని ప్రకటిస్తుండగా బ్రాహ్మణుల మధ్యనుండి అర్జునుడు రంగంలోకి దూకి నవ్వుతూ -

"కడఁగి మదీయాస్త్రము లని
యెడు పటుమంత్రముల నిప్పు డీ నృపరిపుల
న్కడిఁది విషాహుల దర్పం
బుడిగించెదఁ దొలఁగి చూచుచుండుఁడు మీరల్"

— ఆది. 7. 193.

అని విజృంభించాడు. శత్రువీరులందర్నీ చంపి, కర్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. అతని పరాక్రమాన్ని మెచ్చుకున్న కర్ణుణ్ణి -

*"నాయెదురఁ జక్కనై యని*
*సేయఁగ భార్గవునకును శచీవరునకుఁ గొం*
*తేయుఁ డగు విజయునకుఁ గా*
*కాయత భుజశక్తి నొరుల కలవియె ధరణిన్?".*

*"నీ వప్రాకృతబలుఁడవు*
*నీ విక్రమమునకు విల్లునేర్పునకు మహీ*
*దేవకులోత్తమ ! మెచ్చితి*
*నావుడుఁ బార్థుఁడు గర్ణునకు నిట్లనియెన్"*

మధ్యాక్కర:

*"ఏను నీ చెప్పిన వారిలోపల నెవ్వఁడఁ గాను (!)*
*గానీన! సర్వశాస్త్రవిద్యల గడుఁ బ్రసిద్ధుండ*
*భూనుత బ్రహ్మతేజోऽధికుఁడ నిన్నుఁ బోరిలో నోర్వఁ*
*గా నున్న వీరుండ నొండు దక్కి లోఁగక చక్క నిలుము."*

— ఆది.7. 200-202.

అని వెన్నంటి తరుమగా కర్ణుడు, అతడు బ్రహ్మతేజ మజేయమని తొలగిపోయాడు. అర్జునునినోట 'ఎవ్వడగాను' అని పలికించి, అతన్ని అసత్యదూరుణ్ణి చేయక నన్నయ్య రక్షించాడు. నిశ్చయార్థకంగా కాక ఆశ్చర్యార్థకంగా పలికినట్లయితే 'నేనందరిని' అనే అర్థం వస్తుంది. లక్షణార్థంబట్టి అర్జునుడు భార్గవుని తోనూ, ఇంద్రునితోనూ బలతేజసాలలో సమానుడని తెలుస్తుంది. 'నిన్నుఁబోరిలో నోర్వగా నున్న వీరుండ' అని అనటంలో అతడు యుద్ధంలో కర్ణుణ్ణి ఓడించడానికే జీవించి ఉన్నట్లు అర్థమౌతుంది. లక్షాగృహదహనాది కౌరవ కుతంత్రాల బారినుండి తప్పించుకుని బ్రతికి ఉన్నందుకు అదే ఫలకారణమని తెలుస్తుంది. అర్జునాశ్రితమైన యుద్ధవీరం భవిష్యత్తులో పాండవ వివాహహేతువై గృహస్థాశ్రమ ధర్మసాధకంగా ఒప్పుతుంది.

ద్రౌపదీ వివాహం దైవికమైన ధర్మసూక్ష్మానికి సంబంధించింది. త్రికాలజ్ఞులైన మహర్షులకు గాని అవగాహనం కాదు. ధర్మరాజు స్థితప్రజ్ఞుడై దైవనియోగం వల్ల ఈ విధంగా ధర్మప్రతిపాదన చేశాడు.

*"గురువచనస్థితి మనకే*
*గురుకును నిది పత్ని గాఁదగుం గావున ని*
*త్తరుణిని బరిగ్రహింతము*
*తిరముగ గురువచన మొండుదెఱఁ గేల యగున్"* — ఆది. 7.215.

ఆ మాటల్లో ధర్మరాజులోని తల్లిమాట పట్ల గౌరవం, ధర్మానురక్తి గోచరమౌతున్నాయి. నన్నయ్య పాండుభూపాల తనూజపంచకం, ఆ ద్రౌపదిలో పంచశరాహతి పొందటానికి కారణం నిరూపించి ధర్మత్వాన్ని సాధించాడు. అది ధర్మరాజు ధర్మవీరానికి పోషకంగా పాండవ అభేదాన్ని ప్రతిపాదిస్తుంది.

## రాజసూయ యాగం

ధర్మరాజు ఇంద్రప్రస్థపురంలో అర్ధరాజ్యానికి పట్టాభిషిక్తుడై సుఖంగా రాజ్యం చేస్తుండగా నారదుడు వచ్చి, స్వర్గలోకంలో ఉన్న పాండుక్ష్మాభూపాలుని కోరిక అయిన - రాజసూయ యాగాన్ని చేయడానికి ప్రోత్సహించాడు. పితృదేవతలకు ప్రీతి, విపులకీర్తి కలిగించే ఆ యజ్ఞాన్ని ధర్మరాజు చేయడానికి పూనుకున్నాడు. అది చక్రవర్తి అయిన క్షత్రియునికి తగిన ధర్మంగా అతని చరిత్రకు వన్నె తెచ్చింది.

రాజసూయయాగ సన్నివేశంలో వర్ణింపబడిన శిశుపాలుని యుద్ధోత్సాహం. భీమునిరౌద్రం, శ్రీకృష్ణశిశుపాల పరస్పరోపాలంభనం, శిశుపాల వధ మొదలైన ఘట్టాలలో వీరరస స్ఫూర్తి కలిగి ధర్మబద్ధమై సొంపు నింపుకుంది. ద్రౌపదీ వస్త్రాపహరణ కథాభాగంలో ధర్మరాజు ధర్మవీరమే ప్రధానంగా ఆస్వాద్యమానమౌతుంది. దుర్యోధనుడు పాండవ సంపదను చూచి ఈర్ష్యతో దానిని కపటోపాయంగా కబళించడానికి ప్రయత్నించాడు. అందువల్లనే అతని ఉత్సాహం అర్థసాధన ప్రధానమే అయి వీరరస నామయోగ్యతను పొందటంలేదు. విదురుడు మాయాద్యూతం ధర్మవిరుద్ధమని చెప్పినపుడు -

*"పరులసంపద సుఖోపాయబలంబునఁ*
*గొనుట భూపతులకు గుణమకాదె"* — సభా. 2. 188.

అని దుర్యోధనుడు తన ప్రయత్నం నీతిసమ్మతమేనని సమర్థించుకున్నాడు. ఇక్కడ ప్రతినాయకునిది ఐహికార్థ ప్రధానమైన ప్రవృత్తి అని, నాయకునిది ఐహికాముష్మిక ధర్మప్రధాన ప్రవృత్తి అని స్పష్టం అవుతుంది. మొదటి ఉత్సాహం ఉత్కటమై రసాభాసమౌతుంది. రెండవది ధర్మవీరం అవుతుంది.

## కపటద్యూతం

ధర్మరాజు జూదంలోకి ప్రవేశించడానికి, ధృతరాష్ట్రదుర్యోధనుల ఆహ్వానం, శకుని నిష్ఠురవచనాలు కారణాలు. జూదం ధర్మవిరుద్ధమని చెప్పిన యాధిష్ఠిరుని చూచి శకుని, "జూదంబున కీ వోడుదేని యుడుగు"మని సగర్వంగా పలికాడు. ఇక్కడే ధర్మరాజు కభిమానం అడ్డం వచ్చింది.

*"బలవద్ద్యూతార్థముగాఁ*
*బిలువంబడి మగుడనగునె పెక్కులు పలుకుల్*
*పలుకంగా నేల యని య*
*త్యలఘుఁడు ధర్మజుడు జూదమాడఁ గడంగెన్"* — సభా. 2. 172.

మాన సంరక్షణకు ప్రయత్నించిన ధర్మరాజు లౌకికమైన క్షాత్రధర్మాన్ని స్థాపించాడు. కుపితుడైన భీమునికి అర్జునుడు తద్ధర్మనిరూపణం చేసి చూపించాడు.

*"ధర్మతనూజుండు ధర్మువు దప్పిన ధరణీతలం బెల్లఁ దల్లడిల్లుఁ*
*దగిలి సుహృద్ద్యూత ధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువంగఁబడి విభుండు*
*గడఁగక విముఖుండుగాఁ జనదని శుభక్షాత్రధర్మంబు లోకంబులందు*
*నిలిపెఁ దా నిది పతినేరమియే? దైవ వైపరీత్యంబైన వనరఁ దగునె ?*

*గురుల ధర్మపరులఁ గోపించి ధీరు ల*
*తిక్రమింతురే తదీయ నిత్య*
*ధర్మగౌరవం బధార్మికు లగుచున్న*
*పరులచేతఁ జెఱుపఁబడియె నిట్లు"* — సభా. 2. 224.

కౌరవసభలో కౌరవుల దౌష్ట్యం ఇంత అనిలేకుండా పెచ్చుపెరిగింది. భీష్మాదులు, వారించటాని కది సమయంకాదని ఊరుకున్నారు. ఏకవస్త్ర, రజస్వల అయిన ద్రౌపది దుశ్శాసనునితో సభలోకి ఈడ్చబడింది. ఆమె ఆక్రందిస్తూ సభాసదులను ధర్మభిక్ష కోరింది. ఆమెకు సమాధానమిచ్చే ధర్మజ్ఞుడు అక్కడ కనిపించలేదు. వికర్ణుడు చిన్నవాడైనా సమయోచితంగా పెద్దల్ని మందలిస్తూ తనంతట తానే ముందుకు వచ్చి "నే నిందు ధర్మ నిర్ణయంబు సేసెద నెల్లవారును వినుండు: జూదంబును వేటయు బానంబును బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మువుం దప్పివర్తిల్లు; నట్టికృత్యంబులు సేకొనందగవు. కితవాహూతుండై వ్యసనావర్తియయి పరాజితుండయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణధనంబైన పాంచాలిఁ

బణంబుఁ జేసెంగావున యధర్మవిజిత యక్కోమలి యేకవస్త్ర నిట దోడ్కొని తెచ్చుట యన్యాయం" అని ఉద్ఘాటించాడు. దాన్ని ఖండిస్తూ కర్ణుడు 'ద్రౌపది బంధకి యనంబడునుగాన ' వివస్త్రను చేసి తెచ్చినప్పటికీ ధర్మవిరోధం లేదని నిరూపించి వ్యంగ్యంగా దుర్యోధనునికి వస్త్రాపహరణ భావాన్ని అందించాడు. పాండవులకు, ద్రౌపదికీ అవమానహేతువైన ఆ కార్యానికి ఉద్యమించిన దుశ్శాసనుణ్ణి చూచి భీముడు కోపంతో -

*"కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో*
*ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ*
*కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని*
*ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"*

— సభా. 2. 233.

"ఇట్లుసేయనైతినేని పితృపితామహులగతికిం దప్పినవాఁడ నగుదు" అని పలుకగా సభాసదులు భయాన్ని ఆశ్చర్యాన్ని పొందారు.

విదురుడు ద్రౌపది అడిగిన ధర్మప్రశ్నకు సమాధానం ఇవ్వటం న్యాయమని సభకు ప్రబోధించాడు. ద్రౌపది తాను దాసినో కాదో నిరూపించమని సభాసదులను రోదిస్తూ ప్రశ్నించింది. అప్పుడు ఆమెను చూచి నవ్వి -

*"తరుణీ ! యేవురకంటె నొక్కరుఁడ భర్త*
*యగుట లగ్గు జూదంబున నాలి నోటు*
*వడని వానిఁ గాదగు భర్త బడయు మింక*
*ననుచు రాధేయుఁ డుల్లసమాడె నంత"*

— సభా. 2. 246.

'భర్త' అన్నపదంలోని రాజార్థాన్ని గ్రహించి దుర్యోధనుడు ఆ విభీత హరిణాక్షిని తన రమ్యమైన పృథూరుతలం మీద కూర్చొనమని సైగ చేశాడు. ఇది అధర్మానికి పరాకాష్ఠ.

## పాండవ ప్రతిజ్ఞలు

క్రూరులైన కౌరవుల్ని చూచి ధర్మరాజు ఒక్కమాటా మాట్లాడడు. అది క్షమాభావం యొక్క సమగ్రమైన ఉత్కటరూపకల్పన. భీముడు మాత్రం ఆక్రోశం పట్టలేక రంకెలు వేశాడు. ఆయుధాలవైపు, ధర్మరాజువైపు చూస్తూ నిప్పులు కురిపించాడు. భయానక క్రోధావేశుడైన భీముడు -

"ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండగఁ బిల్చిన యిద్ధురాత్ము దు
ర్వార మదీయబాహు పరివర్తితచండ గదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"

— సభా. 2. 249.

అని భీషణ ప్రతిజ్ఞ చేశాడు. భీమునిలో రౌద్రం కార్చిచ్చులాగా ప్రజ్వలించి వ్యాపించింది. కాని, అతడు అన్న ధర్మరాజు ముఖం చూస్తూ నిలిచిపోయాడు. భీముని రోషం మానవులకు సహజం. ఔచితీ పరిపోషకం. దాన్ని అణుచుకోవాలంటే ఎంతో ధృతి, శమదమాలు అవసరం. అవి అన్నీ ధర్మరాజులో మూర్తీభవించాయి. అతని తమ్ముళ్లు అతని శాసనాన్ని దాటరు.

ఈ ఘట్టంలో భీముడు చేసిన ప్రతిజ్ఞలు మూడు. మొదటిసారి తాను ప్రతిజ్ఞ చేశాడు గాని వెంటనే కౌరవులను చంపాలనే భావాన్ని ప్రకటించలేదు. అప్పుడు అతనికి ఆ ఆలోచన లేదు. ఆ ఆలోచన రెండవసారి కలిగింది. దానిని భీష్మద్రోణ విదురులు వారించటంతో సరిపోయింది. మూడవసారి ధర్మరాజు వారించాడు. చేయవద్దన్నట్లు చేయి పైకెత్తాడు. ధర్మరాజు చేసినదింత మాత్రమే. 'తొడలు విరుగగొట్టెద నన్నప్పు డన్నగారి యంగీకార మున్నదో లేదో యని తెలిసికొనుట కతని వంక చూచుచుండెను. శత్రువులంతటి యపకృతి చేసినప్పుడు తనకంతటి కోపము వచ్చినపు డన్నగారంగీకరించునా లేదా యన్న విచారణ విచిత్రముగా నున్నది. ఆ యన్న యదుపెట్టిదో? అతని నాయకత్వ మెట్టిదో? ఆ తమ్ముల యనుయాయిత్వ మెట్టిదో? మనసు పట్టని యొక శైష్యోపాధ్యాయిక వ్యంగ్యమగుచున్నది" అని కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.[2]

"ద్రౌపదీ సంపాదిత రాజ్యానుభూతి యందు అధమత్వ మున్నదని భీముడు మిక్కిలి కోపించెను. ధర్మరాజు వారించెను. ధర్మరాజునకు మాత్రమా యధమాధమ బుద్ధిలేదా? ఎందుకు వారించెను? ధర్మరాజు యొక్క ధర్మ స్వరూపము చాల నిగూఢమయినది. ధృతరాష్ట్రుఁ డిచ్చుటచేత రాజ్యమిప్పుడు వచ్చినది. పాండవులకు మఱల స్వాతంత్ర్యము వచ్చినది. తత్పూర్వము తమమీఁద తమకు, తమ యాయుధముల మీద తమకు తమ వర్మవరూథమ్ముల మీద తమకు నధికారము లేదు. అందుకనియే ద్రౌపది యడిగిన రెండవ వరము:

---

2. నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి - పుట. 156

"నెమ్మిని ధర్మజు నలువురు
తమ్ములు తమ యాయుధములు తమ వర్మ వరూ
ధమ్ములయుతోడ సకల హి
తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్."

అని యున్నది. అందుచేత నిప్పటి భీముని పౌరుషము. ఆయుధ ప్రయోగము చేయఁగల సామర్థ్యముకూడ స్త్రీ విత్తము క్రింద లెక్కఁగట్టఁ వలయును. రాజ్యసంపద ననుభవించుటకు స్త్రీ విత్త దోష మెంత యున్నదో తమపరాక్రమము ప్రకటించుటకు స్త్రీ ప్రసాద కృతసామర్థ్యమను దోస మంతియే యున్నది. ఇందుచేత ధర్మజుడు కరతలమ్మున వారించెను. తొడలు విరుగగొట్టెద నన్నప్పుడు పరాక్రమము ప్రదర్శించుటకు వీలేలేదు. అందుచేత ధర్మరాజాతనివంకనే చూడలేదు." [3] భీముని భీషణరౌద్రమంతా ఇలా ధర్మజుని క్షమాప్రధానమైన ధర్మప్రవృత్తితో అనుశాసింపబడింది. రెండవసారి జరిగిన మాయాద్యూతంలో కూడా ఇలాంటి తత్త్వమే కనిపిస్తుంది.

"ధర్మతనయు పిఱుఁదఁ దమ్ములు నలువురు
నరుగుచుండి తత్సభాంతరమున
జనులు వినుచుండ సంభృత క్రోధులై
పలికి రధిక పరుషభాషణముల."

— సభా. 2. 294.

భీమునితో పాటు నలుగురు తమ్ముళ్లు ప్రతిజ్ఞ చేస్తూనే అన్నవెంట అడవికి వెళ్ళారు. (సభా. 2 295-299) అప్పుడు కూడా ధర్మరాజు పలకలేదు. ధర్మరాజు యొక్క ఈ స్థితిని దుఃఖావేశం అనవచ్చా? కాని అదే స్థితిలో ఉన్న తమ్ముళ్ళు ప్రతిజ్ఞలు చేస్తున్నారే! కాబట్టి అతనిది క్షమ ప్రధానంగా కలిగిన ధీరుని లక్షణమని చెప్పటం సమంజసం. "వికార హేతావపి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః." ఈ విధంగా యుధిష్ఠిరుడు తమ్ముళ్లను శాసిస్తూ, ఇంద్రియాలను శాసించే అంతఃకరణం లాగా కనబడతాడు. పాశుపతాస్త్ర సంపాదన సమయంలో అర్జునుని తపోవీరం సర్వాంగ సుందరమైనది. మోక్ష పురుషార్థసాధనే ఆత్మగా కలిగిన తపస్సుకు లోకవిషయాలకు దూరమైన శమం స్థాయిభావ మవుతుంది. కాని ఇక్కడ అర్జునుడు పురుషార్థాలలో అర్థాన్ని కోరాడు. అది ధర్మబద్ధం కావటం వల్ల 'వీరరస' యోగ్యతను పొందగలిగింది. భీష్మాదులు పుంభావ ధనుర్వేదసారులు. అలాంటి

3. నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి - పుట. 158-159

వారిని ఎదుర్కొని జయం పొందాలంటే దైవికాలైన శస్త్రాస్త్రాలు పాండవులకు అత్యంత ఆవశ్యకం. కాబట్టి అర్జునుడు ధర్మజునిచేత ప్రబోధింపబడి యోగవిద్యను గ్రహించి, ఇంద్రకీలాద్రికి పయనమయ్యాడు. ద్రౌపది "అరి జయార్థ మరుగు నాతని యుత్సాహ మెఱిగి యిట్టులనియె" అని నన్నయ్య (అరణ్య. ప్ర. 283). ఆ వర్ణనలోనే కవి స్థాయిభావాన్ని వ్యంగ్యంగా సూచించినట్లైంది.

## పాశుపతాస్త్ర సంపాదనం

తపోవీరానికి యుద్ధోత్సాహం అంగంగా సంధింపబడిన అపూర్వ ఘట్టం ఇది. "వీరుడు యోగవిద్యను, విల్లును దోడుగ నింద్రకీలమన్ భూరినగంబుపైఁ గడఁగి పోవగ (అరణ్య. ప్ర. 287) అనే వాక్యంలో ఈ భావం ధ్వనిస్తోంది. తపస్వికి అచంచలమైన దీక్ష, సమాహిత బుద్ధి, నైష్ఠిక వర్తనం, భక్తి ప్రధాన గుణాలు. అవి పరీక్షితాలై నాయకునిలో ప్రతిష్ఠింపబడినప్పుడు ఉచిత విభావత్వం నిరూపించబడుతుంది. అందువల్లనే ఇంద్రుడు వృద్ధబ్రాహ్మణవేషంలో అర్జునుని పరీక్షించాడు. పుణ్యలోకాలు, దేవత్వం, సర్వకామాలు అతని కిస్తానని శతమఖుడు ఆశపెట్టాడు. కాని అర్జునుడు -

*"దివిజనాథ ! నా కవియెల్ల నేటికిఁ బరమాస్త్ర లాభంబ కర మభీష్ట*
*మరులు సేసిన మహా పరిభవక్లేశంబు వాపంగ నోపక యేపుటడవి*
*నురుదుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి చనుదెంచి మిన్నక చనిన నన్నుఁ*
*దగువారు జగములోఁ దెగడరే."*

— అరణ్య. 1. 294.

అని స్వీయ దీక్షాపాటవాన్ని ప్రదర్శించి తపస్సుకు యోగ్యుడని నిరూపించుకొన్నాడు.

అర్జునుని తపస్సు అడుగడుగునా తీవ్రరూపం దాల్చింది. కవి ఇక్కడ తపోవీరుని అనుభావ వర్ణన, తపఃప్రభావ వర్ణన చేసి పార్థునిలో (తాత్పర్యశక్తితో) వీరరస స్ఫూర్తి కలిగినట్లు మెళకువతో రచించాడు. ఋషులలోను, సర్వజీవులలోను అద్భుతం సంధింపబడి వీరరసపోషక మవుతోంది.

అర్జునుడు త్రికరణశుద్ధిగా ఈశ్వరుని నమ్మి 'నిరంతర త్రిరాత్రోపవాసమున నొక మాసమును, ద్విగుణిత త్రిరాత్రోపవాస వ్రతమున రెండవ మాసమును పక్షోపవాసంబున తృతీయమును, ఊర్ధ్వబాహుఁడై యేక పాదాంగుష్ఠాగ్రమున నిలిచి వాయు భోజనము చేయుచు చతుర్థమాసమును. తపంబొనర్చె' అనటంలో అతని అనుభావాలు ఉత్కటమైన నైష్ఠిక ఉత్సాహాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఋషులు ఈ తపస్సుకు విస్మయం చెంది ఈశ్వరుని వద్దకు వెళ్ళి ఈ విధంగా అన్నారు.

"భూరిబలుండు పాండవుఁ డపూర్వ తపం బొనరించుటం దదీ
యోరుతపః ప్రభావ దహనోత్థిత ధూమచయంబు లంబుదా
కారము లై వనాంతరము గప్పె జగత్త్రయనాథ తత్తపో
భారము సర్వజీవుల కపారభయావహ మద్భుతం బిలన్."

—అరణ్య. 1. 298.

ఇక్కడ తపోవీరానికి ఆలంబనం కిరీటి. తత్ఫలితాదులైన భయం, విస్మయం మొదలైన వాటికి ఆలంబనాలు సర్వజీవులు, ఈ రెండింటిని తాదాత్మ్యంతో అనుభవించిన విజ్ఞులు ఋషులు - పాఠకుని హృదయానికి సన్నిహితులు. ఈవిధంగా జనకరసాన్ని నాయకునిలోను, జన్యరసాన్ని ఇతర పాత్రలలోను వర్ణించి, జనక రస విస్తృతాకార నిరూపణం చేసి, పఠితలకు రసాస్వాదన సౌలభ్యాన్ని కల్పించటం ఒక కావ్య రచనా శిల్పం.

కిరాతాకృతిలో ఉన్న ఈశ్వరునితో సవ్యసాచి యుద్ధానికి దిగటానికి మృగయాధర్మం కారణం. "నాయేసిన మృగంబు నేసి మృగయాధర్మ మేల చేసితి"వని అతడు ప్రత్యర్థిని గర్జించాడు. ఎదుట ఉన్నవాడు సాక్షాత్పరమేశ్వరుడు. అతడు పరీక్షార్థమై కయ్యానికి దిగాడు కాని క్రోధభావంతో కాదు. అంతే కాకుండా అర్జునుని బాణజాలాన్ని తనలో లీనం చేసుకోగల మహిమాన్వితుడు. అతని యుద్ధం లీలేగాని పురుషకారం కాదు. కాని, అతనితో జరిగిన పోరులో అర్జునుని యందు ద్విగుణీకృతోత్సాహం స్ఫురించి పఠితచేత వీరం ఆస్వాదింపబడుతుంది. దేవుడు నరునితో పోరితే ఆశ్చర్యం లేదు. కాని, నరుడు దేవుని ఢీకొనటం విశేషమే.

కిరాతుని అధిక్షేపాలకు అలిగి విజృంభించిన అర్జునుని దుర్వారనారాచాలు "అవివేకియందు ప్రయుక్తంబులయిన సుభాషితంబులుంబోలె" శివుని యందు నిష్ఫలములయ్యాయి. గాండీవం అపహరించబడింది. కృపాణం మొక్కవోయింది. రాళ్లు విఫలాలయ్యాయి. శూలధరుని ధాటికి ఓర్వలేక గాండీవి మూర్ఛలో మునిగిపోయాడు. కాని త్రిపురాంతకుని ముందు అంత మాత్రం నిలిచే నరు డేడీ యీ లోకంలో? అదియే ఒక గుణం. శివునిది ఇంద్రజాలమే కాని యుద్ధం కాదు. ప్రతి నాయకుని చేతనే పొగడ్తలు అందుకున్న అర్జునుని వీరం సుప్రతిష్ఠితం. "అర్జునా! క్షత్రియులొరు లెవ్వరు నీ యట్టి శౌర్య ధైర్యవంతులు లేరు. నీ తపఃక్షాత్రగుణంబులకు మెచ్చితి" అనే మాటలు శివప్రోక్తాలు కావటం వల్ల అర్జునుని తపోవీరం, తదంగమైన యుద్ధవీరం సఫలమవుతున్నాయి.

అర్జునుడు ఊర్వశీ విముఖుడు కావటానికి అతని ధర్మప్రవృత్తే కారణం. ఊర్వశిని కామించినట్లయితే తాను కురుసభలో బ్రహ్మచర్యంతో వనవాసం చేస్తానని చేసిన సమయం

భగ్నమవుతుంది. శతమఖ పురూరవులకు అనురక్తయైన ఆమెపట్ల మాతృధర్మం బాధితమవుతుంది. అందువల్లనే ఆమెతో అతడు -

*"ఓహో ! యిమ్మెయి ధర్మ*
*ద్రోహోక్తులు పలుకఁదగునె దోసం బది గా*
*దే హరిహరి మనమున*
*నూహింపక నన్ను బలుకు టుచితమె నీకున్"* — అరణ్య. 1. 364.

ఇందులో "ఏకత్రైవానురాగశ్చేత్" అనే లక్షణం వల్ల శృంగారం రసాభాసమై దాని ఫలితంగా హాసం జనించినా, అర్జునుని ధర్మప్రవణత దానిని శాసించటం వల్ల అది ధర్మోత్సాహమే అవుతోంది. తపోవీరుడైన అర్జునుని శీలానికి ఇది మెఱుగు పెడుతుంది.

## ఘోషయాత్రా ఘట్టం

ఘోషయాత్రా ఘట్టంలో ధర్మజుని దయావీరం మూర్తికట్టినట్లు ప్రత్యక్ష మవుతుంది. చిత్రసేనునివల్ల సకుటుంబంగా బంధింపబడిన దుర్యోనుణ్ణి కాపాడటానికి యజ్ఞదీక్షితుడైన ధర్మరాజు దయతలచగా, భీమార్జునులు రారాజు దౌష్ట్యాలు ఉగ్గడించి అన్నను వారించటానికి యత్నించారు. ధర్మరాజు అప్పుడు సాంత్వనవచనాలతో వారితో ఈవిధంగా అన్నాడు:

*"కావరయ్య యనినఁ గరము దుర్బలుఁడైనఁ*
*జెనసి యోపినంత సేయు ననిన*
*నూరకుండు నయ్య యుత్తమశూరుండు*
*దీనజనుల యున్న తెఱఁగు సూచి."*

*"శరణం బని వచ్చిన భీ*
*కర శత్రువునయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం*
*గరుణాపరుల తెఱం గిది*
*యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్"*

"....ని న్నింత నిర్బంధింప వలవ దేన యరుగుదు నిప్పుడు యజ్ఞదీక్షితుండ నై యున్నవాఁడ గావున నాకుం జనరాదు." — అరణ్య. 5. 412-414.

ఇందులో విశృంఖలవర్తనానికి అలవాటుపడిన గుఱ్ఱాలను రథానికి పూన్చే సారథి యొక్క సామర్థ్యం గోచరిస్తుంది. భీమాదులు ధర్మజుని సమర్థించటంలేదు. ఇంద్రియాలు కూడా

ఇలాగే ఒక్కొక్కసారి ప్రకోపిస్తాయి. వానిని నియమించాల్సి ఉంటుంది. దానికి మర్మజ్ఞుడైన మనీషి కాని చాలడు. తమ్ముల మర్మం ఎరిగిన అన్న మాట్లాడే వైఖరి ఇక్కడ అప్రతిమాన్యం. హతశేషులైన కౌరవ సైనికులు దైన్యంతో శరణు వేడారు. భీమాదులు "దీనజనులక్కు యున్న తెఱగు సూచి"నారు. ఉత్తముడు శూరుడు అయినవాడు అలాంటి విభావాన్ని చూస్తే వెంటనే తద్రక్షణానికి ఉద్యుక్తు డవుతాడు. దానినే చమత్కరించి ధర్మరాజు "కరము దుర్బలుఁడైన యోపినంత సేయుననిన" అని వక్రోక్తిగా మాట్లాడాడు. బలహీనుల స్థితే అలా ఉంటే, బలవంతులు మేటి శూరులు అయిన మీ రెందుకు నీళ్లనమలటం? అని తమ్ముళ్లకు పురి ఎక్కించాడు వ్యంగ్యంగా. ఈ మాటలు భీమాదులకు విభావాలై ఉత్సాహాన్ని కలిగించాయి. కాని, దానిని సమర్థంగా నిర్వహించాలంటే శరణువేడిన వారి పట్ల 'ప్రీతి' జనించాలి. దాని కొరకై రెండవ పద్యం చెప్పాడు.'భీకరుడైన శత్రువైనను' శరణన్నచో ప్రీతితో గాచువారు దయామయు లనబడుతారని పేర్కొన్నాడు. భయంకరులనే ప్రీతితో బ్రోచుట ధర్మమైనపుడు ఇక్కట శత్రుపీడితుడైన రారాజును బ్రోచుట విధ్యుక్త ధర్మమవుతుంది అని సూచన. ఇక్కట దయామయత్వం ధర్మం. దీని "కిరవుగ" అనగా స్థిరంగా సరివచ్చే ధర్మం మరొకటి లేదని తెల్పటంలో తాత్పర్యం ఇది: ధర్మాలు పెక్కులు ఉండొచ్చు. వానిలో స్థిరం, సార్వకాలికం అయిన ధర్మాన్నే మానవుడు ఎన్నుకోవాలని వ్యంగ్యం. అంతేగాక తన తమ్ముళ్లని అధర్మవర్తులని నెగ్గటం కష్టం. కాబట్టి వారిదీ ఒక ధర్మమే అని ఒప్పుకుంటూ, అది స్థిరమైంది కాదు, నైమిత్తిక మైందని త్రోసివేస్తూ "రత్నహారీతు పార్థివ" అనే న్యాయంతో ఉత్తమ ధర్మాన్నే క్షత్రియుడు గైకొనాలని ప్రతిపాదించాడు. తమ్ముళ్లలో కొంత ఉత్సాహాన్ని కనుగొన్నాడు. కాని, వారు మనసార అంగీకరించటం లేదు. ఇక్కడ చిన్న బెదిరింపు చేశాడు. "నిన్నింక నిర్బంధింపవలవదు" అన్నాడు. "లోకోభిన్నరుచిః" అనే న్యాయంతో తనకు, తన తమ్మునికి భావభేదం గోచరించింది. 'బలవంతపు మాఘస్నానము చేయించటం నామతము కాదు. మీరు కాదన్నచో నా మార్గము నాది. కాని నేను మాత్రం ఈ ధర్మాన్ని విడిచిపెట్టేది లేదు' అన్న మంకుపట్టు ఆ మాటలలో ధ్వనింపచేశాడు. మెత్తని తమ్ముళ్ల హృదయాలు ఈ మాటలతో కొంత బాధ పడతాయని అతనికి తెలుసు. అందుకే వెంటనే తానున్న పరిస్థితీ, అసమర్థత, ధర్మదీక్ష ద్యోతమానమయ్యేట్లు కొద్దిగా తగ్గిమాట్లాడాడు. ఇది ఎదుటి వానిని తనవైపు మొగ్గించుకొనే వాగ్వైఖరి. ఇట్లా సింహాలలాగా పరమపౌరుషమూర్తులైన తమ్ముళ్లను నయభయాదులతో గురుశిక్షాన్యాయంగా ఒక్కత్రాట నడిపించిన ధర్మజుడు నిజంగా ధన్యజీవి. కడు సమర్థుడు.

"ఎన్నడు నిట్టి సాహసము లింక నొనర్పకుమయ్య ! దుర్జనుం
డన్నున సాహస క్రియలయందుఁ గడంగి నశించు గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్"

— అరణ్య. 5.434.

దీనిలో వ్యంగ్యశిల్పం అతిసున్నితం. పైకి మాత్రం ధర్మజుడు దయామయుడై వాత్సల్యం ఉట్టిపడేట్లు రారాజుకు నీతి చెప్పి, జరిగిన దానికి వగవకు మని ఓదార్చి నట్లున్నది. లోతుగా ఆలోచించినట్లయితే ఆ చల్లని మాటలలో వేడి లేకపోలేదు' ఇట్టి సాహసమా' 'దుర్జనుండు' 'నశించు''సన్నుత' 'ఒండొక' అనే పదాలు అన్యాపదేశంగా దుర్యోధనునిలో శల్యాలలాగా ప్రయుక్తాలు కావటం వల్ల శత్రు హృదయపుట భేదనసమర్థాలు అవుతున్నాయి. భీమాదులకు సంతోషకారకాలు అవుతున్నాయి. దీనిని ఓదార్పుగా భావించినా మందలింపుగా భావించినా ధర్మజుని పెద్దరికం, దయాగుణం, ధర్మాసక్తి అత్యంత కాంతిమంతాలే అవుతున్నాయి.

ఇవి అన్నీ ఇలా ఉండగా - సమయ నిర్వహణరూప ద్వాదశవర్షవనవాసవ్రత మంతా ప్రధానంగా ధర్మోపాఖ్యాన శ్రవణంలోనే గడిపాడు ధర్మరాజు. మహా ఋషుల సందర్శన భాగ్యం కల్గినపు డెప్పుడూ అతడు పుణ్య పురుషుల జీవిత చరిత్రలను అడిగి తెలిసికొని వనవాస దుఃఖాన్ని అపనయించు కొనేవాడు. ఒకసారి బృహదశ్వుడనే మహర్షికి అతిథిపూజ చేసి -

"పుడమియు రాజ్యము బంధులు
విడిచి మృగావలులఁ గలిసి విపినంబులలోఁ
గడుకొని మాయ ట్లిడుమలఁ
బడిన నరులు గలరె యొరులు పరమ మునీంద్రా"

— అరణ్య. 2. 3.

అని తన నిర్వేదాతిశయాన్ని వెలిబుచ్చాడు. తనలాంటి కష్టాత్ముడు మరొకడు ఉన్నాడని తెలిస్తే, ఆ చరిత్ర చర్వణంతో ఉత్కటశోకం ఉపశమింప చేసికొని ధర్మధృతి మనస్సులో కుదుట పరచుకోవాలని ధర్మజుని ఆకాంక్ష. బృహదశ్వుడు నలోపాఖ్యానం చెప్పి, అందులో ఆ నలుడు భార్యను, రాజ్యాన్ని బాసి ఒంటిగా పడిన పాట్లను విశదీకరించి అతణ్ని కృతార్థుని చేశాడు.

ఇంద్ర ప్రేరితుడై ధర్మజాదులకు పుణ్యతీర్థాలు దర్శింప చేయటానికై ఋషి వచ్చిన రోమశ మహర్షి వలన ప్రసక్తానువశంగా అగస్త్య చరిత్రం, మాంధాతృ చరిత్రం, శిబి చరిత్రం మొ॥ ఉపాఖ్యానాలను పుణ్య ప్రబంధాలుగా విని యుధిష్ఠిరుడు ధర్మాసక్తి పెంపొందించుకొన్నాడు. మార్కండేయ మహర్షి కూడ ధర్మరాజుకు పెక్కు ధర్మప్రబోధాలను శ్రీరామోపాఖ్యానాన్ని చెప్పి సైంధవ దుర్నయం వలన ఏర్పడిన విపుల దుఃఖం అపనయింప చేశాడు.

ధర్మరాజు భ్రాతృసమేతంగా బ్రాహ్మణుని అరణి తేవటానికి వెళ్లి తిరిగి తిరిగి అలసిపోయి, ఒకచోట తటాకాన్ని చూసి అందులో నీరు త్రాగటానికి వెళ్ళి మూర్ఛితులైన భీమాదులను రక్షించుకోవటానికి యక్షుని ప్రశ్నలకు సమాధానాలిచ్చి ఉత్తమ ధార్మికునిగాను, జ్ఞానిగాను కీర్తిని పొందాడు. అరణ్యపర్వంలో నాయకుడు తాల్చిన ధర్మవ్రతనిష్ఠకు ఉ యముని ప్రశంస నిదర్శనం.

*"ఏను ధర్ముఁడఁ జువ్వె రాజకులేంద్ర సత్యము శౌచమున్*
*దానముం దపమున్ శమంబును దాంతియున్ యశముం బరి*
*జ్ఞాన యుక్తియు నాదు మూర్తులు సమ్మదంబున నిష్ఠ మ*
*త్సూను నుత్తమధార్మికున్ నినుఁ జూచు వేడుక వచ్చితిన్"*

— అరణ్య. 7. 462.

ధర్మరాజు ఉత్తమ ధార్మికుడు అని ప్రకటించటానికి ధర్ముని కంటె అర్హతములు మరెవ్వరు?

## విరాటపర్వ వీర కథలు

విరాట పర్వంలో భీమార్జునుల ఉత్సాహం పాయలు తీరిన మహాతరంగిణిలాగా ప్రవహించి ధర్మజ మహాసాగరంలో లీనమయింది.

మల్లురతో ప్రారంభమై కీచకులతో ఉన్నతస్థాయిని అందుకున్నది భీముని బలవీరం. కీచకుడు ద్రౌపదీ కామాయత్త చిత్తుడైన వాడు. బలవంతంగా ఆమెను పరిగ్రహించాలని సహస్రప్రయత్నాలు చేశాడు. అతని బాధకు ఓర్వలేక ద్రౌపది తనస్థితి భీమునితో మొరపెట్టుకుంది. భార్య కేర్పడిన విపత్తు భీముణ్ణి ద్రవింప చేసి కీచకునిపై పగను రెచ్చగొట్టింది. అత డాతనిని సంహరిస్తానన్నాడు. అవమాన ఘూర్ణితమానస అయిన ద్రౌపది అతని యత్నాన్ని పటిష్ఠం చేయటానికి భీముని ఎదుట

"వాని( దెగ( జూడవై తేని వాయుపుత్ర !
నీవు గను(గొన నురి నైన నీర నైన
నగ్ని నైన విషంబున నైన నేను
మేను దొఱ(గుదు నెట్టు నీ యానసుమ్ము !" —విరా. 2. 229.

అని బెదిరించింది. ఆ మాటల వెనుక ప్రత్యక్షమవుతున్న ఆమెయొక్క భావతైక్ష్ణ్యం, తనను ప్రేరేపించే ప్రయత్నం భీముడు గమనించాడు. నిజంగా అప్పటికే కీచకునిపై నిప్పులు కక్కుతున్నాడు అతడు. ఎదిరి పరాక్రమాన్ని ఊహించి నిర్లక్ష్యంతో కూడిన ధృతిని దాల్చాడు. సతి దానిని గుర్తించటంలేదు. 'ఓ అబలా! నాకింతగా చెప్పాలా' అన్నట్లు ఒక చిరునవ్వు నవ్వి ఈవిధంగా అన్నాడు -

"జలజదళాక్షి కీచకుని( జంపుట కిమ్మెయి ముట్ట( బల్కగా
వలయుదె యేను జూడ ననివారణ నిన్ను ( బరాభవించి వా(
డిల మన నింక నాం(ద్రకును నెవ్వరు భంగము నీ(గ(జాలు వా
రలఘు మదీయబాహుబల మప్పుడు చూపని తప్పు సాలదే."

— విరా. ద్వి. 231.

భీముడు కార్యవాది. "నేను జూడ నిన్నవమానించి కీచకుడు బ్రతుకుటయే" "ఆంద్రకు భంగము గల్గనిచ్చు నాథు లీ భువిపై నెవ్వ రుందు" రని ధైర్యం చెప్పాడు. ఇంకా —

"ఎల్లి యెల్ల విధంబుల నెందు( జొచ్చి
నేని నా ధర్మతనయుండు దాన వచ్చి
యడ్డు పడెనేని నీవ పెంపారు కరుణ(
గాచితేని నాచే( బడు( గీచకుండు." —విరా. 2. 232.

అని భీకర ప్రతిజ్ఞ చేశాడు. ఎన్ని అవరోధాలు ఉన్నా తన కార్యసాధనాన్ని ఆపేది లేదని దీనిలోని తాత్పర్యం. ధర్మరాజ శాసనం అనుల్లంఘనీయం. ద్రౌపది దయ శత్రు రక్షణసమర్థం. ఆ రెండూ అతని యత్నాన్ని ఆపగలిగినచో ఆపగలవు. అవికూడా రేపు ఫలించవు అని చెప్పి భార్య మనసు రంజించేట్లుగా వీరాన్ని ప్రకటించాడు.

## కీచకవధ: భీమపరాక్రమం

కీచక సంహార ఉపాయాన్ని నిశ్చయించి అతన్ని 'సాళువము గాకి నొడిసిన' విధంగా చంపటం తథ్యం అని తేల్చి, ఒకవేళ తనకు దీటైన వాడుగా కీచకుడు అనిపిస్తే వాణ్ణి -

*"అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం*
*బవధూతంబుగ గోత్ర శైలనికరం బాకంపముం బొంద న*
*ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి*
*త్రవధ ప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్."*

— విరా. 2. 284.

అని ఉత్సహించి, రహస్య భేదనక్రమాలను ఊహించి, మరుసటిరోజు నర్తనశాల సమీప సంకేతస్థలానికి వెళ్లి, వనితావేషంలో ఉండగా కీచకుడు కామాంధుడై సమీపించి తన రూప పరాక్రమాదులను కీర్తించుకున్నాడు. అతనితో భీముడు చేసిన గూఢార్థ సంభాషణలు హాస్యానుప్రాణితమైన వీర రసస్ఫోరకాలు. మచ్చుకు:

*"ననుముట్టి నీవు వెండియు*
*వనితల సంగతికి బోవువాఁడవె యైనం*
*దను వేఁ బడసిన ఫలమే*
*కనియెద విదె చిత్తభవ వికారములెల్లన్."* — విరా. 2. 339.

ఇక్కడ వాచ్యంలో వీరం, శ్లేషార్థంలో హాస్యం స్ఫురించి పోష్య పోషక సంబంధంతో ప్రసిద్ధి పొందాయి. వీరాంగమైన హాస్యం వీరుని ముఖంగా ఇంత సమర్థంగా పోషించటం తెలుగు సాహిత్యంలో అరుదు. భీమకీచకుల మల్ల యుద్ధంలో, ఉపకీచక వధలో రౌద్రస్ఫూర్తి ఉంది. అది భీముని బలవీరానికి అంగం. ఆ కారణం వల్ల పాండవుల గార్హస్థ్య ధర్మం సురక్షితమైంది. కాబట్టి కావ్యనాయకాశ్రయమైన ధర్మ వీరానికి ఇది పరిపోషకమవుతుంది.

దక్షిణ గోగ్రహణం సుశర్మచే ఊహింపబడి నిర్వహింపబడింది. అకాల వర్షంగా వచ్చిన గోగ్రహణ వార్త విరాట నగరాన్ని కలవరపెట్టింది. అది విని విరటుడు -

*"ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన*
*స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే మేలుమే*
*లామై తోడనె పోవుఁగాక యని వీరాలాపముల్ పల్కి."*

— విరా. 3. 140.

మంత్రి దండనాథాదులను పురిగొల్పి సుశర్మను ఢీకొనటానికి ఉత్సహించాడు. ధర్మజుడు సమయాన్ని ఎరిగి, విరటుని బలాన్ని ఊహించి, భీమ నకుల సహదేవ సమన్వితుడై తానుకూడా రథారూఢుడై అతని వెంట వెళ్లాడు. విరట సుశర్మల మధ్య పోరు ఘోరంగా సాగింది. అందులో సుశర్మ విరటుని బంధించాడు. సైన్యం అతనిని నిలపటానికి

శక్యంగాక వికావికలై పారిపోవటం మొదలెట్టింది. ధర్మరాజు ఆ స్థితిలో విరటుని రక్షించటం ధర్మమని భీముని ఎదుట ప్రతిపాదించాడు.

"ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రతికి
యున్నవారము గావున నుగ్రరిపుల
పాలువడకుండ విడిపింపఁ బాడి యితని
నెయిదు మెయిదుము ఠథరయ మెనక మెసఁగ."

"అనవుఁడు మేను వెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను నిదె సాలవృక్షము రయంబున దీన నరాతి సేన డొ
ల్ల నడిచి యీ సుశర్ముని బలంబుఁ జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదన్ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్".

"మీ పనిచినట్లు చేసెద
నేపారిన వైరిబలము నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్య మ
హీపతి విడిపించి తెచ్చియిచ్చెద మీకున్".

— విరా. 2.20, 205, 210.

ధర్మజుని యత్నంలో కృతజ్ఞతాభావం నిబిడమై ఉంది. అన్నగారి ఆజ్ఞ భీమ మహార్ణవానికి శరత్పూర్ణిమ. అతని మేను ఉబ్బి పోయింది. అతని రూపం 'మహాబలనందనుడే' అన్నట్లుంది. సాక్షాత్ ప్రభంజనుడే అయినట్లున్నాడు. అందుకే సాలవృక్షం పెరికి రణానికి ఉన్ముఖుడవటం, ఇందులో చక్కని పొందిక కనబడుతుంది. గాలి భూరుహాలను పెగలుస్తుంది. కాని భూధరాలను ఒంపలేదుకదా! "తెచ్చియిచ్చెద మీకున్" అనటంలో ప్రభుభక్తి కంటె భ్రాతృభక్తి విశేషంగా గోచరిస్తుంది. అభిమాన ఘనుడైన భీముడు ధర్మరాజుకు ధర్మానికి మాత్రమే తలవంచుతాడు అనే భావం ఇందులో వ్యంగ్యం. దీనిలో భీముని యుద్ధోత్సాహం మిత్రజన ఆపదుద్ధరణ సమర్థం, శత్రుభంజన సమర్థం. వీరుని బలానికి ఇదే ప్రయోజనం. విరటుని రక్షించటంలో రెండు ధర్మాలు ఇమిడి ఉన్నాయి. అవి. ఉపకారికి ఉపకారం చేయటం, గురుజన వాక్య పరిపాలనం. దీనివల్ల అర్థలాభం ఒకటి ఉంది. విరటుడు లేకపోతే తమకు ఆశ్రయం లేదు. "శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్". అంతేకాక ప్రస్తుతం విరటుని కొలువు చేసే ఉద్యోగులుగా ఉండి ఉండటంవలన అది సేవాధర్మం అవుతోంది. సమయానికి ఉపయోగపడని బలం అజాగళస్తనంలాగా వ్యర్థం. కాబట్టి భీముని బలవీరం నాయకుని ధర్మవీరాన్ని పోషిస్తుంది. వీటన్నిటిని మించింది ధర్మరాజు దయ. విరటునికి అన్ని చెడులు

తలపెట్టిన సుశర్మను వదిలివేయటం తన కోర్కె అని విరటునితో పలికాడు. ప్రాణం రక్షించిన ధర్మజుని అనుమతిని విరటుడు కోరటం, అతడు అనంతమైన దయ ప్రకటించటం వర్ణితమైన ఈ దృశ్యం అసదృశ్యం. ఉదాత్త ధర్మనిష్ఠులైన పురుషుల మనఃప్రవృత్తి కామాది విషయాతీతం కదా!

## ఉత్తర గోగ్రహణం అర్జునుని యుద్ధవీరం

ఉత్తర గోగ్రహణ ఘట్టంలో అర్జునుని యుద్ధవీరం సారవివేక సుధామధురం. దుర్యోధనుడు కురువీర సమేతంగా ఒక్కుమ్మడి ఉత్తర గోగ్రహణం చేశాడు. విరాట నగరంలో ఉత్తరుడు తప్ప వీరులు మరెవ్వరు లేరు. రాజ్యరక్షణభారం, యుద్ధభారం అతనిపై పడింది. క్షత్రియోచితాలైన వీరవాక్యాలు అతడు కూడా పలికి రణోత్సాహంతో బృహన్నలను సారథిగా తీసుకుని కురుసేనవైపు నడిచాడు. కాని, విపులమైన కురురాజ సైన్యాల్ని చూడటంతోనే అతడు భయకంపితుడయ్యాడు. దీనవాక్యాలకు దిగాడు. రథం దిగి వెన్నిచ్చి పరుగెత్తాడు. ఉత్తరుని నోటినుండి పలికించిన వీరాలాపాలు తాత్కాలిక రసోత్కర్షాలైనా పూర్వాపరవిచారంలో ఆభాసగా గోచరించి హాస్యానుభూతిని కలిగిస్తున్నాయి. ఇది అర్జునుని రణోత్సాహానికి అంగం. తదుత్కర్షకు హేతువు. అర్జునుడు ఉత్తరుని భయకంపాదులను ఊతగా గ్రహించి, సైరంధ్రి నియామకం, పౌరదీవెనలు మొదలైన వాటిని హేతువులుగా చెప్పి వాటి గౌరవరక్షణార్థం తానే గోమోక్షణ ఉద్యోగానికి చాకచక్యంగా పూనుకొనటం కడుమనోహరంగా వర్ణితమైంది, ఈ క్రింది పద్యాలలో -

*"నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దానం బెంపుమైఁ బిల్చి తో*
*డని తోడ్తెచ్చితి వీవు బంటుతన మట్లగ్గించి పౌరాళి దీ*
*వన లిచ్చెం దుదిఁబోయి కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ*
*గని యేఁ గ్రమ్మఱి రిత్తవోదునె భయోత్కంపంబు నీ కేటికిన్".*

— విరా. 4. 68.

*"వెఱవకుమన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న*
*త్తెఱ గదియేల నీ కుడుగు తేరికి సారథికమ్ము నాకుఁ జి*
*చ్చుఱ పిడు గెట్టు ల ట్టడరి శూరుల మొత్తము నుగ్గుసేసెదం*
*బఱపెద సేన రాజుధృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్"*

— విరా. 4. 83.

అని కార్యసాధన ఉపాయాన్ని ఎదుటివాని ఎడదకు ఎక్కేటట్లు చెప్పాడు. 'చిచ్చుఱ పిడుగట్టు' అని తన శత్రుసంహార సామర్థ్యాన్ని ఆలంకారికంగా వ్యక్తపరిచాడు.

అర్జునుని పరాక్రమం, కౌరవపక్షవర్తులైన ద్రోణాదులు పొగడటం వల్ల మరింత ప్రకాశిస్తుంది. మచ్చుకు ద్రోణుడు -

"సింగం బాకటితో గుహాంతరమునం జేట్పాటుమై నుండ మా
తంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేయాభిరామాకృతిన్."

"ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లన్మదీ
యాతత సేనలోఁ గలుగు టారయ సంశయ మెల్లభంగి గో
త్రాత నివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసెనా వినమె పెంపెసలారెడు బాహుసంపదన్."

— విరా. 4. 95- 96.

ఆకలిగొన్న సింగంతోడి ఉపమానం, యుద్ధంలో రుద్రుని ప్రీతుని చేశాడనే గత చరిత్ర స్మృతి అర్జునుని అరిజన భయంకరత్వాన్ని నిరూపిస్తుంది.

అర్జునుడు విభావం కాగా శత్రువీరుల యందు ఉత్పన్నమైన ఉత్సాహం అతని యుద్ధ వీరానికి హేతువు పోషకం అవుతుంది. ఉదాహరణకు కర్ణుడు ద్రోణాచార్యుడు ఒనరించిన అర్జున ప్రశంసకు గినిసి వీరలోకాన్ని ఆలోకించి -

"వెఱచితి రేని నిల్వుఁ డొకవీరున కొక్కఁడ చాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము దవ్వుల మేల్మిడిఁ ద్రుంచివైచెదం
బఱపెదఁ దత్పిశాచముల భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నెఱకులు నొంచెదం బొదులు నించెద నర్జును గాత్రశాలలోన్"

"క్రోధజ్వాలలు నిగుడ వి
రోధి బలేంధనముఁ బొదువు క్రూరతమై దు
స్సాధ్య మగు నర్జునాగ్నిని
సాధించెద నేన పూని శరవర్షమునన్."

— విరా. 4. 201, 203.

అన్న మాటల్లో రణోత్సాహం వ్యక్తమవుతుంది. ఇది కిరీటికి విభావం. ఇందులో అర్జునుని యందు పేర్కొనబడ్డది క్రోధభావం వీరానికి సంచారి. "అర్జునాగ్ని.... శరవర్షమునన్" అనటంలోని రూపకాలంకారం సాభిప్రాయం, వ్యంగ్యార్థ సంభరితం, విభావ నిరూపణసమర్థం.

"వీరావేశంబున" కర్ణునిపైకి ఉరికే బీభత్సుని చూచి, సారథిఅయిన ఉత్తరుడు:

"పుట్టినంతనుండి యిట్టివి యెన్నఁడుఁ
గాన నెందు నట్లు గాన చోద్య
మంది యంతరంగ మవశతఁ బొందిన
కతన నింద్రియములకడఁక దక్కె." — విరా. 5. 113.

అని కీర్తించాడు. పతిత కేర్పడే అనుభావాన్నే పాత్రనిష్ఠం చేసి రసాస్వాదనాన్ని ద్విగుణీకృత సాంద్రం ఒనరించాడు కవిబ్రహ్మ. వీర రసజన్యమైన అద్భుతం చూపరులలో వర్ణించి రసోత్కర్షకు పాటుపడు కావ్యకళకు ఇది మరొక ఉదాహరణ.

అర్జునుడు శత్రువీరులపై విజృంభించి వారిని నొప్పించి, ఉప్పొంగి అధిక్షేపించాడు. వారి వచనాలు అతని రణోత్సాహానికి జీవతుల్యాలు. ఉదాహరణానికి అర్జునుడు దుర్యోధనుణ్ణి ఉపాలంభించటం:

"క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ ! యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ బిన్న నిను బోరికిఁ బిల్వఁగ మానినాఁగ ని
ద్ధాత్త్రి బ్రసిద్ధికెక్కి బలదర్ప సమగ్రుఁడ వైన నీవు నీ
మిత్త్రులుఁగూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూపతుల్"

"ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె
మణిమయంబైన భూషణజాలముల నొప్పి యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూర చందన కస్తూరికాదుల నింపు సొంపార భోగింపఁ గలదె
యతిమనోహరము లగు చతురాంగనలతోడి సంగతి వేడ్కల సలుపఁ గలదె

"కయ్యమున నోడిపోయిన గౌరవేంద్ర
వినుము నా బుద్ధి మరలి యీ తనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి చూఱగలదె
జూద మిచ్చుట నాడంగరాదు సుమ్ము""

— విరా. 5. 203 - 204.

దీనిలో ప్రయోగింపబడిన 'క్షత్రియుడు' 'కౌరవరాజు' 'పిన్న' 'బలదర్పసమగ్రుడవు' 'ఇట్లయిన' 'కౌరవేంద్ర' మొదలైన పదాలు వాఙ్మయాస్త్రాలై దుర్యోధనుని హృదయాన్ని ఏచగలిగినవి. 'జూద మిచ్చుట నాడంగరాదు సుమ్ము' అనటంలో ప్రతినాయకుడు కపటపు యత్నాలతో పరసంపద హరించే నేర్పు కలవాడేగాని వీరుని ఎదురుగా పౌరుషంతో ఎదిరి పోరాడే సామర్థ్యం లేనివాడని అధిక్షేపం. గతస్మృతుల వల్ల ఇంద్ర తనూజునిలో ఉత్సాహం 'రాజబెట్ట'

బడుతుంది. కురువీరులతో చేసే యుద్ధంలో అక్కడక్కడా కనిపించే రౌద్రం అతని వీరానికి అంగం. భీష్ముడు సమ్మోహన బాణ పీడితులై తేరుకొన్న కురువీరులను చూసి పలికిన పలుకులు కిరీటికి వీరనీరాజనాలు :

"మోహనబాణపాతమున మ్రందలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి పార్థుని దాఁకెడు బుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనలనందఱ నొక్కట మార్గణాగ్నికిన్".

— విరా. 5. 218.

సంజయుడు ఉపప్లావ్యం నుండి హస్తినాపురానికి చేరి ధృతరాష్ట్రునికి తెలపమని అర్జునుడు పంపిన పలుకులను తెలిపినాడు. అవి వీరరసావలంబనాలు. (ఉద్యో. 2. 134 - 144). మచ్చుకు:

"వనవాసంబున భూశ
య్యను ధర్మజుఁ డున్న యట్టి యాయాసము నా
వునె యంపశయ్య దుర్యో
ధనుఁడు రణక్షోణిఁ బడక తక్కినయేనిన్" ఉద్యో. 2. 136.

తిక్కన వాక్శిల్పానికి ఇది చక్కని ఉదాహరణ. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన. "ధర్మజుఁడున్న యట్టి ఆయాసము" అనే పలుకుబడి మిక్కిలి ప్రౌఢం. ధర్మరాజు అలా ఉండటం వల్ల ఆయాసం ఏర్పడింది. ఎవరికి? ధర్మరాజు ఒక్కడికే కాదు. పాండవులందరికీ ఆ అర్థం ఆవాక్య నిర్మాణంలో ధ్వనించబడింది. అర్జునుడు ఆయాసాన్ని అనుభవించి దాన్ని ఆక్రోశంగా వెలువరించాడు. ధర్మజుడు ఆయాసపడిన వనవాసస్మృతి - భ్రాతృభక్తియుక్తుఁడు, పౌరుషవంతుడు అయిన కిరీటికి విభావమై శత్రు సంహార రూపమైన రణోత్సాహాన్ని రేకెత్తించింది. తమ్ముడు ఆవిధంగా పలికేటప్పుడు అన్న మాట్లాడడు. మౌనం అర్ధాంగీకారమనే న్యాయమున్నా ఇది పూర్ణాంగీకారమే. అర్జునుని పలుకులు పాండవుల ఏకవాక్యతను, ధర్మరాజు పెద్దరికాన్ని, తమ్ముల అన్యోన్యాన్ని, శత్రుగతామర్షాన్ని, రణోత్సాహాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఇలాంటి అర్థస్ఫూర్తికి తిక్కనగారి వాక్యరచనా శిల్పమే ముఖ్యకారణం.

## ఉద్యోగపర్వం : పాండవ యత్నవీరం

ఉద్యోగపర్వంలో కౌంతేయులను ఆశ్రయించింది యత్నవీరం. సామదానాది నీతి ఉపాయాలను అనుసరించి పాండవులు కౌరవులతో సంధి చేసుకొని, తమపాలు

పొందాలని ప్రయత్నించటం, దుర్యోధనాదులు రణానికే బద్ధ కంకణులై ఉత్సాహపడటం ఇందలి ప్రధాన కథాభాగాలు. "యత్నేకృతే యది నసిద్ధ్యతి కోఽత్రదోషః" అనే న్యాయాన్ని అనుసరించి ధర్మరాజు ఇక్కడ "ధర్మనీతి" వర్తనంతో మెలిగి ధర్మవీరుడని కీర్తిని పొందాడు. కౌరవ పాండవ సంధి విధానం ధర్మనీతిబద్ధమని నిరూపించే ధర్మరాజు శ్రీకృష్ణునితో అన్నమాటలు:

*"పగ యడఁగించు టెంతయు శుభం బది లెస్స యడంగునే పగం*
*బగ వగగొన్న మార్కొనక పల్కక యుండగ వచ్చునే కడుం*
*దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే*
*మి గతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా !"*

*"కావున శాంతి బొందుటయ కర్జము దానది యట్టులుండె శ్రీ*
*గావలె నంచుఁ బోరితము గామియుఁ గోరెద మెల్ల సొమ్ములుం*
*బోవుటయుం గులక్షయము పుట్టుటయున్ వెలిగాఁగ నొందుమై*
*నే విధినైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁజుమీ జనార్దనా !"*

*"మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము ధర్మనీతి వ*
*ర్తనముల రెండు దిక్కుల హితంబును బెంపును గల్గునట్టి చొ*
*ప్పున విదురాది సజ్జనుల బుద్ధికి రా నుచితంబుతోడి మె*
*ల్పునఁ బరుసందనంబునను భూపతులెల్ల నెఱుంగ నాడుమీ !"*

— ఉద్యో. 3. 21 - 23.

సామాన్యంగా రాజనీతిలో ధర్మాధర్మచర్చ అప్రధానం. దుర్యోధనుని నీతి ధర్మలుప్తమైనదే. ధర్మరాజు ఆవిధంగాగాక ధర్మాన్ని, రాజనీతిని జోడించి సార్థకనాముడయ్యాడు. పగయందు వైముఖ్యం, కులక్షయభీతి, ధర్మనీతి సంధానం, పైపద్యాలలో ధర్మరాజుకు శాంతి మార్గమైన సంధి యత్నంలో ఔత్సుక్యం కలగటానికి హేతుభూతాలు అవుతున్నాయి. అతని యత్నవీరానికి తమ్ముళ్లు అండదండలై నిలిచి పోషించారు. రౌద్రరసమూర్తి అయిన భీముడు శాంతివచనాలు పలకటం, అర్జున నకులులు సమయోచిత వాక్పటిమతో అన్నను సమర్థించటం దానికి పోషకాలైనాయి. సహదేవ శ్రీకృష్ణులు సంధియత్నం సఫలం కాదని వాదించికూడా ధర్మజుని ధర్మదృష్టిని మెచ్చుకుని అంగీకరించారు. దేశ శాంతిని ఉద్దేశించి సంధి యత్నం జరుపబడింది. సంధి కుదురకపోతే రణానికి ఆయత్తులై ఉండి ఉండటం వల్ల ఇది ఉపాయ సాధనాత్మకమైన యత్నవిశేషమే అవుతుంది. అంటే వారు పరిస్థితులు

అనుకూలిస్తే శాంతవీరులు. లేని పక్షంలో ర
ధర్మనీతి వర్తనం. శ్రీకృష్ణుడు కురు సభలో పాం

"వారలు శాంతిశూరులు భవచ్ఛరణ
న్నా రటుఁగాక మీకది మనంబున
బోరికి వచ్చుచుండుదురు భూవర
కారయఁ బథ్య మేది యగు నవ్విధ

అని ధృతరాష్ట్రునితో పలికాడు. పాండవయత్నా[illegible]
చేసి ప్రదర్శించాడు శ్రీకృష్ణుడు రాయబారపు [illegible]
శ్రీకృష్ణుడు చేసిన యత్నం రాజనీతికి పతాకా[illegible]
యత్నానికి పోషకాలు. నిజంగా సంజయు[illegible]

"ధర్మజునకు భోగంబుల
ధర్మువున ట్లింపుగావు [illegible]
నిర్మలబుద్ధి సహింప[illegible]
గూర్మి గడుం[illegible] [illegible]

ఇంకా —

"ఒకటి గొని [illegible] [illegible]
మూఁట నాల్గింటఁ [illegible]గడు వశ్యములు
యేనిటిని గెల్చి యాఱింట నెఱిఁగి [illegible]
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు" - అతఁడు.

— ఉద్యో. 2.7,37

అలాంటి వివేకంగల బుద్ధినుండి ప్రభవించిందే ఉద్యోగపర్వంలోని 'ధర్మనీతి వర్తనం'.

## యుద్ధ పంచకం: వీరరస వైవిధ్యం

యుద్ధపంచకం యుద్ధవీరానికి ప్రసిద్ధం. దీనిలో వీరమే గాకుండా రౌద్రాద్భుత బీభత్స కరుణాదులు సందర్భోచితాలుగా పోషింపబడ్డాయి. నాయకాశ్రయమైన అంగిరసానికి అవి అన్నీ అంగాలై పుష్టిని చేకూర్చుతుంటాయి. ధర్మమార్గానుయాయులై పాండవులు తమను ఒడ్డు చేర్చు నావికునిగా కృష్ణుని ఎన్నుకొని కురుక్షేత్ర యుద్ధ మహాసాగరాన్ని దాటగలిగారు. పెక్కు ఇక్కట్లు వారిని ఎదుర్కొన్నప్పటికీ, కృష్ణుని సహాయంతో వాటిని

అవలీలగా దాటి లక్ష్యాన్ని అందుకొన్నారు. కవిబ్రహ్మ ఈ పర్వాలను అనన్యసామాన్యమైన ప్రతిభతో నిర్వహించి రసపోషణ చక్రవర్తి అయినాడు. సులలిత కవితా కళా విలాస విన్యాసాలతో అపూర్వభావపోషణా వైశారద్యంతో, రసోచిత అర్థాలంకార ప్రయోగనైపుణ్యంతో తిక్కన తన భాగం నిర్వహించి ఇతరులకు చేతగాని తెలుగుకావ్యశిల్పాన్ని సంతరించాడు. వీరరస పోషణంలో అతడు ఈ పర్వపంచకంలో పాటించిన మార్గాలను కొన్నిటిని స్థాలీపులాకన్యాయంగా తడవి చూద్దాం.

ఒక వీరుడు మరొ కనికి ఉత్సాహం కల్పించటానికి పలికే మాటలలో వీరరసస్ఫూర్తి కలుగుతుంది. ఉదా: అర్జునుడు రాధేయవధాక్రమాన్ని ఊహించి భయపడి ప్రస్వేదకణాలు శరీరమంతా నిండ కృష్ణు డాతనిని కుదుటపరచి అతనిలో రణోత్సాహాన్ని కల్పించాడు. సామాన్యంగా ఇలాంటి ప్రబోధంలో వీరునికి ఉత్సాహం కల్పించటానికి పేర్కొనబడే అంశాలు ఇలా ఉంటాయి. (1) ప్రతినాయకునికంటె నాయకుడు బలవంతుడని నిరూపించటం (2) ప్రతినాయక లోపాలను విశేషంగా పేర్కొని నిందించటం (3) ప్రతినాయకుని వలన నాయకుడు పూర్వమనుభవించిన పరాభవాదులేవైనా ఉంటే వాటిని పేర్కొని అతనిలో రోషం రాజింపజేయటం (4) ప్రతినాయకునితో కలిగే యుద్ధంలో ఆ వీరుడు సాధించబోయే విజయాన్ని అప్పుడే రూపకల్పన చేసి కన్నులకు కట్టునట్లు వర్ణించిచెప్పటం (5) పూర్వం ఏవైన ప్రతిజ్ఞలు చేసి ఉంటే వాటిని ఆ సందర్భంలో పేర్కొని చెప్పటం (6) శత్రువీరులను ఎదుట విభావాలుగా జూపించి ఆ అనుభావ దర్శనంతో అతని లో ఉత్సాహస్ఫూర్తి కలిగింప చేయటం మొదలైనవి. వీటన్నింటికి ఉదాహరణాలు పేర్కొంటే గ్రంథం అతి విస్తారమవుతుందనే భీతితో భావుకుల కీ అంశాన్ని వదలుతున్నాను. మచ్చుకు: కృష్ణుడు అర్జునునితో -

*"కౌరవసైన్య మగ్గలముగాదె కడున్ భవదీయసేన క*
*వ్వారణకోటు లాతురగ వర్గము లా రథసంచయంబు లా*
*వీరభటావళుల్ బహుళవిక్రమకౌతుకి వైన నీ శరా*
*సారములన్ బడల్పడఁ గృశంబగు టప్పుడు నీకుఁ దోపదే."* — కర్ణ. 3. 118.

ఇది మొదటి అంశానికి ఉదాహరణ. మూడవ అంశానికి ఈ కింది పద్యం ఉదాహరణ: జూదసమయంలో అప్పుడా సభలో ద్రౌపది నుద్దేశించి ఆపాపాత్ముడు -

*"లే రిచట మగలు నీకును*
*వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్*
*వారిజలోచన నీపైఁ*
*గూరిమిఁ గల మగని వెదకికొను మొరు ననఁడే."* — కర్ణ. 3. 123.

ప్రబోధితుడైన వీరునిలో ఫలరూపమైన రణోత్సాహాన్ని వర్ణించి ఒక ఉపక్రమ ఉపసంహార విధానం సంతరించటం కథాకథన శిల్పం. అర్జునుడు కృష్ణునితో :

"నీ తోడ్పాటున నేఁ ద్రివిష్టపముల గ్లల్వంగ నూఁకింతు; నా
చేతం గర్ణుఁడు రూపుమాసి చను; మెచ్చింతున్ నినుం జూఁడుమీ
దైతేయాంతక ! యంచు శేషనిభహస్తం బుద్ధతిం జాఁచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంతకోదండమున్." —కర్ణ. 3. 130.

కృష్ణప్రబోధార్థచర్వణం కర్ణాదుల దర్శనం మొదలైన వానివల్ల ఏర్పడిన ఉత్కటోత్సాహమే గాండీవ ధారణకు అర్జునుని పురికొల్పింది.

ప్రతినాయకగత రణోత్సాహం వర్ణించటం వీరరసనూ... తోడ్పడుతుంది. ఇక్కడ దుర్యోధనుడు ప్రతినాయకుడు. అతడు తన సేన... భీష్మాదులను ఒకరు గతించిన తరువాత ఒకరిని సర్వసైన్యాధ్యక్షునిగా నియమిస్తూ వచ్చాడు. వారు రారాజు పక్షాన పోరాడారు. ఇట్లా పోరాడేవారు ప్రకటించే ఉత్సాహం కూఁ. ప్రతినాయక పోషకమైన ... మనటానికి తగింది. కర్ణుడు సర్వసైన్యాధ్యక్ష పదవిని స్వీకరించి చేసే ... ఇలాంటిదే.

"విను నీ కిచ్చినబాస యే మఱతునే ...ంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీ భూలోకసంచారు లె
ల్లను గీర్తింపఁగ బాండుపుత్త్రు మదోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయంబైన సంగ్రామమున్."

— కర్ణ. 1. 55.

సేవావ్రత ధర్మాన్ని ఆశ్రయించి కర్ణుడు పలికిన ఉత్సాహపు పలుకులు రసపోషకాలు.

ప్రతినాయక సహాయుల నోట నాయక బలాధిక్యాన్ని కీర్తింపజేసి 'రాజు కోరుతున్నాఁడు కాబట్టి తప్పదని, విధి అని యుద్ధము చేస్తున్నా' రన్నట్లు వారిని రణరంగానికి పంపి యుద్ధం చేయించి నాయక పరాక్రమాదులను వ్యంగ్యంగా ప్రకాశించేటట్లు చేయటం వల్ల నాయకాశ్రిత వీరం పుష్టి చెందుతుంది. ఉదా: భీష్ముడు శరతల్ప గతుడై రారాజును చూచి పలికిన పలుకులు :

"నరుఁ డత్యద్భుతవిక్రముం డతని కా నారాయణుం డాప్తుఁ డె
వ్వరికిన్ వీరి జయింపరాదు సమరావష్టంభముం దక్కి ధ
ర్మరతుండైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మి మ్మర్ధ రా
జ్యరమం బొందుము మీరు కొందరయినం జాకున్న నీ కొప్పదే"

— భీష్మ. 3. 435.

కర్ణుడు భీష్మునితో అన్న మాటలు:

"వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింపరామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
క్ష్మారమణుండు సేయు తగు మన్ననలెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక యే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే" —భీష్మ. 3. 447.

భీష్ముడు పాండవులు బలవంతులని రారాజును సౌమ్యంగా బెదరిస్తున్నాడు. కర్ణుడు పాండవ బలాన్ని గుర్తించి రాజు చేసే మన్ననలకు ప్రతిఫలంగా తన పరాక్రమాన్ని కుదువ బెడుతున్నాడు. ఇట్లా శత్రువీరులలో ఒక సమైక్య శక్తి లేదు. చేతలు వేరు. చేతములు వేరు. దీనికి విరుద్ధం నాయక పక్షం. అందరు ఒక్కత్రాటనే నడుస్తారు. ధర్మరాజును అందరు కలిసి పాదివి సమర్థిస్తూ రక్షిస్తారు. ప్రాణాలకంటె ఎక్కువగా గౌరవిస్తారు.

"భవ్యంబైన బలాధిపత్యమునకుం బట్టంబు గట్టుండు న
న్నవ్యాకీర్ణగజాదియై మెఱయు సైన్యశ్రేణిఁ బాలించి కౌ
రవ్యోత్సాహముఁ బెంచి మార్కొనిన వీరవ్రాతముం ద్రుంచి నా
దివ్యాస్త్రంబులఁ బంచి పాండవుల దీప్తిన్ మాయఁ జేయించెదన్"

— ద్రోణ. 1. 74

అని భీషణప్రతిజ్ఞ చేసిన ద్రోణుడు, రారాజు ధర్మరాజు నిమ్మని కోరినపుడు నరుని పరాక్రమం తలచి భయపడి యిలా అన్నాడు :

"నరుఁ డెడసొచ్చెనేని విను నా కది దుష్కర మే నొకండనే
సురగణమైన వ్రేలిఁగొని చూపఁగఁ జాలరు వాఁడు లేనిచో
దిరమయి పోర నిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది పుట్టినింట వే
వురు వెఱగంది చూడ నలవుం జలముం జెడఁ బట్టితెచ్చెదన్."

—ద్రోణ. 1. 113.

ఇందులో అర్జునాదులు అన్ని వేళల నాయకుణ్ని పరిరక్షించటం, అందునా అర్జునుడు దుర్నిరీక్ష్యుఁడై ప్రజ్వలించటం పాండవ సమైక్యాఖండశక్తిని వ్యంగ్యంగా బోధపరుస్తుంది.

శత్రువీరుల ప్రతిజ్ఞలు విభావాలై తద్భావనతో నాయకాదుల లో ఉత్కటోత్సాహం వ్యక్తమవుతుంది. ద్రోణుని ప్రతిజ్ఞను విని ధర్మజుడు దాన్ని తమ్ముళ్లకు తెలిపి విచారించగా అర్జునుడు :

"గురుని వధియించుటయు భూ
వర నీవని నొవ్వకుండువలను ననుటయుం
బరికింప నొక్కరూ పవి
దురితంబులు వీనిఁ జేయుదునె యే నెందున్."

"క్షోణీవల్లభ విను మేఁ
బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా
ద్రోణునక కాదు సగణ
స్థాణునకైనను వశంబె తలఁ కేమిటికిన్." — ద్రోణ. 1. 119-120.

అని వీరాలాపాలాడటం దీనికొక ఉదాహరణ.

ప్రతినాయక పక్షవర్తులు నాయకునిలో అభిమానం కలిగి ఉండటం, సమయం వచ్చినపుడు వారికి చేతనైనంత సాయం చేయటం నాయక విజయ హేతువులై వారి ఉత్సాహాలను ఇనుమడింప చేస్తాయి. భీష్మద్రోణులు తమ మరణ రహస్యాలను పాండవులకు చెప్పటం, కర్ణుడు గాండీవిని తప్ప పాండవులలో మరెవ్వరిని సంహరించనని కుంతికి వరమివ్వటం, శల్యుడు కర్ణహృదయాన్ని శల్యం చేయటం దీనికి చక్కని ఉదాహరణాలు.

యుద్ధ పంచక విభాగం ఒక విచిత్ర కథా కథన విశేషాన్ని తెలుపుతూ పాండవ వీరుల యుద్ధపాటవాన్ని చాటుతుంది. పాండవులకు ధృష్టద్యుమ్నుఁడు సర్వసేనాని. సౌప్తిక పర్వాంతం వరకు అతడు సజీవునిగా ఉన్నాడు. కౌరవులకు నలుగురు సేనానులు మారారు. వారిని ఒక్కొక్కరిని సంహరించటంలో పాండవ యత్నం నిరూపించటమే ఒక్కొక్క పర్వం యొక్క ప్రయోజనం. క్రమంగా క్షీణించే కౌరవ వీర నివహం ఒకవైపు, కొంత తరిగినా మూలబలం చెదరని పాండవ బలం మరొకవైపు ఉన్నపుడు తారతమ్య దృష్టితో పరిశీలిస్తే పఠితకు నాయకుని యుద్ధసాధన సామర్థ్యం వ్యక్తం కాకపోదు.

యుద్ధ పంచకంలో కనబడే వీరులలో ప్రతివాడూ ఉత్తమునిలాగా భాసించి, కారణజన్ముడైనట్లు, ఏదో ఒక వైయక్తిక ధర్మాన్ని ఆశ్రయించి యుద్ధం చేసినట్లు గోచరిస్తారు. ప్రతినాయకుడైన దుర్యోధనుడు కూడ తాను యుద్ధం చేయటం దైవికమైన ఆత్మధర్మమని పూర్వమే నిరూపించి మనకు ఆశ్చర్యం కలిగించాడు.

*"మునులారా ! నన్ను విధి యే*
*మని మును బుట్టించె నట్టులయ్యెడుఁ గా కీ*
*వినఁ జవిగాని పలుకులకు*
*బనిగలదే యుడుగుఁ డింక బహుభాషణముల్"* —ఉద్యో. 3. 325.

క్రాంతదర్శులు, ఋషిపుంగవులు అయిన నారదాదులను చూసి రారాజు అన్న మాటలివి. "నా జన్మ రహస్యమును త్రికాలజ్ఞులయిన మీరు గుర్తింపలేదా !" అని ఎగతాళి చేశాడు. అరణ్యపర్వంలో పాతాళలోకంలో రాక్షసులు సుయోధను జన్మరహస్యం తెలిపే ఘట్టంలో (అరణ్య. 6. 43-49) ఈ విషయం స్పష్టమవుతుంది.

మహాత్ములు, ధర్మవర్తులు అని కీర్తిగాంచిన ప్రతిపక్షవీరులకు అగ్ని పరీక్షవంటి క్లిష్ట పరిస్థితులను ఏర్పరచి వాటి నివృత్తి కొరకు వారి చేత ఘోరమైన అధర్మం చేయించి, ఆ కారణంగా నాయకునిలో నిర్దయతో కూడిన రణోత్సాహం కల్పించి, ధర్మదీప్తమైన యుద్ధవీరాన్ని పోషించటం ఒక పద్ధతి. ద్రోణపర్వంలో పద్మవ్యూహ భేదనం చేసి, శత్రువీరులను చెండాడి ప్రచండ పరాక్రమంతో అవలీలగా రణకేళి సలుపుతున్న అభిమన్యుడు కౌరవులకు అసాధ్యుడు అయినపుడు, యుద్ధావేశంతో ద్రోణుడే అతని వధ వంచన వల్ల సాధ్యమని సూచించాడు. (ద్రోణ. 2. 105). దాన్ని ఆధారంగా తీసికొని కర్ణాదులు ఒక్కుమ్మడిగా బాలుని చుట్టుముగి అతన్ని విరథుణ్ణి చేసి మరణానికి మార్గాన్ని ఏర్పరచారు. ఈ కృత్యానికి హేతువు ద్రోణుడు. అతడు పరిత్యక్త జీవుడైన తరువాత అతని కంఠాన్ని ధృష్టద్యుమ్నుడు తెగనరికాడు. ఆకృత్యం పలువురికి దారుణం, అధర్మం అనిపించింది. అర్జునుడు ఆ క్రియను గర్హిస్తూ ద్రుపదాత్మజుణ్ణి నిందించగా ధర్మజుడు అడ్డం వచ్చి ద్రోణుడు అధర్మవర్తి కాబట్టి అతనిని చంపటం న్యాయమే అని ఇట్లా వాదించాడు.

*"ఆ సభఁ బాంచాలి గాసిసేయఁగ నుపేక్షకుఁడయి నుండెఁ బెక్కంద్రఁ గూర్చి*
*కొని బాలు నభిమన్యుఁ గూల్చె, నించుకవడి యాగిన నర్జునుఁ డగ్నిఁ జొచ్చు*
*ననువగ మనల నతనికిఁ దోడ్పడఁబోవ నీకాఁగె నమ్మెయి నిట్టి ధర్మ*
*చరుఁడైన కలశసంభవునితో సరివచ్చు టుచితంబె...."* —ద్రోణ. 5. 379.

దీనిలోని కాకుస్వరం అతని హృదయంలో ఉన్న అక్కసును వెళ్ళబోస్తుంది. ద్రోణుని క్రౌర్యానికి, ధర్మవిరహితత్వానికి రోసినవాడు కావటంవల్లనే "అశ్వత్థామ అను కుంజరం హతమైన" దనే వాక్యం పలకటానికి అంగీకరించాడు.

పాండవ పక్షవర్తులైన వీరులందరూ ధర్మజుని ధర్మమార్గం ఆశ్రయించిన వారు కావటం వల్ల వారి ఉత్సాహం ఎన్ని ప్రయోజనాలతో కూడి ఉన్నా ఆ ధర్మవీరంలోనే

అంతర్లీనమవుతూ ఉంటుంది. ఉదా: అభిమన్యుని రణవీరం. ద్రోణ విరచితమైన పద్మవ్యూహం పాండవులకు దుర్భేద్యమైనది. దాన్ని ఛేదించగల కళాకోవిదులు కృష్ణార్జున ప్రద్యుమ్నాభిమన్యులు. వారిలో అప్పుడు ఎదుట ఉన్నవాడు ఉత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్ష్యుడైన అభిమన్యకుమారుడు. ధర్మరాజు, వ్యూహపు మొనను చీల్చమని అతనిని కోరాడు. అంతటి పెద్ద తండ్రి తనను అభ్యర్థించగా ఆనాడు అతని జన్మకు ఒక పర్వదినమైంది. గురువు ఆజ్ఞను మీరరాదనే ధర్మబుద్ధి అతని ఉత్సాహాన్ని పెంపొందించింది.

*"దీని ముఖంబు భేదించు తెఱంగు నా కెఱిఁగించె మాతండ్రి యేను దెఱపి*
*సేయనేర్తుఁ జొచ్చి చించి చెండాడెద; మూఁకలెల్లఁ జుట్టు ముట్టినపుడు*
*వెడలునట్టి వెరపు విన, నాచొచ్చు నేర్పు బులుపు చూడు మధిప"*

— ద్రో. 2. 5.

అని రాబోయే కీడును లెక్కచేయకుండా - మోమును చేటంత చేసికొని కొండంత మేనును పెంచి ఉత్సాహపడ్డాడు. "వెడలునట్టి వెఱవు విన - దానికేమి" అనటంలో ప్రాణాలపై నిర్లక్ష్యం, వయసుకు ఉచితమైన మదం, మొండితనం, గుండె నిబ్బరం "మీ కొరకు నేను ముందు వెనుకలు ఆలోచించేవాణ్నికాను; ఎలాంటి పరిస్థితుల్లో ఎలాంటి క్రియకైనా సిద్ధమే" అనే త్యాగం, భక్తి ప్రస్ఫుటమవుతున్నాయి. ధర్మరాజు అడగటంలో అభిమానాన్ని రెచ్చగొట్టే మెలిక మాటలను "పార్థుండు మనల నుల్లసమాడకుండ నీ లావు మెఱసి భేదించి మా కెల్ల ప్రియమొనర్చు కుమార" అని పలికాడు. "మనల" అని సౌభద్రుని కూడ కలుపుకొని పలకటంలో పితృపరోక్షాన అతడు శత్రువిజయం సాధిస్తే అది కీర్తి దాయకం అనే భావం ఉంది. అది అభిమన్యునిలో యశోకాంక్షకు దారితీసింది. అది స్పష్టంగా అభిమన్యుడు భీమునితో పలికిన పలుకుల్లో వ్యక్తమవుతుంది.

*"నను విను కీచకాంతక మనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య*
*మ్మొనఁ గలఁ గింప కిట్లు కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం*
*చిన జతనంబు నిష్ఫలము సేయుదునే నరుఁడున్ సుభద్రయుం*
*దనయునిఁ గాంచి సంతసము దాల్చుట యంతయు రిత్త బుత్తునే"*

*"ఇదె యొక పిన్నవాఁ డదరి యెక్కుడు మూఁకల క్రందు దోలెడుం*
*గదుపుల వెల్చు గోపకుని కైవడి నంచు జనుల్ నుతింపఁ జే*
*సెద విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు నంతసిల్ల బె*
*ట్టిదుఁ డగు కౌరవేంద్రునకు దెప్పర మయ్యెడు భంగిఁ బేర్చెదన్"*

— ద్రోణ. 2. 10-11.

ఈ మాటలలో యశోనుప్రాణిత యుద్ధోత్సాహం ప్రకటిత మవుతోంది. యుద్ధ విజయాలకు యశస్సు ఆనుషంగికమైనా ఇక్కడ అభిమన్యుని చేత అది ప్రత్యేకంగా అతిశయంగా కోరబడటం వల్ల ఉత్కటస్థితిని తాలుస్తుంది.

అభిమన్యుడు స్వీయ పరాక్రమంపై ఎక్కువ నమ్మకం కలవాడు. అందువల్లే సాభిమానంగా తనను గూర్చి చెప్పుకుంటూ ఉంటాడు. అధికారికి ఆత్మశ్లాఘనం అలంకారమవుతుంది కదా! అది దురభిమానం కారాదు. అంతేకాని - అభిమన్యునికి యుద్ధానుభవం లేదనీ, సమర కర్కశులైన కురువీరులతో పోరాడటానికి అది అదనుకాదని సారథి అడ్డంకు చెప్పినపుడు

*"అనవుడు నల్లనవ్వి యతఁ డాతని కిట్లను దేవయుక్తుఁ డై*
*యనికి బలారి వచ్చినఁ బురారిగణంబులుఁ దాను బన్నినం*
*గినిసి కడంగి క్రీడియును గృష్ణుఁడు దాఁకిన నే జయింతు మా*
*ర్కొని యనుచుండుదున్ సరకు గొందునె ద్రోణునితోడి యోధులన్"*

— ద్రోణ. 2. 15.

అని వీరాలాపాలు పలికాడు. అతని నవ్వు శాత్రవ బల నిర్లక్ష్య సూచకం. సూతుని అజ్ఞానంపట్ల అవహేళనాత్మకం. అతని పూనిక తన మాటను నిలబెట్టుకొనటానికేనట. అదనుకు పరాక్రమం చూపకపోతే తనపూర్వ ప్రతిజ్ఞలు ప్రగల్భాలై తాను నిందింపబడతాడు. కాబట్టి ఇందులో మానవీరచ్ఛాయలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. అభిమన్యునిలో ఇన్ని భేదాలతో గోచరించే ఉత్సాహం, ధర్మజశాసన అనువర్తనం కావటంవల్ల దానికి అంగంగా నిలబడి అతని ఉత్సాహాన్నే వ్యంగ్యంగా పోషిస్తుంది.

ఒక వీరుడు శత్రువుతో డీకొన్నపుడు స్మృతి రూపంలో అతడు చేసిన దుర్ణయాలను స్వయంగా భావించి ద్విగుణీకృత ఉత్సాహంతో ఉపాలంభనాయత్త చిత్తుడై శత్రుమర్దనానికి ఉత్సహించటం రణవీర స్ఫూర్తిని కలిగిస్తుంది. అభిమన్యుడు పద్మవ్యూహ యుద్ధంలో దుశ్శాసనునిపై లంఘించి -

*"అనఘుని ధర్మనందనుని నాసభ నమ్మెయి నీవు నొవ్వఁ బ*
*ల్కిన ఫల మందఁజేసెదఁ జలింపక యించుకసేపు నిల్వుమీ*
*నిను లఘుచిత్తుఁ గూరు నవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం*
*చిన గరువంపుఁ దండ్రులకుఁ జిత్తమెలర్ప ఋణంబుఁ దీర్చెదన్."*

— ద్రోణ. 2. 50.

అని తంద్రులను తూలనాడిన దుశ్శాసనుణ్ణి ఉపాలంభించాడు. పగవాణ్ణి పొరిగొనే పౌరుషం అతనిలో పొంగిపొర్లింది.

శత్రువీరులలో ఎవరైనా విశేషపరాక్రమం ప్రకటించి నాయకునికి తీరని నష్టం కలిగించినపుడు అతడుగాని, అతని అనుయాయులుగాని వానిని సంహరించటానికి ప్రతిజ్ఞ చేస్తే వారిలో వీర రసస్ఫూర్తి కలుగుతుంది. ఉదా: సుభద్రా తనయునికి ధర్మరాజాదులు సహాయం చేయకుండునట్లుగా సైంధవుడు అడ్డుపడినాడు. అది తెలిసిన సవ్యసాచి యిట్లా ఘోర ప్రతిజ్ఞ చేశాడు —

*"వినుఁడీ నాదు ప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్ సింధురా*
*జు నవశ్యంబును నెల్లి సంపుదు భయస్థుండై నినుం జొచ్చినన్*
*వనజాక్షున్ శరణంబు వేఁడినను గర్వంబేది నన్నుం దగం*
*గనినం బోరు దొఱంగిపోయిన నెఱుంగంగాని సత్యవ్రతా !"*

*"ఇట్లు సేయనైతినేని గురుద్రోహి*
*గతికి బ్రహ్మఘాతి గతికి మద్య*
*పానరతుని గతికి మానార్హ జనపరి*
*వాదిగతికిఁ బోవువాఁడ నధిప !"*

*"అనిమిష దైత్యకింపురుషు లాదిగ నెవ్వరు వచ్చి కాచినం*
*దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్త్రుఁడు గ్రుంక కుండ ము*
*న్న నరవరేణ్య యిత్తెఱఁగు నా కొనరింపఁగ రాక యున్న నే*
*ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండివంబుతోన్."*

— ద్రోణ. 2. 281-283.

రగులుతున్న కొలిమిలాగా తనలో తాను రోషానలజ్వాలలను పెంచుకొంటూ ప్రతీకార వాంఛా సంబంధమైన ఉత్కటోత్సాహాన్ని తెలిపే ఉష్ణపు పలుకులు ఈ శపథాలు. ఈ ప్రతిజ్ఞ శ్రీకృష్ణుని ముందు చెప్పబడటం వల్ల మరల చర్విత మై (ద్రోణ. 2. 307-313) అర్జునాశ్రితమైన యుద్ధ వీరాన్ని పుష్టినొందిస్తోంది. ఇలాగే వస్తు నాయక సమాశ్రయంగా వీరరసం పెక్కు తీరులలో ప్రస్ఫుటమై సరసులచే ఆస్వాద్య మానమవుతుంది. వాటిని విజ్ఞులకు వదులుతున్నాను.

రసజ్ఞుడైన కవి తన కావ్యంలో రసోచితమైన అలంకారిక రచనం చేసి, రసోత్కర్షకు పాటుపడుతుంటాడు. 'కవిబ్రహ్మ' ఇలాంటి కావ్యకళలో సిద్ధహస్తుడు. ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష, నిదర్శనం, దృష్టాంతం, ఉల్లేఖం, అర్థాంతరన్యాసం మొదలైన సర్వజనపరిచితాలైన

అలంకారాలను మాత్రమే ఎన్నుకొని మారుమూలలైన వాటిని వదిలి ఉపమాన ఉపమేయ ధర్మవైరుధ్యంగాని, అతివ్యాప్తి అవ్యాప్తి దోషాదులు కాని లేకుండా ఔచిత్యం ఎరిగి అలంకారం ప్రయోగించే నేర్పు అతనికి వెన్నతో వచ్చిన విద్య. 'ఆంధ్రావళిమోదముంబొరయ' రచించటానికి పూనుకొన్నవాడు కాబట్టి పండిత పామర నుగ్రాహ్యావై ఆలోచనామృతదాయకమైన ఆలంకారిక రచనాన్నే అనుసరించాడు తిక్కన.

యుద్ధవీరుని ప్రతాపం కళ్లకు కట్టినట్లు వర్ణించటానికి అతడు "అగ్గలిక దూది దరికొను నగ్గి తెఱంగున" (భీ. 2. 163); "వెరవున గోపకుఁడు గదుపు వెలిచిన మాడ్కిన్" (భీ. 2.125); "ఘన శార్దూలంబు బాలమృగంబులం గని గవియు చందంబున నెదుర్కొని (భీ. 2. 236); వెరపుగల వనపాలకుండు తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున మెఱుంగు లడరు వెడంద వాతియమ్ముల నమ్మహీశుల తలలు డొల్ల నేయుచు - (భీ. 3. 63); బలుమానిసి చలిచీమలం గాలం జమరు చందంబు దోఁచె(భీ. 3. 230); కార్చిచ్చు గవిసి మృగతతి నేర్చు కరణి (భీ. 3. 278); నోరికండ నాఁచికొనిన మ్రోగు బెబ్బులి విశేషము దోఁపఁగ (ద్రో. 2. 25); వట్టి యడవి ముట్టి యేర్చు కార్చిచ్చు చందంబునం జతురంగ బలంబులం బారినమరినం (ద్రో. 2. 60); చిచ్చు మిడుతపిండు నేర్చు చెలువముఁదోచెన్ (ద్రో. 2. 77); లేళ్ళ గమిం గనిన బెబ్బులి యుబ్బు దోఁప (ద్రో. 2. 78); పసుల నడుమ సొచ్చు పులివోలె (ద్రో. 1. 126); "గాడ్పు తోడుగల యగ్నిదేవుండును బోలెఁ దేజరిల్లి (ద్రో. 4. 294); "వానపైఁ గురియ వంచిన మస్తక మొప్పఁ బోవు సుందరవృషభంబువోలె (ద్రో. 4. 154) ఇటువంటి ఉపమానాలను రసోదంచితంగా అనుసంధిస్తుంటాడు. వీటి వల్ల తిక్కన కున్న విపుల లోకానుభూతి గోచరమవుతుంది. దీనికి తోడు అతని ప్రకృతి సౌందర్యావిష్కరణోత్సాహం అతని కవితలో అడుగడుగున ద్యోతకమవుతుంది. భీష్ముని చతుర్థ దివస యుద్ధంలో రంగంలో నిలిచిన సైన్యద్వయం తిక్కన కళ్లకు —

"కారుకొని మేఘమాలా
కారంబునఁ జాల నొప్పెఁ గౌరవసైన్యం
బారూఢ వీరరస వి
స్ఫారంబై యంతఁ దోఁచెఁ బాండవబలమున్." —భీష్మ. 2. 169.

కౌరవసైన్యం 'కారుమేఘాలంకారంబున'అని ఊహించిన కవి ప్రతిభ అనన్యసామాన్యం. భావుకునికి అనంత రసవృష్టి కురిసే ఉపమ అది. పాండవసైన్యం ఆరూఢ వీరరస విస్ఫారమట. కాలమేఘంలో నైల్యం వర్ణనవ్యంగ్యంలో భయానక బీభత్స రసాలను ధ్వనిస్తోంది. వీరరసం అనేపదం పాండవసైన్య గౌరవర్ణ ఛ్ఛాయను ధ్వనిస్తోంది. రసనామ

ప్రయోగం వల్ల పాండవ సైన్యోత్సాహం ఉత్కటమని వ్యంగ్యం అవుతుంది. ఇట్టి శిల్పాలు తిక్కనలో అనంతాలు. ఇంకా - మండలీకృత కోదండుడు, పటుసంధాన స్ఫురిత శర నికరుడు అయిన అభిమన్యుని "బరివేషములోనం గిరణస్ఫురణ దుర్నిరీక్ష్యుండగు తపను ననుకరించె" అనటంలో (భీష్మ. 2. 39) ప్రకృతి పరిశీలనాపాటవం సమయసూచనం వ్యక్తమవుతున్నాయి. నాయకుని ఏకైక వీరునిగా నిరూపించటానికి అనన్వయాలంకార మార్గాన్ని అనుసరిస్తూ —

*"కృష్ణసారథ్యమున నొప్పు క్రీడి యిపుడు*
*కౌరవానీకముల నెల్లఁ గసిమసంగి*
*కృష్ణసారథ్యమున నొప్పు క్రీడి యైన*
*నెట్లు సేయంగవలయుఁ దా నట్లు సేసె"* — భీష్మ. 2. 92.

అని మెప్పించటంలో తిక్కనకు తిక్కనే సాటి.

ద్వంద్వయుద్ధం వర్ణించే సమయంలో వీర ద్వంద్వాన్ని వర్ణించటంలో తుల్యబల నిరూపణంలో తిక్కన పోయిన తీరులు ఒకటి రెండు గమనించండి. (1) భీష్ముఁ డర్జునునిపై బాణముల వెల్లువలు కురిపించగా -

*"ఆ వెల్లువ శరజిహ్వలఁ*
*ద్రావి ధనంజయ మహాగ్ని దరికొని కవియం*
*గా వెగడొందెడు కురుబల*
*దావము శాంతనవుఁ డంబుదముక్రియఁ గాచెన్"* — భీష్మ. 2. 45.

విరుద్ధ గుణాలను తుల్యావస్థలో ప్రకటించి ఇద్దరు బలాలను నిరూపించే వైఖరి ఇది. ఇలాగాక - "వృషభంబులక్రియ నొండొరుల మార్మలయుచు"(ద్రోణ. 4. 191.) కొఱవి గొఱవిం దాకిన విధమునం దలంపడి" (ద్రోణ. 4.154) మొదలైన సమాన లక్షణాలు కలిగిన ఉపమానాలతో తుల్యబలాలను ఒక్కొక్క చోట తిక్కన నిరూపించాడు. ఉపమానాలను తీసికుని రణక్రమం నిరూపించటంకూడా ఉంది. కర్ణ భీములు —

*"బలు దేగలకై వడి బె*
*బ్బులుల పగిది మత్తకరుల పోలిక దర్పో*
*జ్జ్వల సింహముల చాడ్పున*
*నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రారథిక వరుల్"* —ద్రోణ. 4. 181.

అని వర్ణించటంలో ఒక చక్కని క్రమవికాసం ఉంది. రెక్కలు విదులుస్తున్న డేగలు

అనటంలో బాహువులు అప్పళించుభంగిమ, బెబ్బులి ఉపమానంలో కుప్పించి పైకి ఎగయటం, గర్జించటం, మత్తకరుల పోలికతో బాహాబాహి, కచాకచి ఇత్యాది మల్లయుద్ధ విశేషాలు, ఉజ్జ్వల సింహాలనటం వల్ల పౌరుష అమర్షోగ్రసమగ్రస్ఫూర్తి ధ్వనితాలై రణక్రమ వికాసాన్ని ప్రకాశమొనరుస్తున్నాయి. ఇలాంటి మాలోపమలను సామాన్యంగా తిక్కన విశేష ఘట్టాలలో మాత్రమే వాడతాడు. రణనిహతుడైన అభిమన్యుని వర్ణనం దీనికి చక్కని ఉదాహరణ.

*"జగము లన్నియును దేజంబున వెలిఁగించి యపరాద్రి సేరిన తపనుమాడ్కిఁ*
*దఱచైన కానలు దరికొని నివుఱుగాఁ జేసి యారిన డవశిఖి విధమున*
*గగనంబుతో రాయు కరడులు గల జలం బివురఁ బారిన మహార్ణవము కరణి*
*నున్నత గతి సెడి యుర్విపైఁ గడు విన్ననై పడియున్న సుధాంశుభంగి*
*బీరమునఁ దమవారికిఁ బెం పొనర్చి*
*యరుల సమయింప్ప్ వసమతి యనువు దప్పి*
*తెగియుఁ జూడ్కికిఁ జాల వ్రేఁగగుచుఁ బొలిచె*
*మహితమూర్తిశోభితుఁ డభిమన్యుఁ డధిప."* — ద్రోణ. 2. 126.

అభిమన్యునిలో అంతకు పూర్వం వెలుగందిన దుర్నిరీక్ష్యతేజం, శత్రుభంజన సామర్థ్యం, అతిలోకగాంభీర్యం, మనోహర చారుత్వం, అఖండాభిమానం స్మృతిలో స్ఫురించేట్లు రచించిన ఈ సీసం తిక్కన రసావేశనివాసం.

కవితాశిల్పానికి కాణాచి అయిన తిక్కయజ్వ యుద్ధపంచకాన్ని వీరరసావతారంగా తీర్చిదిద్ది కృతకృత్యుడయ్యాడు. తరువాత కవులకు యుద్ధవీర రచనా శిల్ప భిక్షపెట్టాడు. శాంత్యనుశాసని కాశ్వమేధ పర్వాలలోని నాయకవృత్తాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ భూపతి లక్ష్మీనారాయణరావుగారు సరసంగా ఇలా అన్నారు. "అమానుషమగు పాప మొనర్చిన దుర్యోధన దుశ్శాసనులను జంపుటచే గ్రోధము శాంతించినది. తాత్కాలికమగు తృప్తి కల్గినది. కాని, సకల హిత బంధువర్గనాశనముచే గల్గిన శోకావేగ ముత్కటమై సత్పురుషుడగు ధర్మరాజు మనస్సు వికలపరచినది. ఇంతటి పాపమునకు కారణమగు రాజ్యసంపదను బూర్తిగా విసర్జించుటయే తనకు కర్తవ్యమని ధర్మజుడు నిశ్చయించినాడు. పశ్చాత్తాపమున కిది ముఖ్య లక్షణము. ధర్మజుని మనోవైకల్యము పోవుటకును, మనస్సు ప్రశాంతత నొందుటకును గురూపదేశ మవసరము. అంతియగాక విశిష్టజ్ఞానోపేతు డగు కర్మయోగిగా ధర్మజుడు పరివర్తన మొందవలసి యున్నది. ప్రజాపాలనకు జనక మహారాజుల వంటి జీవన్ముక్తులే యర్హులని భారతీయుల యభిప్రాయము. కనుక ప్రజాపాలన భారము

నిర్వహించబోవు ధర్మరాజునకు సమగ్రమగు నైహికాముష్మిక జ్ఞానము మిక్కిలి యవసరమై యున్నది. ఇట్లు శాంత్యనుశాసనిక పర్వ గతమగు విషయమంతయు బ్రధానేతివృత్తముతో సమన్వయము చెందుచున్నది. జ్ఞానోపదేశమునం జేసి స్వధర్మోన్ముఖుఁడైన ధర్మరాజు రాజ్యభారము వహించి, వ్యాసబోధితుఁడై లోకహితార్థ మశ్వమేధమును వేదోక్తవిధమున నిర్వహించి దేశమునందలి రాజుల నెల్లర నేకైక ధర్మశాసనబద్ధులం గావించినాడు. అంతియేకాక నిరాసక్తుడై వేదోక్తములగు కర్మల నాచరించుట వలనను, స్వధర్మమును శ్రద్ధతో నిర్వహించుట వలనను గృహస్థుడు భవబంధ విమోచనము బడయగలడను విషయము ధర్మరాజు నశ్వమేధ వృత్తాంత మూలమున వ్యక్తీకరింపబడినది. ఈ పర్వమున వర్ణితమైన సక్తుప్రస్థుని వృత్తాంతము స్వధర్మ విశిష్టతను నిరూపించుచున్నది"[4]

## అశ్వమేధపర్వం : దయావీరం

అశ్వమేధపర్వంలో ధర్మరాజు యొక్క దయావీరానికి అర్జునుని యుద్ధవీరం అంగంగా నిలిచి పోషించింది. సవనాశ్వాన్ని అనుసరిస్తూ అర్జునుడు ధర్మరాజు తనతో పలికిన పలుకులనే ఎదురుపడ్డ ప్రతిరాజుకు తెలియజేస్తూ దయాభావాన్ని ప్రదర్శించాడు.

*"కవిసిన వానితో మఱియు గవ్వడి యిట్టు లనున్ దయాధురా*
*ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్డు భూ*
*పవితతి యెల్లనుం దెగియె భారత యుద్ధమునందు బాలురం*
*దివిరి వధింపఁ గాదు కృప దిన్నదనం బెనఁగం జరింపుమా !"*
*"అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిరయేని నీవు బాం*
*ధవము దలిర్పఁ బల్కి యనిఁ దప్పఁగ బ్రోవుము గిన్క మాను"*

-అశ్వ. 4. 278.

అన్న ధర్మజుని మాటలు ధర్మరాజు దయామయ హృదయభావ స్పందనలు. అహింసా ప్రధానమైన ధర్మయజ్ఞం నాయకుని హృదయశాలలో ప్రారంభమై ఉండటం వల్ల ఈ పుణ్య వాసనలు విరివిగా వ్యాపించాయి. వాటిని గంధవాహునిలాగా ఇంద్రతనూజుడు దిగంతాలవరకు ప్రసరింపజేశాడు.

సవనాశ్వాన్ని అడ్డగించి, పరాక్రమవంతులై త్రిగర్తదేశాధినాథులు తనను ఎదిరించినప్పటికీ, ధర్మరాజ ప్రబోధంతో దయను కలిగిన అర్జునుడు సమయోచితంగా యుద్ధపాండిత్యాన్ని ప్రకటించలేక గాండీవాన్ని జారవిడుచుకున్నాడు. అప్పుడు వీరులు

---

4. 'భారతము - తిక్కన' - పుట. 158-15!

కొందరు -

> "ఇంద్రధనువుచందమున నెసక మెసఁగు
> గాండివము పాటు గంటిరే చండవిక్ర
> మాభిరాముండు గాండీవి యన్నపలుకు (ధర్మజుని మాటలకు)
> లకు మహోగ్రత సూప నొల్లండుగాక" — అశ్వ. 4. 14.

అని అర్జునుని మనస్తత్వాన్ని వ్యాఖ్యానించారు. శత్రువీరులు పంతానికి యుద్ధానికి దిగి ఔద్ధత్యం ప్రకటించగా మానధనుడైన నాయకునికే క్రోధం రావడం సహజం. కాని, అర్జునునికి క్రోధం రాలేదు. అతనిలో ధర్మజ ప్రేరితమైన దయాభావంతో క్రోధం లోపించిందని భావం. ఆ తరువాత నిజంగా అర్జునునికి కోపం వచ్చింది. దానికి కారణం గాండీవ పతనాల వల్ల అవమానం, అవినయ ప్రధానమైన శాత్రవోద్ధతి. ఇక్కడ ఉన్న విభావానుభావ వర్ణన ఎంత రసోదంచితమో చూడండి —

> "అటమున్న గాండివం బు
> త్కటరయమున నెత్తి కోపదహనుం డత్యు
> ద్భటమూర్తిఁ దాల్చె నన
> మిక్కుటమై కడకంటికెంపు గొమరారంగన్"

ఆ బీభత్సుండు,

> "పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ
> బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటువిశిఖము ల
> ప్పుడు మేదిని దోఁపద చె
> ప్పెడుకొలఁదియె రథిక వరుల పీనుఁగు పెంటల్" — అశ్వ. 4. 16 - 18.

ధనుస్సు వెంటనే ఎత్తటం, కోపదహనుడౌటం, కడకంటి కెంపు కోపభావానికి అనుభావాలు. 'బీభత్సుడు' అన్న శబ్దం అర్థశక్తితో అర్జునుడు వైరి బలాన్ని బీభత్సం చేయడానికి ఉత్సాహం చూపిస్తున్నాడనే భావం కలిగిస్తుంది. అలాంటి క్రోధం కలిగిన అతని కార్ముక నిర్ముక్తబాణవితానం పిడుగుల వరుస అనటంలో అలంకార ధ్వని ఉంది. ఒక్కొక్క విశిఖం ఒక్కొక్క వజ్రాయుధం. ఇంద్రుని ఆయుధశక్తి అంతా ఒక్క బాణంతో సమానం ఈ అర్జునునిలో. 'రథికవరుల పీనుగు పెంటల్' అనటంవల్ల మహారథికులతో మాత్రం పోరాడి సైన్యాన్ని జాలితో వదిలి వేసినట్లుగా అర్థం జనిస్తుంది. సింహం, గజేంద్రమస్తిష్క మాంసఖాదనం చేసే పద్ధతి ఇది. ఇదంతా అర్జునునికి ఒంటపుట్టిన కోపం కాదు. పాలపొంగు వంటిది మాత్రమే. 'అన్నమాట' ను నిరాదరించారని శత్రువుల మీద "కలిగిన తాత్కాలిక

మానసోద్రేకమే గాని మరొకటి కాదు. క్షణంలో అతని కోపం అధికమైంది. పోయిన వారుపోగా మిగిలిన వారి బంధువులు శరణువేడగా అతని కోపం అప్రయత్నంగా చల్లారింది.

"ఆయుగ్రోద్ధతి చూచి పెల్కుఱి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయం బాఱెఁ దదాప్తు లేము దగ నీపం పోపి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారి నెల్లం గృపన్."

వ. అట్లు వెనుకొనక నిలిచి యెలుంగెత్తి వారలతో మీ రిట్లు ప్రాణంబులు గాచి కొనుండు నాపంచినపని సేయంబూని బుద్ధిగలిగి సుఖులరై యుండుఁ డని యయ్యశ్వంబు ననుసరించె

— అశ్వ. 4. 19, 20.

పై మాటల్లో శరణు కోరిన వారిని కాపాడవలెనన్న ధర్మంతోపాటు శత్రువీరులకు తగిన బుద్ధి చెప్పి తరువాత వారిని కూడా దయతో కాపాడాలనే భావం కూడా కనిపిస్తుంది. లేకపోతే గొంతెత్తి రాజలోకాన్ని పిలవాల్సిన అవసరంలేదు. 'కృపన్' అనే శబ్దానికి అదే అర్థం. ఆ అర్థం:

"చంపకుమీ రాజుల నను
కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెం పను కుసుమమునకు
నాపం పొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ." — అశ్వ. 4. 34.

అన్న ధర్మరాజు ఉపదేశంతో అతని హృదయంలో నాటుకుంది. ఇలాంటి ప్రవృత్తే అశ్వమేధపర్వమంతా కనిపించింది. ధర్మరాజు అఖిలపృథ్వి స్వీయాయత్తమైనట్లుగా అశ్వమేధ యాగాన్ని సలక్షణంగా నిర్వహించాడు. ఆ సామ్రాజ్యమంతా ఋత్విగర్చనంగా ధారపోసి నిష్కామాన్ని, నిర్వ్యామోహాన్ని ప్రకటించి ధర్మబద్ధమైన దాన వీరాన్ని ప్రదర్శించాడు. ఈవిధంగా ధర్మరాజు ధర్మసంస్థితి అనేకవిధాలుగా ప్రదర్శింపబడటమే కాక శోధింపబడింది. సంభోగశృంగారం విప్రలంభంతో ఏ విధంగా నిగ్గుదేలుతుందో ఆ విధంగా ధర్మోత్సాహం ధర్మసంకట పరిస్థితుల్లో నాయకుడు ప్రదర్శించే ధృతిని ఆశ్రయించి పుష్టిని, వికాస విస్తరాలను పొంది సారవంతమౌతుంది. ధర్మరాజు జీవితంలోని ఇలాంటి ఘట్టాలెన్నో మహాభారతంలో ఉన్నాయి.

## ధర్మరాజు : ధర్మవీరం

ధర్మరాజు కేర్పడిన ధర్మపరీక్షలు ప్రధానంగా రెండు విధాలు. అవి: మానవ పరీక్షలు, దైవ పరీక్షలు. మానవ పరీక్షల్లో భీమార్జున శక్తి యుక్తులను ఉపయోగించి విజయాన్ని సాధించాడు. దైవకృతమైన ధర్మ పరీక్షల్లో స్వీయమైన ఆధ్యాత్మిక శక్తిని, ధర్మదీక్షను ఉపయోగించి సర్వస్వతంత్రుడై వ్యవహరించాడు. దైవ పరీక్షల్లో మకుటాయమానం ఈ క్రింది చరమపరీక్ష. దీనిలో ప్రదర్శింపబడే ధర్మస్థితికి 'దేవత్వ'మే ఫలం.

ధర్మరాజును ఆశ్రయించి వచ్చే సారమేయం, స్వర్గప్రదేశానికి అనర్హమనే ఇంద్రుని మాటలు నాయకునికి అగ్ని పరీక్షల్లాంటివి. శునకం మీద అమేయ దయాప్రపూర్ణుడుగా ఉన్నాడు ధర్మరాజు. అతని ధర్మబుద్ధి చలించలేదు. ఇంద్రునితో -

"....................................................... విను భక్తియుక్తుని విడుపు బ్రహ్మ
హత్యఁ బోలెడి పాప మని చెప్పుదురు పెద్ద లట్లు గావున దీని నఖిలధర్మ
సారజ్ఞ! విడుచుట చనదు దివ్యసుఖంబునకుఁ గాఁగఁ బాపంబునకుఁ జొరంగఁ,
జాల"

— మహా. 1. 55.

అని సర్వభూతదయా విశేషరూపధర్మాన్ని ప్రతిపాదించాడు. భక్తి యుక్తమైన శునకాన్ని వదిలినట్లైతే బ్రహ్మహత్యాదోషం, కలుగుతుందనటంలో అతని పుణ్యశీలం స్పష్టమౌతుంది. 'విడుచుట సనదు' అనటంలో అతని ధృతి, పట్టుదల, ధర్మస్థితి వ్యక్తమౌతున్నాయి. 'దివ్యసుఖం........జాల' అని అనటంలో అతని వివేకసహితమైన జ్ఞానం, ధర్మం కొరకై ఎంతటి సుఖాన్నైనా అవలీలగా త్యాగం చేసే బుద్ధి ధ్వనిస్తున్నాయి.

మహేంద్రుడు శునకాన్ని తాకితే సుకృతం నశిస్తుందని ధర్మరాజును బెదిరించాడు. అది ధర్మరాజుకు బలమైన ప్రతిపక్షం. సురేంద్రుని పలుకు కాదనరాని మాట. ఇటు ఆశ్రితులను వదలటం అనేది దయలేని చేత అవుతుంది. ధర్మరాజు హృదయంలో సంఘర్షణ ఏర్పడింది. అలాంటి సమయంలో కార్యసాధన కౌశలం వల్ల పరిస్థితిని తనకు అనుకూలంగా మార్చుకొను అతని నేర్పు అసమానం. ఇంద్రుడు :

"*జనులు నుతింపఁగా సుకృతసంపదఁ జేసి యమర్త్యభావముం*
*గనియును జెంద కి ట్లునికి కార్యమె ద్రౌపది భీమసేను న*
*ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత చాలితి చాల వయ్యె దీ*
*శునకము విడ్వ నిత్తెఱఁగు సూరినుతుం డగు నీకు నర్హమే.*"

ధర్మరాజు :

"............................అఖిల లోకములకుఁ బతివి ధర్మమునకుఁ బ్రభువ విట్టి నీకంటె నెఱుంగుదునే సద సత్ప్రకారము లట్లుఁగాక వాదము మాహాత్మ్ము లయిన వారలతోడ నగునె చేయంగ నైనను విన్నవింపఁదగిన తెఱంగు విన్నవించుట దోషవిధము గా దనియెడు బుద్ధిఁజేసెద నేను బూని విన్న పంబు భీమముఖ్యులును ద్రౌపదియుఁ జచ్చి, రేను వారల విడువక యేడ్చుచున్న వత్తురే తోడవచ్చి చావని శునకము, విడువకుండుట తప్పుగా నుడువఁదగునె"

"అనఘచరిత్ర ! నిన్ను శరణాగతుఁ జేకొన కున్కి శుద్ధ మి
త్త్రునియెడఁ జేయు ద్రోహము వధూటి వధించుట విప్రునర్థముం
గొనుట యనంగఁ గల్గు నివిగూడ సమం బగు నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిన్ విడుచు దోషముతో నిది యోర్పవచ్చునే."

"కావున నాకలోకపుసుఖం బటు లుండగ నిమ్ము దేవ నీ
భావము నిల్పు నాదెసఁ గృపాభరితంబుగ సారమేయ సం
భావనసేఁత దోసముగఁ బట్టమిఁ నాకు వరంబు నీవు పా
మ్మీ వనభూమి నుండెద సమిద్ధతపంబుల నిన్న కొల్చుచున్."

—మహా. 1. 56 - 59.

ఒకవిధంగా వీరిద్దరి మధ్య ధర్మసంఘర్షణాత్మకమైన చర్చ బయలుదేరింది. ఇంద్రుడు త్రిలోకాధిపతి; ఇతడు మర్త్యలోకాధిపతిమాత్రమే. అందువల్లనే ధర్మరాజు అత్యంత వినయం ప్రకటించటం. వినయశ్రద్ధా భక్తులు ఉట్టి పడేటట్లు సత్యనిరూపణలోను, దోష నిషేధంలోను, ధర్మ పోషణలోను ప్రబలేచ్ఛను ప్రకటించి గతించిన వారిపట్ల దుఃఖాతిశయోపశమన అనంతర ప్రబల నైరాశ్యాన్ని, ప్రకృతవిషయాలలో సంపూర్ణ ధర్మ నిర్వహణ పారీణతను వహించి ధర్మనిర్ణయాధికారంతో శునకాన్ని విడవటాన్ని పంచమహా పాపాలలో ఒకటిగా నిరూపించి ఆ పాపం కలగకుండా ఉండేట్లు వరం కోరుతున్నాడు. వరం ఇవ్వకపోతే ఇంద్రుని గూర్చి సమిద్ధతపం చేస్తానని పలకటంలో గడుసుదనం ఒలికించి, ఇంద్రుని మనసు కదలించాడు. ఇంద్రసుతాదులను వశపరచుకొనే మంత్రమే ఇంద్రుని పట్ల కూడా ప్రయోగించాడు. అతని 'ధర్మనీతి' వర్తనం అటువంటిది. ధర్మ వినయ దయాదిగుణ ప్రకాశకమైన ఈ వాక్య రచనా విధానం విషయ నిరూపణ సమర్థం అవటమే కాక విషయాతీతుడైన దైవాన్ని ఆర్ద్రపరచింది. సారమేయరూపుడైన ధర్ముడు విలువున పులకించి నిజరూపం ధరించి ధర్మజుని ధర్మస్థితిని వేనోళ్ల కీర్తించాడు.

ఈ విధంగా సర్వకాల సర్వావస్థలలో ధర్మనిష్ఠను జన్మవ్రతంగా ఉత్కటోత్సాహంతో సాధించి తదానుషంగిక ఫలమైన కీర్తిని, శాశ్వతఫలమైన స్వర్గాన్ని పొంది, ఐహికాముష్మిక సుఖాలను పొందిన ధన్యాత్ముడే మహాకావ్య నాయకుడైన ధర్మరాజు. అనితర సాధ్యమైన అస్థితి అతని ధర్మప్రవర్తనం వల్లనే కలిగింది. లౌకికులైన ధర్మశూరులకు ఆదర్శవంతుడైన అలౌకిక ధర్మవీరుడు ధర్మరాజు.

ఇంద్రుఁడు

"ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున నిట్లనియె"

"దానములం దపంబులను దద్దయుఁ బే ర్కలయట్టివారలన్
మానవనాథులన్ వినమె మాసెఁ దదీయ యశంబు లెల్ల నీ
మానిత కీర్తి దీప్తులు సమస్త జగంబులయందుఁ బర్వుట
న్మేనులతోడ వారిటులు నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్" —మహా. 1. 69.

త్రిలోకాధిపతి పలుకులు కావ్యనాయక కీర్తిజయపతాకలు !!

## ధర్మవీరం రసామృతం

ఈ విధంగా నిర్వహింపబడిన ధర్మరాజు ధర్మమయ జీవితంలో శాంతరసం అంగంగా కలిగిన వీరరసం సర్వాంశాలలో వ్యాప్తమైనట్లుగా నిర్బాధగా చెప్పవచ్చు. అలంకారికులైన ఆనందవర్ధనాదులు మహాభారతాన్ని శాంతరస ప్రధానమైన కావ్యంగా నిర్దేశిస్తారు. కాని, అదే ఆనందవర్ధనాచార్యులు "రసస్తు కథానాయకాశ్రయః తద్విపక్షాశ్రయోవా' అని నిర్దేశించిన దానిని బట్టి కావ్యగతరసం నాయకాలంబనంగా భావించినట్లు తెలుస్తున్నది. సామాజికులు ఆ నాయకాశ్రితాలైన భావాలను తాదాత్మ్యంతో "యస్తుష్టే తుష్టి మాయాతి....' ' అన్న భరతోక్తి అనుసరించి అనుభవిస్తారు. నాయకుడు వీరరసాశ్రయు డైనట్లయితే సామాజికుడు వీరరసానందాన్నే పొందుతాడు. శాంత రసాశ్రయు డైనట్లయితే శాంతాన్నే పొందుతాడు. ధర్మరాజు స్వర్గారోహణ పర్వాంతం వరకు ఉన్న తన జీవిత వృత్తంలో మోక్షాన్ని పొందినట్లుగా ప్రతిపాదింపబడక అతని ప్రవృత్తి ధర్మాచరణానికి ఫలరూపంగా స్వర్గప్రాప్తి నిబంధింపబడింది. అందువల్ల నాయకుడు స్వర్గఫలకమైన ప్రవృత్తిధర్మాశ్రయం కలవాడని తెలుస్తున్నది. అట్లాంటి అతని ప్రవృత్తిధర్మం నివృత్తిధర్మరూపమైన మోక్షజ్ఞానంతో మెరుగులు పెట్టబడినప్పటికీ అతడు కథావ్యాప్తిలో ధర్మవీరుడే అవుతున్నాడు. అతనిలో కనిపించేది ధర్మవీర రసమే అన్న భావనలో ఇక్కడ రసచర్చ చేయబడింది.

ఒకవేళ కౌరవ వృష్ణి యాదవ వంశాది నాశనంతో సామాజికులకు కలిగే నిర్వేదాన్ని బట్టి మహాభారతం నిర్వేద ప్రధానమనికానీ, అందువల్ల అది మోక్ష ఫలకమని కాని చెప్పటం సరిపోదు. వారికి అందులో కలుగు నిర్వేదభావం అక్కడక్కడ జరిగిన మోక్షోపదేశాలతో తొలగి విరిసిపోవడం సంభవిస్తున్నది. నాయకునిలో అట్లాంటి ప్రవృత్తే గోచరిస్తుంది. అందువల్ల సామాజికులకు నిర్వేదమే మిగులుతుం దనటం సమంజసం కాదు. నిజంగా భారతంలో ధర్మవిషయ ప్రశంస వచ్చినప్పుడెల్లా భీమాది పాండవులు, కురువృద్ధులైన భీష్మాదులు, ద్రుపదాది రాజులు, వ్యాసాది మహర్షుల యొక్క దృష్టులు, ప్రశంసలు ధర్మరాజులోనే కేంద్రీకృతం కావటం సర్వత్రా కనిపిస్తుంది. అంతేకాక కథాంతంలో కూడ ఒక్క ధర్మరాజే స్వర్గారోహణాంతం వరకు మిగిలి ఉండటాన్ని బట్టి సామాజికుల చిత్తవృత్తి మొదటినుండీ ధర్మరాజుతో సహానుభూతి, తాదాత్మ్యాన్నీ పొందుతూ కథాంతం వరకు కూడా ఆ అనుభూతులను చుట్టుకొని ఉండటంలో విప్రతిపత్తి లేదు. అలాంటప్పుడు నాయకుడైన ధర్మరాజు కథాశ్రవణంతో ధర్మరాజు లాంటి ధర్మాధిష్ఠాతకు మానవజీవిత సహజాలైన విఘాతాలు కలగటం, అవి పెద్దల ఉపదేశాదులతో కలిగే స్థైర్యాదులతో పరిహారాలు కావటాన్ని గుర్తిస్తూనే సహృదయులు ప్రవృత్తి ధర్మాచరణ నిష్ఫలం కాక ఉత్తర జన్మలో స్వర్గఫలప్రదమనీ, అధర్మాచరణ దుర్యోధనాదులకు లాగా నరకప్రద మని తెలుసుకుని పాపవర్జన పూర్వకంగా స్వర్గాదిఫలమైన ధర్మాచరణలో ఉత్సాహంలై ప్రవర్తించి ధర్మరాజు లాగానే ధర్మవీరులు కావటానికి ఎక్కువ అవకాశాలున్నాయి. అట్లా నాయక దృష్టితో చూచినప్పటికీ, నాయక సామాజికుల దృక్పథాలతో చూచినప్పటికీ మహాభారతంలో అంగిరసం శాంతరసం కాక ధర్మవీరమే అని నిశ్చయింపవచ్చు.

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు భారతంలో శాంతరసం అంగిగా స్ఫురించటం లేదని సూచించారు. కాని, వ్యాసభారతం శాంతరస ప్రధానమని అంగీకరించారు. "(సంస్కృత) భారత మున్నది, భారత మహాకావ్యం యొక్క మహాకావ్యార్థము శాంతరసమునందు బర్యవసించుచున్నది. అది శాంతరస పర్యవసాయి యగుట వ్యాసోపజ్ఞక మైన విషయము. నన్నయ చేసిన చేత వేఱు, తిక్కన చేసిన చేత వేఱు, ఆయన దృష్టి వేఱు, ఈయనదృష్టి వేఱు. మహాకావ్యము యొక్క సమిష్టిమీద సంస్కృత భారతమునందు నిర్ణీతమైన శాంతరసము తెనుగు కావ్యము నందు కూడ సహజముగా బర్యవసింప జేసికొనవచ్చును గాని యెచ్చట నీ శాంతరసమునకు నద్భుతగులునో చెప్పలేము. ఆంధ్ర మహాభారతము భిన్న కర్తృక మగుట చేత నా యిబ్బంది కలుగదు. ఇది చాలా అగాధమైన విషయము" అన్న అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు.[5] వారి దృష్టికూడా 'భారతము ధర్మవీర

5. జయంతి, 'నాచనసోముఁడొకఁడు' వ్యా.

ప్రధానం' అన్న నా ఊహకు ప్రోద్బలకంగానే ఉన్నది. శాంతరస ప్రధానంగా, వ్యాసోపజ్ఞకంగా నిర్మింపబడ్డ సంస్కృత భారతం కంటె భిన్నమార్గంలో నడపబడ్డ ఆంధ్రమహాభారతంలోని రసం, శాంత రసం కానప్పుడు న్యాయంగా ధర్మవీరరసాన్నే అంగి రసంగా అంగీకరించటానికి వీలుపడుతుంది కదా!

సాధారణంగా కావ్యరసానికీ కథానాయకాశ్రిత రసానికీ - నాయకుని చరిత్రే కావ్యం కనుక - భేదముండదు. కాని కావ్యరసం అన్నప్పుడు నాయకాశ్రితమైన అంగాంగి రసాలతోపాటు, ఇతర పాత్రాశ్రయాలైన రసాలు వ్యక్తం అయినప్పటికీ అవి నాయకాశ్రితమైన అంగిరసాన్నే మింగి వేయకూడదు. ఆ దృష్టితో చూచినప్పటికీ ఆంధ్ర మహాభారతంలో భీమాదు లనునాయకులుగా కలిగిన ప్రధాన నాయకుడైన ధర్మరాజు నాశ్రయించింది - వీరరసమనే భావింపబడి ఈ చర్చారంభం నుండి ప్రతిపాదింపబడింది.

కొందరు భారతంలో శ్రీకృష్ణుడు నాయకుడని, దానికి ప్రోద్బలకంగా సంస్కృత భారతంలోని 'నారాయణం నమస్కృత్య' అన్న ఉపక్రమాన్ని, హరివంశంతో జరిగిన ఉపసంహారాన్ని, మధ్య మధ్య నిబంధింపబడిన శ్రీకృష్ణ మాహాత్మ్య సందర్భాలను, భగవద్గీత, సనత్సుజాతీయం, మోక్షధర్మోపన్యాసాలు మొదలైన గ్రంథాంశాలను కలిపి చదివి వీనినే గ్రంథతాత్పర్య నిర్ణాయకమైన లింగాలుగా భావించి వీటి పర్యాలోచనతో అది శాంతరస ప్రధాన మని భావిస్తున్నారు. ఇటువంటి సందర్భం శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు సంస్కృత భారతానికి సరిపెట్టుకున్నా సరిపోవచ్చునేమో కాని ఈ విషయంలో కూడ భిన్న మార్గంలో నడచిన ఆంధ్ర మహాభారతానికి అలాకాదేమోనని నేను భావిస్తున్నాను. దాని కుపస్కారకంగా వెనుక స్పృశింపబడని ఒకటి రెండు కారణాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

(1). ఆంధ్రమహాభారతంలో నన్నయభట్టారకుడు 'నారాయణం నమస్కృత్య....' అన్న అర్థసందర్భం కలిగేట్లు కాక, "శ్రీ వాణీ గిరిజా......పురుషోత్తమాంబుజభవ శ్రీ కంధరాః..."అని మూర్తిత్రయ స్మరణంతో గ్రంథోపక్రమం చేశాడు. తిక్కన సోమయాజి భారతాన్ని సమగ్రంగా ముగింప దలచినవాడై "హృదయాహ్లాది.........ఉద్యోగాదులం గూడగా బదునేనింటఁ దెనుంగు బాస జనసంప్రార్థంబు"గా రచింపదలచి, 'హరివంశ' రహితంగ తన గ్రంథో సంహారాన్ని చేయదలచినట్లు స్పష్టమౌతుంది. పరమజ్ఞాని అయిన తిక్కన సోమయాజి వాసుదేవతత్త్వ ప్రతిపాదకమైన హరివంశాన్ని కూడా గ్రహించినట్లైతే ఆ గ్రంథ తాత్పర్యం వేరుగా నిర్ణయింపవలసి ఉండేదేమో! మధ్యలో భగవద్గీతాది మోక్షప్రతిపాదక గ్రంథాంశాలను కావ్యరస పోషణదృష్టితో చాలా వరకు తగ్గించి రచించటంలో కూడ శాంతరస తాత్పర్యాన్ని ఆంధ్రభారతంలోని వీరరసానికి అంగభూతంగా చేయటానికే అయ్యుండవచ్చునని మనం ఊహించవచ్చు.

(2). భగవానుడైన శ్రీకృష్ణుడు భారతంలో ప్రధాన నాయకుడై ఉన్నప్పుడు "వాసుదేవస్య మాహాత్మ్యం - పాండవానాం చ సత్యతాం - దుర్వృత్తం ధార్త రాష్ట్రానాం" అన్న వ్యాస వచనానికి తగినంత సార్థక్యం కలగదు. దీనిని బట్టి పాండవుల సద్వృత్తం ధార్తరాష్ట్రుల దర్వృత్తం దానికనుగుణంగా వాసుదేవుని మాహాత్మ్యం భారతంలో ముఖ్యమైన ప్రతిపాద్యాంశాలుగా ఏర్పడుతున్నాయి. మూడింట రెండంశాలుగా ఉన్న పాండవ కౌరవుల సద్వృత్త దుర్వృత్తాలు అన్వయ వ్యతిరేకాలతో ధర్మాశ్రయాలనీ, వాటికి పోషకంగా శ్రీకృష్ణమాహాత్మ్యం ప్రపంచితమైన దనీ, మనం ఊహించటం సహజం. ఈ దృష్టితో కూడా శ్రీకృష్ణుని చరిత్ర వివిధ మహిమల కాస్పదమైనట్టిదై పాండవ ధర్మ రక్షణ పరత్వంతో కూడి ఉన్నట్లు చిత్రింపబడటం వల్ల ఆయన భారతంలో ఉపనాయకుడనే చెప్పవచ్చు. అలాంటప్పుడు భగవన్మాహాత్మ్యం స్వాశ్రయ రక్షణతత్పర మౌట వల్ల దాని గౌరవం ఇనుమడిస్తుంది. "నాయకం ప్రాగుపన్యస్య వంశవీర్యశ్రుతాదిభిః న తస్యైవ వధం బ్రూయాత్" (భామహాలంకారం) అన్న ఆలంకారికాదేశాన్ని బట్టి కథామధ్యంలో నాయకవధకాని, మరణం కాని నిబంధింపరాదు. దీనికి విరుద్ధంగా శ్రీకృష్ణనిర్యాణం కథామధ్యమంలోనే కూర్చబడటం వల్ల, అది సాంప్రదాయికం కాకపోవటంవల్ల శ్రీకృష్ణునికి కథానాయకత్వం కల్పించటం పొసగదు. నాయక నిర్యాణమైన తరువాత చేర్చిన హరివంశం ఐతిహాసిక దృష్టితో దానిమహిమను ప్రతిపాదిస్తున్నట్లుగా నిలబడటాని కవకాశముంటుందే గాని కావ్యదృష్టితో అటువంటిది పొసగదని సహృదయులు గుర్తింపకపోరు. ఈ విధంగా శ్రీకృష్ణుడు కథానాయకుడు కానప్పుడు పరిశేష న్యాయంలో ధర్మరాజు కాక తప్పదు. "సమగ్ర గుణః కథావ్యాపీ నాయకః" అన్న లక్షణం ధర్మరాజులో నూటికి నూరు పాళ్ళు ప్రవర్తిస్తుందని భారత పరిశీలకులకు గోచరిస్తుంది. 'భారతం,' 'జయం' అన్న కావ్యనామాలు కూడా ధర్మరాజు యొక్క చరిత్రౌన్నత్యాన్ని 'నాయకో ధర్మవిజయీ లోకోత్తర గుణోత్తరః' (విష్ణుధర్మోత్తర ఖండం) అన్న దృష్టిని బట్టి అతని ధర్మ విజయాన్ని ప్రతిపాదించేవిగా ఉండి అతని నాయకత్వానికి ఏకవాక్యతను సంపాదిస్తున్నాయి.

భారత విమర్శకుల్లో కొందరు నాయకుడైన ధర్మరాజు పొందింది మోక్షమే అనీ, దానిని ఫలింపజేసే శాంతరసమే రచనను ఆశ్రయించుకున్న ప్రధానరసమనీ అంటారు కాని అదికూడా సత్యం కాదు. కావ్యశాస్త్రంలో సుపరిష్కృతంగా శాంతరసం 'న యత్ర దుఃఖం న సుఖం న చింతా న ద్వేషరాగౌ నచకాచి దిచ్ఛా, రసస్తు శాంతః" (నాట్యశాస్త్రము) అని వర్ణింప బడింది. అటువంటి స్వరూపం ధర్మరాజులో ఎక్కడా కనపడదని భావించవచ్చు. 'నచకాచిదిచ్ఛా, నచింతా' - అన్నది రాజ్య సంపాదనాసక్తుడైన అతనికి 'న యత్ర దుఃఖం' అన్నది అరణ్యవాస-బంధు మరణ దుఃఖితుడు, సోదర మరణ దుఃఖితుడై చివరి వరకు మెలిగిన అతనికి,

'నసుఖం' అన్నది రాజ్యపాలనం ముప్పైఏళ్ళు చేసిన అతనికి, 'న ద్వేషరాగౌ' అన్నది స్వర్గంలో కూడ దుర్యోధనాదులను గురించి, పాండవులను గురించి ద్వేషరాగాలను ప్రకటించిన అతనికి ఎట్లా వర్తిస్తుంది? కాబట్టి శాంతరసం కాబోదు.

కావ్యాంతంలో ధర్మరాజు పొందిన స్థితులు ముందుగా కనిపిస్తున్నవి: సశరీరంగా స్వర్గారోహణం మాయామూలకమైన నరకదర్శనం, దేవలోక నివాసం, యమధర్మరాజు రూపంలో పూర్వరూప ప్రాప్తి అన్నవాటిల్లో దేనిని గూడ మోక్షమని పేర్కొనటానికి వీల్లేదు. 'ఆత్యంతిక దుఃఖనివృత్తి రూపమైన స్వరూప స్థితికి' మోక్షమని సంకేతం. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' (శ్రుతి) అన్నట్లు బ్రహ్మవేత్త అయిన నాయకుడు బ్రహ్మరూపంలో భాసిల్లాలి గాని యమరూపస్థితుడుకావటం ముఖ్య లక్షణం కాదు. 'కుత్రచిత్ గమనం నాస్తి తస్య సంపూర్ణ రూపిణః" (శ్రుతి) అన్నట్లు ముక్తునికి గమనాగమనాలు నిషేధింపబడటం వల్ల స్వర్గారోహణం జరిపిన నాయకుడు ముక్తుడని మోక్షసాధన పరుడని చెప్పడానికి వీల్లేదు. ముక్తి ద్వివిధం : జీవన్ముక్తి, విదేహముక్తి అని. స్వర్గంలో కూడా శరీర ధర్మాలైన రాగద్వేషాలు విడువని నాయకుడు జీవన్ముక్తుడని గాని, ఆకాశగంగావగాహం తరువాత దివ్యశరీరాన్ని ధరించిన ధర్మరాజు విదేహ ముక్తుడని గాని చెప్పటం ఎంత సమంజసమో భావుకులు తెలుసుకోగలరు !.

ఈ విధంగా ముక్తిద్వయానికి దూరమైన శాంతరసాన్ని ధర్మరాజులో ప్రతిష్ఠించి మహాభారత తాత్పర్య రూపాన్ని నిర్ణయించటం పాడిగాదని నా మనవి.

నివృత్తి ధర్మరూపమైన మోక్షానికి సోపాన రూపమైన ప్రవృత్తి ధర్మాన్ని తక్కువగా భావించుకుని ఇలాంటి రస నిబంధనం చేయబడుతుంది. రసలోకంలోనూ, కావ్యరసిక లోకంలోను ప్రవృత్తి రసాలకు నివృత్తి రసాల కన్నా ప్రభుత్వం హెచ్చు; శాంతం సన్మునుల మనోదృష్టులకు, తత్త్వవేత్తల శాస్త్రదృష్టులకు అందినంతగా సామాజికులకు సర్వసామాన్యంగా అనుభూతి కందదు. 'ఆంధ్రావళి మోదముం బొరయు' లక్ష్యంతో ప్రధానంగా రచింపబడ్డ ఆంధ్ర మహాభారతంలో పురుషార్థ సాధనోత్సాహాన్ని ధర్మబద్ధంగా సాధించే చిత్తవృత్తికి మూలకందమైన ధర్మవీరం అంగిరస మనటం సర్వాంగీకారం అవుతుంది. వీరం సర్వమానసిక ప్రవృత్తులకు బీజ భూతం; ప్రదీపకం. ప్రవృత్తి రసాలలో వీరం రసమూర్ధన్యం! శాంతం దానికి శక్తి నిస్తుంది. కవిత్రయం ఈ సత్యాన్ని ఆంధ్రభారత రసపోషణం ద్వారా నిరూపించింది.

నా దృష్టిలో మహాభారతాన్ని ఎన్ని దృక్కోణాల నుండి చూచినప్పటికీ ధర్మరాజు ధార్మిక చరిత్రతో పాటు కావ్యమంతా పరివ్యాప్తమైన ధర్మ వీరరసమే అంగిరసమని స్ఫురిస్తుంది. అదే ఆంధ్ర మహాభారతం సాధించిన రసామృతత్వ సిద్ధి!

# శాంతి పర్వం జ్ఞానామృతం

పద్దెనిమిది పర్వాల ఆంధ్ర మహాభారతంలో శాంతి పర్వం పన్నెండోది. ఇది పరిమాణంలోనే కాక పరమార్థంలో కూడా పర్వాలన్నిటి కన్నా గొప్పది.

భారతానికి పంచమవేదమనే ప్రశస్తితో పాటు కార్ష్ణవేదమనే కీర్తి కూడా ఉంది. ఆ కీర్తికి ప్రధాన కారణం భగవద్గీత. అది భీష్మపర్వంలో చెప్పబడింది. భీష్మునికి భీష్మపర్వంలో ప్రచండ వీరుడనే ఖ్యాతి దక్కింది. శాంతి పర్వంలో పరమధర్మజ్ఞుడనే ప్రశస్తి నిలిచింది. శాంతి పర్వం శాంతనవుడు బోధించిన ధర్మగీత. భగవద్గీత పరమార్థాన్ని బోధించినా నరుని చేత గాండీవాన్ని పట్టించింది. శాంతనవగీత పురుషార్థ సారాలను బోధించినా ధర్మజును ధర్మసింహాసనం ఎక్కించింది. ఈ రెండింట్లో ప్రవృత్తి నివృత్తి ధర్మాలు ప్రబోధితాలైనా అవి పృచ్ఛకునిలో ప్రవృత్తి ధర్మ ప్రతిష్ఠాపనానికి ప్రకృష్ట సాధనాలైనాయి. నివృత్తి ధర్మం నిర్మల జ్ఞానాన్ని ప్రసాదించింది; ప్రవృత్తి ధర్మం విధి నిర్వహణకు వెలుగు బాట చూపించింది. రెండింటి వెనక ఉన్న శక్తి శ్రీకృష్ణుడు. అతడు ఒక చోట ప్రవక్త; మరొక చోట ప్రయోక్త.

భారత పర్వాల పేర్లలో శాంతి పర్వమనే పేరుకు ఒక విశిష్టత ఉంది. ఆది పర్వం నుంచి ఉద్యోగ పర్వం వరకు పాండవేతి వృత్తంలో కనిపించే ప్రధానాంశాల్ని దృష్టిలో పెట్టుకొని పేర్లు పెట్టారు. యుద్ధషట్కంలో నాలుగు పేర్లు కౌరవ సేనానులను దృష్టిలో పెట్టుకున్నవి. సౌప్తిక పర్వమనే పేరు యుద్ధం జరిగిన కాలాన్ని సూచించేది. స్త్రీ పర్వం కౌరవ వనితా శోక స్రవంతిని పొంగించింది. అనుశాసనిక, అశ్వమేధాలు పాండవ రాజ్య పాలన ప్రవృత్తిని ప్రతిపాదించేవి; ఆశ్రమ వాసంలో కురువృద్ధుల స్థితి తెలియజేయబడింది. మౌసలంలో యాదవ వంశ పరిసమాప్తి ప్రస్తావించ బడింది. మహాప్రస్థాన స్వర్గారోహణలు పాండవ చరమ స్థితిని వర్ణించేవి. ఇవన్నీ నాయకులైన పాండవులకు, వారి సమష్టి జీవితానికి సంబంధించినవి. మరి శాంతి పర్వమో? పాండవులందరి కన్నా ధర్మజుని గురించే ప్రవర్తిల్లింది. శాంతి ఎవరికి? భీమాదులకు కాదు. ధర్మరాజుకే. ధర్మజ చిత్తవృత్తిలో భాసించే అవస్థా విశేషా న్నధికరించి 'శాంతిపర్వమనే' పేరు పెట్టడం జరిగింది.

ధర్మరాజుకు రాజ్యం దక్కింది. కానీ అది రక్తపు కూడే అయింది. అశుచిత్వాన్ని పోగొట్టుకోడానికి ధర్మరాజు గంగాతీరంలో మూడునెల లున్నపుడు ధర్మరాజు దగ్గరకు నారద వ్యాసాది మునులు వచ్చారు. వారితో ధర్మరాజు చెప్పిన మాటలు విజయోత్సాహ ముద్రితాలై లేవు; విషాదమగ్నాలై ఉన్నాయి.

"కృష్ణుండు మామీఁద గృపసేయుటయు బ్రాహ్మ
ణాను గ్రహంబున ననిలపుత్ర
పార్థుల పటు బాహుబలమున మేదిని
యంతయుఁ జేకుఱునట్టిదయ్యె;
నైనను నతిఘోర మగు నఖిలజ్ఞాతి
వధ మొనరించుటవలన నధిక
గుణుని సౌభద్రునిఁ గుణభూషణంబు బాం
చాల తనూజ పంచకముఁ గోలు
పోకఁ జేసియు గెల్పు గెల్పుగ మదీయ
బుద్ధి గైకొన దయ్యెడు సిద్ధముఖ్య !" శాంతి. 1. 6.

బంధువులందర్నీ బలిపెట్టి సాధించిన విజయం విజయమే కాదని అనుకున్నాడు. బంధువుల్లో జ్ఞాతి వర్గమంతా ఒక ఎత్తు; నిజసుత వర్గమంతా ఒక ఎత్తు; కర్ణవధ ఒక్కటి ఒక ఎత్తు. కర్ణుడు కుంతి కొడుకని ఉదక ప్రదాన సమయంలో కుంతి వల్ల విన్న ధర్మజుని అంతరంగం నిప్పులలో పోర్లినట్లైంది - గతస్మృతు లతడి మనస్సులోని శోకాన్ని ఉత్తుంగ తరంగ సదృశంగా పైకెగజిమ్మాయి. నారదునితో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

"గాండివి నొవ్వఁబల్కి, తిటు గర్ణునిఁ జంపక వచ్చితేని త
మ్ముండవు గావు నాకు నని మూర్ఖత సోదరఘాతి నైన క
ష్టుండ మనంబునం బెఱుగు శోకము నెట్లు సహింతుఁ; దప్పె నా
తండును నేను నైన విబుధ ప్రకరంబును మాకు నర్థమే." — 1.14.

కర్ణవధ ధర్మజున్ని మనస్సులో సహించలేని శోక భావాతిశయం కలిగించింది. ఆ శోకం వల్ల అతనిలో భాసింప వలసిన విజయోత్సాహం తగ్గింది. అంతటితో ఆగలేదు. అతిశోకం అతనికి విరక్తిని కలిగించింది. తమ్ముళ్ల చేతిలో రాజ్యాన్నుంచి తపోవనానికి వెళ్ల దలచి అర్జునుని ఎదుట వేదనను ఇట్లా వెలిబుచ్చాడు.

"జ్ఞాతుల నందఱఁ జంపితి మది యాత్మ
వధమ కాదే ! రాజవర్తనంబుఁ
గాల్పు ; మహింస నిక్కము దాల్మి మత్సర
వర్జన మిది వనవాస జనుల

కాగమవిహితంబు లటె; యింత యొప్పునే;
వన్యమున వసియింపవలయు; వింటె;
యసుఖదంబైన రాజ్యామిషంబునకుఁ గు
క్కలభంగిఁ దమలోనఁ గాటులాడి

కులము నెల్లను బొలియింపఁ గుత్సితంపు
బ్రదుకు వచ్చునె యను వగ పాలువడఁగఁ
బ్రమద మొనఁగదు త్రైలోక్యరాజ్య మైనఁ;
గాన యే నొల్ల మహి, మీర కైకొనుండు." —1. 42.

శోకం నిర్వేదమైంది; నిర్వేదం విరక్తికి మార్గం చూపింది. ధర్మజుని మానసిక స్థితి శాంతి పర్వం మొదట్లో ఇట్లా ఉంది.

ఇక్కడ శాంతి దేనికి? ఇట్టి స్థితికి మూలమైన శోకానికి. అది శాంతిస్తే ఆపై నిర్వేదాదులు శాంతించినట్లే. కాబట్టి తాత్పర్యంలో — శోక శాంతే శాంతి పర్వ సర్వార్థ ప్రయోజనం.

ధర్మజుని శోకం రెండు పాయలుగా ప్రవహిస్తుంది. ఒకటి బంధుజన వియోగ జనితమైంది. రెండు: బంధుజన వధ వల్ల కలిగే పాపాన్ని గురించి భీతి. ఒకటి ఇహానికి సంబంధించింది. రెండోది పరానికి సంబంధించింది. బంధుజన వియోగం వల్ల పుట్టిన శోకం ఉపశమన వాక్యాలతో శమింపవచ్చు. రెండోది శమించాలంటే ఉపదేశం అవసరం. శాంతిపర్వం ప్రథమాశ్వాసంలో భీమాదులు, ద్రౌపది పారాశర్య వాసుదేవాదులు బోధించిన ఉపశమన వాక్య సారాంశం వల్ల ధర్మజుని చిత్తం కుదుటపడింది. పట్టాభిషేకానికి అంగీకరించాడు. పట్టం కట్టుకున్నా పాపశంక మాత్రం అతనిని హృదయశల్యమై వేధింపసాగింది. అశ్వమేధ యాగంతో గానీ అది అతన్ని వీడిపోలేదు.

## శాంతిత్రయం: శోకశాంతి

అందువల్లే శాంతి, అనుశాసనిక, అశ్వమేధ పర్వాల్ని కలిపి "శాంతిత్రయ" మని వ్యవహరించే పరిపాటి ఉంది. ఈ పర్వత్రయంలో ధర్మరాజు శోకం అవస్థాతయా న్నాశ్రయించి ఉపశమించిందని విమర్శకులు గుర్తించారు. "ధర్మరాజు సింహాసన మధిష్ఠించుటకు పూర్వము, యుద్ధానంతరము, వ్యాసార్జునుల చేత బోధింప బడినప్పుడు "చిత్తంబు కలంకదేరి కౌంతేయాగ్రజుండు రాజ్యభార నిర్వహణోత్సాహము" (శాం. 1.345) కలవాడయ్యాడని కవిచేత చెప్పబడింది. భీష్మోపదేశం ముగిసిన తరువాత "ధర్మజుడ

తెలివొందె భవ దుపదేశామృతంబున'' (అను. 5.440) అని వ్యాసుడు భీష్మునితో చెప్పాడు. భీష్మ నిర్యాణానంతరం శ్రీకృష్ణుడు, వ్యాసుడు అశ్వమేధంలో చిత్తాన్ని ప్రవర్తింప జేసిన తరువాత ధర్మరాజు "మీ కారుణ్యంబున నా శోకం బంతయును బాసె సుమనస్కత కలిగె'' (అశ్వ. 1. 137) అని తానుగా చెప్పాడు. ఇది శాంతి త్రయంలో ధర్మరాజు శోకం క్రమంగా ఉపశమించిన విధం. [1]

బంధుజన వియోగశోకం ధర్మజుని మనస్సుకి సంబంధించింది. పాపశంక బుద్ధికి సంబంధించింది. మనస్సు బుద్ధిచేత శాసింపబడేది. బుద్ధి జ్ఞానం చేత శాసింప బడేది. జ్ఞానం వల్ల వివేక ముదయిస్తుంది. వివేకం మనసులోని శోకాన్ని ఉపశమింప చేస్తుంది. మనసు కుదుటపడితే, ఇక తెలివి కలగవలసింది బుద్ధికి. బంధువధవల్ల పుట్టిన మహాపాపం తరింపరానిదని ధర్మరాజు అభిప్రాయం. రాజ్యాన్ని పరిగ్రహిస్తే తత్ఫలం కట్టి కుడుపుతుందని, దానిపరిహరణం వల్ల ఆపాప పరిహారం చేసుకోవాలనుకున్నాడు ధర్మరాజు. ఇది ధర్మరాజు ధర్మశీల లక్షణం. అతడు కళంక రహితమైన ధర్మాన్ని ఆచరించడమే జీవిత వ్రతంగా కలవాడు. రాజ్యాన్ని గ్రహించడమే రాజధర్మమని యుద్ధోద్యోగం కావించాడు. యుద్ధానంతరం ఆ రాజ్యగ్రహణానికి వెనుకాడటం, అది అఘదూషిత మనే భావన వల్లే.పాప విరహితమైనట్లైతే అతనికి రాజ్యపాలన ధర్మం ఉపాదేయమే. భీష్మాదుల ఉపదేశం వల్ల అతడికి జ్ఞానం ఉదయించింది; అశ్వమేధాదుల వల్ల పాపరిక్షాళనమైంది. ధర్మరాజు రాజ్య స్థితి అనఘమై భారతంలో భాసించింది. శాంతిత్రయ కథా తాత్పర్యం ధర్మరాజుకు అనఘస్థితి కల్పించడాని కేర్పడింది. ఈ సందర్భంలో శాంతి పర్వం శాఖాద్వయ విశిష్టమైన శోకం ఉపశమించడానికి ప్రవర్తిల్లింది. అందులో ఒకటి ఫలించింది; మరొకటి ఫలించలేదు.

మనస్సు వికారాల కెట్లా మూలకందమో బుద్ధి శంకలకు ఆ రకంగా ఆలవాలం. లోకంలో అహింస, దయాదులు ఉత్తమ ధర్మాలు. ధర్మరాజుకు రాజ్యం హింస వల్ల లభించింది. హింసార్జిత విత్త భోగం ధర్మ విరుద్ధమని లోకంలో వినిపిస్తుంది. అందువల్ల ధర్మరాజు రాజ్య భోగం అధర్మమౌతుంది. ఇది సామాన్య ధర్మదృష్టి. దీన్ని ధర్మసూక్ష్మ జ్ఞానం వల్ల తరింపవచ్చు. దానిలో మొదటిది రాజధర్మ పరిజ్ఞానం. క్షత్రియుడు స్వార్థంకోసం రాజ్యాన్ని సంపాదిస్తే హింస కావచ్చు. ధర్మస్థాపన కోసం రాజ్యాన్ని సంపాదిస్తే ఆ హింస హింస కాదు. ఒక వేళ అది హింస అయినప్పటికీ ధర్మాన్ని రాజ్యంలో స్థాపిస్తే ఆ దోషం తీరిపోతుంది. అధర్మ పాలనం వల్ల లోకమంతా బాధపడుతుంది. ధర్మం కోసం కొంత ప్రజాహింస అయినప్పటికీ భూతలమంతా సుఖపడుతుంది. ఇటువంటి విశ్వ ధర్మాన్ని

1. **తిక్కన కావ్యశిల్పము** - డా॥ కే. వేం. రామకోటి శాస్త్రి - పుట. - 322.

సాధించడానికి ధర్మపరులు సాయుధోద్యమం చేయవచ్చు. దానివల్ల లోకానికి హితం అధికంగా కలగడం వల్ల ఆ సాధనలోనైనా హింస ఉత్తమ ప్రయోజనం కోసం ఉజ్జ్వలమై భాసిస్తుంది. ఈ ధర్మసూక్ష్మం పాలకులకు ఎంత తెలియాలో అతని చరిత్రను పఠించే పాఠకులకు కూడా అంతగా తెలియాలి. అందువల్ల శాంతి పర్వం ధర్మరాజు కెంత అవసరమో పాఠకుడికి కూడా అంత అవసరం.

మనస్సులో శోకం మోహం వల్ల పుడుతుంది. బంధుజన నష్టం, ప్రజానష్టం, ధర్మరాజు చిత్తానికి శోకాన్ని ఆపాదించాయి. ధర్మరాజు ఎంతటి మనస్వియో అంతటి ధీరుడు. ధీరునికి కలిగే శోకం ఎంత తీవ్రమైనా దీర్ఘ కాలికం కాదు. అందువల్ల అది సంచారీ భావం వంటిదే అవుతుంది. అది ఉపశమన వాక్యాలతో శాంతిస్తుంది. ప్రథమాశ్వాసంలో అట్లాగే జరిగింది. మోహం అహంకార జనితం. యుద్ధంలో బంధుజనాన్ని తాను చంపాననే కర్తృత్వ బుద్ధి ఉండటం వల్ల ధర్మజుడు దానిఫలమైన శోకాన్ని అనుభవిస్తున్నాడు. యుద్ధం విధాతృ సంఘటన అని భావిస్తే ఆ శోకం అతనికి అంటదు. అర్జునుడీ రకమైన భావాన్ని ఇదివరకే శ్రీకృష్ణుని వల్ల విని యుద్ధాన్ని కర్తృత్వ విరహిత బుద్ధితో నిర్వహించాడు. ఆ సంస్కారంతో అన్నను ఓదార్చాడు.

*"వైరి వధంబు నీకును నవశ్యముఁ జేయక పోవరానిదై*
*వైరులకున్ భవత్సమరవాంఛన సద్గతి కేఁగఁ బాలిదై*
*చేరె విధాతృసంఘటనఁ జింతకుఁ గారణ మేమి? ధర్మవి*
*స్తారవిదుండ వీ వకట ! ధైర్యసమగ్రుఁడవై వెలుంగవే !"*

—1. 154.

శ్రీకృష్ణుడా తాత్పర్యాన్నే వక్రమార్గంలో బోధించాడు.

*"పురుషవ్యాఘ్ర ! మనంబు గుంద వగలం బొందంగ నీ కేల సం*
*గరకేలిన్ భవదీయబంధు లతిలోకంబైన పెంపొప్పఁ బో*
*యిరి నాకంబున కట్లుగాక కలగాదే రాజవృత్తంబు దా*
*నరయన్ రాజుల యేల యేజనులు నిత్యాయుష్యులే సెప్పుమా !"*

—1. 225

తన ఉపదేశానికి ఉపబలకంగా షోడశ రాజుల చరిత్రలు చెప్పాడు. సువర్ణష్ఠీవి కథ తెలిపాడు. పారాశరుడీ అంశాన్ని వాచ్యం చేసి చెప్పాడు.

*"మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు*
*న్వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మొం*
*దు నొకొ కుఠారమున్ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం*
*డనియెడు నిశ్చయంబు దృఢమై మది నిల్పినఁ జాలు భూవరా !"*

—1. 277

"కర్మఫలం బీశ్వరుని యదియ తదర్పణ బుద్ధి సహితంబుగాఁ బ్రబుద్ధులు వేద చోదిత కర్మంబు లనుష్ఠింతు" రని ప్రబోధించాడు. యుద్ధానికి పూర్వం నరునికి నారాయణుడు బోధించిన తాత్పర్యం కూడా ఇలాంటిదే.

*"కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన*
*మా కర్మఫలహేతుర్భూ ర్మా తే సంగోZ స్త్వకర్మణి"* — *గీత. 2. 47.*

అప్పుడు నరునికి కలిగిన విషాదమే ఇప్పుడు ధర్మరాజుకు కలిగింది. "పుత్రులుం బౌత్రులునన్నలుం దమ్ములు జనకులుం దాతలు మామలు గురువులు సబంధులు సఖులు నల్లురు బావలు మఱందులు మఱియుఁ బవిత్రులగు ధాత్రీపతులు నాచేత మడిసిరి. తదీయ స్త్రీజనంబులు పతి సుత సోదర పితృ మరణ శోక సంతాపాతిశయంబునం బలవించి పలవించి ప్రాణంబులు విడుతురు గావున దాని సూక్ష్మంబుగా విచారించిన వనితావధపాతకంబునుం బాటిల్లు; నెయ్యది కడగా నిష్కల్మషుండ నగుదు నను వెగడున మునింగిన మనంబు మహీభరణంబున కెట్లు సొచ్చు; నుగ్రంబైన తపంబునం దనువు దొఱంగుట దక్క నొండు విధంబు నాకుం జూడలేకున్నయది" అని ధర్మజుడు వాపోయాడు. పారాశరు డతడి మర్మా న్నెరిగి ఇలా ఉపలాలించాడు.

*"విడువు ముమ్మలికంబు; వినుము; నీ చెప్పిన*
*యందఱు భూముల కాసపడియుఁ*

*బెంపును దేజంబుఁ బేరును గోరియు*
*నీసున సమరంబు సేసి చచ్చి;*

*రా పని కిల్బిషం బగునె నీ; కట్లును*
*గాక వారల నెట్టి కర్మగతులు*

*మృతులఁ గావించెనో మతి నెఱుంగుదె వాని*
*నెఱుఁగుఁ గాలుఁడు చావ నేరి కెద్ది*

తఱి యతం డప్డు దెగటార్చు దాని నీవు
సేసినాడవుగా మదిఁ జింత సొనిపి
యుడుకు టొక వెఱ్ఱి; దీనిపై నొల్ల గృహము
విడుతుఁగా కను టిది పెద్దవెఱ్ఱి యధిప !" —1. 282.

ఈ మాటలతో అతని హృదయం కుదుటపడింది. సింహాసన మెక్కటానికి సిద్ధమైనాడు. కర్త తాను కాదని తలచినంతనే కలత తీరింది. రాజ్య చక్రం తిప్పవలసి వచ్చినపుడు చేయాల్సిన ధర్మమేదో తెలిస్తే కాని భావి చరిత్రం ప్రసన్నం కాదు. అది మనసుకు సంబంధించిన విషయం కాదు. బుద్ధి విషయం. అది జ్ఞానాన్ని ఆశ్రయించాలి. తర్వాత కథంతా ఈ సూత్రాన్నంటిపెట్టుకొని కొనసాగింది.

నిర్మల ధర్మాచరణం కత్తిమీద సాములాంటిది. ధర్మసాధకునికి అధర్మ భీతి ఎక్కువ. భర్తృహరి లోకుల్లో ఉండే భయ స్వరూపాన్ని లెస్సగా నిరూపించాడు.

"భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలా ద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయం
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కామే కృతాంతాద్భయం
సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్"[2]

ధర్మరాజుకి కూడా ఇలాంటి భయమే ఉంది.

"వినుము; వివిధ సుఖము లనుభవింపఁగ రాజ్య
విభవ యుక్తిఁ దిరుగ వేడ్క లేదు;
నాకు ధర్మరక్షణము మీఁది భరముఁ ద
ల్లోపభయము మనములోనఁ బెద్ద" — 2 331.

ఇటువంటి భయముండటం ఉత్తమ ధర్మసాధకుని లక్షణం. ధర్మనిర్వహణలో అనుక్షణం జాగరూకుడై ఉండటాని కది సాధకం. ధర్మజిజ్ఞాసువు కది జ్ఞాన సముపార్జన హేతువు.

ధర్మరాజు గద్దె ఎక్కిన మరునాటి నుండే అతని చిత్తంలో ధర్మలోప భీతి వల్ల ధర్మ జిజ్ఞాస అంకురించింది. జిజ్ఞాస బుద్ధి లక్షణం. సర్వజ్ఞుడైన వాసుదేవుని దగ్గరకు వెళ్లి తన జిజ్ఞాస ప్రవృత్తిని బైటపెట్టాడు. అతడు శాంతనవుని ఉపదేష్టగా నిశ్చయించి అతని వద్దకు ఇతనిని తీసికెళ్లాడు. భీష్ముని బుద్ధిలో పురుషోత్తముడు తన బుద్ధి స్ఫురణాన్ని ఆవాహనం చేశాడు. తా నొకసారి గీతను ప్రవచించినట్లు - భీష్మునితో ధర్మగీతను ప్రబోధింప చేశాడు.

2. భర్తృహరి సుభాషితము - వైరాగ్య శతకము. శ్లో. 31.

ఇక్కడ ధర్మజుడు శ్రోత; శాంతనవుడు వక్త; పలికే వాడు గాంగేయుడు; పలికించే వాడు గోవిందుడు. పలికే పలుకులు వేద తుల్యాలు.

"ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు
కీర్తి యందాక నక్షయస్ఫూర్తిఁ దాల్చి
నడవఁగల యది నీవు సెప్పెడి సువాక్య
ములును వేదతుల్యంబులై వెలయుచుండు" —2. 148

అని ప్రకటించాడు పురుషోత్తముడు. వేదోపమానంతో పరమ ప్రామాణికాలనే భావం ధ్వనింప చేశాడు. ధర్మరాజు ఆ వాక్య శ్రోతగా నిలవడం వల్ల అవి వెలువడ్డాయి. ధరరాజుకు తెలిపిన తత్త్వ విశేషాలు ప్రజలందరికీ ఉపాదేయాలే -

"ధర్మజునకు నీ చెప్పెడు
ధర్మస్థితి వాక్యసమితి తాత్పర్యముతో
నిర్మలులై కొనియాడెడు
ధార్మికులకు నుభయ జగదుదాత్తత కలుగున్" — 2. 149

విశ్వజనీనమైన విజ్ఞానం ఈ పర్వ తాత్పర్య వివేచనం. ధర్మరాజు ధర్మ జిజ్ఞాసకు ప్రతీక; శాంతనవుడు సర్వలోక హిత బోధకు ప్రతీక !

## శాంతిపర్వం శాంతనవగీత

శాంతి పర్వంలో సాగిన ధర్మజ భీష్మ సంవాదం లోక హితార్థమై ప్రవర్తిల్లిన జ్ఞాన యజ్ఞం. దానివల్ల ధర్మరాజు పొందిన ఫలం వైయక్తికం; పాఠకులు పొందే ఫలం విశ్వ జనీనం.

శాంతి పర్వ ద్వితీయాశ్వాసంలో భీష్ముడు శ్రీకృష్ణుణ్ణి స్తుతించి,. దాన్ని వాఙ్మయాధ్వరంగా భావించి, దాన్ని అర్పణం చేశాడు.

" తపమునకు విద్యకును జనుస్థానమైన
జననరహితుని యజ్ఞాత్ము శౌరి వాఙ్మ
యాధ్వరార్చితుఁ జేసితి నాజనార్ద
నుండు మధ్భజనమునఁ బ్రీతుండుగాత !" — 2. 56.

ఇలాంటి ఉత్తమ సంస్కారంతో ప్రారంభించిన ఉపదేశం శాంతిపర్వ తాత్పర్యం. అట్లాకావడం వల్ల ఇదికూడా వాఙ్మయాధ్వరమే; జ్ఞానయజ్ఞమే.

'విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్' అనే ఉపనిషత్సూక్తిని అనుసరించి ధర్మజగాంగేయు లిద్దరూ జ్ఞానరూపమైన బ్రహ్మాన్ని అర్చించారనవచ్చు. ఇందులో మరో విశేషం. ధర్మరా జడిగిన ప్రశ్నలు అష్టోత్తర శత సంఖ్యలో ఉన్నాయి. అర్చన కన్వయించే సంఖ్య అది. ఆ సంఖ్యలో వాటిని నిబంధించడం తిక్కన చేసిన వాఙ్మయార్చనం. అతడు తీర్చి దిద్దిన శాంతిపర్వం శాంతనవ గీత.

శాంతనవ గీతలో రాజధర్మ, ఆపద్ధర్మ, మోక్ష ధర్మాలు మూలంలో చెప్పారు. నన్నయ కూడా పర్వ సంగ్రహంలో వీటిని పేర్కొన్నాడు.[3] కాని తిక్కన ఈ విభాగాన్ని యథామూలంగా పాటింపలేదని విమర్శకులు భావిస్తున్నారు. "రచనా ప్రణాళిక యందు తిక్కనసోమయాజి ఏకారణముననో ఈ త్రివిధభాగమును పాటింపలేదు. ఆ యా విభాగము యొక్క సీమారేఖలు అంత స్పష్టముగా లేవని ఆయన భావించియుండనోపును. ఒక విభాగమునందు మరియొక విభాగము యొక్క అంశములు ప్రవేశించుచుండును. రాజధర్మ ఆపద్ధర్మ పర్వములు మైథిలీ ప్రతిలోను (బెంగాలీ), కొన్ని దాక్షిణాత్య ప్రతులలోను వేరువేరుగా నిర్దేశింపబడలేదని భండార్కరు సంస్థవారు గుర్తించినారు. తిక్కనసోమయాజి ఈ సంప్రదాయమును పాటించియుండును. మూలము నందు రాజధర్మ పర్వము 1—128 అధ్యాయముల వరకును, ఆపద్ధర్మపర్వము 129-167 వరకును, మోక్షధర్మ పర్వము 168-353 అధ్యాయముల వరకును వ్యాపించియున్నవి. తెలుగు భారతమునందు 12-335 వచనమునందు రాజధర్మ అపద్ధర్మ ప్రశంస కలదు".[4] స్థూల విభాగానికి ద్వితీయ తృతీయాశ్వాసాలలో రాజధర్మ, ఆపద్ధర్మాలు, చతుర్థ పంచమ షష్ఠాశ్వాసాలలో మోక్ష ధర్మాలు తిక్కన రచనలో కనిపిస్తున్నాయి. వాటిలోనూ రాజ ధర్మాదులలో యాభై ప్రశ్నలూ, మిగిలినవి మోక్ష ధర్మాలలో కనిపిస్తున్నాయి.

*"ధర్మ విదులు రాజు ధర్మ స్వరూపుఁగాఁ*
*జెప్ప విందుఁ దద్విశేషవృత్తి*
*భరముగాఁ దలంతు నరవర ! చెప్పవే*
*మున్ను రాజధర్మముల తెఱంగు"* — 2. 162

ధర్మారా జడిగిన మొదటి ప్రశ్న ఇది. రాజధర్మం రూపు కట్టిన వాడుగా ఉండాలన్న తన బాధ్యతను గుర్తించి అడిగిన మొదటి ప్రశ్న ఇది. దీనికి భీష్ముండు రాజ ధర్మాలను, విపుల

3. "ధర్మజునకు శరతల్ప గతుండైన భీష్ముండు ధర్మవిదులైన రాజుల కెల్ల హితంబుగా రాజధర్మంబులు, నాపద్ధర్మంబులు, నేవాని నెఱింగిన సర్వజ్ఞాన సంపన్నులగుదు రట్టి మోక్ష ధర్మంబులు చెప్పుటయు"..... ఆది 1. 57.

4. ఆం.మ.భా. సంశోధిత ముద్రణము శాంతిపర్వము పీఠిక - శ్రీఖండవల్లి లక్ష్మీరంజనము. పుట. 3-4.

ఫలవంతమైన ధర్మపథాన్ని వివరిస్తానని సమాధానం మొదలు పెడతాడు. నిజానికి రాజధర్మాలన్నీ చెప్పడానికి ఈ ప్రశ్న ఒక్కటే చాలు. ఇది ఆధికారికమైన ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పేటప్పుడు అనుబంధప్రశ్న లడగ బడ్డాయి. వాటికి భీష్ముడు సమాధానం చెబుతూ వచ్చాడు. నిజానికి ఆ నలభై తొమ్మిది ప్రశ్నలు దీనిలో గతార్థాలే. ఇది ఒక భాగం.

చతుర్థాశ్వాసారంభంలో ధర్మరాజు -

" రాజోచిత ధర్మంబుల
యోజ విశదభంగిఁ జెప్పి తుజ్జ్వలవిసర
త్తేజోధన ! నాకు సకల
భూజన పరమ హితధర్మముం దెలుపు దయన్.'" —4 - 3.

అని ప్రస్తావించి ఉత్తమ ధర్మాన్ని గురించి ప్రశ్నించాడు. భీష్ముడు -

" విను మనేక విధంబుల విస్తరిల్లు
ధర్మములయం దొకండును దలఁప నిష్ఫ
లంబు లే; దాత్మ మోక్షావలంబి యైన
ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప" —4 - 5.

అని మోక్ష ధర్మం ఉపదేశించడం మొదలెడతాడు. దీంట్లో కూడా మిగిలిన ప్రశ్నలు అనుబంధ ప్రశ్నలే. వాకోవాక్య రూపమైన సంవాదమే ఈ ధర్మబోధ కాయు స్సూత్రం. శ్రోతృ గ్రహణ మనన జిజ్ఞాసలను బట్టి వక్త విషయ వివరణం చెయ్యాలి. ఇది శ్రోతృ చిత్త పరిపాకానికి ప్రాతిపదిక కావాలి. ఇది ఇతిహాసంలోని రసపోషణ రహస్యం.

ధర్మజ భీష్మ సంవాద రూపమైన శాంతి పర్వార్థాలను విని జనమేజయుడు కూడ జిజ్ఞాసువైపారాశర శిష్యుని ప్రశ్న పరంపరలను అడగడానికి ఆరంభించాడు. (6. 398) అది తత్పూర్వ శ్రవణ ప్రభావం.

పైన చెప్పిన ధర్మాలలో రాజ ధర్మాలు విశేష ధర్మాలు; మోక్షాది ధర్మాలు సామాన్య ధర్మాలు. రాజుకు కులధర్మమైన విశేషధర్మం, సామాన్య ధర్మమైన మోక్ష ధర్మం రెండూ వర్తిస్తాయి. అతడు వర్ణ ధర్మాన్ని నిర్వహిస్తూ పరమధర్మాన్ని సాధించాలి. ఒకటి మార్గం. మరొకటి గమ్యం. గమ్యానికి మార్గాలు భిన్నాలు కావచ్చు. సాధనను బట్టి స్థితి. ఆదీనిలో మొదటిది ప్రవృత్తి ధర్మం; రెండోది నివృత్తి ధర్మం. ప్రవృత్తిలో నివృత్తిని సాధించిన వారు జీవన్ముక్తులు. రాజర్షులలో జనకు డలాంటి వాడు; బ్రహ్మర్షులలో శుకు డలాంటి వాడు. వాళ్లిద్దరి కథలు భీముడు ధర్మరాజుకి చెప్పాడు. అయినా ధర్మరాజుకి వారిద్దరి కున్న సిద్ధి

లేదు. కానీ ఆ పరిజ్ఞాన లబ్ధి శాంతి పర్వంలో కలిగింది. ధర్మరాజు రాజర్షి కాడు; ధర్మావతారుడైన ప్రభువు. ధర్మమంటే ప్రవృత్తి నివృత్తి రూపాన ఉన్నది కదా అనవచ్చు. ప్రవృత్తి ధర్మమే రాజధర్మం. అది ధర్మరాజుకు సహజ సంపత్తి; నివృత్తి సాధ్య వ్యుత్పత్తి. అతడు ప్రవృత్తి ధర్మంతో పరిపూర్ణత సాధించిన మహితాత్ముడు. నివృత్తి ధర్మ పరిజ్ఞానం అతడి ప్రవృత్తి ధర్మ నిష్ఠకు. పరివేషంగా ప్రకాశించింది. ధర్మరాజుని సిద్ధి అంతవరకే. అతడు జీవితాంతంలో పొందేది దేవత్వమే కాని బ్రహ్మత్వం కాదు. ఆ సత్యం ఆ గోవిందునికి తెలుసు. ఆ శాంతనవునికీ తెలుసు.

ధర్మరాజు లోని ఇలాంటి సంస్కారాన్ని తిక్కన శాంతిపర్వంలో ప్రశ్నలడిగే పద్ధతి లోనూ, శాంతనవు డిచ్చే సమాధానాల తీరులోనూ వ్యంగ్యంగా వ్యక్తీకరించాడు. ధర్మరాజు రాజధర్మాలను వింటాడు. దాదాపు పది ప్రశ్నలువేసి చాతుర్వర్ణ్య వర్తనం, ఆశ్రమచతుష్టయ విధి, రాష్ట్రజనపద పరిపాలనలు, శత్రువధాది విశేషాలు, దండనీతివిధానం మొదలైన వెన్నో విషయాలు తెలుసుకుని చివరికి ధర్మ లోప భయాన్ని వ్యక్తీకరించి రాజ్యం వద్దని మొండి కేస్తాడు. భీష్ముడు ప్రసిద్ధమైన ఇతిహాసాలెన్నో చెప్పి అతన్ని తిరిగి దారిలోకి తెస్తాడు. మళ్ళా పది ప్రశ్న లడుగుతాడు. భీష్ముడు సమాధానం చెబుతాడు. అప్పటికీ అతని నాలుకపై ఆడేది నిర్వేదమే. "రాజ ధర్మము కంటెను బాపకర్మంబు లేదు" పొమ్మని చీదరించుకున్నాడు. (2.4; 5) మళ్ళీ ఏదోవిధంగా భీష్ముడు అతని మనసును కుదుట పరిచాడు. విశ్వామిత్ర చండాల సంవాదం విన్న ధర్మరాజు"ఈ యితిహాసం బాకర్ణించుట నా డెందంబు విషాదంబునొందె" నని వెలవెల బోయాడు. శాంతనవుడు అతని నుద్దేశించి "ధర్మంబు బహుశాఖా సమన్వితంబై యుండు; రాజులకు నెల్ల తెఱంగుల నెఱుంగవలయు ; విషాదంబేల?'అని బుజ్జగించి చెప్పాడు. రాజ్య పాలనంలో ధర్మలోపం వాటిల్లుతుందేమోనన్న భయం అడుగడుగున ధర్మరాజు మాటల్లో ధ్వనించింది. ఎక్కడ ధర్మరాజు చిత్తం విషాదమగ్నం అయ్యిందో అక్కడ భీష్ముడు తన నేర్పు, ఓర్పు ప్రకటించి ఉపదేశం నిర్వహించటం అయింది.

రాజధర్మాలు విన్నతీరు ఈ విధంగా ఉంది. ఇక మోక్షధర్మాల తీరును గమనించాలి. 'ఉత్తమ ధర్మం ఏది?' అని ప్రశ్నిస్తే మోక్షాధారమైన ధర్మం ఉత్తమమని పితామహుడు పేర్కొన్నాడు. ఆ తరువాత మనుమ డెన్నో ప్రశ్నలు వేశాడు. విసుగు లేకుండా విశదీకరించాడు తాత. "అధ్యాత్మ విద్య వినవలతు జెప్పవే" (4. 120) అని అడిగాడు. ఆ తరువాత నిరతిశయ జ్ఞానయోగాన్ని చెప్పమన్నాడు; మృత్యువును గురించి మోక్షమార్గాన్ని గురించి అడిగాడు. మధ్య మధ్య అనేక రకాల ప్రశ్నలు వేశాడు. సాంఖ్య యోగ దర్శన తత్త్వాల నడిగి

వినిపించుకున్నాడు. జనక మహారాజు మోక్షం సాధించిన విధానం విన్నాడు. "ధర్మాధర్మవియుక్తంబును, సర్వసంశయ విముక్తంబును, జన్మమృత్యు రహితంబును, నిత్యంబును, శుచియు, శివంబును, నవ్యయంబును, బరంబును, ననాయాసంబును నగునట్టి దాని నెఱింగిపవే" (6. 79) అని తరచి తరచి అడిగి తెలుసుకున్నాడు. భీష్ముడు యాజ్ఞవల్క్య జనక సంవాదాన్ని ఉపదేశించి "ఆర్యగర్హితములైన శోకమోహాది ప్రాకృతభావంబులందొలంగి సుఖివగుము (6. 169)" అని దీవించాడు. అందుకు ధర్మరాజు సంతుష్టుడై, "గృహస్థ ధర్మంబు పరిత్యజింపక మోక్షంబు వడయుట గలుగనోపునే, మదీయచిత్తంబు సంశయాయత్తం బగుచుండు : నిక్కాలుష్యంబు వాపవే" (6.169) అని అభ్యర్థించాడు. భీష్ముడు జనక సులభా సంవాదాన్ని చెప్పాడు. ధర్మరాజు మళ్ళీ శుకుని వైరాగ్యాన్ని గురించి ప్రశ్నించాడు. తాత శుక చరిత్రాన్ని చెప్పాడు. ఇంకా సకల లోక సంభావనీయ సత్కథలెన్నింటినో తెలిపాడు. అన్నీ విని ధర్మరాజు -

*"అమరతటినీసుతున కిట్టు లనియె రాజ*
*ధర్మ ముఖ్యంబు లగు సర్వధర్మముల ను*
*దాత్త కృప నెఱిఁగించి తత్యుత్తమంపు*
*ధర్మ మెయ్యది సెప్పుము ధర్మనిత్య !"* —(6.543)

ఉత్తమ ధర్మంతో ప్రారంభమైన మోక్ష ధర్మ చర్చ 'అత్యుత్తమ ధర్మ మేది?' అని పునః ప్రశ్నించడం వరకూ వచ్చింది. భీష్ముడు ఉంఛవృత్తి మహిమను ఉల్లేఖించి "సర్వ సమతా సముపహితంబైన యనాకాంక్షిత్వంబు ధర్మోత్తమ"మని స్పష్టపరిచాడు. ఇదంతా విన్న ఆ ధర్మరాజు అన్న మాట లివి -

*"అనఘ ! నాదగు చిత్తమునకు శమంబు గా*
*వించుటకై నీవు వివిధ విశద*
*భంగులఁ బరమ కృపానిరతుండ వై*
*సకల ధర్మోపదేశములుఁ జేసి*
*తిమ్మెయిఁ జెప్పఁగా నించుకయేనియు*
*శమము లేకున్నది నలముకొని య*
*నేక బంధుల వధియించితి నదియొక్క*
*తలయు నీ కలిగిన దారుణత్వ*

మొక్క తలయునైన యుగ్ర కర్మంబులు
చిత్తవృత్తిఁ దగిలి యుత్తలంబుఁ
జేయ శాంతి యెట్లు సిద్ధించు మునిమాన
నీయ ! యింక నేమి సేయువాఁడ ?" — అను. 1. 3.

పరమార్థ శ్రవణానంతరం కూడా ధర్మరాజులో శమం కుదురలేదు. శోకమోహా లతని హృదయంలో ఆ మరణాంతం ఉన్నాయి. యమధర్మరాజు స్వర్గారోహణ పర్వంలో -

"నీ వియ్యాకాశనదీ
పావన సలిలముల మునుఁగు భవ్యాత్మ భవ
ద్భావంబు విడుచు మానుష
భావ వికారములు శోకబంధము లడఁగున్." —స్వర్గా. 50

అని ఆకాశగంగలో ముంచేంత వరకూ ధర్మరాజు శోక బంధాల నుండి విముక్తుడు కాలేదు. చివరికి అతనికి కలిగింది దేహవిముక్తి; దేవత్వము. అది మోక్షం కాదు. స్వర్గ ప్రాప్తి సశరీర స్వర్గగమనానికి జీవన్ముక్తుడు పొందే మోక్షానికి అంతర మెంతో ఉంది. ఒకటి ప్రవృత్తి ధర్మవీర ఫలం; రెండవది : నివృత్తి ధర్మఫలం. ధర్మరాజు సాధించింది మొదటిదే కాని రెండవది కాదు.

భీష్ముడు మోక్షధర్మాల నుపదేశించే సందర్భంలో ప్రవృత్తి ధర్మాన్ని నివృత్తి ధర్మం కంటె తక్కువగా భావించలేదు. అత్యుత్తమ ధర్మం చెప్పమని అడిగినప్పుడు అత డిచ్చిన సమాధానం ఇది -

"అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లే దొకండు నె
వ్వరి మది యెందు వ్రాలెఁ దగ వారలు దానిన పూని యాచరిం
తు రదియ వారి కిష్టఫల దోహన కార్య మొనర్చు నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ బోలిన ధర్మములన్ వెలుంగగన్." —6.545

ధర్మరాజు ప్రవృత్తివీరానికి, నివృత్తివీరాని కున్నంత గౌరవం ఉందని శాంతనవుడే సమర్థించాడు. నిజానికి ధర్మరాజును ఆదర్శ ధర్మ వీరునిగా తీర్చి దిద్దాలనే శాంతి త్రయంలో శాంతనవ గోవింద పారాశర్యాదులు చేసిన తీవ్ర ప్రయత్నం.

శాంతిపర్వంలో ధర్మరాజు చిత్తవృత్తిలో పట్టాభిషేకాని కడ్డం వచ్చిన శోకం శమించింది. కాని, పాపశంకకు సంబంధించిన కల్మషం తొలగలేదు. ప్రవృత్తి నివృత్తి జ్ఞానాలు అతని వ్యుత్పత్తిని పండించాయి. అతనికి తెలివి కలిగిందే కాని, తేట కలగలేదు. అది అశ్వమేధయాగ

ప్రవర్తనంతో గాని, సిద్ధించలేదు. యాగం కర్మ సంబంధి. జ్ఞానం కర్మ నుద్దీపనం చేస్తుంది. కర్మకు పూర్వరంగమైన జ్ఞానం శాంతి పర్వంలో లభించింది. ఆ తరువాత ధర్మరాజు ఏం చేసినప్పటికీ తెలిసి చేశాడు. ఆ తెలివిడికి తొలివెలుగును ప్రసాదించింది శాంతి పర్వం.

శాంతి పర్వంలో కథ తక్కువ. బోధ ఎక్కువ. బోధ శాస్త్రశరీరం. కథ కావ్యశరీరం. భారతం ఇతిహాసం. ఇతిహాసం శాస్త్రరూపమనీ, కావ్యచ్ఛాయాన్వయి అనీ ఆనందవర్ధనుడు పేర్కొన్నాడు. బోధకు కథ తోడైతే ఇతిహాసం అవుతుంది.

ఇతిహాసం అంటే పూర్వవృత్తాంతం. అది ఇలా జరిగిందని పారంపర్యంగా చెప్పుకుంటున్న కథై ఉండాలి. "ఇతిహాసః - ఇతిహ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్ ఆస ఆధారే ఘఞ్ . ధర్మార్థకామమోక్షణాం ఉపదేశ సమన్వితమ్, పూర్వముక్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥ ఇత్యుక్త లక్షణే పురావృత్త ప్రకాశకే భారతాది గ్రంథే" అని శబ్దకల్పద్రుమం. పారంపర్యంగా చెప్పుకునే కథార్థాలకు ప్రజలలో ప్రచారంతోపాటు ప్రామాణిక భావం కూడా ఉంటుంది. పదికాలాలపాటు నిలిచే పాటవం లేకపోతే పదిమంది నోట పదిలంగా బ్రతకటం కష్టం.

## భీష్మోపదేశం : ఇతిహాసాలు

భీష్ముడు ధర్మరాజుకు చెప్పిన బోధలలో ఇతిహాసాలైన ఉపాఖ్యానాలను, పురాణకథలను, సంవాదాలను ఎన్నింటినో పేర్కొన్నాడు. ఆనాడు ధర్మరా జడిగిన ప్రశ్న ఏనాడో ఒక జిజ్ఞాసువు అడిగాడు. ఒక బోద్ధ దానికి సమాధానం చెప్పాడు. వారిద్దరికీ సంబంధించిన కథ ఒకటి లోకంలో వెలసింది. అది పరంపరగా జనశ్రుతిలో సాగింది. ఇతిహాసమైంది. ధర్మబోధల్లో దృష్టాంతాలుగా ఇతిహాసాలైన కథార్థాలను నిబంధించు వైఖరి శాంతి పర్వంలో సర్వత్రా సమకూర్చబడింది. ఇతిహాసమైన భారతంలో ఐతిహాసిక ప్రవృత్తితో శాస్త్రబోధ చేసే ఆఖ్యాన శిల్పానికీ శాంతి పర్వం ఒక చక్కని ఉదాహరణ.

'పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్విధా
స్యా దేకనాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా'

అని రాజశేఖరుడు కావ్యమీమాంసలో పేర్కొన్న అంశం ఇక్కడ గమనించదగింది. ఏకనాయకం పరిక్రియ అనీ, బహునాయకం పురాకల్ప మనీ అతడు భావించాడు. దీని తత్త్వం తెలుసుకున్నట్లయితే, ఈ విధంగా భావించటానికి వీలుంది: రాజశేఖరుడు ఈ శబ్దాలను దార్శనిక పరిభాష నుండి గ్రహించినట్లున్నాడు. దార్శనికులు పరిక్రియా పురాకల్పం అన్నవి అర్థవాదాలుగా పేర్కొన్నారు. అర్థవాదాలు ప్రస్తుతః నిందా - ప్రశంసా - పరకృతి - పురాకల్ప భేదంతో నాలుగు విధాలు. మహాపురుషు డొకడు పూర్వం జరిగిన ఒక అంశాన్ని

ప్రమాణంగా చూపించటం, పరకృతి. 'అగ్ని అన్నవాడు సర్వభక్షకుడు కాదలచి అగ్నిని ఆరాధించి, సర్వభక్షకు డయ్యాడు'[5]. అన్న పూర్వ ప్రవర్తి తైతిహ్యాన్ని ప్రమాణంగా చూపించటం పరకృతి. పూర్వం ఒకరివల్ల చెప్పబడ్డ అర్థాన్ని ప్రతిపాదించేది పురాకల్పం. 'పూర్వం అగ్ని, హోమాలు మోయడం ఇష్టంలేక నీళ్ళలో ఉండిపోయాడు. దేవతలు అగ్నిని వెదుకుతు ఉండగా చేపలు అగ్ని నీళ్ళలో ఉన్న విషయాన్ని చెప్పాయి. అగ్ని తన రహస్యాన్ని బయట పెట్టినందుకు ఆగ్రహంతో 'లోకులు మిమ్మల్ని ఇష్టం వచ్చినట్లు చంపుదురు గాక'! అని చేపల్ని శపించాడు.[6] అన్న పరవక్తృ కార్థప్రతిపాదనం పురాకల్పం. ఇవి చెప్పబడ్డ విధానాన్ని గమనించినట్లైతే పరకృతి ఏకవక్తృక మని, పురాకల్పకం బహువక్తృక మని, తెలుస్తుంది. ఒక విధంగా ఈ రెండూ అతీతార్థ ప్రధానాలే[7] కాని పరకృతి అద్యతన భూతార్థం. పరకృతి లో ప్రాచీనోదంతం ప్రప్రథమంగా ఒక వక్తతో చెప్పబడింది; పురాకల్పం పారంపర్య కథనంగా బహువక్తలతో చెప్పబడింది. బహుశః మీమాంసకులు చెప్పే ఈ అర్థవాద భేదాలను రాజశేఖరుడు గ్రహించి తన కావ్యమీమాంసలో స్థాపించి ఉండవచ్చు. కాని, వాటి సహజ లక్షణాలైన ఏకవక్తృబహువక్తృకత్వాలను మార్చి ఏక నాయక బహునాయకత్వాలుగా అతడు నిబంధించి ఉండవచ్చు. పరక్రియా శబ్దం పరిక్రియగా మార్చి ఉండవచ్చు. ఈ దృష్టితో చూచినప్పటికీ శాంతిపర్వంలో అర్థవాద రూపాలుగా పేర్కొన్న ఇతిహాసాలు సార్థకాలవుతున్నాయి. ఉపదేశించే ధర్మార్థాల కుపపత్తులుగా ఇతిహాసోపాఖ్యానాలు నిలపటం వక్త సాధించే ప్రయోజనం. వాటిపై ఉన్న ప్రామాణిక భావం వల్ల భక్తిప్రపత్తులు శ్రోత కేర్పడటం ఇతిహాస కథా ప్రభావం.

నన్నయభట్టు శాంతిపర్వం 14525 శ్లోకాల గ్రంథ మన్నాడు. మూలభారతంలో 14731 శ్లోకాలు కనిపిస్తున్నాయి. ఈ రెండింటికీ భేదం చెప్పుకోదగినంతగా లేదు. ఈ పర్వాన్ని తిక్కన 3,069 పద్యగద్యాలలో రచించాడు (అశ్వాసాద్యంతాలు వదిలి). తిక్కన మూలపరిమాణాన్ని సంగ్రహించి తెలుగులో అనువదించాడని చెప్పవచ్చు. మూలగ్రంథాన్ని సంగ్రహించటం కవిత్రయం వారు పాటించిన అనువాద లక్షణమే. కాని, ధర్మశాస్త్ర విషయాలలో అత్యంత సంగ్రహరచన కుద్యమించిన తిక్కన శాంతిపర్వంలో ఆ మార్గాన్ని అనుసరించలేదు. ఈ సత్యం విమర్శకులు గుర్తించిందే.

కురుక్షేత్ర యుద్ధానంతరం మిగిలిన భారతకథ స్వల్పం. విరాటోద్యోగాలు,

5. తైత్తిరీయ బ్రాహ్మణంIII. 1. IV. 1.

6 తైత్తిరీయ సూత్రం II. VI. VI. I.

7. 'అతీతార్థప్రాధాన్యా దితిహాసః' - సరస్వతీ కంఠాభరణం 2. 368 శ్లో. వ.

యుద్ధపర్వాలు, యుద్ధపర్వాలకు అనుబంధ ప్రాయమైన సౌప్తిక స్త్రీ పర్వాలు కథాప్రధానంగా తెలుగులో వినిర్మించిన తిక్కనకు కథకంటె ఆధ్యాత్మిక విషయాలే బహుళంగా ఉన్న శాంతిసప్తకం (శాంతి పర్వం నుండి స్వర్గారోహణ పర్వం వరకు) లో సంక్షేపించే అవసరం అంతకు ముందుకంటె అధికమైంది. భగవద్గీతాసారం కొన్ని పద్యాలలో, సనత్సుజాతీయం ఒక్కవాక్యంలో సంక్షేపించిన తిక్కన, ఆ పద్ధతిని శాంతిపర్వంలో అనుసరించినట్లయితే శాంతిపర్వమంతా తెలుగులో కొన్ని పద్యాలతో సరిపోయేది'[8]. మోక్షధర్మప్రబోధకాలైన భగవద్గీత, శాంతిపర్వాలను తిక్కన అనువదించటంలో ఉన్న ఈ భేదానికి కారణం తెలుసుకోవలసిఉంది.

తిక్కన భగవద్గీతను పూర్తిగా సంగ్రహించటానికి విమర్శకులు ఎన్నో కారణాలను చూపించారు. వాటిలో ముఖ్యమైనవి : 1. రణోన్ముఖమైన యుద్ధభూమిలో విస్తృత మైన గీత బోధింపబడటం సందర్భౌచిత్యం కాదు. 2. భగవద్గీతలో చెప్పిన తత్త్వార్థాలు భారతంలో అక్కడక్కడా ప్రవచింపబడ్డాయి. 3. శ్రీకృష్ణుడు అర్జునునికి తిరిగి ఆ అర్థాలను అశ్వమేధ పర్వంలో పునః ప్రబోధించాడు. కాబట్టి తిక్కన భీష్మపర్వంలో వాటిని అత్యంత సంగ్రహంగా పేర్కొన్నాడు. 4. తిక్కన భారతంలో కావ్యశిల్పాన్ని వెలార్చదలచి ధర్మార్థాలను సంక్షేపించాడు. ఇలాంటివి మరికొన్ని కారణాలను సూచింపవచ్చు. ఏమైనప్పటికీ ఆంధ్రమహాభారతానికి, ఆ భగవద్గీత కుదింపబడటం వల్ల ఎలాంటి లోపం వాటిల్ల లేదని విమర్శకులు చెప్పారు. ఇక శాంతి పర్వాన్ని కూడా తిక్కన అట్లా ఎందుకు చేయలేదు? అన్నదిక్కడ విచారించదగింది.

దీనికి ప్రధానంగా మూడు కారణాలు చెప్పవచ్చు.

1. శాంతి పర్వంలో ప్రవర్తిల్లిన ధర్మబోధ నాయకుడైన ధర్మరాజును ఉద్దేశించి జరిగింది. భగవద్గీత అనునాయకుడైన అర్జునుని ఉద్దేశించి చెప్పబడింది.

2. శాంతిపర్వ కథనం అంగిరస పోషణకు అనుకూలం. భగవద్గీత అ విధంగా కాదు.

3. శాంతి పర్వంలోని రాజధర్మ మోక్షధర్మాది కథనం ఇతిహాస రచనకు అనుకూలం.

మహాభారతంలో నాయకుడు ధర్మరాజు. అతన్ని ఆశ్రయించి స్థాయిభావం నడుస్తుంది. భీమార్జునాదులు అనునాయకులు. వారి ప్రవృత్తులును, ప్రవర్తనలును ధర్మరాజు స్థాయిభావాన్ని పోషించాలి. ఇది కథలోని రసపోషణ రహస్యం. పంచమవేదం అని ప్రసిద్ధి చెందిన భగవద్గీతపై తిక్కనకు తక్కువచూపు లేదు. కాని, అది అనునాయకుడైన అర్జునుని

8. తిక్కన భారత దర్శనము - శ్రీ నండూరి కృష్ణమాచార్య. పుట 310.

ఉద్దేశించి ప్రవర్తిల్లింది. అర్జునుడు లేనిదే ఆహవ విజయం లేదన్నమాట సత్యం. అయినప్పటికీ అంత డంగికి అంగం. గాండీవియే కాదు, గోవిందుడు కూడా మహాభారతంలో నాయకునికి అంగభూతుడే. మహిమాన్వితుడైన ఉపనాయకుడు లభించిన అదృష్టం ఆ అజాతశత్రువుకు దక్కింది. అంగభూతులైన నరనారాయణుల వృత్తం ప్రధాన వృత్త పరిధిని అధిగమించకూడదు. అందువల్ల దాని పరిమితిని మించి పెంచలేదు తిక్కన గారు. అక్కడి సంక్షిప్త రచన తిక్కనను సంయమిగా నిరూపించింది.

మోక్షధర్మమైన భగవద్గీత, ధర్మరాజు ధర్మవీర ప్రవృత్తిని మించినట్లుండ కూడదు. అట్లాగే శాంతిపర్వంలోని మోక్ష ధర్మాలు అతనిని విరక్తునిగా మార్చకూడదు. శోకోపశాంతి వల్ల ధర్మరాజు రాజ్యాన్ని నిర్వహించాలి. ధర్మహాని అవుతుందని భయపడే ధర్మరాజుకు సకల ధర్మస్వరూపం తెలియాలి. పరమ ధర్మం తెలిసిన ప్రజ్ఞావంతుడు గాని పరమ పురుషార్థసాధకుల మహిమను తెలుసుకోలేడు. జ్ఞానస్వరూపం తెలిస్తేగాని కర్మమౌఢ్యం విడిపోదు. బ్రహ్మర్షిలో మోక్షానికి అంగాలుగా ధర్మార్థకామాలు వర్తిస్తాయి. శుకాదులలో అది చెల్లింది. రాజర్షి అయిన జనకునిలో ధర్మం మోక్షానువర్తి అయింది. మరి ధర్మరాజు ధర్మస్వరూపుడైన ఆదర్శ ప్రభువు. ధర్మప్రభువులో ధర్మాని కంగాలుగా అర్థకామమోక్షాలు వర్తిస్తాయి. అతడు సకల ధర్మాలను రాజధర్మానికి పోషకాలుగా అనువదించుకుంటాడు. ధర్మరాజుకు దక్కింది మోక్షం కాకపోవచ్చు. స్వర్గమే కావచ్చు. అతడు నిర్వహించేది ప్రవృత్తి ధర్మమే కావచ్చు. దానిని తక్కువగా భావించకూడదని భీష్మాదుల ప్రబోధ. ప్రజలకొరకై స్వీయ పరమ పురుషార్థాన్ని పణంగా పెట్టే ప్రభువు లోకారాధ్యుడు. అతడు శక్తిమంతుడై మోక్షాన్ని సాధించుకుంటే ప్రజలు సంతోషిస్తారు. జ్ఞానులు అభినందిస్తారు. కాని, రాజధర్మాన్ని విస్మరించినట్లయితే అతనికేకాక దేశప్రజలకు కూడా ఇహపరా లుండవు. అంటే ధర్మరాజు ప్రవృత్తి ప్రధానంగా రాజధర్మాన్ని ఆశ్రయించాలి. మోక్ష జ్ఞానాదులు అతని మోహాదులను దూరం చేయాలి. జ్ఞాన విశిష్టమైన ధర్మం సాత్త్వికం. అహంకార పూరితమైన ధర్మం రాజసం. మోహావిష్టమైన ధర్మం తామసం. ధర్మరాజు సాత్త్విక ధర్మ సాధకుడు. అతడు జీవితంలో సాధించింది శుద్ధ ధర్మం. అతని చిత్తాన్ని ఆశ్రయించిన స్థాయి ధర్మోత్సాహం.

ధర్మరాజు శాంతిత్రయంలో పాపరహితమైన రాజధర్మం యొక్క స్వరూపం తెలుసుకున్నాడు. అశ్వమేధం అతని ప్రభుత్వాన్ని నిష్కళంకం చేసింది. అతడు పుటం పెట్టిన బంగారం లాగా పుణ్యధర్మశీలి అయ్యాడు. అతడు శాంతి పర్వారంభంలో బంధువులను చంపిన క్రూరకర్మ వల్ల శోకాన్ని చవిచూశాడు. అశ్వమేధ పర్వారంభంలో కూడా అదే శోకం అతని చిత్తాన్ని వికలం చేసింది. (అశ్వ. 1.11.) అప్పు డతడు అడవులకు వెళ్ళడానికి అనుజ్ఞ

ఇమ్మని శ్రీకృష్ణ సాత్యవతేయాదులను అడిగాడు. మళ్ళీ కథ మొదటికి వచ్చింది. చెప్పే పెద్దలకు ప్రాణాలు విసిగిపోయాయి. కృష్ణుడు.

*" వినవలయువాని నెల్లను*
*జననాయక వింటి వీవు శాంతనవునిచే*
*వనట యుడుగు మిఁక దుర్మతి*
*యునుబోలెను వగచుచుండు టుచితమె నీకున్ "* — అశ్వ. 1.8.

అని మందలించాడు, పారాశర్యుడు - 'నిష్ఠించి యిబ్భంగి నీ కేము చెప్పిన వాక్యంబు లెల్లను వఱదఁ గలిసి పోయెనే? నీ దగు బుద్ధి 'యింతొప్పదో?' (అశ్వ. 1. 12) అని నిష్ఠురాలాడాడు. పాపకర్మశంక తొలగడానికి అశ్వమేధం చేయుమని సూచించాడు. ఈ సూచన ఇప్పటిది కాదు; శాంతి పర్వారంభంలో అర్జునుడే చేశాడు (శాం. 1. 49) అప్పటి శోక తీవ్రత వల్ల అది తలకెక్కలేదు. అప్పు డతడు మోహావిష్టుడు. ఇప్పు డతనికి జ్ఞానం తెలుసు. కాని అతడు జ్ఞాని లాగా మాట్లాడటం లేదు. శంక ఉన్నచోట జ్ఞానం భాసించదు. జ్ఞానబోధ అయినప్పటికీ శంక తీరలేదంటే అతని చిత్తవృత్తికి అనువైన ప్రతిపాదనం రాలేదని భావం. అశ్వమేధ యాగ సూచన అతని చిత్తానికి హత్తింది.

*" అన విని యమ్మునీశ్వరున కానృపుఁ డిట్లను నశ్వమేధ యా*
*గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగఁ జాలు నాఁగ ము*
*న్నును వెడ వింటి నజ్జన మనోజ్ఞ వచోమహనీయ ! నీవు చె*
*ప్పిన పలు కూఁది యాక్రతువు ప్రీతి నొనర్చెద నెల్లభంగులన్"*

— అశ్వ. 1. 13

అని హర్షాన్ని వ్యక్తపరచాడు. యాగం సంకల్పించబడింది. ముని వర్గంతో ధర్మరాజు ఇట్లన్నాడు.

*" మీ కారుణ్యంబున నా*
*శోకం బంతయును బాసె; సుమనస్కృత సు*
*శ్లోకాత్ములార ! కలిగెన్*
*నాకున్; విచ్చేయుఁ డింక నను మఱవకుడీ"* — అశ్వ. 1. 37

అడవుల కెళతానని నిర్వేదపడ్డవాడు శోకం విడిచి ధరణీపాలనాధ్వరకరణాలపై మనసు పడ్డాడు. అనగా నిజ ధర్మంలో నిష్ఠబూనాడు. ఇతని ఇప్పటి స్థితి నివృత్తిమార్గాన్ని ఆశ్రయించి లేదు కదా! ప్రవృత్తి మార్గంలో ప్రకృష్టంగా ప్రతిష్ఠాపించబడింది.

## శాంతి పర్వత్రయ రస సమన్వయం

శాంతిత్రయంలో రస సమన్వయం ఇట్లా ఉంటుంది. ధర్మరాజు చిత్తాన్ని ఆశ్రయించింది శోకం. దానికి హేతువు పాపకర్మ శంక. మరి భీష్ముని ఆశ్రయించింది నిర్వికారమైన జ్ఞానబోధ. అత డొక జ్ఞాన యజ్ఞంగా దాన్ని నిర్వహించాడు. జ్ఞానం వల్ల శంక నశించాలి కదా ! నశించలేదు. తిరిగి శోకం ఉద్బుద్ధమౌతూనే ఉంది. దానికి కారణం పాపకర్మశంక పరిహారం కాకపోవటమే. దాని వల్ల ధర్మరాజు శోకతీవ్రత ధ్వనింపబడుతూనే ఉంది. జ్ఞాన భాస్కరు డెంత ప్రచండంగా వెలిగినప్పటికీ శోకతిమిరం సమూలంగా ఉన్మూలించబడలేదు. అనగా జ్ఞానబోధ వల్ల కలగవలసిన శమం ధర్మరాజుకు కలగలేదు. శమైక లక్షితమైన జ్ఞానబోధ ఆభాస అయింది. అందువల్ల శాంతం నాయకునిలో దీపింపలేక పోయింది. శోకమే స్థాయిగా మిగిలింది. దానిని శమింపజేయటానికి అశ్వమేధ యాగ ప్రయత్నం సాగింది. అంటే పాపకర్మ శంక ధర్మకర్మాచరణం వల్లగాని ఉపశమించలేదన్నమాట ! దీని తాత్పర్యం ఏమిటి? శమం శోకాన్ని ఉపశమింప జేసే సామర్థ్యం కలిగినప్పటికీ ధర్మరాజు చిత్తవృత్తిలో అది ఆభాసమై శోకానికే అంగమై పోయిన విచిత్రస్థితి ఏర్పడింది. అతని శోకం ఉత్సాహాన్ని భంజించటమే కాకుండా శాంతాన్ని రూపు కట్టనీయలేదు. శాంతం అతనికి స్థాయి కాదని తెలిసిన పారాశర్యుడు పుణ్యకర్మను చూపించి అతనిలోని ధర్మోత్సాహానికిత్రాణ కల్పించాడు. పాపనాశని అయిన పవనకర్మ అతనికి సంతోషహేతువైంది. శోకం నశించింది. కార్యోత్సాహరూపమైన రాజధర్మం రాణించింది. దయాసత్య శౌచాది ధర్మాలు అతనినిర్మల ధర్మవర్తనాన్ని పోషించాయి. అతనిలో అశ్వమేధ పర్వం నుండి భాసించింది సాత్త్విక ధర్మవీరం.

యుద్ధపంచకంలో రౌద్రకర్మ ప్రవర్తిల్లింది. రౌద్రం నుండి కరుణం పుడుతుంది. అది స్త్రీ పర్వంలో రూపుకట్టింది. నాయక రౌద్రకర్మ వల్ల ప్రతినాయక పక్షంలో కలిగే కరుణం తరింపలేనిది. ప్రతినాయక రౌద్రకర్మ వల్ల నాయకునికి కలిగే కరుణం తరింప గలిగేట్లు ఉండాలి. అట్లాంటి కరుణం శాంతి పర్వ ప్రథమాశ్వాసంలోనే తరింపబడింది. అది ధర్మరాజు శోకంలోని ఒక శాఖ అన్నాం కదా ! పాపకర్మ శంక వల్ల శోకం సాత్త్వికునికి గాని కలగదు. అట్లాంటి శోకం బంధు వధకై విలపించిన వివ్వచ్చునిలో లేదు. ఇక భీమాదులలో ఎక్కడ కలుగుతుంది? పాండవుల్లో సాత్త్వికుడు ధర్మరాజు. అందువల్లే అతనికి అంత బాధ. అయిదు పర్వాల గాథ వల్ల కలిగిన శోకం రెండుపర్వాలబోధ వల్లగాని శాంతించలేదు; అది అతని గాఢశీలతను ధ్వనింపచేస్తుంది. దాన్ని చిత్రించడానికి తిక్కనగారు ఈ గ్రంథాన్ని కొంత సంగ్రహ పరచినప్పటికీ దాన్ని విస్తృతిని తగ్గించలేదు. నాయకునికి, రసానికి సంబంధమున్నదని ఊరుకున్నాడు గాని లేని పక్షంలో తిక్కనగారు భగవంతుడు చెప్పినప్పటికీ ప్రకరణౌచిత్యానికి

భంగం రానీయడు ! అనౌచిత్యం రసభంగ హేతువుకదా !

ధర్మరాజు మననశీలి. అది బుద్ధిజీవిలక్షణం. అట్లాంటి ధర్మరాజుకు చిత్తపరిణామం కలగాలంటే శ్రవణం కావాలి. అరణ్య పర్వంలో ధర్మరాజు మహర్షులు చెప్పిన ఉపాఖ్యానాలు విని మనసులోని ఉమ్మలికను ఉపశమింప చేసుకున్నాడు. అలాగే శాంత్యనుశాసనిక పర్వాలలోని బోధవల్ల బాధను తగ్గించుకోడానికి ప్రయత్నించాడు. శ్రవణం మననానికి వస్తేగాని మనసుకు శాంతి కలగదు. ధర్మరాజు శోకశాంతికి యత్నించిన వాసుదేవ భీష్మ పారాశర్యాదులు అందువల్లే ధర్మార్థాలను ధారావాహినిగా అతని చెవుల్లో నూరిపోశారు. వాటిని సంగ్రహించినట్లయితే వారి ప్రయోజనం చెడిపోతుంది. పాత్రశీల పోషణం కుదరదు. పరమార్థం దెబ్బతింటుంది. అందువల్ల తిక్కన ఈ పర్వాలను పరువం చెడకుండా తెలుగులోకి పరివర్తనం చేశాడు.

శాంతిపర్వంలోని శాంత నవ ధర్మబోధ ఇతిహాస స్వభావానికి అత్యంత అనుకూలంగా ఉంది. శిల్పదృష్టితో చూస్తే భగవద్గీత ఇతిహాసాని కనుకూలం కాదని చెప్పవలసివస్తుంది. ఏ విధంగానంటే :- భగవద్గీత గురుబోధ వంటిది; శాంతనవగీత హితబోధ లాంటిది. గురుబోధలో గురువాక్యమే ప్రమాణం. హితబోధలో హితవాక్యంతోపాటు బుధవాక్యం కూడా ప్రమాణం. ధర్మరాజు బుద్ధిజీవి కావటం వల్ల తాను వినే ధర్మార్థాలకు ప్రమాణాలను అభిలషిస్తాడు. భీష్ముడు తాను చెప్పినవి చెప్పాడు. చెప్పిన చాలా వాటికి పూర్వేతిహాసాలను ప్రమాణాలుగా చూపించాడు. ఇతిహాసంలో ఇతిహాసంవల్ల ప్రమాణీకరించబడిన ధర్మ ప్రపంచాన్ని ప్రపంచించటం రచనాశిల్ప రహస్యం. తిక్కన దాని కనుకూల వృత్తిని శాంతిపర్వాదులలో దర్శించి వాటిని తదుచితంగా తీర్చిదిద్దాడు.

శాంతిపర్వంలో భీష్ముని ప్రబోధం సంవాద రూపం. సంవాదం సామాన్యంగా వాకోవాక్యరూపంలో గాని, అర్థవాద స్వరూపంలో గాని ఉండవచ్చు. ఈ పర్వంలో ద్వితీయ తృతీయాశ్వాసాలలో సంవాదాలు వాకోవాక్యరూపాలుగాను, చతుర్థాశ్వాసం నుండి ప్రవర్తిల్లినవి. అర్థవాదరూపాలుగాను, తిక్కనగారు తీర్చిదిద్దారు. వారి ప్రణాళిక స్వరూపాన్ని జనమేజయుని వాక్యాలలో నిపుణంగా సూచించారు.

1. ద్వితీయాశ్వాసాంతంలో - 'అటమీఁద వారల సంప్రశ్నోత్తరంబులు ప్రవర్తిల్లిన విధంబులు వినపింపుము.' (2. 446)

2. తృతీయాశ్వాసాంతంలో- 'అయ్యుత్తమ పురుషుల యడుగుటలును నుత్తరం బిచ్చుటలును నింతలెస్సలై చెల్లెడునే - యటమీఁదఁ జెల్లిన తెఱంగు లెఱిగింపుము.' (3. 528)

చతుర్థాశ్వాసారంభంలో భీష్ముడు - 'నా యెఱింగిన తెఱంగునం బ్రజ్ఞాకరంబులగు

వాక్యప్రకరంబు లుపన్యసించితి, నింక నేమి విన విచ్చ చేసెదవు' - (4.2)

3. చతుర్థాశ్వాసాంతంలో - 'మఱి యేమి సత్కథలు సెల్లెఁ జెప్పుము.
(4. 454)

4. పంచమాశ్వాసాంతంలో - 'అఁటమీఁద వర్తించిన విశిష్ట సల్లాపంబులు సెప్పవే.'
(5. 629)

5. షష్ఠాశ్వాసాంతంలో - 'ఇత్తెఱంగునఁ బితామహుండు హితోపదేశంబు సేసిన నమ్మహీశుం డెవ్విధంబు దశావిశేషంబు నొందె మునీంద్రా ! చెప్పవే' -
(6. 621)

ద్వితీయ తృతీయాశ్వాసాలలో చెప్పబడినవి రాజధర్మ విశేషాలు. తరువాతి మూడాశ్వాసాలలో చెప్పబడినవి. మోక్షధర్మాలు. రాజధర్మాల ప్రవచనం ప్రశ్నోత్తరంగా నడచిందని, మోక్షధర్మ ప్రవచనాలలో సత్కథలును, విశిష్టసల్లాపములు కూర్చబడ్డాయని తిక్కనగారి వివేచనం. శాంతిపర్వ రచనం చూచినట్లయితే చతుర్థాశ్వాసానికి పూర్వమున్న భాగంలో కంటె పరంలో ఉన్న భాగంలోనే ఇతిహాస ప్రమాణకథనం ఎక్కువగా సాగింది. జటిలమైన తాత్త్వికార్థాల అర్థవాదాలవంటి ఇతిహాస కథల ఆధారంగా శ్రోతకు మిత్రసమ్మితంగా బోధించటం కథనంలో పాటించిన శిల్పం. ఇది ఇతిహాస స్వభావానికి అత్యంత సన్నిహితం. దాన్ని గుర్తించి తిక్కన షష్ఠాశ్వాసాంతంలో 'పితామహుండు హితోపదేశంబు' చేశాడని పేర్కొన్నాడు.

శాంతి పర్వంలో ప్రవక్తగా భీష్ముడు నియుక్తుడవటంలో ఔచిత్యాన్ని విమర్శకులు ఈ విధంగా గుర్తించారు. 'శ్రీకృష్ణుడే ఈ గురుత్వానికి అర్హుడని శాంతనవుడు రెండు మూడు సార్లు పలికాడు. అయినప్పటికీ పరాత్మ వివేక శాలియైన దేవకీనందనుడు వేరుగా నిర్ణయించాడు. దీనికి ఒకటి రెండు కారణాలు ఊహించవచ్చు. శ్రోత అయిన ధర్మరాజు కన్నా శ్రీకృష్ణుడు వయసులో చిన్నవాడు. చిన్నవారు - పెద్దవారికి ధర్మోపన్యాసం చేయటం అసంబద్ధం కాకపోయినప్పటికీ చూచేవారికి వింతగా ఉంటుంది. తత్కాలీన క్షత్రియ సమాజంలో శాంతనవుని కన్నా వయోవృద్ధుడు, జ్ఞాన మహితుడు లేకపోవటం స్పష్టం. కాబట్టి భీష్ముడు ధర్మరాజుకుపదేష్ట కావటమే అత్యంత సముచితం అని బుద్ధిశాలి అయిన శ్రీకృష్ణుడు నిర్ణయించాడు. మరొక హేతువుకూడా ఆలోచింప దగింది. శ్రీకృష్ణుడు మోక్ష ధర్మవేత్తలలో అగ్రేసరుడైనప్పటికీ రాజధర్మంలో నిశితానుభవం కలవాడు కాదేమో అన్న సందేహం కలుగుతుంది. అతడు మహాయోద్ధ. జీవితంలో విశేషభాగం దుష్టశిక్షణంలో గడపవలసివచ్చింది.

